# జై సోమనాథ్

చారిత్రక నవల



మూలం

కులపతి కె. యం. మున్షీ

అనువాదం

భండారు సదాశివరావు



నవయుగభారతి ప్రచురణలు
హైదరాబాదు-500 029

హక్కులు 'భారతీయ విద్యాభవన్' వారివి
మూడవ ముద్రణ ఏప్రిల్, 2001
ప్రతులు 2000

ప్రచురణ
**నవయుగ భారతి**
3-4-705/4, నారాయణగూడ,
హైదరాబాదు - 500 029

అక్షరముల కూర్పు
**భారత ముద్రణాలయం**
3-4-705/4, నారాయణగూడ,
హైదరాబాదు - 500 029

ముద్రణ
**ఆకృతి ఆఫ్‌సెట్ ప్రింటర్స్**
**చిక్కడపల్లి, హైద్రాబాద్ - 20**

ప్రతులకు
**సాహిత్యనికేతన్**
బర్కత్‌పుర, కేశవనిలయం,
హైదరాబాద్-500 027
ఫోన్ 7562363

**సాహిత్యనికేతన్**
ఏలూరు రోడ్,
విజయవాడ-520 002

**వెల : 80.00**

# జై సోమనాథ్

గజనీ మహమ్మద్ ఈ దేశంపై పద్దెనిమిది సార్లు దండెత్తడం, అనేక దేవాలయాలను- ముఖ్యంగా సోమనాథ దేవాలయాన్ని - ధ్వంసం చేయడం- అపారమైన ధనరాసులు దోచుకోవడం మన చరిత్రలో ఒక భయంకరమైన అంధకారయుగానికి నాంది పలికినట్లయింది కాని అలా ఒక విదేశీయుడు మన పవిత్ర మాతృభూమిపై మహోదారుణం చేయగలిగాడంటే దానికి మన దేశ పరిస్థితులే కొంతవరకు తోడయ్యాయేమో ఇదే కథా వస్తువుగా తీసుకొని స్వర్గీయ కులపతి కె ఎమ్ మున్షీ అద్భుతమైన నవల వ్రాశారు. దానిని శ్రీ భండారు సదాశివరావుగారు తెలుగులోకి అనువదించారు ఆ నవల సుమారు ముప్పై ఏళ్ళ క్రిందట ''జాగృతి'' వార పత్రికలో ధారావాహికంగా వచ్చినపుడు పాఠక లోకాన్ని ఉర్రూత లూపింది తరువాత పుస్తక రూపంలో వచ్చి పాఠకుల అశేషాభిమానాన్ని చూరగొంది. రెండవ ముద్రణ కోసం పాఠకులు ఎదురు చూశారు ఇప్పటికి వారి కోరిక తీర్చగలుగుతున్నందుకు నవయుగభారతి ప్రచురణలు గర్విస్తోంది అనువాదకులు శ్రీ భండారు సదాశివరావుగారికీ, మాకు ఈ ముద్రణకి అనుమతి ఇచ్చిన భారతీయ విద్యాభవన్, ముంబాయి వారికీ మా ధన్యవాదాలు

-ప్రకాశకులు

# మనవి

'జై సోమనాధ్' అనువాదం తెలుగు పాఠకుల కందిస్తున్నాను దీనికి మూలం హిందీలో ఉంది. రచయిత కీ శే కులపతి కె.యం మున్షీగారు గుజరాత్ సాహిత్యానికి ప్రాణం పోసిన ఆచార్యులుగా, రాజకీయ నాయకులుగా, కేంద్రమంత్రిగా, ఉత్తర ప్రదేశ్ గవర్నరుగా వారిని ఎరుగనివారు ఉండరు గుజరాత్ సాహిత్యానికి వారు చేసిన సేవ అమూల్యం అందుకే 'మున్షీ సాహిత్యం' అని వారి రచనలు ప్రసిద్ధి కెక్కాయి

తెలుగులోకి ఇంతవరకు వారి రచనలు ఎక్కువగా రాలేదు ఆనాటి హైద్రాబాద్ ముఖ్యమంత్రి కీ శే బూర్గుల రామకృష్ణారావుగారు అనువాదాన్ని విని, హైద్రాబాద్‌లో శ్రీ మున్షీగారికి నన్ను పరిచయం చేశారు అడుగగానే అనుమతించి నన్నీ పనికి ప్రోత్సహించిన కీ.శే మున్షీగారికి, పరిచయ భాగ్యం లభింపజేసిన కీ శే. రామకృష్ణారావు గారికి నేను ఋణపడి ఉన్నాను.

దీనిని ఈ రూపంలో తీసుకొనిరావడానికి మిత్రులు శ్రీ గొట్టు ముక్కల సోమరాజు, బాలకవి కుమారస్వామిగార్లు సహకరించారు

'జాగృతి'లో దీన్ని వరుసగా ప్రకటించి తెలుగు చదువరులకు ఎరుక పరచారు శ్రీ బుద్ధవరపు వెంకటరత్నం (ఆనాటి సంపాదకులు) గారు. మిత్రులందరూ ఈ ప్రయత్నానికి తోడ్పడ్డవారే

ప్రస్తుతం నవయుగభారతి ప్రచురణలవారు తృతీయ ముద్రణ తీసుకు వస్తున్నారు

వీరందరికీ నా ధన్యవాదాలు.

వరంగల్

భండారు సదాశివరావు

# పీఠిక

''ఈస్ట్ అండ్ వెస్ట్'' అను ఆంగ్ల మాసపత్రికలో 1911 నవంబరు-డిశంబరు సంచికలో ''సోమనాధ విజయం'' అనే వ్యాసం ఒకటి నేను వ్రాశాను అప్పటినుంచీ నాకీ విషయంలో అభిరుచి ఉంది తరువాత అనేక సంవత్సరాలకు 'పాటణ ప్రభుత్వం'తో జోడించడానికి ఈ కధ వ్రాయాలనిపించింది దానిని నేను వ్యక్తపరచాను కూడా

కాని ఆ కోరిక మనస్సులోనే ఉండిపోయింది తరువాత 1935-36లో ప్రారంభించిన ఈ కధను 1937లో ముగించగలిగాను.

ఎదురులేని వీరుడైన గజనీ మహమ్మదు సోమనాధం మీద దాడి చేసినప్పుడు హిందూదేశ స్థితి- గుజరాతు పరిస్థితి- ఎలా ఉండేదో తెలుపడానికే ఈ పుస్తకంలో ప్రయత్నించాను ఒక వైపు మహా వ్యూహ రచనా కుశలుడైన వీరుడు మరొకవైపు పౌరుషాగ్ని స్ఫులింగాలవలె వెలుగొందిన రాజులు- వీరు చేసిన ప్రారంభ ప్రయత్నాలలో ఎన్నో మహా కావ్యాలకు సరిపోయే సామగ్రి ఉంది

ఈ దండయాత్రను గురించిన ఆధారాలు ముస్లిం చరిత్రలో ఉన్నాయి కాని అనేక విషయాలను పరిశోధించిన పిమ్మట అవన్నీ నిరాధారాలని నాకు నమ్మిక ఏర్పడ్డది

కారణాలివి :

1. భారతీయ చరిత్రలో ఎక్కడా ఈ దండయాత్రలను గురించి లేదు

2. ముస్లిం చరిత్రకారుడు ఫెరిస్తా, 'నహరవాల్ (అనహిలవాడ) రాజైన బిరహమ్‌దేవ్ (భీమదేవ్) అజ్మీర్ రాజునూ, మరి ఇతర రాజులనూ కలుపుకొని సుల్తానును అడ్డగించే భారీ ప్రయత్నాలు చేస్తూ ఉన్నందున అతడు సింధు మార్గాన ముల్తాను వెళ్ళడానికి నిశ్చయించుకున్నాడు దారిలో భరించరాని ఎండవలనా, నీటి చుక్కైనా దొరకనందునా సైన్యంలో సగభాగం మతిచెడి నశించింది'1 అని వ్రాశాడు మరి భీమదేవునికి లభించిన కీర్తిని ఎక్కడా, 'ద్వయాశ్రయ'లో కాని, 'కీర్తి కౌముది'లో కాని, మరే చరిత్రలో కాని ఎందుకు కన్పించదు ?

3 ముస్లిం చరిత్రలు మహమ్మదు పాటణ గద్దె మీద డాబీసలీమ్ అనే వ్యక్తిని 'కరదాత'గా నియుక్తి చేశాడని చెబుతున్నాయి కాని భారతీయ చరిత్రలో దీనికి ఎట్టి ఆధారమూ లేదు

4 మాకు లభించిన చరిత్రాధారాలన్నీ భీమదేవుని రాజ్యకాలాన్ని ఒక క్రమంగా తెలుపుతున్నాయి. విక్రమ శకం 1086 లోనిదైన ఒక తామ్ర శాసనం ప్రకారం అప్పట్లో భీమదేవుడు 'కచ్ఛ'ను పరిపాలిస్తుండేవాడనీ, వి శ 1088లో అతని మంత్రి యైన విమలుడు అబూ పర్వతం మీద ఒక మందిరం కట్టించాడనీ తెలుస్తున్నది 2 ఆక్రమణ 1082-83 లో జరిగి ఉంటే 1088లో కన్పించే ఈ పరిపాలన, వైభవాలు వింతగా కనిపిస్తాయి

5 'సోమనాథ ఆక్రమణ'ను గురించి మొదటి రచన మహమ్మదు తరువాత 200 సం.లకు దాదాపు క్రీ శ. 1230లో ఇబ్న అసీర్ వ్రాసిన 'కామిలిల్‌వారీఖ్'లో ఉన్నది

6 ముస్లిం చరిత్రకారులు ఎందరో సోమనాథ శివమూర్తిని గురించి చేసిన వర్ణన హిందువుల దృష్ట్యా అసంభవమైనది ఇదేగాక, అల్బెరూనీ స్వయంగా ఈ మూర్తిని చూశాడు. చెప్పినదాన్ని బట్టి అది శివలింగమనీ, మిగతా మూర్తులవంటిదేననీ తేలుతుంది.3

ఈ పై ప్రశ్నలన్నీ విమర్శనీయమైనవే. అయినా ఈ దండయాత్రలో ఏదో కొంచెం సత్యం ఉండి ఉంటుందని ఈ కథను వ్రాశాను.

---

*1 ఫెరిస్తా - భా 1 పేజీ 45. రతికాంతభట్టు వ్రాసిన గుర్జరేశ్వర సోలంకీ, బుద్ధిప్రతాశ్, జులై - సెప్టెంబరు 1935 సంచిక.*

*2 దుర్గాశంకరశాస్త్రి - మధ్యయుగ గుజరాత్ చరిత్ర, 1 భాగం పేజీలు 189-190*

*3 రతికాంతభట్టు వ్రాసిన పై వ్యాసంలో*

ఘోఘారాణా పరాక్రమం కల్పితం కాదు. నా ఇంగ్లీషు వ్యాసంలో దీనికి కారణాలు ఇచ్చాను కాని ఆ కారణాలకు సామగ్రి ఎక్కడ నుంచి సేకరించానో ఆలోచించ డానికి తిరిగి సమయం దొరకలేదు ఇప్పటి వరకు రాజస్థాన్‌లో ఒక ప్రదేశానికి 'ఘోఘా దేవ్ కా స్థల్' అని ప్రసిద్ధి ఉన్నది.

కాని ఈ కథలో సుల్తాన్ మహమ్మద్ దండయాత్రను కాక గుజరాత్‌ను ఎదిరించ డానికి చేసిన ప్రయత్నాలను వర్ణించాను. ఈ దండయాత్ర చాలా భయంకరమైనదని అంగీ కరిస్తే, దాని నెదిరించడంలో సోలంకీ నరేశుల గుజరాతుకు బలం చేకూరిందని కూడా ఒప్పుకోక తప్పదు ఈ కథలో చిత్రించిన మహాప్రయత్నాల భూమిక లేనిచో, గంగ సర్వ జ్ఞుడు, సామంతుడు, భీమదెవుడు ప్రదర్శించిన పటు సాహసంలేనిచో గంగ చేసిన ఆత్మా ర్పణా, చోళా చూపిన ప్రణయ విహ్వల భక్తీ లేనిచో- దేవప్రసాద్, ముంజాల్, కాక్, మీనల్, మంజరి మొదలగువారు వెలుగొందిన గుజరాత్ రూపొందించడం అసంభవమే.

ఆనాడు గుజరాతు పాశుపత మతానికి కేంద్రం 4 దీని స్థాపకులు లకులేశులు (నకులేశులు) ఈశ్వరావతారులని నమ్మిక వారు భడీంచ్ దగ్గర నేటి 'కారాహణ'లో జన్మించారు పాశుపత మతంలో కాపాలికులది ఒక ముఖ్య శాఖ కాపాలిక, కాళముఖ, వామాచార, భైరవాదులు ఉప శాఖలు, వీటి పద్ధతులు చూస్తే రోమాంచమవుతుంది. పుర్రెలలో తినడం, చితాభస్మం పులుముకోవడం, బూది తినడం, త్రిశూలాన్ని ధరిం చడం, త్రాగడం, శ్మశానవాసియైన దేవుణ్ణి ఆరాధించడం మోక్షప్రాప్తికై వీరికి సాధనాలు. పార్వతిని త్రిపురసుందరిగా పూజించే శాఖ కూడా ఒకటి ఉన్నది. అఘోరీ, కాంచలియా సాంప్రదాయాలు దీని ఛాయలే

గంగ సర్వజ్ఞుని పాశుపత మత కేంద్రమైన ప్రభాసంలో ఈ సాంప్రదాయాల పద్ధతు లను జోడించడం కొంత వెగటుగా తోచవచ్చు, కాని వీటి ప్రసక్తి లేనిచో 11వ శతాబ్దినాటి ప్రభాస వర్ణన సరిగా ఉండదు.

ప్రబంధ చింతామణియను కుమారపాల ప్రబంధంలో భీమదేవుని భార్యయూ, క్షేమరాజు తల్లియూనగు చోళాను వారాంగన యని పేర్కొన్నారు

''శ్రీ మదనహిల పురవత్తనే బృహతి శ్రీ భీమదేవే సామ్రాజ్య పాలయతి శ్రీభీమేశ్వరస్య పూరే చ ఉలాదేవీ నామ్నా పరాయాఇనా.. తామంతపురఃపురేణ్యధాత్''

---

*4 సంక్షిప్త శైవధర్మ చరిత్ర - శ్రీ దుర్గానందశాస్త్రి*

*5 ప్రబంధ చింతామణి - కుమారపాల ప్రబంధం*

*6 మధ్యయుగ గుజరాత చరిత్ర - దుర్గాశంకరశాస్త్రి పేజీ 201*

ఆమె పుత్రుని పేరు షేమరాజు లేక హరపాలుడు 6 యవ్వనం వచ్చినా అతనికి ఈ మచ్చ వల్లనే రాజ్యం లభించలేదు.

గర్వితుడైన చాళుక్యుడు నర్తకిని పెండ్లాడాడు దీన్ని ఆధారంగా గ్రహించే చోళా రూపకల్పన జరిగింది. చోళాదేవిని అంతఃపురంలో ఉంచడానికి పేర్కొన్న కారణాల కంటే ఈ కధలోని కారణాలు మరింత చక్కగా ఉన్నాయి.

ఈ కధకు మూలం 'పాటణ కా ప్రభుత్వ' 'గుజరాత్ కా నాధ్' 'రాజాధిరాజ్'ల శృంఖల లోనిదే అయినా దీని కల్పనా, శైలి, రచన శిల్ప విధానంలో చాలా తేడా ఉన్నది 25 ఏండ్ల వయసుగల వ్యక్తికీ, 51 ఏండ్ల వయసుగల వ్యక్తికీ ఎంత తేడా ఉంటుందో అంత ఉన్నదని చెప్పవచ్చు.

సాహిత్య సృష్టికై స్వరూప నిర్మాణంలో నే ననేక కొత్త ప్రయోగాలు చేశాను అప్రఖ్యాత కథకుడగు డ్యూమా ప్రభావం నా మీద లేకుండా పోయింది కనుక ఆదుర్దాగా చదవాలని కూర్చున్న పాఠకునికి మొదటి రచనలన్నీ చక్కగా కన్పించక పోవచ్చు కాని భయంకర ఘట్టాలనూ, కరుణ జీవితాన్నీ, మహత్వాకాంక్షనూ, లక్ష్యంగా పెట్టుకొని నడిచే జీవులకు ఇందులో కొంత విశేషం కన్పించకపోదు అసలు నా సాహిత్య చైతన్య మార్గానికి ఒక కొత్త కొలబద్దను సృష్టించకోక తప్పనిసరి అయింది. ఇది ఎలా ఉన్నా గుజరాత పాదపీఠిపై ఈ కథను సమర్పిస్తున్నాను అనేక వర్షాల కోరిక నేడు పూర్తి అవుతున్నది నాకిదే సంతోషం.

**కన్హయ్యాలాల్ మున్షీ**

మహాబలేశ్వర్
20-5-1840

మొదటి ప్రకరణం

# జగన్నియంత

## 1

1082 కార్తీక శుద్ధ ఏకాదశి అయస్కాంతం వైపు ఇనుము ఆకర్షింపబడినట్లు పరమ పునీతమైన సోమనాథ శివమందిరానికి భక్తులు పరుగెడుతూ వస్తున్నారు దేల్వాడా దారిన కొందరు, వేరావల్ బందరు నుండి కొందరు, జునాగఢ్ మార్గాన కొందరు, సుఖోన్మత్తులు కొందరు, దుఃఖితులు కొందరు, కొందరు ధృఢకాయులు, కొందరు రోగులు, కుంటీ, గుడ్డీ, గుఱ్ఱాలపై, ఒంటెలపై, ఏనుగులపై, భజన కీర్తనలతో, తంబుర మీటుతూ, భటుల కాపలాతో ధనరాసులను తరలించుకొని కొందరు, భిక్షాటనతోనే మజలీలు దాటుతూ, బాధానివృత్తికి కొందరు, భక్తి పారవశ్యంతో కొందరు, ధన త్యాగానికీ, ధనార్జనకు, క్రయ విక్రయాలకూ, పుణ్యార్జనకూ, పాప ప్రక్షాళనకూ, వేలసంఖ్యలో భక్తులు ''పరమేశ్వర సందర్శన''మనే పరమ కర్తవ్యాన్ని ముందుంచుకొని వస్తున్నారు. 'జై సోమనాథ్' అనే పుణ్యనినాదమొక్కటే వారి చెవుల్లో మారుమ్రోగుతున్నది.

ప్రభాసకోట కావలా, లోపలా, దారిలో చెట్లకిందా, ఇండ్లనీడల్లో, ధర్మశాలల్లో, కూర్చుంటూనో, నిద్రిస్తూనో, వంట ప్రయత్నాలు చేసుకుంటూనో భక్తులు వచ్చేస్తున్నారు

సూర్యకాంతికి ధగధగ మెరుస్తూన్న శంకరుని రాజధానిపై భక్తిరసమొలికే చూపులు నిలిపి, ఆ మహానుభావుని సహస్రానేక మందిర శిఖరాలపై నర్తిస్తున్న ధ్వజాల సుందర దృశ్యానికి మనస్సులుప్పొంగిపోగా, సోమనాథ మందిరంపై సువర్ణ కలశ కమనీయ కాంతులను చూచి ముగ్ధులవుతూ, కలశంమీద రెపరెపలాడుతున్న కాషాయవర్ణ మండిత మోహన ధ్వజంలో తమ మోక్ష మార్గాన్ని వెదుక్కుంటూ, ఒకరినొకరు [illegible] అట్టహాసం చేస్తూ, జై సోమనాథ్ అని నినాదాలిస్తూ ముఖద్వారం[illegible] వస్తున్నారు.

## 2

సోమనాధుని శివాలయం ఒక ఇల్లు కాదు, పట్టణం కాదు, ఆరోగ్యప్రదమైన ప్రదేశమూ కాదు శతాబ్దాల భక్తి శ్రద్ధలా ప్రదేశాన్ని దేవ భూమిలా సర్వసంపదలతో . మోక్షభూమిలా చేశాయి

కోట బయట కాపాలికుల గుంపొకటి ఉన్నది వీరంతా నీలవర్ణులు, దృఢకాయులు, మహావ్రతధారులు, కపాల మాలల్ని ధరించి, చూపరులకు భయం కల్గింపచేస్తూ, బూడిదనో, మనుష్య మాంసాన్నో తింటూ, అట్టహాసాలతో కపాల పాత్రలతో సురాపానం చేస్తుంటారు

కోటలో ప్రవేశించగానే ధనికులైన యాత్రికులుండే ధర్మశాలలున్నాయి వాటికి ఎడమవైపున మోచీలు, గాండ్లవారు, ఇతర పేద గేస్తులు ఉంటారు కుడివైపున దుర్గపాలకులు, రక్షక భటులు నివసిస్తుంటారు

ముఖద్వారంలోంచి విశాలమైన మార్గాన ముందుకు నడిస్తే బావులు, కోనేర్లు దాటి ఒక ముఖ్య వీధి ఉన్నది గుజరాతీ వణిక్కులక్కడ, కళాకౌశలాలకు ప్రపంచ ప్రఖ్యాతి పొందిన వస్తువుల్ని విక్రయిస్తుంటారు రకరకాల ఇత్తడి, రాగి పాత్రలూ, పట్టు జరీతో నేసిన వస్త్రాలూ- అనేక రకాల నగలూ అక్కడ వుంటాయి గజరాతీ వణిక్కుల పూర్వులు కాలుమీద కాలు వేసుకొని, ఠీవిగా బొజ్జ నిమురుతూ, వడ్డీ వ్యాపారంతో రేయింబవళ్ళు ధనార్జనతో తన్మయులై ఉండే స్థలమిది

వీధి కిరుపక్కలా ఉండేది అగ్రవర్ణస్థులు ముందుకు నడిస్తే ప్రాకారం వస్తుంది దాని దాపునే ఈవలివైపు బ్రాహ్మణ వీధి ఉంది రెండువేల మంది శ్రోత్రీయు లావీధిలో వేదాధ్యయనంతో, పూజాదికాలతోనూ శాస్త్రోక్తంగా ఇహంలో సోమనాధుని పూజిస్తూ, పరంలో ముక్తి నార్జించుకుంటారు

ప్రాకారపు గోడ దాదాపు ఇరవై అడుగుల ఎత్తూ, ఆరడగుల వెడల్పూ ఉంటుంది. లోపలికి ప్రవేశించగానే యిరువైపులా పురోహితుల ఆసనాలూ, పూజాసామాగ్రి అమ్మే చిన్న చిన్న అంగళ్ళూ ఉన్నాయి. అక్కడే మధ్యన గణపతి మందిరం ఉంది దీన్ని యయాతి మహారాజు నిర్మించాడని ప్రతీతి దీని కిరువైపులా రెండు పూలతోట లున్నాయి. హిరణ్యానదిలో నుంచి రెండు కాలవల్లో నీరు ఎప్పుడూ ఈ తోటల్లోకి ప్రవహిస్తూ ఉంటుంది. ఈ నీటివల్ల పూదోట లెపుడూ చక్కగా విరియబూసి ఉంటాయి.

ఎడమవైపున పూదోట ప్రక్కగా భైరవమందిరం ఉంది ఇక్కడ కాపాలికులూ, కాళముఖులూ, భయంకర మూర్తి అయిన భైరవ స్వామిని మద్యమాంసాలతో పూజిస్తుంటారు కాళికా చతుర్దశినాడు అక్కడ నరమేధ మవుతుందని వాడుక అక్కడికి పోయే అదృష్టం అందరికీ దొరకదు భక్తులంతా దూరాన్నుంచే నమస్కరించి వెళ్తూంటారు ఎడమవైపున కూడా పూదోటలో ఒక ద్వారం ఉంది అనేక కల్పిత గాధల కధిష్ఠానదేవత అయిన త్రిపురసుందరీ మందిరానికి దారి యిదే ఈ మందిరానికి చుట్టుపక్కలే పార్వతి అవతారాలైన కుమారి, కాళి, కాపాలి, చాముండి మొదలైన దేవతల మందిరాలున్నాయి. త్రిపుర సుందరీ మందిరానికి భక్తులు ఉల్లాసంతో వెళ్తూంటారు. అక్కడ స్తంభాలపై, భిత్తిలపై శివపార్వతుల మూర్తులు కనిపిస్తాయి. మందిర ద్వారం మీద ఒక భైరవచక్రం ఉంది స్త్రీలకే మోక్షాధికారమని నమ్మే భక్తు లెందరో అక్కడ రేయింబవళ్లు స్త్రీల హావభావాలతో మహాశక్తిని పూజిస్తూ ఉంటారు. ఆశ్వీయుజ మాసం మొదటి పది రోజులూ ఉత్తర కాళికా సాంప్రదాయానికి చెందిన కాపాలికులు మహా శక్తి సజీవ స్వరూపాన్ని స్తుతి, కీర్తనలతో పూజిస్తుంటారు మధు, మత్స్య, మాంస, మదిరలు నైవేద్యాలుగా పంచి పెడతారు భోగవిలాసాలే ఈ మందిరంలో మోక్షానికి రాచబాటలు

ఈ సాంప్రదాయంలో దీక్ష పొందిన స్త్రీ పురుషులు మందిరంలో జాతి, వర్ణ, ఆచారాలను విడిచి జగజ్జనని యైన మహాశక్తి పూజలో లీనమవుతారు.

## 3

గణపతి మందిరానికి ఎదురుగా సోమనాథుని మందిర ముఖద్వారం ఉంది. దాని పైనే నౌబత్‌ఖానాలో ప్రతి ప్రహరానికీ గంటలు కొడుతూంటారు ఈ ద్వారానికి రెండు వైపులా రెండు 'దీప స్తంభా' లున్నాయి. ఆ రెంటిపైనా రెండు వృషభమూర్తులను రాతితో చెక్కారు ఆ రెండు స్తంభాలపైన అద్భుతమైన శిల్పం కనిపిస్తుంది. కుడివైపున ఉన్న దీప స్తంభానికి సమీపంలోనే 'చంద్రగుండం' ఉంది. దానిలో స్నానం చేస్తే సమస్త వ్యాధులూ, సర్వపాపాలూ నాశనమవుతాయట. దీపాల మధ్య నుంచి వెళితే సభామండపానికి మెట్లు కనిపిస్తాయి మంటపంలో నుంచి గర్భద్వారానికి దారి ఉంది గర్భగృహం పైన ఒక పెద్ద శిఖరం ఉంది. ఆ శిఖరం మీద ఒక్కొక్క అండకు ఒక్కొక్క దేశపు శిల్పులు తమ చేతి పనితనాన్ని కురిపించి అనేక మూర్తులను చెక్కారు. దానిపైనే శంకరుని విజయపతాకమైన కాషాయ ధ్వజం రెపరెపలాడుతూ ఎగురుతూ ఉంటుంది.

సభా మండపంలో ప్రవేశించగానే రెండు మూలలా రెండు ఐరావతాలు చెక్కబడి ఉన్నాయి వాటిపై ఎక్కి ఇంద్రుడు శివపూజకై వస్తున్నట్లు రూపింపబడింది మండపం వైశాల్యానికి తోడు అద్భుతంగా కూడా ఉంది మండపంలో ఉన్న నలభై ఎనిమిది స్తంభాలూ, వృక్ష పంక్తులతో శోభిల్లుతూన్న మహావనాన్ని గుర్తుకుతెస్తాయి అయిదువేల మంది భక్తు లొక్కసారిగా ఆ మండపంలో నిల్చుని పరమేశ్వరుని సందర్శించవచ్చు

మండపానికెదురుగా, తూర్పు ముఖంగా గర్భ ద్వారంవైపు చూస్తూన్న ఒక ఇత్తడి మహానంది ఉంది ఆ నంది తోకను తాకితే చాలు సంసార సాగరాన్ని తరించవచ్చునని భక్తుల నమ్మకం.

గర్భగృహంలో త్రిలోకనాథుడు శ్రీ సోమనాథ పరమేశ్వరుడు విరాజిల్లుతూ ఉంటాడు

సృష్టికి పూర్వం ప్రకృతి పురుషు లుద్భవించారు పరస్పర ధ్యానంలో - నారాయణీ నారాయణుల రూపంలో - అనంత జలరాశిపై నిద్రించారు అపుడు నారాయణి నాభినుంచి ఒక కమలం పుట్టింది. ఆ కమలం యొక్క నూరు దళాల కాంతులు కోటి సూర్యుల వలె తేజరిల్లాయి ఆ దళాలలో నుంచి హిరణ్య గర్భుడు ఉదయించాడు

''నే నెవరి పుత్రుణ్ణి?'' అని నవోదిత బ్రహ్మ ప్రశ్నించాడు ఈ ప్రశ్నకు సమాధానం పొందడానికి శతాబ్దాల వరకూ ఆ కమల నాళంలో తిరిగాడు. అలా తీవ్రమైన తపశ్చర్య చేయగా, చివరికి పీతాంబరధారియైన చతుర్భుజుడు - శ్రీ మహావిష్ణువు - ప్రత్యక్షమయ్యాడు

''నే నెవరిని?'' అని బ్రహ్మ తన మనస్సునే సంక్షోభపెడుతూన్న ప్రశ్న వేసుకున్నాడు

''నేను జగత్తును సృష్టించాను నీవు నావల్లనే జన్మించా''వన్నాడు విష్ణువు.

ఈ అవమానాన్ని సహించలేక బ్రహ్మ విష్ణువుతో మహాయుద్ధానికి తలపడ్డాడు శతదళ కమల కాంతులలో ఘోరమైన యుద్ధం ప్రారంభమైంది. అలా యుద్ధంలో మునిగి వున్న ఈ యిరువురి మధ్య శతానేక జ్వాలల్తో శోభిల్లుతూ, ప్రళయ సముద్రాంతర మహాగ్ని సమూహం వలె తేజరిల్లుతూ, వృద్ధి క్షయ రహితమూ, తర్కనిర్వచనా తీతమూ, సృష్టికి మూలరూపమూ యైన జ్యోతిర్లింగం ప్రత్యక్షమైంది. వెంటనే ఈజ్యోతిర్లింగానికి ఆద్యంతాలు తెలుసుకునేందుకు విష్ణువు వరాహ రూపాన్నీ, బ్రహ్మ హంస రూపాన్నీ ధరించి పాతాళాకాశాలలోనికి పరుగెత్తారు

మొదట ఈ శివమూర్తికి చంద్రుడు మేల్మి బంగారు మందిరాన్ని కట్టించాడు. సత్యయుగం కూడా ఆవిర్భవించిన నాటి గాధ అమృతనాథుడైన చంద్రుడారోజుల్లో అఖండంగా పన్నెండు నెలల రాత్రులనూ శోభిల్ల జేస్తూండేవాడు కాని బృహస్పతి భార్య - తారను చేరదీసి చంద్రుడు కర్తవ్యభ్రష్టుడయ్యాడు ఇరువదేడ్గురు భార్యల్లో రోహిణీ మీదనే ఎక్కువ ప్రేమతో వ్యవహరిస్తూండేవాడు భర్త ఇలా నిరసిస్తే విసిగి మిగతా ఇరువదార్గురు భార్యలూ తమ తండ్రియైన దక్షప్రజాపతి వద్దకు విలపిస్తూ వెళ్లారు కన్న కూతుళ్ల దుఃఖాన్ని చూసి సహించలేక కోపంతో ''నీవు క్షయరోగివి కమ్మ''ని చంద్రుణ్ణి దక్షుడు శపించాడు ఈ శాపాన్ని వినగానే వెలుగులేని రాత్రులే మనకిక గతి కాబోలునని ముల్లోకాలూ గడగడ వణికిపోయాయి

క్రమేపీ క్షీణిస్తూ, మామగారి శాపానికి దగ్ధుడవుతూ చివరకు చంద్రుడీ జ్యోతిర్లింగాన్ని శరణు వేడాడు అలా అనేక యుగాలు తపస్సు చేశాడు తుదకీ జ్యోతిర్లింగం చంద్రుని తపస్సుకు తృప్తిపొంది 'పదిహేను రోజులు క్షయా, పదిహేను రోజుల వృద్ధీ కలుగుతుంటా'యని దీవించింది అప్పుడే ఈ జ్యోతిర్లింగాన్ని సోమనాథుడనే పేరుతో స్తుతించారు

ఋషులూ, దేవతలూ అక్కడ 'చంద్రగుండాన్ని' నిర్మించారు చంద్రుడు ఒక మేల్మి బంగారు మందిరం కట్టించాడు

యుగాలు గడిచాయి లంకేశుడైన రావణుడు జగత్తునంతా తన గుప్పిట ఇముడ్చుకోవాలనే కోరికతో ఇక్కడ మహోగ్రమైన తపస్సు చేశాడు శంభుప్రీతికై ఒక్కొక్కటిగా తన శిరస్సులను ఖండించి సోమనాథుని పాదతలిని సమర్పించాడు. చివరి తల ఖండింపబోయేసరికి కృపాసింధువైన పరమశివుడు ప్రత్యక్షమై అతని పది తలలు తిరిగి ప్రసాదించడమేగాక 'విశ్వవిజయం సాధించ'మని దీవించాడు. రావణు డపుడిక్కడ ఒక రజత దేవాలయాన్ని నిర్మించాడు

ద్వాపర-కలియుగాల సంధి కాలంలో పదహారువేల నూట ఎనమండుగురు భార్యలతో యాదవ కుల శిరోమణియైన శ్రీకృష్ణుడీజ్యోతిర్లింగాన్ని పూజించి ''పురుషో త్తమ'' పదవిని పొందినప్పుడిక్కడ ఒక చందన దేవాలయాన్ని నిర్మించాడు

కాలాంతరంలో, కలి ప్రభావం పెరిగినప్పుడు వల్లభీపుర పరమ మాహేశ్వరులైన రాజులు ఇక్కడి రాతితో మందిరాన్ని నిర్మించారు ఈ మందిర నిర్మాణానికి విశ్వకర్మ సహాయం చేశాడనీ, దేవగంధర్వ కిన్నరులు తమ సంగీత నృత్య వాద్యాలతో ఇక్కడ శివప్రతిష్ఠ జరిపించారనీ వాడుక

## 4

ఈ జ్యోతిర్లింగానికి అహర్నిశలూ రుద్రాభిషేకం జరుగుతూనే ఉంటుంది ఎదురుగా ఉన్న సభామండపంలో సూర్యోదయాది అర్ధనిశీధి వరకు అనవరత నృత్యం జరుగుతూనే ఉంటుంది

దీప స్తంభానికి ముందుగా ప్రదక్షిణ మార్గంలో ప్రాకారానికి మూడు చిన్న తలుపులున్నాయి. అందులో ఒకటి పాశుపత మఠానికి దారి చూపుతుంది ఆ మఠంలోనే పూజ్యపాదులైన గంగ సర్వజ్ఞులు నివసిస్తూ ఉంటారు.

శంకరుని అవతారమని కీర్తిపొందిన లకులేశ దేవులు స్థాపించిన పాశుపత మతానికి ఈ గంగ సర్వజ్ఞులు పరమ గురువులు సమస్త జ్ఞానమూ ఆయనకు కరతలామలకం అందుకే ఆయనను ''సర్వజ్ఞు''డని భక్తులు వ్యవహరిస్తుంటారు ఆయన కీర్తి అన్ని లోకాలలోనూ వ్యాపించింది కాశ్మీర్ నుంచి కంచి వరకూ సర్వజ్ఞుని శిష్యులు గురువుగారి కీర్తిని వ్యాపింపజేస్తూంటారు దేశదేశాల రాజులు తమ మకుటమణుల కాంతుల్తో గురు దేవుని పాదాలను అభిషేకిస్తూంటారు ఆయన కనుసన్నలను సాక్షాత్తు సోమనాధుని ఆదేశంగా ప్రజలు భావిస్తారు దేవతల్లో చేర్చి లెక్కించరు కానీ దేవతలకు కూడా సాధ్యమవని తపోవైభవాన్ని ఆయన సంపాదించారు

వెనుకవైపునున్న రెండవ ద్వారం ఒక చతుశ్శాలలో నుంచి సముద్రానికి దారి చూపుతుంది

## 5

ప్రాకారానికి దక్షిణంగా నాల్గోద్వారముంది దేవదాసీ గణం ఉండే వీధికి ఇటే దారి. ఈ వీధికి నాల్గువైపులా కోట ఉంది.

ఈ వీధిలో మూడు నాలుగు వందల దేవదాసీలు ఉంటారు ఇందులో కొందరు ఘుర్జర దేశాలవారు. గోధుమరంగు మైఛాయ, పొట్టి శరీరం వీరిది. మంద స్వరాలతో భావ పూర్ణమైన సంగీతంతో వీరంతా దేవదేవుని ఆరాధిస్తుంటారు. ఉత్తర ప్రాంతం నుంచి వచ్చిన దేవదాసీలు మాట్లాడే భాష ఎవరికీ తెలియదు. కాని తీవ్ర ధ్వనులను ప్రసరించే సారంగి మీద ఏవో పాటలు పాడుతూ పరమేశ్వరుని రంజింపజేయాలని ప్రయత్నిస్తుంటారు ఇంకా ఉత్తరాది వారు - ఎవరో పార్వతీయులు - చాలా పొడుగరులు. ఎఱ్ఱని మైఛాయగల సౌందర్యరాసులు. కాని వారి గొంతు కర్కశంగా

ఉంటుంది ఆలాపనలో మాధుర్యం ఉండదు కొందరు దక్షిణం నుంచి వచ్చారు. వీరంతా శ్యామవర్ణులు నాతి దీర్ఘనాశికలు. చిత్ర విచిత్రాభినయాలతో, అతిలోక మధుర స్వరాలతో పాడుతూంటారు వీరి భాష ఎవరికీ తెలియదు.

ఈ దేవదాసీలంతా పరమేశ్వరునికి సమర్పితులు. నృత్యగీతాదులతో దేవదేవుని ఆరాధించడమే వీరి జీవితాదర్శం - ఈ మూడు నాలుగు వందల నర్తకీగణమూ, వస్త్ర భూషణాలు ధరిస్తూనో, నృత్య సంగీతాలు నేర్చుకుంటూనో, నేర్పుతూనో లేదా పర పురుషులకు విలాసక్రీడలు నేర్పుతూనో కాలక్షేపం చేస్తుంటారు

## 6

ఈ వీధిలో మిగతా యిళ్ళకు దూరాన చక్కని చిన్న ఇల్లొకటి ఉంది. ఇంటి ముందు లోగిలిలో చెట్టుక్రింద ఒక యువతి లేత చేతులపై బుగ్గలానించి, కాళ్లను మంచం మీద కొడుతూ, బోరగిల పడుకుంది మధ్యాహ్నం నిద్రలేచిన తర్వాత అలా పడి ఉంది. తల వెంట్రుకలు నిగ నిగ లాడుతూ సింహకేసరములవలె చక్కగా ఉన్నాయి. జడకుచ్చులు ఆచ్ఛాదనలేని వీపును సగం కప్పుతూ మోకాళ్ళవరకూ వ్రేలాడుతున్నాయి. కాళ్ళతో మంచంమీద ఎత్తికొడుతున్నప్పుడు నల్లని నీటి అలలు లేచి పడుతూ ఉన్నట్లు శిరోజాలు పైకిలేచి పడుతున్నాయి

విసుగు ఎక్కువవుతున్నకొద్దీ కాళ్ళను త్వరత్వరగా కొడుతోంది కాళ్ళమీద వెంట్రుకలు ఎగిరి పడుతున్నాయి

పద్దెనిమిది సంవత్సరాలు వచ్చినా, అవయవాల పొందికవల్ల పదహారేండ్ల బాలికగా కన్పిస్తుంది ముఖంలో ఎనిమిదేళ్ళ బాలకుని మాధుర్యం, సారళ్యం కనిపిస్తాయి. కాని, కన్నుల్లోని గాంభీర్యం మట్టుకు వయస్సుకు మించినది. నుదుటిమీద అప్పుడప్పుడు కొన్ని రేఖలు పడి చెరిగిపోతున్నాయి ఇంకా తన తల్లి ఎందుకు రాలేదు? సర్వజ్ఞులు ఎప్పుడూ ఎందుకంతసేపు ఆమెను కూర్చోబెట్టుకుంటాడు? ఈ ముసలాడు ఎప్పుడూ ఇంతే

మెడ పైకెత్తి సూర్యుణ్ణి చూసింది మెడమీది రేఖలు వింటి వంపులను మరిపించేట్టున్నాయి అప్పుడే సూర్యుడొకవైపుకు వాలబోతున్నాడు సోమనాథుని మందిరం పైన సువర్ణకలశం మీద పడుతూన్న కిరణాలు కొంత కాంతి తగ్గాయి.

అలా చాలాసేపు పరధ్యానంగా చూపులను శిఖరంమీదనే నిలిపి ఉంచింది. వంశానుగతంగా నేర్చుకున్న శిల్పకళను ఆకాశాన్ని అందుకుంటున్న ఆ శిఖరంలో

మహాశిల్పు లెందరో కరిగిపోశారు చోళాదేవి అక్కడ నిల్చొని సముద్ర తరంగ తాళాలతో నృత్యం చేస్తూండేది. చోళాదేవి భావాలు పరుగెత్తాయి సూర్యాస్తమయం కావస్తోంది హారతులిస్తారు. ఇక తనవంతు. తన జీవితానికి అపూర్వమైన సమయం. తల్లిదండ్రులు పసితనం నుంచీ ఉద్వేగపడుతూండేవారు తానూ బుద్ధి తెలిసినప్పటినుంచీ ప్రయత్నం చేస్తూనే ఉంది. ఏ ముహూర్తం కోసమిన్నాళ్లూ ఎదురుచూస్తూ జీవించిందో ఆ శుభముహూర్తం రానే వచ్చింది

జగన్నాయకుడైన సోమనాధుని ప్రీతికై తన తల్లిలా మూడు వందల మంది దేవ దాసీలు అహర్నిశలు నృత్యం చేస్తూ ఉంటారు. అయినా అందరిలోనూ తనదే పైచేయి తన కాళ్లల్లో ఉన్న బలం సౌందర్యం ఇతరులకేవి? ఎవరి నడుమూ తన నడుములా వొంపులుతీరి కులుకులు వలక పోయదు సర్వజ్ఞులు కూడా తనమీద అభిమానం చూపుతూనే ఉంటారు ఆయన కూడా తన సౌందర్యం చూసి ఆనందిస్తూనే ఉంటారు నృత్యం చేస్తూ చేస్తూ అలసిపోయినప్పుడు శ్రీ సోమనాధుడే తన కాళ్ళలో బలం కరిగి పోసేవాడు ఎన్నోసార్లు ఆ త్రిశూలపాణియైన పరమశివుడు కలలో కన్పించి ''కుమారీ నాకు నిజమైన నర్తకివి నీవే'' అన్నాడు. తనూ తన శరీరాన్ని, మనస్సునూ, శ్వాసోచ్ఛ్వాసాలనూ ఆ మహామహునికే సమర్పించుకుంది జీవితమంతా శ్రీసోమనాధుని సంప్రీతికై నృత్యం చేయడం తప్పితే మరో కోరికే ఆమెకు లేదు నృత్యం చేయడమే- జయసోమనాధ నినాదంతో నృత్యం చేస్తూ సోమనాధుని గర్భద్వారం ముందు ప్రాణాలని సమర్పించడం- దీనిని మించి పొందదగిన కోరికే లేదు చోళాదేవికి.

## 7

దేవాలయ నృత్యశాల నియమాల ననుసరించి కార్తీక ఏకాదశినాడు హారతి సమయంలో, అష్టాదశ నాట్య శాస్త్రాల్లోనూ, ద్వాదశాభినయ శాస్త్రాల్లోనూ ఆరితేరిన పదునెనిమిదేండ్ల బాల నర్తకికి ప్రారంభ నృత్యం చేసే అదృష్టం లభిస్తుంటుంది. ఆ శుభ సమయంలో ఒక కిశోర కుసుమం వికసించి దేవదేవునికి సమర్పిత మవుతుంది శేషించిన జీవితాన్ని రోజూ నృత్యం చేస్తూ దేవదాసిగా శుష్కింప చేసుకుంటుంది.

ఆ క్షణికానందం మరుగున ఎంత అంధకారముందో చోళాకు తెలియదు నేడామె నృత్యం చేయబోతున్నది సోమనాధుడు తప్పక ప్రసన్నుడౌతాడు ఆ మహామహుణ్ణే సాక్షాత్కరించుకోడాని కెంత తపస్సు చేసింది

నృత్యంలో ఆరితేరడానికి ఇంద్రియాలను అదుపులో పెట్టుకుంది తిండినీ, నిద్రనూ పరిమితం చేసింది పురుషస్పర్శ అంటూ ఎరుగదు సోమనాథుడిక తప్పక ప్రసన్నుడౌతాడు ఇహ- ఇహ- ఏకాదశీ శివరాత్రులకు తన నృత్యం తప్ప మరో నృత్యాన్నే పరమశివుడు చూడడు ఆ నమ్మకం పూర్తిగా వుందామెకు ఎన్నోసార్లు తెల్లవారకమునుపే నిర్మానుష్యమైన సభామండపానికి వెళ్లి ఆమె సోమనాథుణ్ణే ఆరాధించింది ఇతరులకు అనూహ్యమైన కళను ప్రసాదించమని వేడుకున్నది పరమేశ్వరుడు అనుగ్రహించాడు అదే నేడు తనకు లభించబోతున్నది నేడామె నృత్యం చేస్తుంది భోలాశంకరుడు ఎంతో ఆనందిస్తాడు

-చోళా మళ్ళా శిఖరాన్ని చూచింది పైన కాషాయ ధ్వజం గాలిలో రెప రెప లాడుతోంది

--అలా ఎంతసేపు చూస్తూ గడిపిందో

అలలవలె ఎగిరే పతాకాల దృశ్యమంటే చోళాకు మహదానందం ఎవరెక్కడ నృత్యం చేస్తున్నా ఆమె హృదయం అక్కడికి పరుగెత్తుతుంది రెపరెపలాడే ధ్వజాలనూ, పైపైకిలేస్తూ నర్తించే తరంగాలనూ, ఉయ్యేలలూగే కొమ్మలనూ చూచినప్పుడల్లా ఆమె హృదయం పొంగేది ఆమె కూడా ఆ కుటుంబంలోనిదే తాళబద్ధ సౌందర్యమే వీటన్నిటికీ సమాన లక్షణం వీటన్నిటికీ మూలరూపుడైన భోలా శంకరునితో చోళా జీవితం లీనమై పోయింది పరమ శివుడైన నటరాజమూర్తీ - ఆ మహా మహుని బాల నర్తకియైన తనూ- ఈ ఇద్దరికే చోళా హృదయంలో స్థానం ఉన్నది మిగతా ప్రపంచమంతా మంచుతో నిర్మించింది

'చోళా .. చోళా. లే! ఎంతసేపూ నిద్ర.' గంగ చోళాను లేపింది చోళాముఖం సంతోషంతో వికసించింది. కొంచెం లేచి వెనక్కు చూచింది; అపుడామె మెడమీదా, భుజాల మీదా మాధుర్య రేఖలు వెల్లి విరిశాయి.

'ఇహలే, అవునుగానీ, ఈరోజు ఎవరొచ్చారో తెలుసా?' అని అడిగింది గంగ.

'ఇంతకూ నా గుడ్డలేవే?'

'ఇవిగో ' అన్నది గంగ నవ్వుతూ

గంగకు వయస్సు మళ్ళింది. తలలో వెండిగుత్తుల్లా జుట్టు మెరుస్తున్నది ఐనా ఆమె- నడకలో - గొంతుకలో ఇప్పటికీ ఆకర్షణ ఉన్నది స్వరంలో ఇప్పటికీ మాధుర్యం పొరలుతూనే ఉన్నది ఇరవైయైదు సంవత్సరాలపాటు సోమనాథ మందిరంలో నృత్య కళకు నాయకత్వం ఎలా వెలిగించిందో చూస్తేనే తెలుసుకోవచ్చు

కూతురి కళ్ళలోని మెరుపు ఆమె కన్నుల్లో లేకపోయినా అందానికి మట్టుకు ఏసిపోదు కూతురిని చూచి గంగ నవ్వుతున్నది ముసలితనం క్రమ్ముకుంటున్నా చూపులలో భావాన్ని ప్రదర్శించే శక్తి సన్నగిల్లలేదు

తల్లి చేతుల్లో ఉన్న వస్త్ర భూషణాలను చూచి చోళా ఆమెను సమీపించింది వస్త్రభూషణాలే తన ప్రాణాలైనట్లు శ్వాస బిగించి అలాగే వాటిని చూస్తూ నిల్చున్నది

'అమ్మా ! యివన్నీ నాకే-నాకేనా ?'

'అవును! ఎన్నో దేశాలనుంచి నీకోసం ఆయన తెప్పించారు.'

సర్వజ్ఞుణ్ణి సర్వనామంతో తప్పితే మరోవిధంగా గంగ సంబోధించదు ఈరహస్యాన్ని తలచుకొని చోళా ఆనందిస్తూ ఉండేది

'ఏవిటీ! నిజంగా?' అన్నది చోళా

'నిజంగానే సరేగాని ఇవాళెవరు వచ్చారో తెలిసిందా?'

'నాకేం తెలుసు? ఎవరొచ్చారు?'

''పాటణ ప్రభువు శ్రీ భీమదేవ మహారాజు''

''సరే!'' అంటూ చోళా ఒక నగను తీసుకొని మెడలో పెట్టుకోబోయింది

''ఏం! ఘుర్జర మహారాజు అంత హీనంగా కన్పించాడే నీ కంటికి?'' అన్నది గంగ.

''నాకా నాకు నా సోమనాధుడు తప్ప మరొకరి లెక్కేలేదు''

''నేనంటేకూడానా'' అంటూ నవ్వుతూ నెమ్మదిగా చోళా చెంపమీద కొట్టింది గంగ

''నువ్వా! అమ్మా! నీవు లేకపోతే ఎలాగే'' అంటూ చోళా తల్లి కంఠాన్ని తన చేతుల్తో పెనవేసింది

ఈ వీధి కంతటికీ గంగ, తన తల్లివలెనే నాయకత్వం వహించింది గంగ అంటే మిగతా దేవదాసీలకు మహాభయం నృత్య, గీతాభినయాల్లో ఆమెకు రానిదేమిటో ఎవరికీ తెలియదు స్వరంలో, తాళంలో, ముద్రలో ఎవరు తప్పుచేసినా ఇట్టే పట్టుకుంటుంది తప్పు చేసిన వారిని గట్టిగా మందలిస్తుంటుంది ఎవరికి ఏ ఇల్లివ్వాలో, ఎన్ని నగలివ్వాలో శెలవలెపుడివ్వాలో గంగే నిర్ణయిస్తుండేది ఈ అధికారానికీ, నాయకత్వానికీ మరో కారణం ఉందని పడనివాళ్ళు కొందరంటుంటారు దేవదాసీల్లోకల్లా సర్వజ్ఞుని దగ్గరకు వెళ్ళ గలిగేది .. ఏ పనైనా జేయించగలిగేది - గంగ ఒక్కతే అడగకముందే సర్వజ్ఞుడు ఆమె కోరికలను తీరుస్తుంటాడని గిట్టని వాళ్ళంటారు వీరిని గురించి కొన్ని పుక్కిటి పురాణాలు కూడా వృద్ధులు చెబుతుంటారు కాని నిజానిజాలు ఎవరూ చెప్పలేరు ప్రతి సోమవారం గంగ నృత్యం చేస్తుంటుంది. సర్వజ్ఞుడెప్పుడూ మరచిపోకుండా వస్తుంటాడు

ధూర్తులు కొందరు చోళా ముఖాకృతిలో బ్రహ్మచారియైన సర్వజ్ఞుని మూర్తిని వెదుకుతుంటారు పోలిక లేకపోయినా ఉన్నవని చూపేందుకు ప్రయత్నిస్తుంటారు

గంగను ఆమె తల్లి తర్ఫీదు చేసినట్లే చోళాను గంగ ఈ పదవి కొరకు తర్ఫీదు చేసింది తనకు తెలిసిన కళనంతా కూతురుకి నూరిపోసింది యౌవ్వనంలో ఆమె ఎంత అందగత్తో చోళా అంతకు మించిన అందగత్తె సర్వజ్ఞుని పట్ట శిష్యుడైన శివరాశి చూపులు చోళాపై ప్రసరించేందుకు గంగ ఒక పన్నాగాన్ని కూడా పన్నింది ముందు ముందు శివరాశి చేతిలోకి మఠాధిపత్యం వచ్చినప్పుడు దేవదాసీలకు చోళా నాయకురాలవ్వాలని గంగ కోరిక కాని అప్పుడప్పుడు చోళాపై గంగకు విశ్వాసం కుదరక పోయేది దానికి లౌక్యమే తెలియదు ఎప్పుడూ ఎగురుతూ పాడుతూ సోమనాథుని పూజిస్తూనే కూర్చుంటుంది దేవసమర్పితలైన దాసీగణం ఎప్పుడూ దేవధ్యానమే చేస్తుండాలని అందరికీ నేర్పిందేకాని, ఆచరించేటప్పుడు ఎన్నో బాధలుంటాయని గంగకు తెలుసు రాను రాను చోళాకు కూడా అనుభవం మీదట అన్నీ తెలుస్తాయని గంగ విశ్వాసం కాని అప్పుడప్పుడు చోళా పెద్దదైనా వీటిని గ్రహిస్తుందో లేదో అని గంగ భయపడుతూ ఉండేది.

ఈ రోజు గంగకు పరీక్షా దినం. మహాశివుని పూజాసమయంలో చోళాదేవి మొట్ట మొదటిసారిగా నృత్యం చేయబోతున్నది ఈ శుభ సమయానికై ఎన్నేండ్లనుంచో గంగ కూతురిని తయారు చేసింది పోయిన సంవత్సరం సర్వజ్ఞుడు చోళా ప్రసక్తి తెస్తే, ఇంకా చిన్నదే అనీ, విద్య పూర్తికాలేదనీ మాట తప్పించింది

రెండవ ప్రకరణం

# నృత్యాంజలి

బైట దీపస్తంభాలమీద వేలకొలది దీపికలు వెలుగుతున్నాయి కోట అంతా కళకళ లాడుతున్నది సోమనాథ భగవానునికి హారతులిచ్చే సమయం సమీపించడం వల్ల భక్తులు సభామండపంలో గుమికూడారు

సభామండపంలో స్తంభాలమీద వున్న బంగారు దీపికల్లో జ్యోతులు మెరుస్తున్నాయి కప్పుపైన, స్తంభాలమీద త్రిపుర సంహారుడైన శంకరుని మూర్తులు జీవకళతో ఉట్టిపడుతున్నాయి నాలుగేసి స్తంభాలకు మధ్యగా బంగారు గొలుసుల్తో వ్రేలాడదీసిన ఘంటికల ధ్వనులు గట్టిగా విన్పిస్తున్నాయి జనసంఖ్య పెరిగినకొద్దీ 'జై సోమనాథ్' అనే నినాదం కూడా మారుమ్రోగుతోంది

గర్భ గృహంలో పైనుంచి వ్రేలాడుతున్న రత్నఘటిక దీపికలు వెలుగుతున్నాయి మధ్య రొమ్ము ఎత్తున సోమనాధ లింగం పూలతో - బిల్వ పత్రాలతో కైలాస గిరిని గుర్తుకు తెస్తూ విరాజిల్లుతున్నది.

శివమూర్తిపైన వ్రేలాడే కలశంలోనుంచి ధార సన్నగా పడుతున్నది నాల్గు వేదాల్లోనూ పారంగతులైన శ్రోత్రియులు పురుష సూక్తం పఠిస్తూ మహాశివుని పూజిస్తున్నారు

హఠాత్తుగా నౌబత్ఖానాలో వాద్యాలు మ్రోగాయి జనంలో త్రొక్కిడి ఎక్కువైంది పదిహేను మంది 'బ్రహ్మచారులు' ముందుగా వచ్చి దారి ఏర్పరచారు జనం హడావుడిగా తొలగి గర్భగృహానికి ఎదురుగా దారి నిచ్చారు

ఒక బ్రహ్మచారి గంభీరంగా శంఖుల నూదాడు ఆ గంభీర ధ్వని అన్ని వైపులా వ్యాపించింది ప్రజలంతా నిశ్శబ్దంగా మెట్లవైపే తదేక దృష్టితో చూస్తూ నిల్చున్నారు

ముందు ఆజానుబాహువైన వృద్ధుడొకడు ప్రవేశించాడు. శరీరం బంగారంలా మిలమిల మెరిసి పోతున్నది వ్యాఘ్ర చర్మాన్ని ధరించాడు శరీరమంతా భస్మంతో నిండి పోయింది సగం నెరిసిన గడ్డాన్ని ముడి వేశాడు విదియ చంద్రునిలా యజ్ఞోపవీతం వ్రేలాడుతున్నది. ఆయన ప్రవేశించగానే రెండు చేతులూ నుదుటికి చేర్చి ఎందరో నమస్కరించారు కొందరు సాష్టాంగ నమస్కారాలు చేశారు ''జయ సర్వరూప'' ''జయ సర్వజ్ఞ'' అనే విజయ నినాదాలు వ్యాపించాయి

ఆ వృద్ధుని ముఖంలో మూడు కాలాల జ్ఞానకాంతి ప్రసరిస్తున్నది కన్నులు నిర్మలమైన గాంభీర్యాన్ని, సద్భావాన్నీ వర్షిస్తున్నాయి దృష్టి ఈ లౌకిక జగత్తుమీద కాక, ఏదో ఒక కాంతి కేంద్రాన్ని వెదుకుతున్నది పరమశివుని సేవకొరకూ, పాశుపతమత విజయానికీ సర్వజ్ఞులు అలవరచుకున్న సంస్కారాలు అడుగడుగుకూ కన్పిస్తున్నాయి ఆయన 27వ యేట మఠాధిపతి అయినాడు అప్పుడు పాశుపతమత ప్రతిభ సన్నగిలి పోతున్నది కాని నేడు దేశ దేశాల రాజులకాయన వాక్కు బ్రహ్మవాక్కు సర్వజ్ఞుని నిర్విరామ సేవ మూలాననే నాడు భారతదేశ మంతటా సోమనాథుని కీర్తి ముమ్మరంగా వ్యాపించింది

సర్వజ్ఞుని వెంట ముగ్గురు వ్యక్తులు ప్రవేశించారు మొదట సర్వజ్ఞుని పట్ట శిష్యుడు శివరాశి ప్రవేశించాడు వేషం గురువుగారి వలెనే వున్నా ముఖంలో మాత్రం విద్య కంటే లౌక్యమే ఎక్కువగా కన్పిస్తున్నది రెండవ వ్యక్తి పొడుగరి, బలిష్ఠుడు కాగడాల వెలుతురులో ఆయన శరీరం మెరుస్తున్నది. విశాలమైన నేత్రాల్లో పడి కాగడా వెలుతురు ప్రతిబింబిస్తున్నది ముఖంలో, కన్నుల్లో, సంపూర్ణ వ్యక్తిత్వంలోనూ, సౌమ్యభావం, నిర్భయత్వం పట్టుదల కన్పిస్తున్నాయి ఆయన్ను చూడగానే ప్రపంచంలోని ప్రియాతి ప్రియమైన వస్తువును పొందడానికై ఈ వ్యక్తిత్వం ఏర్పడ్డదనే భావం కలుగుతుంది అలసియున్నా నడకలో రాజవంశపు ఠీవి ఉంది తలమీద పాగా, నడుమున వ్రేలాడుతూన్న పొడుగుపాటి కత్తి, భుజాన వ్రేలాడే పెద్ద ధనుస్సూ అతని రాజసాన్ని ధృవపరుస్తున్నాయి అలసి ఉన్నా కుప్పించి దూకడానికి సిద్ధంగా ఉన్న క్రోల్పులిలా ఉన్నాడు

మూడవ వ్యక్తికీ ఈ రెండవ వ్యక్తికీ సంబంధమే లేదు పొట్టివాడైనా అందగాడు బంగారు దేహం, చక్కని ముఖం, తేజం కురిపించే చంచల నేత్రాలు, శ్రీమంతుని గారాబుపట్టిలా కన్పిస్తాడు. ప్రథమ వీక్షణంలో బాలుడుగా కన్పించినా, బిగించిన పెదవుల్లోని రేఖలు అతని ప్రతాపాన్ని ప్రస్ఫుటంచేసి, బాలుడని భావించిన వారిని నిలువునా కంపింప చేస్తాయి అతని నడుములో కూడా కత్తి వ్రేలాడుతున్నది కాని అనవసరమైన ఆయుధాలు మోయడం అతనికిష్టంలేదు.

'నమః శివాయ' అనే వారికి 'శివాయ నమః' అంటూ చేతులు చాచి ఆశీర్వదిస్తూ సర్వజ్ఞుడు గర్భద్వారాన్ని సమీపించాడు. సిద్ధంగా ఉన్న బిల్వపత్రాలను తీసుకొని శివుని ముందు సాష్టాంగపడి పూజించాడు రాజాధిరాజులు ఏ మహానుభావుణ్ణి పూజించడం మహద్భాగ్యమని భావిస్తారో, ఆ మహానుభావుడు - సర్వజ్ఞ గురుదేవుడు - దయార్థియై, చేతులు జోడించి, తలవంచి, దేవదేవుణ్ణే ధ్యానించాడు ఇంతలో ఒక శివభక్తుడు హారతులు సిద్ధం చేశాడు సర్వజ్ఞుడు ఆ హారతులతో పరమశివుని ఆరాధించాడు

నేటికి పదునాలుగు సంవత్సరాలు గడిచాయి సంధ్యాసమయంలో ఒక్కరోజున కూడా మరువకుండా, సర్వజ్ఞుడు స్వయంగా హారతులిస్తూన్నప్పుడు భక్తులు ''నమః శివాయ'' అని మౌనంగా జపిస్తుంటారు వేలకొలది ఘంటికలు ధ్వనిస్తాయి భేరీ వాద్యాలు దేవదుందుభుల్లా మ్రోగుతాయి

సర్వజ్ఞులు హారతులిచ్చి ''జై సోమనాథ్'' అని నినాదం చేశారు చుట్టూ ఉన్న శిష్యులీ నినాదాన్ని అందుకున్నారు నినాదం సభామండపంలోంచి అధిగమించి, యాత్రికుల్లోకి పొంగి, మందిరాన్ని దాటి ప్రళయ సముద్ర ఘోషవలె నలువైపులకూ వ్యాపించింది ఒక్క క్షణం పాటు ప్రభాస నగరమంతా సోమనాథమయమైంది

భక్తులు హారతులు తీసుకొంటున్నారు. శివపూజలో పూర్ణాహుతియైంది సర్వజ్ఞులు బైటికి వచ్చి ఒక బంగారు గద్దె నలంకరించారు సమీపాన రాశితో పాటు ఆ ఇద్దరతిరథులూ కూర్చున్నారు

''నాయనా భీమా! ధారాధీశు డెల్లాగైతేనేం గ్రామాల నిచ్చారు '' రాజు వలె కన్పించే అతిథిని చూచి సర్వజ్ఞుడన్నాడు

''అయినా జీర్ణమందిరాన్ని నేనే కట్టిస్తాను స్వామీ'' అన్నాడపుడు భీమదేవుడు ప్రేమపూర్వకంగా 'నీభక్తీ-పరమేశ్వరుని కృపానూ' సర్వజ్ఞుడన్నాడు నవ్వుతూ కొందరు పాదాలకు నమస్కరించి వెళ్ళిన తర్వాత ''తిరిగి నీ రాక ఎప్పుడూ?'' అని అడిగాడు

''వచ్చే సంవత్సరం ఏమంటావు విమలమంత్రీ?'' అంటూ విమల మంత్రిని చూచి భీమదేవుడన్నాడు.

'తప్పక ఈశ్వరుని కృప వుండాలిగానీ, అప్పటికి మాళవం కూడా మహారాజు వశమవుతుంది' అన్నాడు విమల మంత్రి

సర్వజ్ఞులు గంభీరంగా విమలుణ్ణి చూచారు అది పరమేశ్వరుని పేరుతో మాళవ యుద్ధాన్ని జోడించడమాతనికి నచ్చలేదు.

'సరే నృత్యానికి వేళ అయిం'దన్నారు సర్వజ్ఞులు

ప్రాకారపు దక్షిణ ద్వారం నుంచి సభామంటపం వరకు తాడుతో కట్టి ఏర్పరచిన దారి వైపు భక్తులంతా చూస్తున్నారు ముందు రెండు దివ్విటీలు వచ్చాయి తర్వాత గంగ మిలమిల మెరుస్తున్న వస్త్రాలు ధరించి ప్రవేశించింది ఆమె వెనుక తెల్లని వస్త్రాలలో ఒదిగి పోతున్న ఒక చిన్న యువతి ప్రవేశించింది ఆమె వెంట ఆర్గురు నర్తకిలు వచ్చారు చివర మృదంగ వాద్యాదులు వాయించేవారు వచ్చారు. అంతా సభామండపంలో ప్రవేశించి, సాష్టాంగంగా మహాదేవునికి నమస్కరించారు సర్వజ్ఞుని చూపులు ఆ చిన్న యువతిపై నిలిచాయి.

''ఈ రోజు కొత్త నర్తకి నాట్యం చేస్తుందికదూ'' అని శివరాశిని భీమదేవుడు అడిగాడు.

శివరాశి అవునన్నాడు.

''ఎవరూ? పేరూ?'' విమల మంత్రి కూడా ఉత్సాహం కనబరచాడు

కానీ, శివరాశి ప్రత్యుత్తరం ఇవ్వలేదు గంగ పరమేశ్వర స్తవనం ప్రారంభించింది ఆమె కంఠంలో మాధుర్యం నదిలా ప్రవహిస్తుంది ఆ నదిలో భక్తీ, భావమూ, స్తవమూ త్రివేణిలా సంగమిస్తాయి గంగ శంకరుని స్తవనం పఠిస్తుందనేకాని, సర్వజ్ఞుని రంజింపడానికే అదంతానూ చూపులు పరమేశ్వరునిపై కెన్నిసార్లు పరుగిడుతాయో, అంతకంటే ఎక్కువ సార్లు సర్వజ్ఞునీ వెదుకుతుంటాయి సర్వజ్ఞుని కొరకు ఆమె ఒక్కతి మాత్రమే పాడుతుంది సర్వజ్ఞ డరమోడ్పు కనులతో ఆమె పాటను మాత్రమే వింటుంటాడు అన్ని శాస్త్రాలతో పాటు ఆయనకు సంగీతంలో కూడా ప్రావీణ్యం ఉంది గంగ పాడే సంగీతం తప్ప ఇతరుల పాట ఆయన పరీక్ష కాగలేదు పాట ఆగిపోయింది చూపుల్తో గంగ సర్వజ్ఞుని సత్కారం యాచించటమూ, సర్వజ్ఞుడు సగం కన్నులు తెరచి గంగను సత్కరించటమూ జరిగాయి ఇద్దరి చూపులూ తెల్లని వస్త్రాలతో ఒదిగియున్న యువతి వైపు ఒకేసారి పరుగెత్తాయి

'ఇక నృత్యం ప్రారంభించు' అన్నాడు సర్వజ్ఞుడు నెమ్మదిగా

అప్పుడొక రెప్పపాటంత సేపు ఆయన ముందు మరపురాని ఒక మధుర ప్రభాతం ఉదయించి క్షణంలో పందొమ్మిది సంవత్సరాలు వెనక్కు సరుగెత్తాయి 'అర్బుదాచలం' అతని కన్నులముందు వచ్చి నిల్చున్నది అక్కడ సర్వజ్ఞుడు పునీత తత్వాన్ని ఆరాధిస్తూ పంచాగ్ని సేవ చేశారు అక్కడ్నుంచి వచ్చింతర్వాత పరమేశ్వరుని సేవచేస్తూ, భక్తులూ, శిష్యులూ తనపై కురిపించిన వాత్సల్యంతో తాననుభవించిన ఉత్సాహం ఆయనకు గుర్తుకు వచ్చింది

అర్ధరాత్రి అయినా, ఆ వుత్సాహపు పొంగు తరగలేదు నిద్రపట్టక, దూరాన ఎవరో పిలుస్తున్నట్లనిపించి, దండం తీసుకొని, సముద్రతీరానికి వెళ్లి అస్తమిత తారకల కాంతుల్లో ఇటూ అటూ తిరుగుతున్నాడు

ఇంతలో సముద్రంలోంచి లక్ష్మి ఉదయించినట్లు ఒక సుందరి కన్పించింది ప్రభాత సూర్యుని ప్రకాశంలో ఆమె అలౌకిక మూర్తివలె కన్పించింది ఆ దృశ్యాన్ని మరవడం అసాధ్యం

''ఎవరు?'' అని అడిగాడు సర్వజ్ఞుడు

'నేనే' అన్నదా సుందరి

ఆ కంఠం, ఆ మాటలూ ఆయనకు తెలిసినవే

వెంటనే గుర్తించాడు దేవదాసీల నాయకురాలి కుమార్తె శివగీతాలను కోమల కంఠంతో పాడుతూ చలువ వెన్నెలలు కురిపించగలిగే దివ్యమూర్తి నర్తకే అయినా ఆమె మహా శివభక్తురాలని సర్వజ్ఞునికి తెలుసు పరమ శివుని సేవయే ఆమె ప్రాణం - ఆమె సర్వస్వం.

సర్వజ్ఞుడు ఆగాడు లోనిపొంగు పైకుబికింది

'ఎక్కడినుంచి?'

'ఇపుడు వద్దు పరమేశ్వరుని సన్నిధిలో నృత్యం చేయాలిపుడు.'

'ఇపుడా? వంటరిగా? ఏం వరాలు కోరుకుంటావు?'

ఆ సుందరి చూపులు క్రిందికి దిగాయి నేటికి పందొమ్మిది సంవత్సరాలు గడచినా అప్పటి ఈ సంఘటనను సర్వజ్ఞుడు మరచిపోలేదు.

'పరమేశ్వరుని సేవా!, మీ సేవా' కోమలంగా అన్నదామె ఆమె హృదయంలో అజ్ఞాతమైన తుఫాను లేచింది సర్వజ్ఞుని కన్ని విషయాలూ తెలుసు భిల్లాంగన నృత్యం వలన పరమశివుని హృదయంలో లేచిన జ్వాలలు ఆయన్ను కూడా స్పర్శించాయి పరమేశ్వరుని ఆదేశం ఆయనకు వినిపించింది

అస్తమిత తారకా కాంతులు- సాగర సంగీతోల్లాసం- ప్రభాత వాయు వీచికలు- నేటికీ ఆయన స్మృతి పథంలో స్పష్టంగా కన్పిస్తూనే ఉన్నాయి

ఈ స్వప్నం ఒక క్షణంలో మాయమయింది. స్థిర స్వరంతో 'నృత్యానికి వేళ అయింది' అన్నాడు

ముందు ముందు చూడబోతూన్న మధుర క్షణాల కొరకు ఆయన మనస్సు ఆరాటంతో ఎదురు చూస్తున్నది

చోళా శ్వేతపరిధానాలతో వస్త్రాలంకారాలను కప్పుకొని క్రిందికి చూస్తూ కూర్చున్నది గుండె ఎంతో వేగంగా కొట్టుకుంటున్నది- చెవుల్లో నిశ్శబ్దం వ్యాపించింది.

సర్వజ్ఞుని ఆజ్ఞ వినిపించిం దామెకు 'లే' అని తల్లి ఆదేశించింది చోళా వణుకుతూన్న పాదాలతో లేచింది పాదాలు లేవడం ఎలా? నృత్యాభినయాల్లో ఒక్క పద్ధతి కూడా జ్ఞాపకం లేదు మరి నృత్యం చేయడం ఎలా? అమె కన్నులముందు చీకట్లు అలముకున్నాయి

కాని, ఆమె హృదయంలో అపారమైన శ్రద్ధ ఉన్నది తన సోమనాథుడు తన్నెప్పుడూ విస్మరించలేదు మరి. ఇప్పుడో ఆయన తన సమక్షంలో వున్నాడు. చోళా మూర్తివైపు చూచింది అదిగో. . సాక్షాత్తు తన దైవం. తన ప్రాణం . తన నాధుడు ఆమె నమస్కరించింది.

''సర్వజ్ఞునికి నమస్కరించు'' గంగ కంఠధ్వని విన్పించింది

''తప్పకుండా'' ఆమె కాళ్ళకు బలం చిక్కింది. వెళ్ళి వారి పాదాలకు నమస్కరించింది. మఠాధిపతి నవ్వాడు - అదే ఆశీర్వాదం - తిరిగి అస్తమితతారకా కాంతులు- తరంగిత సాగరం - ప్రభాతవాయువులు - ఆయన మనస్సులో క్షణంపాటు తళుక్కున మెరసి మాయమయ్యాయి

చోళా లేచింది సర్వజ్ఞుని దగ్గరే కూర్చున్న శివరాసిని చూచింది అక్కడే కూర్చుని తనవైపు రసార్ద్రంగా తదేకంగా చూస్తున్న ఇద్దరు అపరిచితుల్ని చూచింది కొద్దిగా వెనక్కు జరిగి ఒక్క గెంతుతో సభా మండపం మధ్య - రత్న జటిల దీపికల మనోహర కాంతుల్లో - పై పరిధానాలను దిగజార్చి - ఆ కుప్ప మధ్య శ్వేతకమలోద్భవయైన మహాలక్ష్మి వలె నిల్చున్నది

ప్రేక్షకులు ముగ్ధులై, మౌనంగా కూర్చున్నారు నూపురాలతో అందాలు చిందుతూ, కోమల కదళికాకృతి నున్న కాళ్ళపై బంగారు జరీలతో ముడి వేసిన లంగాపై మిలమిల మెరుస్తున్న మేఖల లోంచి- సుందరమైన మందిర శిఖరంలా శోభిల్లే - నాజూకు నడుమూ - రత్నాలతో ధగధగ మెరుస్తున్న అదృశ్య స్తనమండలం - సుందరమైన గోధుమ రంగు మెడ వంపులూ - పసిబాలుని లాంటి మనోహరమైన ముఖమూ కన్పించాయి ఆ ముఖంలో మానవ సహజమైన సౌందర్య రేఖలు లేవు. దేవాంగనల భవ్యతా లేదు శిశు సౌకుమార్యమూ లేదు స్వప్నంలో ఒక్కక్షణం మెరుపు మెరిసినట్లు . నూతన కిసలయాలను పిండి చేసినట్లు . మధుర .నిర్మల భావ సారాన్ని కరిగిపోసినట్లు కన్పిస్తూ బాల వసంతుణ్ణి మరుపుకు తెచ్చే సౌందర్య రేఖలు చోళా ముఖాకృతిలో ఉన్నాయి

చోళాకు తన రూపలావణ్యం తెలియదు చుట్టూ భూమి ఉన్నదీ లేనిదీ కూడా తెలియదు

ఏ మహానుభావుని రంజింపచేయడానికి ఏండ్ల పర్యంతం ఏకాగ్రతతో తపస్సు చేసిందో - తన జీవిత సర్వస్వంపైనా - శ్రీ సోమనాధుని మూర్తి పైనా ఆమె చూపులన్నీ నిలిచి వున్నాయి. ఆహా! భోలాశంకరుడు తనకై ఎదురు చూస్తున్నాడు తన నృత్యం చూడాలని ఆతురపడుతున్నాడు మేలు మేలని పొగడడానికి ఉవ్విళ్ళూరుతున్నాడు ఆమె పాదాలకు ఎక్కడా లేని బలం వచ్చింది తుఫానుగాలిలా, సెలయేటి ప్రవాహంలా గర్భ ద్వారాన్ని సమీపించింది. మృదంగతాళం ప్రారంభమైంది

చోళా నాడుల్లో నెత్తురు వేగంగా ప్రవహిస్తున్నది. ఆమె చోళా కాదిప్పుడు- పర్వత కన్యక - అది సోమనాధ మందిరం కాదు-తపస్సులో అచంచలమై ఆమె ప్రాణాలు లీనమయ్యాయి పార్వతివలె పూజ ప్రారంభించింది కాళ్ళూ, చేతులూ, నడుమూ, మెడా పూజిస్తున్న పార్వతినే జ్ఞప్తికి తెస్తున్నాయి ముఖంలో అమాయకమైన - ఉన్మత్త పూజారిణీ భావం కన్పిస్తున్నది కన్నుల్లో ఆతురతా- భక్తి భావావన్నతా ఉన్నాయి నిల్చొని, కూర్చుని, వంగుతూ పూజించింది హస్తాభినయం ద్వారా అక్షతలు-గంధమూ సమర్పించింది. రెండు చేతులతో పూలు చల్లింది. చోళా ప్రతి అవయవపు ఒంపులోనూ దేవదేవుని రంజింపచేయాలనే తీవ్రమైన అభిలాష కన్పిస్తున్నది.

పూజారిణి అలసింది కాళ్ళు శిథిలమయ్యాయి చేతుల్లో నిస్సత్తువ వచ్చింది ముఖంలో దైన్యం ఆవరించింది సంగీతం మందమైంది తాళంలో వేగం తగ్గింది ముఖంలో ఉత్సాహం నెమ్మది నెమ్మదిగా లోపించింది కారుణ్యభావం కూడా వ్యాపించింది కన్నులలో నిరాశ అలముకున్నది

చోళా అభినయించడం కాదది పార్వతివలె ఆమెకూడా తపస్సు చేసింది ఇక శంకరుని రజింపచేయాలని ప్రయత్నిస్తున్నది. కాని, తీరా పరమ శివుడు తృప్తిపడక పోతేనో? మనోభావంతో నృత్యాన్నే ఆమె తనలో లీనం చేసుకున్నది.

హఠాత్తుగా ఆమె భావాల్లో మార్పు వచ్చింది కామదేవుడు వస్తున్నాడు ముఖంలో ఉత్సాహ రేఖలు కన్పించాయి అభినయంలో చైతన్యం కన్పించింది అడుగు మందంగా పడుతున్నా, ఆశ చిందులు త్రొక్కుచున్నది నెమ్మది నెమ్మదిగా ఆశను ప్రకటించే తాళపాతంతో నర్తించడం ప్రారంభించింది.

ఆశతో-చోళా దిగ్భ్రమ చెందింది శరీరంలో సగం వంపు ఏర్పడ్డది విహ్వలమైన నేత్రాలలో కొంత స్థైర్యం కన్పించింది - నెమ్మదిగా వెనక్కు వెళ్లింది కామదేవుని బాణం శివునికి తగిలింది ఆనందంతో పంచప్రాణాలనూ కన్నుల్లో నిలిపి, అలతి సిగ్గుతో, కొంచెం గర్వంతో శంకరుని సమీపించింది చోళా శివమూర్తిని చూచింది. శివుడు ఆనందించినట్లే కన్పించిం దామెకు

వెనుకనున్న ఆరుగురు దేవదాసీలు తీయగా మహోమహుని వాక్యాల నుచ్చరించారు

★ ''కిం ముఖం కిం శశాంకశ్చ కిం నేత్రే చోత్పలేచ కిం ।
భ్రుకుట్యోధనుషీ చైతే కందర్పస్య మహాత్మనః
అధరః కిం చచింబం కిం, కిం నాసా శుకచంచుకా,
కిం స్వరః కోకిలాలాపః కిం మధ్యేచాధవేదికా''

విరహ భారంతో పార్వతి తపిస్తున్నా, సిగ్గుతో కొంచెం జంకింది నితంబాలు విజయోల్లాసం ప్రకటిస్తున్నాయి చిరునవ్వుతో, సంభ్రమ ముఖంతో, ఉత్తరీయంతో స్తనమండలాన్ని కప్పుకుంటూ నెమ్మదిగా సంకోచం ప్రకటించే అడుగులతో, గర్వాన్ని వొలికిస్తూ వెనక్కు అడుగులు వేసింది

తిరిగి చోళా దిగ్భ్రమచెందింది. భయపడి ఆగిపోయింది దేవదాసీలు పాడుతున్నారు.

---

★ ఇది ముఖమా! చంద్రబింబమా! ఇవి కన్నులా! లేక కమలాలా? ఇవి కామదేవుని వింటి వంపులా! లేక భ్రుకుటియా? ఇవి పెదవులా! లేక బింబాఫలములా? ఇది నాసికా! లేక శుకచంచువా? ఇది స్వరమా! లేక కోకిల ధ్వనియా? ఇది నడుమా! లేక వేదియా?

★ ''కిం జాతం చరితం చిత్రం, కిమహం మోహమాతః
కామేన వికృతాశ్చాద్య భూత్వాపి ప్రభురీశ్వరః
ఈశ్వరోహం యదీచ్ఛేయం పరాంగనస్పర్శనం ఖలు
తర్హికోన్యోక్షమః క్షుద్ర కిం కిం నైవక రిష్యతి''

సర్వజ్ఞుడిహ ఊరుకోలేక ఆ తరువాత శృంఖలను ఇలా జోడించాడు
''ఏవం వైరాగ్య మాసాద్య పర్యంకో త్సారణం చతత్.
వారయామాస సర్వాత్మా, పరేశః కిం పతేదిహ

చోళా శరీరం కంపించింది గజ్జెల్లో భయం ఉట్టిపడింది భీతితో ప్రతి అవయవమూ వణికిపోయింది

మదన సంహారం జరిగింది మిత్రుని మరణంతో పిచ్చిదై పార్వతి నృత్యంతో, ముఖాకృతితో ఏడ్వనారంభించింది కాని ఇంతలో శివుడు అంతర్ధానమైనాడు మిత్ర వియోగం విరహ వేదనగా మారింది మృదంగంలో వెక్కిళ్ళు విన్పించాయి చోళా కాళ్ల వూగిసలాడాయి చేతుల్లో నిరాశా, కన్నుల్లో దుఃఖము వ్యాపించాయి చోళా ఏడ్చింది-వెక్కి వెక్కి ఏడ్చింది చివరకు పరమశివునిపై చూపులు నిలిపి ధ్యానించ నారంభించింది. ముఖంలో దృఢభావం, ఝంకారంలో స్థిరత్వం, అభినయంలో తపస్వినీ గౌరవం అవయవాల్లో కఠోరత్వం కన్పించాయి అభినయంలో ఆసనం వేసుకొని వ్రేళ్ళతో ధ్యానముద్రను ప్రదర్శించి, కన్నులను నాసికాగ్రాన నిలిపి, మందమందగా విన్పించే మృదంగ తాళాలతో ధ్యానించింది. అలా సుస్థిర సమాధిలో ప్రవేశించింది

-అదిగో - వృద్ధ బ్రాహ్మణుడు; అతిథి సత్కార భావం ప్రదర్శిస్తున్నది. అభినయంతో చేతులూ - కాళ్ళూ కడిగి నమస్కరించింది గజ్జెల ఘల్లు ఘల్లుమనే ధ్వనితో సత్కారాన్నీ ప్రదర్శించింది. తరువాత జాగ్రత్తగా వృద్ధ బ్రాహ్మణుని మాటలు వింటున్నది

---

★ నేను ఈశ్వరుడను ప్రభువును - అయినా కామాంధుడ నైనందు వల్ల నాప్రవర్తనలో ఇంత మార్పు వచ్చింది నేను మోహవశుడనైనాను. ఈశ్వరుడనైన నేనే పరస్త్రీని స్పర్శించ సాహసిస్తే, క్షుద్రులైన ఇతర వ్యక్తులు ఎన్నెన్ని నీచ కార్యాలను చేస్తుంటారో?

★ ఇలా వివేకంతో సర్వాత్ముడైన శంకరుడు ఆ సుందరిని పర్యంకం మీద కూర్చోనీయకుండా వారించాడు. పరమేశ్వరుడేమిటి? మోహబద్ధుడవడమేమిటి?

౧ ఇంద్రాదిలోక పాలాంశ్చ హిత్వా శివమనువ్రతా
నైతత్పూక్తం హి లోకేషు, విరుద్ధం దృశ్యతే ధునా,
క్వ త్వం కమల పత్రాక్షీ, క్వాసౌ వైత్రివిలోచనః
శశాంక వదనాత్వంచ పంచవక్త్రః శివః స్మృతః!!

౨ వేణీశిరసితే దివ్యా సర్పిణీవ విభాసితా
జటాజూటం శివస్యేవ ప్రసిద్ధం పరిచక్షతే
చందనంచ త్వదీయాంగే, చితాభస్మ శివస్యచ,
క్వదుకూలం త్వదీయంవై శాంకరం క్వగజానిమ్!!
క్వభూషణాని దివ్యాని, క్వసర్పాః శంకరస్యచ !!

పార్వతికి మహా కోపంవచ్చింది గజ్జెలు కోపంతో ఘల్లుమన్నాయి చేతి వంపులో కోపం వచ్చింది మృదంగం కూడా క్రోధంతో గర్జించింది కన్నులతో నిప్పులు కురిపించింది అడుగులతో చక్కగా ఎగురుతూ గజ్జెల ధ్వనితో అడుగులు వేస్తూ, నలువైపులనుంచీ బ్రాహ్మణుల్ని విదలించింది కన్నులతో, భావంతో, ముద్రలతో తిరస్కరించింది ముఖం చిట్లించుకొని వెనక్కు వచ్చింది

కాని చోళా వెంటనే మారిపోయింది మారువేషంతో వచ్చిన పరమశివుడు మారువేషాన్ని విడిచి నిజస్వరూపంతో నిల్చున్నాడు మృదంగం మేఘంలా గర్జించింది వాద్యాలన్నీ స్తంభించాయి

శివమూర్తిలోంచి శంకరుడు లేచి నిలుచున్నట్లే చోళా కన్నులకు కూడా కన్పించింది. నృత్యం చేస్తుంటే ఆమె నవనాడుల్లో ఎంతో ఉత్సాహం ప్రవేశించింది హృదయంలో వర్ణనాతీతమైన ఆనందం పొంగిపోయింది గతినాదాలతో ఎగురుతు సెలయేరులో ప్రవహిస్తున్న భావ జగత్తులో - ఎదురుగా - తన జీవన సర్వస్వమైన - సాక్షాత్తు సోమనాథుడు వచ్చి నిల్చున్నాడు

---

★ ఇంద్రాది లోకాధిపతులను కాదని నీవు శివుని కోరడం అనుచితం - లోక విరుద్ధం కూడాను ఎందుకంటావా? విను కమల రేకుల వంటి కన్నులు కలిగిన దానివి నీవెక్కడ! మూడు కన్నుల వాడు - ఆ శివుడెక్కడ! చంద్రబింబంలాంటి చక్కని ముఖం నీది ఆ శివుడో అయిదు తలలవాడు!

★ నల్లని త్రాచు పాములా నీ వేణి నిగనిగలాడుతున్నది కాని శివుని జటాజూటం అందరికీ తెలిసిందే! యిక నీ శరీరంలో గంధ లేపనం - శివుని శరీరాన బూడిద! నీవు ధరించే చక్కని పట్టు చీరలెక్కడ! శివుడు ధరించే ఆ మంగళకరమైన హస్తి చర్మం ఎక్కడ? నీ వేమో దివ్య భూషణాలను ధరిస్తే, శివుడు సర్పాలను ధరిస్తాడు

చోళా సర్వస్వాన్నీ మరిచిపోయింది తన జీవనలక్ష్యం సిద్ధించిందనే విషయ మొక్కటే ఆమెకు జ్ఞాపకముంది నృత్యాభినయాలతో అన్ని శాస్త్రాలనూ మరిపించిం దామె ముక్కుపుటాలదురుతున్నాయి ప్రేమోన్మాదంతో ఆమె కన్నులు మరింత పెద్దవై వ్యాకుల భావాన్ని ప్రదర్శించాయి

ప్రణయ విహ్వాలయ్యైన పార్వతిలా నర్తిస్తూ నర్తిస్తూ ప్రణయ విహ్వాలమైన వధువుగా మారింది అడుగులు నర్తించడంలేదు. భూమిని స్పర్శించకుండానే పైకిలేస్తున్నాయి ఆమె ముఖం అజ్ఞాతమైన కాంతితో ప్రణయతత్వంలా ప్రకాశిస్తున్నది

చోళా సంతోషంతో ప్రదక్షిణం చేసింది. వృషభరాజాన్ని హృదయానికి హత్తుకున్నది పరమశివుని కౌగలించుకుంటూ రుండ మాలలో వొదిగి పోయింది. ఆలింగనంలో కుదించుకొనిపోయి, చుంబనంతో సిగ్గుపడి పోయింది

తిరిగి నృత్యం ప్రారంభించింది హెచ్చుతున్న మృదంగ ధ్వనీ, గజ్జెల ఘల్లుఘల్లుమనే ధ్వనీ గుండెదడతో ఏకమైనాయి చోళా విగ్రహాన్ని విడిచి పెట్టింది. నృత్యం ఒక మహాప్రణయకార్యంగా రూపొందింది చుంబనాది పరమానందస్థాయి ననుభవిస్తూ నేలమీద పడిపోయింది

మృదంగ వాద్యాలు ఆగిపోయాయి. సభయావత్తూ చిత్రప్రతిమ అయిపోయింది సర్వజ్ఞుడు తేరుకొని గర్వాశ్రువులను తుడుచుకున్నాడు.

తరువాత గత ఇరవై ఏడు సంవత్సరాలలో కనీవినీ యెరుగని దృశ్యాన్ని భక్తు లానాడు చూచారు కూర్చున్న చోటనుంచి లేచి సర్వజ్ఞుడు త్వరగా చోళా పడివున్న చోటికి వెళ్లాడు-వెళ్లి ఆమెను తన చేతుల్లోకి తీసుకున్నాడు.

చోళా తన పుత్రిక. పరమేశ్వరానుగ్రహం వల్ల ఆమె తనకెలా లభించిందో ఆనాడు ఆయనకు తెలిసింది అలా ఆమెను గర్భద్వారం దగ్గరికి తీసుకువెళ్లాడు. వెళ్ళి వణుకుతూన్న స్వరంతో 'స్వామీ . ఈమెను స్వీకరించు ఎంతవరకు చోళా జీవించి ఉంటుందో అంతవరకిక ప్రతి శివరాత్రినాడూ ఈమె నీ సమక్షాన నృత్యం చేస్తుంటుంది ' అని అన్నాడు

నైవేద్యంలా చోళాను సర్వజ్ఞుడు సోమనాథుని ముందు పెట్టాడు చోళాకు తన జీవిత పరమావధి లభించింది. పినాకపాణి, జటాధారియైన పరమశివుడు ఇంకా ఆమె కన్నులముందునుంచి మాయం కాలేదు

'ఈ జన్మలో! జన్మ జన్మాలలో నీదానను.. నీదాననే' నంటూ మూర్ఛపోయింది

మూడవ ప్రకరణము

# దేవుని కోపం

## 1

మందిరంలో గుమిగూడిన గుంపులో ఒక్కసారిగా అలజడి ప్రారంభమైంది జనం అంతా కోలాహలం చేశారు ఎవరో గుంపును చీల్చుకుంటూ ముందుకు వస్తున్నట్లుంది సర్వజ్ఞునికి ఆశ్చర్యమైంది ఆ సమయంలో శాంతిని భంగపరిచే దెవరా? అని బొమలు ముడిచి చూచాడు. ఆయన ఉన్నచోట అల్లరి ఎక్కువగా జరగదు గుంపు రెండుగా చీలి పోయింది. ఆ మధ్యగా ఒక వ్యక్తి ఉన్మాదిలా వచ్చి ''భీమదేవ మహారాజు వర్ధిల్లాలి'' అని అలసి పూడుకు పోతున్న స్వరంతో అన్నాడు భీమదేవుడిది విని విస్మయంతో లేచి ముందుకు వచ్చాడు.

''ఎవరది'' అని సర్వజ్ఞుణ్ణి చూస్తూ అడిగాడు.

''ఎవరా! ఎవరైనాసరే . రానీయండి'' అన్నాడు సర్వజ్ఞుడు. ఆ కొత్త మనిషి ఊగిపోతూ ముందుకు వచ్చాడు కన్నులు లోనికి పోయాయి గుడ్డలు పిడచ కట్టాయి వచ్చి సర్వజ్ఞుని పాదాలమీద పడి ఎవరో ''నమఃశివాయ'' అని మాత్రం అనగలిగాడు

''శివాయ నమః ఎవరు నాయనా నువ్వు?''

''ఎవరూ? మూలారారోర్!'' భీమదేవుడు అతణ్ణి సమీపించి అన్నాడు

''స్వామీ! స్వామీ!'' అంటూ కొంచెం లేచి చేతులు జోడిస్తూ- ''నేనే త్వరపడండి మెహతాజీ చనిపోతున్నారు'' అని అన్నాడు.

''మెహతాజీయా? మహామంత్రులేనా? అసలు విషయమేమిటి? వారెక్కడ?'' అంటూ విమలాదిత్యుడు వచ్చి మూలా భుజాలను పట్టుకొని ఊపుతూ మతిపోయిందా? అసలు నీవు వచ్చిందెక్కడ్నుంచి. మరి మెహతాజీ సపాదలక్ష వెళ్లారుగా '' అని అన్నాడు.

అసలే అలుపుతో సగమైనాడు మూలా. ''లేదు స్వామీ లేదు, ఆయనక్కడ లేరు. వారిక్కడే- ప్రాంగణంలోనే- అవసానదశలో ఉన్నారు పది రోజుల్నుంచి తిండి- నిద్రా లేదు. గాలిలా పరుగెత్తే నాలుగైదు ఒంటెలు చచ్చాయి స్వామీ! సమయానికి ఆదుకోండి లేకపోతే మెహతాజీ దక్కరు అశనిపాతమవుతుంది.''

భీముని కిదంతా అర్థమే కాలేదు ఆప్తమంత్రి దామోదర మెహతా సపాదలక్ష రాజుతో సంధి చేసుకోడానికి వెళ్ళాడు మూలా ఆయనకు నమ్మినబంటు మరిప్పుడీ మూలా ప్రభాస నగరానికి ఎలా వచ్చాడు? దామోదర్‌కు అవసానదశ రావడమేమిటి?

''స్వామీ! త్వరపడండి''

''సరే లేచి త్వరగా బయల్దేరు''

సర్వజ్ఞులు ముక్కుమీద వేలుంచి ఆలోచించారు ''శివరాశీ ఏదో ఆపద రాబోతున్నదనిపిస్తోంది పో నీవు పోయి దామోదర్ మెహతాను నా నివాసానికి తీసుకురా నేనూ ఇప్పుడే వస్తాను''

శివరాశి ఇద్దరు సాధువుల్ని తీసుకొని, భీమ్‌దేవ్, విమల, మూలారాథోర్లతో కలసి మెహతాను వెదకడానికి బయల్దేరారు వారికి ఇద్దరు భటులు దివిటీలతో,దారి చూపుతూ ముందుకు నడిచారు

సర్వజ్ఞుని మనస్సు కలత చెందింది సోమనాథుని వైపు చూస్తూ, ఇదేమిటి స్వామీ! అని మౌనంగా ప్రశ్నించాడు కాని స్పష్టమైన ప్రత్యుత్తరం లభించలేదు అందుకని దైన్యంతో కూడిన వేదనతో సన్యాసోచితంగా శివార్పణం చేశాడు

కొద్దిసేపటిలోనే అంతా సర్వజ్ఞుని నివాసానికి చేరారు

## 2

మెహతా మంచం మీద స్పృహ లేకుండా పడి ఉన్నాడు ఆయన వయస్సు నలభై యేండ్లుంటాయి అందమైన ముఖమప్పుడు అలుపుతో, బాధతో కాంతి లేకుండా ఉంది. కన్నులు వాపు చూపాయి

విమలాదిత్యుడు ఆయన తలను వత్తుతున్నాడు సర్వజ్ఞుని శిష్యుడొకడు ఆముదాన్ని కంచు గిన్నెతో ఆయన అరికాళ్లకు రుద్దుతున్నాడు భీమదేవుడు ఆదుర్దాగా చూస్తున్నాడు

కొంతదూరాన సర్వజ్ఞుడు పీఠం వేసుకొని కూర్చున్నాడు దగ్గరే శివరాశి ఉన్నాడు ఒకమూల మరో శిష్యుడు ఏదో మందు నూరుతున్నాడు మూలారాఠోర్ మరోమూల కునికిపాట్లు పడుతున్నాడు

భీమదేవుడు ఆదుర్దాగా ''గురుదేవా! మెహతా చనిపోడుగదా'' అని అప్పటికి పదోసారి అడిగాడు

''లేదని నా వాగ్దానం- సరేనా'' అని సర్వజ్ఞుడు లేచి శిష్యుడు నూరిన మందు తీసుకొని మెహతా నోరు తెరచి పోశాడు.

కొద్దిసేపు అంతా తదేకంగా మెహతా వైపే చూచారు స్పృహ తప్పిన మెహతా ఒక నిట్టూర్పు విడిచాడు కన్నులదిరాయి పెదవుల్లోంచి కొద్దిగా మందు బైటికి వచ్చింది

మెహతా కన్నులు తెరిచాడు

''మెహతా! దామోదర్!'' అంటూ భీమదేవుడు ప్రేమతో పిలిచాడు

మెహతా కన్నుల్లో ప్రాణం నిల్చింది భీమదేవుణ్ని గుర్తించి ''బాబూ నీవా నిజంగా నీవేనా'' అంటూ తటాలున లేచి కూర్చుని భీమదేవుణ్ని కౌగలించుకున్నాడు

''మెహతాజీ'' అంటూ పాటణ మహారాజు తన మంత్రిని ప్రేమతో పలుకరించాడు

గురుదేవుణ్ని చూచి మెహతా వారి పాదాలకు నమస్కరించాడు 'నమఃశివాయ' అని దీవించి మెహతాను దిండుకానించి కూచోబెట్టాడు సర్వజ్ఞుడు

''మెహతా! ఇక సంకోచించకుండా అసలు విషయమేమిటో చెప్పు ''

''మహానుభావా!'' అని మెహతా ప్రారంభించాడు మాటల్లో చక్కని సంస్కారం ఉట్టిపడుతున్నది దగ్గువల్ల కాసేపాగి తిరిగి ప్రారంభించాడు

''నెమ్మదిగా! నెమ్మదిగా చెప్పు మెహతా!''

''బాబూ! బాబూ! ఇంకా కూర్చున్నారా? పాటణ్‌కు పరుగెత్తండి, త్వరపడండి'' అన్నాడు ఆవేశంతో

''ఎందుకు మెహతా?'' అని అడిగాడు భీమదేవుడాశ్చర్యంతో.

''ఎందుకా! గజనీ మహమ్మదు దండెత్తి వస్తున్నాడు ''

''ఏమిటీ?'' అన్నారు భీమ, సర్వజ్ఞులిద్దరూ ఒక్కసారిగా

''ఏముంది స్వామీ! మిడతల దండులా అతని సైన్యం సపాదలక్షను ఆక్రమించడానికి వస్తున్నది రేపో మాపో ఇక్కడికీ వచ్చి పడుతుంది.

''ఇక్కడికా?'' సర్వజ్ఞుడు గంభీరంగా ప్రశ్నించాడు

''అవును ధానేశ్వరాన్ని దోచుకున్నాడు కన్నోజ్‌ను ధ్వంసం చేశాడు ఇక సోమనాథ మందిర విధ్వంసనకు వస్తున్నాడు తెలుసా? ఇక ఒక్కక్షణం కూడా ఆగకూడదు స్వామీ! - వెళ్ళండి- గుజరాత్‌ను కాపాడండి''

'గజనీ నుంచి ఎప్పుడు బయల్దేరాడు?'

'నెల కావచ్చిందేమో- నాకు తెలియగానే మీకు తెలపడానికి రెక్కలు కట్టుకొని వచ్చా. ఈ పదిరోజులూ క్షణం కూర్చోలేకపోయినా'

సర్వజ్ఞుడు కొంచెం గర్వంగా 'సోమనాథ పరమేశ్వరుని మందిరాన్ని ధ్వంసం చేసేందుకు వస్తున్నాడా- సరే' అన్నాడు

'అవును స్వామీ! తనకు దారి నిమ్మని సపాదలక్షకు రాయబారమంపాడు '

'ఎన్నిరోజుల్లో వస్తాడిక్కడికి?'

'చెప్పడం ఎలా? లక్షల సైన్యంతో ఈ ఎడారిని దాటి రావద్దూ?'

'అయితే ఈ మ్లేచ్ఛుడు నా దేవదేవుని ధ్వజాన్ని క్రిందికి దించుతాడన్నమాట' సర్వజ్ఞుడు కొద్దిగా నవ్వాడు! 'ఈ దురభిమానులు పరమేశ్వరుడంటే కూడా భయపడరు కదా!'

'గజనీ మహమ్మదు యముని కంటే క్రూరుడంటారు భగవాన్!'

'సరే రానీ కామదేవుణ్ణి కాల్చి చంపిన పరమేశ్వరుని మూడవ కంటి మంట ఇంకా చల్లారలేదులే భీమా! మెహతా చెప్పింది నిజం పాటణ నగరాన్ని కాపాడుకోవడానికి నీవు వెంటనే వెళ్ళిపో '

'నేను సిద్ధంగానే వున్నాను స్వామీ! గజనీ మహమ్మదు పాటణ ప్రజల పౌరుషాన్నింకా చవిచూడలేదు ఈ మ్లేచ్ఛుని సైన్యం ఎంత ఉంటుంది మెహతా?'

'చెప్పడం సాధ్యంకాదు లక్షల సైన్యం ఉన్నదని అంటున్నారు '

'పినాకపాణియైన పరమశివుడు రక్షిస్తుంటే యిక ఎదిరించగలిగేదెవరయ్యా! లే నాయనా, లే, సోమనాథుడు ఎప్పుడూ నీవాడే '

'ఇదంతా నాకు పరమేశ్వరుని అనుగ్రహంగా తోస్తున్నది గురుదేవా! నేనూ యుద్ధమంటే ఉవ్విళ్ళూరుతూనే వున్నాను పైగా గజనీ మహమ్మదు లాంటి వీరునితో పోరాటం! భీమదేవుని ధనుర్విద్యను ఇక చూడండి! లేచి ప్రయాణానికి సిద్ధం చేయి విమలా '

'ఎప్పుడూ సత్యమే జయిస్తుంది నాయనా... పరమేశ్వరుడు నీకే విజయాన్ని అనుగ్రహిస్తా'డని సోమనాథుని కటాక్షాన్ని గాఢంగా నమ్మిన సర్వజ్ఞుడు అన్నాడు

## 3

భీమదేవుని చెవులకు రణదుందుభుల ఉత్సాహ నినాదాలు వినిపిస్తున్నాయి తండ్రి విషయలోలుడు అన్న అసమర్థుడు వీరిద్దరినీ గద్దె దింపి రాజ్యాన్ని సునాయాసంగా కైవసం చేసుకున్నాడు ఇప్పుడు మాళవం మీదికి దండయాత్ర చేయడానికి ప్రయత్నిస్తున్నాడు విజయం తనదేనని అతని విశ్వాసం. తనతో పోరాడగల వీరుడే జన్మించలేదని అప్పుడప్పుడతనికి విచారంగా ఉండేది. మరి ఈఅవకాశాన్ని పరమేశ్వరుడే అనుగ్రహించాడు

గజనీ దేశపు మ్లేచ్ఛ రాజును గురించి భీమదేవునికి ఎన్నో విషయాలు తెలుసు అతను లవకోట రాజును జయించాడు స్థానేశ్వరాన్ని దోచుకున్నాడు కన్నోజ్‌ను ధ్వంసం చేశాడు కాని అంతటి ఎడారిని దాటి ప్రపంచంలో ఒక మూలనుంచి వీరగడ్డయైన గుజరాత్‌పై దండయాత్ర చేయ సాహసిస్తాడని కలలోనైనా అనుకోలేదు పరమేశ్వరుడే తనకీ చక్కని అవకాశాన్ని అనుగ్రహించాడు పరమశివుని పుణ్యమందిరాన్ని ధ్వంసం చేయపూనుకొన్న దుష్టుణ్ణి దండించడం కంటే తనబోటి సామాన్యుల కెక్కువ అదృష్టం ఏముంటుంది? అతని శరీరంలో ఉత్సాహం పొంగిపోయింది

అర్ధరాత్రి దాటింది విమలుడు ప్రయాణపు సన్నాహాలు చేస్తున్నాడు ప్రయాణానికి రెండు మూడు ఘడియల వ్యవధి వుంది

గుడ్డలు కట్టుకొని సిద్ధంగా వున్నా, ప్రయాణానికి కొంత వ్యవధి ఉన్నందువల్ల, సింహంలా ఆదుర్దాగా ఇటూ అటూ తిరిగి మందిరంవైపు నడిచాడు వెళ్ళేముందు సోమనాథుని దర్శించి, ఆశీస్సులు పొంది వెళ్ళడం మంచిదికదూ!

సర్వజ్ఞుని నిలయం నుంచి ప్రాకారం వైపు వచ్చాడు మండపం శూన్యంగా ఉంది ఒకరిద్దరు ఒకమూల ఆవలిస్తూ, ఏవో కబుర్లు చెప్పుకుంటున్నారు దీపాలు చాలా మట్టుకు ఆరిపోయాయి

భీమదేవుడలా సభామండపం వైపు నడిచాడు ఒకవైపు ఎవరో దుఃఖితుడు శివకవచాన్ని పఠిస్తున్నాడు రెండోవైపు చంద్రకాంతులు స్తంభాల్లోంచి అద్దాల మండపంలో పడుతున్నాయి ఆ దృశ్యం తాటి తోపులో ఇసుక తిన్నెలమీద వెన్నెల విరిసినట్లు కన్పించిందతనికి యుద్ధం కొరకు తపిస్తూన్న అతని మనస్సును రసజ్ఞత చల్లని మధుర వాయువులా స్పర్శిస్తున్నది అలా గర్భద్వారాన్ని సమీపించాడు. గర్భగృహంలో నేతిదీపాలు మందంగా ప్రకాశిస్తున్నాయి

అలా మహాదేవునిపై చూపులు నిలిపి ముందుకు నడుస్తుండగా స్తంభాన్ని ఆనుకొని నిల్చున్న ఒక విగ్రహం అతనికి కన్పించింది

స్తంభాన్ని ఆనుకొని నిల్చున్న రూపం చాలా భయంకరంగా ఉంది తలపై మురికితో జడలు కట్టుకున్న వెంట్రుకలు వ్రేలాడుతున్నాయి మెడలో పుర్రెల దండ ఉన్నది చేతులకూ, కాళ్ళకూ చిన్నచిన్న ఎముకల దండలున్నాయి చేతిలో ఒక పెద్ద జంతువు కాలి ఎముక ఉన్నది ముక్కుకు పెద్ద పెద్ద రంధ్రాలున్నాయి పైపెదవి రెండుగా చీలి లోపలి పెద్దపెద్ద పండ్లు భయంకరంగా కన్పిస్తున్నాయి అంతేకాదు ఆ మూర్తి మహాదారుణంగా నవ్వుతున్నది

భీమదేవుడు గజగజ వణికిపోయాడు సాక్షాత్తు కాలభైరవుడే శివ మందిరాన్ని కాపాడడానికి నిల్చున్నాడేమోనని మొదట అనుకున్నాడు కాని సరిగా చూచేసరికి ఎవరో కాపాలికుడని తెలిసింది భైరవుడు దేవదూత ఎంత భయంకరుడైనా దైవశక్తితో తేజరిల్లుతుంటాడు మరి యితడో - ఇతడు ప్రాణాలతో ఉన్న కాపాలికుడు భీమదేవునికి భయంతో గగుర్పాటు కలిగింది అక్కడినుంచి పారిపోదామనిపించింది కాని కాళ్లు కదల్లేదు

కాపాలికుడు ఎవరిని చూచి నవ్వుతున్నాడో తెలుసుకుందామని గర్భగృహం వైపు చూచాడు సురాపానంతో కైపెక్కిన భయంకరమైన చూపుల్తో ఏదోవస్తువును తదేకంగా చూస్తున్నాడు భీమదేవుడు కూడా ఆ వస్తువును చూచాడు

ముందా వస్తువు ఒక పూలకుప్పలా కన్పించింది కాని తరువాత అదొక స్త్రీ రూప మనిపించింది చక్కని భుజాలను, చిన్నచిన్న నాజూకు చేతులనూ, నితంబాలనూ చూచాడు చూడగానే ఆ స్త్రీ మహదేవుని ప్రియనర్తకి - చోళా అని గుర్తించాడు.

ఆమె శిరస్సును నేల కాన్చి ప్రార్థిస్తున్నది ఒక్క అవయవంలోనైనా కదలిక కన్పించడం లేదు చోళా చనిపోలేదు కదా! భీమదేవుని ప్రాణజ్యోతి ఆరిపోతున్న ట్లనిపించింది మరి ఈ కాపాలికుడు ఆమె వైపలా ఎందుకు చూస్తున్నాడు?

అతడు కూడా స్తంభించి నిల్చున్నాడు చూపులు చోళా సుప్త శరీరం మీద నిలిచి పోయాయి

కొంతసేపటికి చోళా తల కదిలించింది ఈమె జీవించే వున్నదా? ఈ కాపాలికు డీమె నిక్కడికి తీసుకొని రాలేదు గదా? ఈమె కొరకే వీడు ఎదురు చూస్తున్నాడా? అత డలాగే కదలకుండా నిల్చున్నాడు చోళా కూడా కదలలేదు కాపాలికుడూ కదలలేదు తరువాత చోళా కూర్చుని చేతులు జోడించి ప్రార్థించడం ప్రారంభించింది తరువాత

బంతిలా ఒక్కసారి పైకి ఎగిరింది బంగారు రంగరించిన చిరునవ్వు లొలికిస్తూ సోమనాధుణ్ణి లాలించింది . నవ్వింది రెండు మూడడుగులు తాళంతో నర్తించింది ప్రణయ కలహంతో మధుర స్వరంతో, 'నా స్వామీ! నీ దాననే! నేను నీదాననే' అన్నది తరువాత వెనుకకు తిరిగి నవ్వుతూ, ఉల్లాసంతో కండ్లను నర్తింపజేస్తూ గర్భద్వారం దాటివచ్చి దక్షిణ ద్వారం వైపు వెళ్ళింది

భీమదేవుడు వెనక్కు జరిగాడు కాపాలికుడు కూడా స్తంభం చాటున నక్కి నిల్చున్నాడు చోళా వసంత విహంగంలా ఉల్లాసంతో గంతులు వేస్తూ వెళ్ళిపోయింది

వెంటనే కాపాలికుడు స్తంభాల చాటున దాగుతూ ఆమెను వెంబడించాడు

భీమదేవునికి మ్లేచ్ఛుడు గజనీ గానీ, శ్రీ సోమనాధుని దర్శనంగానీ జ్ఞాపకం లేదు అతని మనస్సు ఆ వసంత విహంగం మీదనే ఉంది అతడు కూడా కాపాలికుణ్ణి వెంబడించాడు

కాపాలికుడెందుకు వెంబడించాడు?

సౌంజ్ఞ పొందా? - మరి అలా దాక్కోడం దేనికి?

కారణమేమైనా ఉందా? - ఉంటే ఏమిటా కారణం?

కాపాలికులు అమాయకులైన బాలికలను అపహరించి త్రిపురసుందరికి బలి యిస్తారనీ, శ్మశానానికి తీసుకొని వెళ్ళి బాలికల రుధిరంతో భైరవుణ్ణి ఆరాధిస్తారనీ అతను విన్నాడు కాని చోళా సోమనాధుని నర్తకి కదా? ఈమెకలాంటి భయమేముంటుంది?

కాపాలికుడు చోళా వైపే చూస్తూ వెంబడిస్తున్నాడు భీమదేవుడు కూడా కాపాలికుని మీదనే దృష్టినుంచి గర్భగృహం చాటుకు వెళ్ళాడు చోళా సముద్రానికి వెళ్ళే ద్వారాన్ని సమీపించింది ఆ సమయంలో సముద్రానికి ఎందుకు? భీమదేవుడు తలుపు చాటున నిల్చున్నాడు కాపాలికుడు సముద్రపు మెట్లమీద ఒక చెట్టు నీడలో నిల్చున్నాడు కానీ చోళా

ఆమె ఒడ్డున చివరి మెట్టుమీద ఉన్నది వేగంగా వస్త్రాలు విప్పుతున్నది ఇద్దరు పురుషులు - వేర్వేరు భావాలతో - అసంతృప్త నేత్రాలతో, పోతుటీగల్లా- తన శరీరశోభ నాస్వాదిస్తున్నారని ఆమెకు తెలియదు

చోళా వస్త్రాలు విప్పింది అమృతం వర్షించే వెన్నెల్లో, అందం చిందే సాగరుని తరంగ కాంతుల్లో, ఏకాంతంగా భాసిస్తున్న తీరాన - జలజాతయైన లక్ష్మిలా వస్త్రహీన సౌందర్యంతో - చంద్రకిరణాలను పిండి పోసిన చిన్న వెన్నెల బొమ్మలా కన్పిస్తున్నది

మహా ప్రవాహంలా పొరలుతున్న ఆ సౌందర్య నిరీక్షణలో భీమదేవుడు కదిలిపోయాడు

చోళా స్నానం చేయడానికి సముద్రంలోకి దూకింది సముద్రంలో తుఫాను వస్తున్నది కొప్పు విప్పి మృదువుగా చిక్కులు సవరించుకున్నది బుగ్గలపై, మెడపై, వక్షస్థలంపై, పొట్టపైనా చేతితో నెమ్మదిగా నిమురుకుంటూ ఒక మునక వేసింది అలా ఒక క్షణం ఉండి - లేచి మళ్ళీ మునిగింది కాళ్ళతో, చేతుల్తో నీళ్ళు ఎగజిమ్మి వెల్లకిల పడుకొని కాసేపు ఈదింది మిలమిల మెరసే అలల్లోంచి చంద్ర కిరణాలు ఆమె శరీరం మీద పడుతున్నాయి ఆమె సౌందర్యం-అప్పుడే మోహశుక్తిలోంచి విడదీసిన ముత్యంలా-మెరుస్తున్నది సముద్రుడు కూడా తరంగడోలల్లో - నెమ్మది నెమ్మదిగా-మమకారంతో-ఊగిస్తున్నా డామెను

భీమదేవు డెందరో స్త్రీలను - మంచివాళ్ళనూ - చెడ్డవాళ్ళనూ, సౌందర్య మూర్తులనూ, సరసలనూ - విరసులనూ చూచాడు కాని ఇలా తనను ముగ్ధుణ్ణి గావించిన స్త్రీని చూడలేదు సరే-ఊహించుకోలేదు కూడా

వెన్నెలనూ, అలలనూ, చిరుగాలినీ, లావణ్యాన్నీ రంగరించి చేసిన సౌందర్య మూర్తి చోళా తన ఉన్మత్త సౌందర్యంతో మూర్ఛనలు సృజిస్తున్న స్వప్న కన్యక!

చోళా సౌందర్యస్నానం పూర్తి అయింది మోకాళ్ళబంటి నీళ్ళలో నిల్చుని కొప్పు పిండి ముడి వేసుకొని నీటిలోనుంచి తీరానికి వచ్చింది భీమదేవు డామె సౌందర్యాన్ని ఆస్వాదిస్తున్నాడు.

ఆ విరియబూసిన వెన్నెలలో సముద్రపుటలల ముగ్ధకాంతుల్లో . సాక్షాత్తు రస జగత్తులా నిల్చిన ఆ చిత్రాన్ని చెడగొట్టడానికి నల్లని మచ్చలా రాహువులా ఆ కాపాలికుడు వేగంగా వెళ్ళి చేతిలోని శల్యగదను త్రిప్పుతూ చోళా ముందు నిల్చున్నాడు

ఆనందంతో, ఉత్సాహంతో తేలిపోతూన్న ఆ సుకుమారి కాపాలికుని భీభత్స స్వరూపాన్ని చూచి భీతితో వెనక్కు జరిగి కెవ్వున అరిచింది ఆ అరపుతో సముద్ర తరంగ సంగీతంతో మనోహరమై వెలుగొందుతున్న శాంతి భగ్నమైంది

భీమదేవుని కిదొక ఆఘాతంవలె తగిలింది సింహంలా ఒక్క దూకుతో మెట్లను దాటి కాపాలికునిమీద విరుచుకొని పడ్డాడు పడుతూనే అతని మెడను ఒడిసిపట్టుకున్నాడు

చోళాను పట్టుకోడానికి లేచిన కాపాలికుని చేయి అలా ఆగిపోయింది చోళా భయపడి మూర్ఛిల్లింది భీమదేవుని శక్తికి లొంగిపోయి ఆ కాపాలికుడు పశువులా అరుస్తూ ఉరిచేరుల్లాంటి అతని చేతులను కొరకాలని ప్రయత్నించాడు

భీమదేవుని కోపానికి అంతులేదు కాపాలికుని మెడ నొడిసిపట్టి, ఎత్తి నేలమీద కొట్టాలని ప్రయత్నించాడు కాపాలికుడు కూడా తన సత్తువనంతా ఉపయోగించి అతణ్ణి

నెట్టివేయాలని ప్రయత్నించాడు అలా ఒకరినొకరు పడగొట్టాలని ప్రయత్నిస్తూ బాహాబాహీ పోరాటంతో నెమ్మదిగా నీళ్ళలోకి దిగారు ఇక భీముని నిగ్రహం సడలిపోయింది పెదవులు బిగించి ఆ కాపాలికుణ్ణి ఎత్తి నీళ్ళలో పడవేసి-మెడ అదిమి పట్టుకొని, ఒకసారి-రెండుసార్లు-అలా ఎన్నోసార్లు - గట్టిగా - ఇంకా గట్టిగా ముంచాడు కాపాలికుడు పెనుగులాడడం మాని, నోట నురుగులు గ్రక్కుతున్నాడు. అలా నురుగులు క్రక్కుతూ నీళ్ళలో మృతప్రాయుడై పడిపోయాడు కాపాలికుడు తిరిగి లేవకపోవడం చూచిన తరువాత భీముని కోపం ఉపశమించింది కాలితో ఒక నెట్టు నెట్టి తీరానికి వచ్చాడు

## 4

నీళ్ళలోంచి ఒడ్డుకు వచ్చి భీమదేవుడు చోళాను చూచాడు చక్కని అవయవాలూ, తెల్లని మైఛాయ ఆమె సౌందర్యాన్ని మెరిపిస్తున్నాయి కాని వాడిపోయిన సంపంగివలె ఒడలి పడిపోయి ఉన్నది

భీమదేవుని హృదయంలో కోరికలూరాయి ఆమెను చేతుల్లోకి తీసుకొని, మెడకు చుట్టుకొని, తనలో లీనం చేసుకుందామనిపించింది నెమ్మదిగా చేతుల్లోకి తీసుకున్నాడు

స్నిగ్ధ శీతలమైన ఆమె శరీరాన్ని తాకగానే అతని శరీరమంతటా రోమాంచం కలిగింది ఆమె ఇంకా బాలికయే అవయవ రేఖల్లో పేరుకు మాత్రమే సంపూర్ణత్వ మేర్పడింది చోళా అవయవాలలో అద్భుతమైన విశ్వకర్మ కళానైపుణి కన్పిస్తుంది

చోళా చలితో ఒదిగిపోయింది భీమదేవుడామెను వర్ణనాతీతమైన ప్రేమతో గుండెకు హత్తుకొని, ఆమె ముఖాన్ని తన ముఖానికి చేర్చాడు క్రోధంతో, అలుపుతో, కోరికతో జ్వలిస్తున్న అతని ముఖం చైతన్య విహీనమైన చోళా ముఖస్పర్శతో శాంతించింది నెమ్మదిగా ఏదో విధంగా వస్త్రాలతో చోళా శరీరాన్ని కప్పాడు తరువాత స్పృహ కలిగించడానికి ప్రయత్నిస్తూ కూర్చున్నాడు

చోళా రెప్పలార్చి కండ్లు తెరిచింది. కండ్లు తెరవడంతోటే స్పృహ కలిగి ఒక్కసారిగా అరుస్తూ లేచి దూరాన నిల్చున్నది అలా దూరంగా పరుగెత్తేప్పుడు ఆమె వస్త్రాలు నేలమీదకు జారిపోయాయి

భీమదేవుడు కూడా లేచి నిల్చుంటూ 'భయపడకు భయపడకు ' అని అన్నాడు

తన శరీర స్థితి చూచుకోగానే చోళా లజ్జా సంభ్రమాలతో గుడ్డలు తీసుకొని శరీరాన్ని కప్పుకుంటూ 'ఏడీ - ఆ కాపాలికుడు' అని భయంతో నాలుగువైపులా చూస్తూ అడిగింది

'కాపాలికుణ్ణి నేను కాలభైరవుని సన్నిధికి పంపా'నని భీమదేవుడు నవ్వాడు.

'ఏమిటి? కాపాలికుణ్ణి . కాపాలికుణ్ణి చంపారా?'' అంటూ అవరుద్ధమైన కంఠంతో ''అయ్యయ్యో! ఎంత అపశకునం! అయినా తమరెవరు?'' అని అడిగింది

కాపాలికుని హత్యవల్ల పుట్టిన అపశకున భయాన్ని అణచుకుంటూ ''నన్నెరుగవూ! నేను పాటణ రాజును, భీమదేవుణ్ణి'' అన్నాడు

''ఎవరూ ధనుర్విద్యాపారంగతులు భీమదేవులా '' లజ్జా సంభ్రమాలతో చోళా తిరిగి తన శరీరాన్ని కప్పుకోవాలని వ్యర్థ ప్రయత్నం చేసింది.

''అవును వాణ్ణి హతమార్చకపోతే నిన్నెత్తుకొని పొయ్యేవాడే''

''కాని కృపాళూ! తమరు నన్నెత్తుకొని తెచ్చారా?'' చోళా తల సిగ్గుతో వంగిపోయింది ''అపుడు నా గుడ్డలు ''

''నేనేంచేసేది'' భీమదేవుడు కూడా సిగ్గుతో కిలకిలా నవ్వాడు ''మరి గుడ్డలతో మూర్ఛపోలేదుగా నీవు'' ఆ హాస్యధోరణి చోళాను కూడా ఆకర్షించింది

''కృపాళూ! జరిగిందంతా మరచిపోండి నేను సాధారణ నర్తకిని కాను శివ నిర్మాల్యాన్ని ''

'అందుకే శివునికి అర్పింపబడ్డ పుష్పాన్ని శిరసున ధరించాను సరే నేనటు తిరిగి నిల్చుంటా-గుడ్డలు కట్టుకో '

భీమదేవు డటు తిరిగి నిల్చున్నాడు. భయాందోళనలతో అటూ ఇటూ చూస్తూ ఏదోవిధంగా చోళా గుడ్డలు కట్టుకున్నది. కాపాలికుని భయమూ, వస్త్రవిహీనతవల్ల కల్గిన సిగ్గూ- ఈ రెంటినుంచీ చోళా ఇంకా తేరుకోలేదు

'ఇక అటు తిరగనా?'

'ఊఁ-'

'నేను ఇక్కడ ఉండడం మంచిదైంది.. లేకపోతే...'

''తమకు కాపాలికుడంటే భయం కలగలేదూ? వాడి చావువల్ల ఏమి కానున్నదో? అలాంటి దురాచారిని ముట్టుకోడానికి మీకు సాహసం ఎలా వచ్చిందో దేవునికే తెలియాలి! అయినా పరమేశ్వరుడు తన నర్తకిని విస్మరిస్తాడా?''

భీమదేవుడు మళ్ళీ నవ్వాడు ఇంతలో చోళా అతణ్ణి సమీపించింది

''తమరు మహాసాహసులు!''

''నీవంటున్నావు కనుక నాకూ నమ్మకం కలుగుతున్నది ''

''సరే నేనిక వెళ్ళివస్తా, తమరింకా ఎన్నాళ్లుంటారిక్కడ?''

''నేనా! నన్ను ఈ పనికే పరమేశ్వరుడిక్కడికి పంపాడు నేనూ వెళ్ళిపోతున్నాను''

''ఇప్పుడీ సమయంలో ఎక్కడికి వెళ్తారు?''

''పాటణ నగరం''

''కాని ప్రొద్దునేగా వచ్చింది తమరు? ఇంత త్వరగా వెళ్ళడమేమిటి?'' అంటూ చోళా - మొదటిసారిగా నవ్వింది ఆ నవ్వు జ్యోత్స్నా రామణీయకతలా సహస్ర వీచికలై భీమదేవునికి కన్పించింది

''ఎవ్వరికీ చెప్పనంటే చెప్తా''

''చెప్పను అయినా అసలు విషయం ఏమిటి?''

''గజనీ మ్లేచ్ఛుడు దండయాత్ర చేయడానికి వస్తున్నాడు అతనితో యుద్ధం చేయడానికి వెళ్తున్నాను''

''అయితే విజయంతో త్వరగా తిరిగిరండి! భోళా శంకరుడు మిమ్మల్ని రక్షిస్తాడు'' అన్నది చోళా

''మరి నీ వెదురు చూస్తూంటావా?'' అని చటుక్కున నోరు జారాడు భీముడు.

చోళా పరాకుగా ''మీరు వచ్చేటప్పటికి నేను పరమశివుని పాదాల దాపుననే కలుసుకుంటాను''

భీమదేవుని అభిమానం దెబ్బతిన్నది ఈ ప్రత్యుత్తర మతని కొక చెంప పెట్టులా ధ్వనించింది అతనా బాలికను చూచాడు. కృతజ్ఞతతో వినమ్రమైపోతూన్న ఆ చూపుల్లోకాని, ముగ్ధమోహనమైన ఆ చిరునవ్వులో గాని దైవభక్తే - కేవలం దైవభక్తే తప్ప మానవీయ ప్రేమ ఎక్కడా కన్పించడం లేదు అతడొక వేడి నిట్టూర్పు విడిచాడు

''అయితే నిన్ను పంపి వెళ్తా పద! మా విమలుడు ఎదురు చూస్తుంటాడు''

''సరే''నంటూ చోళా నీటివైపు చూచి మరొకసారి కంపించిపోయింది

## 5

దేవదాసీలుండే వీధికి పోయే ద్వారం దగ్గర చోళా భీమదేవుని వద్ద సెలవు తీసుకున్నది. అస్తమిస్తున్న చంద్రబింబంలా ఆమె చూపులకు దూరమైపోయింది. కానీ భీమదేవుడక్కడ నుంచి కదలలేక పోయినాడు. తన జన్మలో కనీవినీ ఎరుగని- కనీసం కలలోనైనా ఊహించుకోలేని- సౌందర్యమూర్తిని చూచాడు చీకటి తెరల్లో అణగిమణగి యున్న ప్రపంచానికి ప్రాణజ్యోతిలా సూర్యు డుదయించినట్లు తన జీవనజగత్తులోకి ఈ

ప్రాణేశ్వరి ప్రవేశించింది- ప్రవేశించిన ఆ పరమ సౌభాగ్యకరమైన సుముహూర్తంలోనే- తనను వదిలి వెళ్ళిపోయింది అతనూ ఇక వెళ్ళిపోవాలి యుద్ధం కూడా చేయాలి విజయలక్ష్మి ఒడిలో విశ్రాంతి తీసుకోవాలి- తప్పదు- ఏదీ తప్పదు. ఏమో ప్రాణాలతో తిరిగి రావడం ఉండకపోవచ్చు! అతని మనస్సును దైన్యం ఆవరించింది

అలా మందిరాన్ని చూచాడు నెమ్మదిగా చూపును పైకి పోనిస్తూ శిఖరం మీద రెపరెపలాడుతూ ఎగురుతూన్న ధ్వజాన్ని చూచాడు ఆ మహాదేవుడే తనకిక అండదండ సర్వజ్ఞుని ఆశీర్వాద బలం అతనికి రక్షగా ఉన్నది చోళా కూడా- ఎంత కాదన్నా- తప్పక తన కొరకు ఎదురుచూస్తూ ఉంటుంది- తానూ తప్పకుండా తిరిగి వస్తాడు వచ్చి దర్శనం చేసుకుంటాడు. అలా ఊహలు ముందుకు పరుగెత్తకముందే తానే పెదవులు కొరుక్కుంటూ వెళ్ళిపోయాడు.

త్వరగా మహాదేవుని దర్శనం చేసుకొని వెళ్ళి, తన కొరకెదురు చూస్తూన్న విమల మంత్రిని కలుసుకున్నాడు వెళ్ళేముందు దామోదర్‌ను నిద్రలేపి వీడ్కోలందుకున్నాడు

''బాబూ! కొంచెం నెమ్మదించగానే వస్తా జాగ్రత్త సుమా! పొరపడకండి! గజనీ మహమ్మదు దావానలంవలె అతి భయంకరుడు అతణ్ణి తరమడం అంత సులభం కాదు ''

''విచారపడకు మెహతా! నేను అక్కడికి వెళ్ళి అంతా సరిచేస్తా.''

''తప్పకుండా ''

''అసలీ యుద్ధం ఎలా చేయడం? నేను సైన్యంతో వాణ్ణి ఎదిరిస్తా మహాప్రభువులు పాటణ నగరాన్ని కాపాడుకుంటారు'' అన్నాడు విమలుడు మెహతా సూచించిన భయం అర్థరహితమని అతని భావం

కానీ మెహతా తల ఊపుతూ ''అలా చేయకండి! ఎప్పుడూ చేయకండి సైన్యాన్నంతా ఒకేచోట చేర్చి అటోయిటో తేల్చాలి బాబూ .. అర్థమైందా?'' అన్నాడు

''నీవు దిగులుపడకు మెహతా! నేను అంతా చూస్తానన్నానుగా'' అంటూ భీముడు మెహతాకు ధైర్యం కలిగించి మరోమారు సర్వజ్ఞుని ఆశీస్సులు పొంది విమలునితో కలిసి వెళ్ళిపోయాడు సోమనాథ మందిరాన్ని విడిచి ఒంటెలు దూరమవుతున్నకొద్దీ అతని మనసు మందిరంలోని ఒక సాధారణ నర్తకి వైపు దారం లేకుండా లాగివేయబడుతున్నది భావుకత ప్రణయం వైపుకు పరుగెత్తుతుంటే, కర్తవ్యమేమో యుద్ధానికి ప్రేరేపిస్తున్నది. అలా కర్తవ్య ప్రేరితమై శరీరం దూరంగా పోతున్నకొద్దీ హృదయం ప్రణయ ప్రేరితమై చోళా సన్నిధికి . అతిసన్నిధికి. పరుగెడుతున్నది

## 6

ఒక శివభక్తుడు రోజూ లేచినట్లే లేచి దంతధావనచేస్తూ నెమ్మదిగా 'స్తవనం చేస్తూ, సముద్రానికి పొయ్యే మెట్లు దిగుతున్నాడు చంద్రుడు అస్తమించబోతున్నాడు వెన్నెల వెలవెల పోతున్నది అలా మెట్లుదిగి పుల్లతుంపులను సముద్రంలోకి దూరంగా పారవేసి కూర్చుని పుక్కిలించ నారంభించీ ఆరంభించకముందే, భయంకరంగా గావుకేకతో వెనక్కి తిరిగి ప్రాణభీతితో పరుగెత్తాడు నోటితో 'ఓం నమో భగవతే సదాశివాయ సకల తత్వాత్మకాయ' అంటూ స్తవనం పఠిస్తున్నాడు

ఆడవాళ్ళిద్దరు బిందెలను చంకల్లో పెట్టుకొని నీళ్లలోకి వచ్చారు ఆవలిస్తూ, కబుర్లు చెప్పుకుంటూ మెట్లు దిగారు నీళ్ళలో కాలు పెట్టగానే కాలికేదో తగిలింది ఇద్దరూ క్రిందికి చూచారు చూచీచూడ్డంతోనే 'అమ్మో' అని వెర్రికేకపెట్టి బిందెలక్కడే పారవేసి వెనక్కు పరుగెత్తారు

క్షణంలో మందిర మంతటా అలజడి రేగింది అందరి నోటా ఒకే విషయం అందరి గుండెల్లో ఒకే అనూహ్యమైన భయం అతి భయంకరమైనది, ఆపదలను సూచించేది; దైవాగ్రహాన్ని తెలిపేది, కనీ వినీ ఎరుగనట్టిది ఒక కాపాలికుడు గుడ్లుతెరచుకొని, బోసి పెదవులవల్ల అతి వికృతమైన ముఖంతో తీరంలో పడి వున్నాడు

వార్త గాలిలో తేలిపోయింది సర్వజ్ఞుని నివాసం నుండి, మందిరం నుండి, పాఠశాలలనుండి, శివభక్తులు, దేవదాసీలూ వుండే వీధులనుండి, స్త్రీపురుషులు భయాందోళనలతో - గుసగుసలతో - పరమ శివుని దయాయాచనలతో వీధుల్లోకి వచ్చారు తలచుకుంటేనే శరీరం వణికిపొయ్యేటంత విపరీతమైన వాతావరణం వ్యాపించింది త్రికాలాల్లో ఎవరూ అనుభవించని దారుణమైన పరిస్థితి ఏర్పడింది ఒక కాపాలికుని శవం మందిర ద్వారం సమీపాన పడివున్నదట! భయగ్రస్తులు దైవాగ్రహాన్ని ఊహించుకొని వణికిపోతూ. జిజ్ఞాసను ఆపుకోలేక పోయినా - అసలు విషయమేమిటో తెలుసుకోలేకపోయారు

వార్త చిలువలు పలువలైంది ఒకటికాదు - అనేకమంది కాపాలికుల శవాలు పడివున్నాయని వ్యాపించింది.

యాత్రీకుల నివాసాల్లోకి ఈ వార్త పాకింది గజ గజ వణికిపోతూ శ్రద్ధాళువులైన యాత్రీకులు ఈ దైవాగ్రహాన్నుంచి తప్పించుకొనే ఉపాయం ఆలోచిస్తున్నారు. స్త్రీలు ఏడవడమారంభించారు. పసిపిల్లలను గుండెలకదుముకుంటూ దిష్టులు తీయడం

మొదలు పెట్టారు చిన్నచిన్న బాలికలు వెక్కి వెక్కి ఏడుస్తున్నారు ప్రతిచోటా 'శివ- శివ' అనే నామమే విన్పిస్తున్నది

శివకవచ స్తుతి తెలిసిన వాళ్ళందరూ పఠిస్తున్నారు శ్రోత్రియులు మందిరంలోకి వచ్చి తలలు వంచి, చెంపలు వేసుకుంటూ పరమేశ్వరుని క్షమాభిక్ష వేడుకుంటున్నారు భయగ్రస్తులు కొందరు బైట గుంపులుగా చేరి భజన ప్రారంభించారు నాలుగు వైపులా మంజరీ, మృదంగ, సన్నాయి వాద్యాలు మ్రోగుతున్నాయి శంకరుని దయాభిక్ష కోరు కోడం కంటే ఈ దైవాగ్రహాన్ని తప్పించుకోడానికి మరో మార్గమే యెవరికీ స్ఫురించలేదు.

శివరాశి ఒక ఘడియ కన్ను మూశాడో లేదో ఈ అలజడంతా విని మేలుకొన్నాడు అసలు సంగతేమిటో విన్నాడు వినీ వినడంతో శివ కవచాన్ని పఠిస్తూ, నిత్య కర్మ కూడా చేయకుండా మందిరానికి వచ్చాడు భయభ్రాంతులై, దయాభిక్ష కోరుకుంటున్న సమూహాన్ని చూచి తానూ భయపడి పోయినాడు ప్రాంగణంలోకి వచ్చి, గుంపులోంచి ఎలాగో దారి చేసుకొని మెట్లమీదికి వచ్చాడు

ఉదయోన్ముఖుడైన సూర్యుని కాంతుల్లో పెదవులులేని కాపాలికుని ముఖం, పగిలి తెరుచుకొని యున్న గుడ్లతో శిఖరంపైనున్న ధ్వజంవైపు చూస్తున్నట్లుంది

దామోదర్ మెహతా తెచ్చిన వార్తను శివరాశి విని ఉన్నాడు ఆ భయంతో - దైవాగ్రహ భీతితో - హడలిపోయి, రెండు చేతులనూ నుదుట చేర్చుకొని సాధారణ మనుష్యునివలె ''ఓం నమో భగవతే '' అని స్తుతించడం ప్రారంభించాడు అక్కడి నుంచి త్వరగా వెళ్ళిపోవడానికి వెనక్కి తిరగడం తోటే దృష్టి భయగ్రస్తులైన జనసమూహం మీద పడింది దాంతో అతనక్కడే ఆగిపోయాడు ఇరవై సంవత్సరాల శాస్త్రపఠనం, గురుసేవ - తపం అతణ్ణి ఆదుకున్నాయి సర్వజ్ఞుని అనంతరం సోమనాథుని ఈ పరమ ధామానికీ పాశుపత మత సాంప్రదాయానికీ - ఏకైక గురువుగా వెలుగొందబోతున్న తాను ఈవిధంగా భయపడి పారిపోవడమా? ధైర్యం చేసుకొని వెనక్కి తిరుగుతూ, దగ్గరే వున్న ఒక శిష్యుణ్ణి పిలిచాడు

''సిద్ధేశా ''

''చిత్తం''

''గురుదేవునితో కాపాలిక శ్రేష్ఠులూ త్రికాలవేత్తలు - అయిన శ్రీమత్కంక యోగీశ్వరులు కైలాసవాసులైనారని తెలిపి అక్కడ్నుంచి కాపాలక సమూహానికి వార్త తెలిపిరా''

''సరే'' సిద్ధేశ్వరుడు వెళ్ళిపోయాడు

అక్కడే నిల్చున్న జనం 'కంకయోగీశ్వరుల' పేరువిని నిలువునా వణకిపోయారు కంకయోగి, కాపాలిక సాంప్రదాయంవారికి సర్వపూజ్యుడు, ప్రముఖుడు యోగ బలం వల్ల సాక్షాత్తు భైరవుణ్ణి అదుపులో ఉంచుకున్నాడని పాశుపతమతానుచరులు నమ్మేతుండే వారు శంకరుని సాక్షాత్కారం కొరకు అతడు భయంకరమైన ఒక ''మహానిధి''ని ప్రారంభించాడు ఆ 'నిధి' పూర్తిచేసేందుకు నూట ఎనమండుగురు పరమ సౌందర్య మూర్తులైన యువతుల శోణితంతో మహారుద్రుణ్ణి అభిషేకించాలని దీక్ష పూనాడు 'అఘోర' సాంప్రదాయ శ్రేష్టుడైన ఆ యోగీశ్వరుడు అర్ధరాత్రి తప్ప స్మశానం వదలి ఎప్పుడూ బైటికి రాడు. అతనిలా చావడంతో ప్రజలు మరీ ఎక్కువగా భయపడ్డారు

శివరాశి కది పరీక్షాసమయం- అతను కూడా భయపడ్డట్టు ప్రజలు గ్రహిస్తే 'సర్వజ్ఞ పదవి' పొందడానికి అవసరమైన యోగ్యత లోపిస్తుందని అతను అనుకున్నాడు గురువు సహచర్యంలో ఉండి అధికారం ఎలా పొందాలి- అనే విషయం అతనికి బాగా తెలుసు ఎలాగో భీతిగ్రస్తమైన హృదయాన్ని శాంతింప చేసుకొని, దగ్గరే ఒక వృద్ధ స్త్రీ వణికి పోవడం చూచాడు చూచి ''ఎందుకమ్మా! అలా వణికిపోతున్నావు?'' అని అడిగాడు

''శివరాశిగారూ! ఏమిటీ అనర్ధం కంకయోగీంద్రు లిలా మరణించారు ఇక ఏమి కానుందో?''

''పరమశివుని అనుగ్రహం అయినప్పుడు ఏమవుతుంది?''

అవును ''మహాదేవునికి కోపం రాకపోతే ఇలా జరుగుతుందా? ఎలాంటి ఆపదలు రానున్నవో''

శివరాశికి గజనీ మహమ్మదు గుర్తుకు వచ్చాడు అతని శరీరంలో గగుర్పాటు కలిగింది కాని భయభ్రాంతమైన మనస్సును ప్రయత్న పూర్వకంగా దిటవుపరచుకొని ''ఏమిటమ్మా అలా భయపడతావు ఏ నిమిషాన పరమేశ్వరుడు తనకు దర్శన మిస్తాడో ఆ నిమిషాననే తానీ లోకాన్ని విడిచిపెట్టి కైలాసం వెళ్తానని స్వయంగా కంక యోగీంద్రులు నాకు చెప్పారు ఇది సోమనాథుని పరమకృపా విశేషం'' అన్నాడు

శివరాశి మహాడంబరంగా మెట్లు దిగి, కంకయోగి శవం ముందు నిల్చుని, పగిలి వికృతంగా కన్పిస్తున్న అతని కన్నులనుంచి తన దృష్టిని తప్పించుకుంటూ స్తోత్రపఠనం ప్రారంభించాడు. అతని హృదయం నిమిష నిమిషానికీ ఆగిపోయినంత పని అవుతున్నది కాని త్వరలోనే సర్వజ్ఞ గురుదేవులు వస్తారనే ఆశతో ఏదో విధంగా ప్రాణాలు బిగపట్టుకొని నిల్చున్నాడు

రానురాను జనసమూహం పెద్దదవుతూ వచ్చింది బిగ్గరగా కీర్తనలు పాడుతూ, భజనలు చేస్తూ, భయాన్ని పోగొట్టుకోడానికీ, దైవాగ్రహాన్ని ఉపశమింపచేయడానికి ప్రయత్నిస్తున్నారు

శివరాశి చెప్పిన ముక్కలు ఆ నోటి నుంచి ఆ నోటికి వెళ్ళి అన్ని వైపులా వ్యాపించాయి ఇది దేవుని కోపం కాదు దేవుడే ఈ విధంగా అనుగ్రహించాడు సర్వజ్ఞులు రాకముందే ప్రజల భయం చాలావరకు తగ్గింది సత్కారాలు స్వీకరిస్తూ సర్వజ్ఞుడు వచ్చాడు ముఖంలో ఎప్పటి ప్రశాంతియే కన్పిస్తున్నది వస్తూనే బిగ్గరగా సుపరిచితమైన స్తోత్రాన్ని పఠించ నారంభించాడు భీతి ఉపశమించిన, ప్రజలు కూడా ఆ స్తోత్రాన్ని తామూ అందుకొని పఠించడం ప్రారంభించారు సర్వజ్ఞుడు యోగీశ్వరుని శవాన్ని సమీపించి, అతని కన్నులపై పూలు ఉంచారు

ఇంతలోనే ఒక కాపాలికుల గుంపు మహాభయకరంగా విచిత్రమైన అట్టహాసాలతో వచ్చి కంక యోగీశ్వరుని శవాన్ని తమ రక్షణలోకి తీసుకున్నారు

యోగీశ్వరుని శవయాత్ర ప్రారంభమైంది ఒక లక్షమంది చేసే 'నమశ్శివాయ' అనే నినాదాలతో యోగీశ్వర శ్రేష్ఠుడైన కంకుని శవం స్మశానం చేరుకున్నది కాపాలికులు తమ పద్ధతిని అనుసరించి అంత్యక్రియలు ఆరంభించారు సర్వజ్ఞుడు, శివరాశి తప్ప మిగతా ప్రజలందరూ వెళ్ళిపోయారు తమ సనాతనాచారాన్ననుసరించి కాపాలికులు కైలాసాన్ని చేరిన తమ యోగీశ్వరుని అస్థి, చర్మాలను అతి భయంకరంగా, అవాచ్యంగా పదిలపరచారు

## 7

సూర్యుడు నడినెత్తికి వచ్చాడు గంగ తిరిగి వచ్చేవరకు చోళా నిద్రపోతూనే ఉన్నది ఆమె కనేక కలలు వచ్చాయి అందులో కొన్ని భయంకరమైనవి మరికొన్ని రసార్ద్రమైనవి భీకరమైన కాపాలికుడు తనను తరుముకొని వస్తున్నట్లు, పరమశివుడు వృషభ వాహనాన్ని ఎక్కి తన కెదురుగా వస్తూ కన్పించారు భీమదేవుని ఒడిలో ఒదిగి వినాయకుని ఎలుక మీద స్వారీ చేసింది దేవదానవులు తన కొరకు నరుకుకొని చచ్చారు శంకరుని ఒడిలో కూర్చుని పార్వతితో పోరు పెట్టుకున్నది పార్వతి కోపంతో ఒంటికాలు మీద నాట్యం చేయడం మొదలుపెట్టింది పెదవులులేని కాపాలికుడు తనను భుజాలపైన ఎక్కించుకొని భీముని దగ్గరకు తీసుకు వెళ్తున్నాడు భీమదేవుడు కార్తికేయుని నెమలిపై

ఎక్కి వచ్చాడు తనను రొమ్ము చేర్చుకున్నాడు ఇంతలో నెమలి ముక్కుతో తన వస్త్రాలను లాగుకొని ఎగిరిపోయింది

ఆమె సంభ్రమంతో లేచింది క్రిందటి రోజున జరిగిన విషయాలను నెమరుకు తెచ్చుకుంటున్నది నిన్న తాను పరమేశ్వరుని రంజించింది వెన్నెలలో సముద్రస్నానం చేసింది భీముని ఒడిలో ఒదిగిపోయింది తన మహాదేవుడే తనను రక్షించుకున్నాడు కాకపోతే తనను రక్షించడానికి భీమదేవుడు ఎక్కడనుంచి వచ్చివుండేవాడు? నిజంగా తాను పరమేశ్వరుని ప్రియురాలే! అవును నిజమే అందులో అనుమాన మేమీ లేదు చోళా కిలకిలమని నవ్వింది

కూతురు నవ్వడం గంగ చూచింది 'ఇంకా ఎంతసేపే నిద్ర? మధ్యాహ్నం ఎప్పుడైందో తెలుసా?'

'అయితే ఏం? నిన్న రాత్రంతా నిద్రలేదుగా'

'కాని ఏం జరిగిందో నీకు తెలుసా?'

'నిద్రపోతుంటే ఎలా తెలుస్తుందమ్మా? ఇంతకూ ఏమైందేమిటి' అని చిలిపిగా అడిగింది

'కంకయోగి మరణించాడు '

'ఎవరూ?'

'కాపాలికుల గురువు తీరంలో శవం పడివున్నది అబ్బబ్బ! ఆ పగిలిన కండ్లూ - భీకరమైన ముఖం ఎంత భయంకరంగా వుంది!'

అంటూ గుడ్డలు మార్చుకుంటూనే గంగ చెబుతూ పోయింది 'నీకు తెలుసో లేదో, ఆయన నూట ఎనమండుగురి బాలికల రక్తంతో రుద్రాభిషేకం చేశాడు-' ఆమె చూపులు చోళామీదికి మళ్ళినాయి చెప్పడం ఆపి భయంతో 'అదేమిటే ' అన్నది

'బాలికల రక్తమా అమ్మో!' అంటూ అరుస్తూ చోళా మూర్ఛిల్లింది

## 8

శ్మశానం నుండి తిరిగివచ్చి, రెండోసారి స్నానంచేసి ధ్యానం చేసుకోడానికి సర్వజ్ఞుడు కూర్చోగానే ఆయన నోటి నుండి కూడా అప్రయత్నంగా శివకవచం వెలువడింది- ఓం నమో భగవతే సదాశివాయ-

# సామంత చౌహాన్

## 1

మూర్ఛనుంచి తేరుకున్నా చోళాకు తల తిరుగుతున్నది. భీమదేవుడూ కాపాలికుడూ - గజనీ మహమ్మదూ - ఆ మూడు మూర్తులూ ఆమె తలలో సుళ్ళు తిరుగుతున్నాయి ఆమె హృదయంలో భయం ఏర్పడింది వెంటనే దగ్గరే కూర్చున్న తల్లిని కౌగిలించుకున్నది

'అమ్మా! ఇక ఏం జరుగుతుందో'

'ఏమవుతుందీ'

'నీకేం తెలుసు- యోగీశ్వరుడు మరణించాడంటే ఏదో కీడు తప్పక కలుగుతుంది'

'ఆ కీడు జరగకేం' అంటూ ఉపేక్షాభావంతో 'ఇన్ని ఏండ్ల నుంచి ఇలాటి అరిష్టం ఎన్నడూ చూడలే'దన్నది గంగ

'అసలు నీకు తెలుసా. గజనీ మహమ్మదు వస్తున్నా'డని గంగ చెవిలో చెప్పింది చోళా

'గజనీమహమ్మదా! ఈ ఘటికుడెవడే?'

'నాకేం తెలుసు?'

'మరి ఈ సంగతి నీకెలా తెలిసింది?'

'ఎలాగో తెలిసిందిలే అది నీకెందుకూ'

'అదా! నిన్నటివరకేమీ తెలియనిదానికి ఈ రోజెలా తెలిసింది?'

'అవును, నాకు తెలిసింది '

'ఎలా తెలిసిందో చెప్పరాదూ' అంటూ గంగ బలవంతం చేసింది కూతురు మనసులోంచి భావాలైనా సరే తనకు తెలియకపోతే గంగకు కష్టంగా ఉండేది- అంటే కూతురుపట్ల అంత ప్రేమ గంగకు శివరాశితో చోళా స్నేహం కలపాలని గంగకు ఉన్నా చోళా తన హృదయాన్ని, శరీరాన్ని ఎవరికో ఇతరులకు సంపూర్ణంగా అర్పించు కుంటుందనే భావం వస్తే గంగ హృదయంలో పెద్ద గాయం ఏర్పడేది

'చెప్పవూ! నాకు చెప్పవుటే?'

చోళా చాలా అమాయకురాలు బోళా స్వభావం కలది అన్యుల ముందే ఏమీ దాచుకోలేనిది తల్లిముందా దాపరికం?

'గజనీ మహమ్మదు దండయాత్రకు వస్తున్నాడని పాటణ ప్రభువు భీమదేవులు నాకు చెప్పారమ్మా'

వెంటనే ఆమెకు, క్రిందటి రాత్రి జరిగిన చంద్రికా స్నానదృశ్యం లీలగా కన్పించి నిలువునా కంపించిపోయింది

గంగ చోళాను హృదయానికి హత్తుకున్నది చోళా తెలివికి మురిసిపోతూ 'భీమదేవుణ్ణి ఎప్పుడు కలుసుకున్నావే' అని అడిగింది చోళా హృదయం తన అనుభవాన్ని తెలపడానికి ఆరాటపడింది. తల్లిని కౌగిలించుకొని- ఆమె ఒడిలో ఒదిగిపోయి - ఏడుస్తూ - - నవ్వుతూ- భయపడుతూ రాత్రి జరిగిన ఘటనలు- కంకయోగి మరణం, భీమదేవుని కలయిక పూసగుచ్చినట్టు వర్ణించింది స్నానానంతరం భీమదేవుడు తన నెత్తు కొని వచ్చినపుడు తన నగ్నావస్థను చెప్పడం మాత్రం విస్మరించింది

## 2

ఈ విషయం వినేసరికి గంగ గుండెల్లో కూడా భీతి ఆవరించింది. కంకయోగి చోళా కొరకై హత్య కావింపబడడం కంటే భయానకమైన ఘట్టం, బాధాసూచకమైన ఘట్టం మరేముంటుంది? వెంటనే భీమదేవుడు కూడా గజనీ మహమ్మదుతో పోరాడ డానికి వెళ్లవలసి వచ్చింది.

ఎన్ని దుఃఖాలు తటస్థించినా, వాటి నుండి తప్పించుకోడానికి గంగకు ఒకే ఉపాయం తెలుసు సర్వజ్ఞుని దగ్గరకు చోళాను కూడా తీసుకు వెళ్ళింది.

సర్వజ్ఞులు మధ్యాహ్న సంధ్యలో నిమగ్నులై ఉన్నారు. అర్ఘ్యం విడిచి గాయత్రి పఠనం ఆరంభించారు నేడు ఆయన మనస్సు కూడా స్థిమితంగా లేదు నోట గాయత్రి పఠిస్తున్నా, హృదయంలో 'ఏమి తలపెట్టావయ్యా! పరమ శివా' అనే ధ్వనిస్తున్నది

చోళాతో గంగ పెరటి ద్వారం నుంచి ప్రాంగణంలోకి వచ్చి చేతులు జోడించి ఒక ప్రక్కన కూర్చున్నది దగ్గరే చోళా క్రిందికి చూస్తూ కూర్చున్నది.

చోళా సర్వజ్ఞుణ్ణి చూస్తున్నది తేజం ఒలికే విశాల ఫాలభాగాన తెల్లని విభూతి రేఖలు శోభిల్లుతున్నాయి సర్వజ్ఞుడు మానవుడేనా? లేక సాక్షాత్శంకరుడా! అనే సందేహం కలిగిం దామెకు ఎన్నోసార్లు కలలో శంకరుని కూడా ఇదే రూపంలో తాను చూచింది

సర్వజ్ఞుని గడ్డంలో ఉన్న ముడే శంకరుని గడ్డంలో కూడా కన్పించింది చోళా యోచన హద్దులు దాటి పరుగెడుతున్నది

''మరి సర్వజ్ఞుడే శంకరుడైతే తానా దేవాధిదేవునికి పుత్రికయా? ఇది ఏమంత సమంజసంగా లేదు ఎందుకంటే తాను స్వయంగా-పార్వతిలా-శంకరుణ్ణే ఆరాధిస్తున్నది ''

సర్వజ్ఞుడు సంధ్య వారుస్తున్నాడు శివరాశి వచ్చి గురువుగారి చరణాలను స్పర్శించాడు క్రీగంట చోళాను చూచాడు. అతని పెదవులపై చిరునవ్వు తొలకరించింది

''గురుదేవా! సజ్జన చౌహాన్ తన పుత్రునితో మిమ్మల్ని దర్శించుకోడానికి వచ్చాడు ''

''సరే అసలు గంగ ఎందుకు వచ్చింది? ముందు అడుగు '' సర్వజ్ఞుడు స్నేహార్ద్రమైన దృష్టిని చోళాపై నిలిపి ''చోళాకూడా వచ్చిందే! ఏమమ్మా చోళా! నిన్న ప్రేక్షకులందర్నీ మైమరపించావే!'' అన్నాడు

గంగ, చోళా లిద్దరూ సర్వజ్ఞునికి నమస్కరించి ''తమ దయ'' అన్నారు

''ఆ! పరమేశ్వరుని కృప, కానీ చోళా! నీవు చాలా గంభీరమైన దానివే సుమా! ఇంత సహజంగా నర్తించగలవని నాకేం తెలుసు? గంగా ఇక నీ పని అయిపోయింది ''

''నా పని అయిపోతే నా కూతురే కదా వారసురాలు స్వామీ! ఏమంటారు రాశిగారూ'' అన్నది గంగ

రాశి ఏదో చెప్పబోతుండగానే సర్వజ్ఞుడీ కుటుంబ ప్రసంగాన్ని ఆపాడు

''అయితే గంగా! ఏమిటీ విషయం ''

''చోళాకు మీ దర్శనం చేయిద్దాం ఒకటి ''

'' ఇక రెండోది?''

''రెండో విషయం చోళా నాకో భయంకరమైన విషయం చెప్పింది. అది మీకు చెబుదామని''

చోళా నలువైపులా చూచింది; సర్వజ్ఞు డిది గ్రహించి ''రాశీ! వెళ్ళి లోనికి ఎవరినీ రానీయవద్దని'' చెప్పమన్నారు

''అలాగే'' నంటూ శివరాశి క్షణంలో తిరిగివచ్చి కూర్చున్నాడు

తరువాత చోళా విషయంలో జరిగినదంతా సర్వజ్ఞునికి గంగ వర్ణించి చెప్పింది చెపుతూన్నప్పుడు సర్వజ్ఞుని ముఖం గంభీరమవుతూ వచ్చింది కంకయోగిని భీమ దేవుడు చంపాడని వినగానే ఆయన కండ్లు తెరిచి, శ్వాస బిగించి, శివకవచ స్తోత్రంలోని

కొన్ని పంక్తులు చదివాడు శివరాశి ఈ వృత్తాంతమంతా వింటూ కొయ్యబారి పోయినాడు గంగ చెప్పడం అయ్యేసరికి అందరూ రాతిబొమ్మ లైనారు

సర్వజ్ఞుడు ప్రయత్న పూర్వకంగా, స్థిరంగా ఇలా అన్నాడు మానవుని భయమూ, ఆశా- అంతా కుందేటి కొమ్ములాంటిది ఈశ్వరానుగ్రహ మొక్కటే సార్వకాలిక సత్యం ఆయనను శరణు వేడడ మొక్కటే మన కర్తవ్యం పరమేశ్వరుడే ఈ ఇరవై సంవత్సరాల నుంచి ఈ మందిరాన్ని నా చేతులతో అభివృద్ధికి తెచ్చాడు అలాంటి త్రిశూలధారి ఎంతవరకు ప్రసన్నుడై విరాజిల్లుతుంటాడో అంతవర కెవరేమి చేయగలరు? ఈమాటలంటూంటే ఆయన కన్నుల్లో తేజం పొరలింది. సాక్షాత్తు దైవ సందేశాన్ని వినిపిస్తున్నట్లు భావగర్భితంగా ఈ మాటలన్నాడు - ''పరమేశ్వరుడు అభయమిచ్చి కాపాడుతుంటే ఎదిరించే సాహసం ఎవరికుంటుంది? పరమేశ్వరుడే పరిత్యజిస్తే ఇక రక్షించ సాహసించే దెవరు? గజనీ మహమ్మదు ఆయన్ను ద్వేషించ నారంభిస్తే ఎన్నడూ ఎరుగని దుర్గతికి పాలవుతాడు ''

అలా కాసేపాగి ఒక క్షణం మౌనంగా ఆకాశాన్ని చూచాడు సర్వజ్ఞుని వైపు చూస్తున్న ఆ ముగ్గురికీ ఆయన పట్ల అమితమైన శ్రద్ధా భక్తు లుప్పతిల్లాయి

''రాశీ! సజ్జన చౌహానుడు ఎదురు చూస్తున్నాడు కదూ! సోమనాధుడే అతణ్ణి పంపాడు పోయి లోనికి తీసుకురా''

శివరాశి లేచి సజ్జన చౌహానునూ, అతని కుమారునీ పిలవడానికి వెళ్ళాడు

## 3

సజ్జన చౌహాను నలుబదేండ్ల రాజపుత్రుడు సమున్నతమైన శరీరం, దట్టమైన తల కట్టు-మహా భీకరాకృతి కుమారుడు కూడా తండ్రి పోలికే వయసు ఇరవై సంవత్సరాలు ఇద్దరూ ఒకే విధమైన ఖడ్గ కవచాలను ధరించారు ఇద్దరూ వచ్చి సాష్టాంగపడి సర్వజ్ఞునికి 'నమఃశివాయ' అని నమస్కరించారు

'శివాయ నమః' అని ఆశీర్వదించి ''నిన్ననేనా రావడం'' అని అడిగాడు సర్వజ్ఞుడు

''అవును గురుదేవా! వచ్చేటప్పటికి కొద్దిగా ఆలస్యమైంది తమరు హారతులిస్తున్నారు తరువాత నృత్యం జరిగిం''దంటూ సజ్జనుడు చోళాను చూచాడు

''అవును- నిన్న చోళా అద్భుతంగా నృత్యం చేసింది కదూ!'' అని ప్రశ్నించారు సర్వజ్ఞులు ఆయన దృష్టి సజ్జనుని కుమారుడు సామంతుని వైపుకు మళ్ళింది

వచ్చినప్పటి నుంచీ సామంతుడు చోళావైపే కండ్లప్పగించి చూస్తున్నాడు సర్వజ్ఞుడు చిరునవ్వు నవ్వాడు చోళా భువనమోహినిగదా మరి!

''సజ్జనా! ఘోఘారాణా కుశలమా?''

''ఆ సోమనాధుని దయవల్ల 'తమ కనేక నమస్సు లర్పించి ఈ కానుక సమర్పించ మన్నారు '' అంటూ నడుమున ఉన్న దట్టీలోంచి ఒక వజ్రాన్ని తీసి సర్వజ్ఞుని పాదాల వద్ద ఉంచాడు సజ్జనుడు

''చౌహాను వంశ మకుటం పరమేశ్వరునిపై భక్తిశ్రద్ధల్తో వున్నందుకు చాలా సంతోషం ''

''పరమేశ్వరానుగ్రహం గురుదేవా!''

''ఘోఘారాణాకు శంకరుడు ప్రసన్నుడైనాడయ్యా ఆయన సేవ పరమేశ్వరునకు చాలా ప్రియమైనది నీ వెపుడు బయల్దేరావు?''

''ఘోఘా దుర్గంనుంచి బయల్దేరి రెండు నెల్లయింది సపాదలక్ష నుంచి శ్రీమాళం, అక్కడనుంచి చిత్తోడ్ ద్వారా వస్తున్నాను.''

''ఎన్నాళ్ళలోగా తిరిగి వెళ్తావు?''

''పాతిక రోజులు పట్టవచ్చు''

''అలా కాదు. త్వరగా- పక్షిలా ప్రయాణించి ఘోఘా దుర్గం చేరాలి ప్రాణాలతో చెరలాటం వచ్చి పడ్డది పరమేశ్వరుని కార్యమిది!''

''మరీ త్వరపడితే ఇరవై రోజులైనా పడుతుంది''

''సజ్జన్ - పదిహేనురోజులు - పదిరోజులు - పదికూడా కాదు వారం రోజులు నీవు ఘోఘారాణా కుమారుడివి - అతడు ఘోఘారాణా పౌత్రుడు నీశక్తి నాకు తెలియనిది కాదు. ఎడారిలో ఒంటెను పక్షి కంటే వేగంగా పరుగెత్తించే సామర్థ్యాలున్నాయి నీకు''

''అయితే అజ్ఞాపించండి గురుదేవా''

''పతితుణ్ణి నే నాజ్ఞాపించడం ఏమిటయ్యా ఇది సోమనాధ పరమేశ్వరుని ఆదేశం''

''ఏమిటో సెలవివ్వండి స్వామీ! ఘోఘారాణా కుటుంబం సోమనాధుని ఆజ్ఞను ఎల్లప్పుడూ శిరసావహిస్తుంది ''

''మీ కుటుంబాన్ని సోమనాథుడు చల్లని హస్తాలతో ఆశీర్వదిస్తున్నాడు సజ్జనా! మందిరంలోంచి అన్నిటికంటే పెద్ద ఒంటెను తీసుకో! రేయింబవళ్ళు ఎడారిలో ప్రయాణం చేసి ఘోఘారాణాకు సోమనాధుని ఆదేశాన్ని అందించు''

''ఏమిటది స్వామీ?''

''గజనీ మహమ్మదు దండయాత్రకు బయలుదేరాడు - పరమేశ్వర మందిరాన్ని ధ్వంసం చేయడానికి ఎనుబదేండ్ల భక్తికి ప్రతిఫలంగా దేవ దుర్లభమైన అధికారం సోమనాధ మందిర - రక్షణాధికారం - ఘోఘూరాణాకు లభించిందని తెలుపు ''

''మహాభాగ్యం స్వామీ''

శంకరుని ఆదేశం విన్పించేటప్పుడు సర్వజ్ఞుని ముఖంలోంచి తేజం ఉట్టిపడింది కన్నుల్లో కెంపుల కాంతి నిండింది

''వెళ్ళు. వెళ్ళి ఎంతవరకు ఘోఘూ వంశంలో ఒక్కడైనా జీవించి వుంటాడో అంత వరకు సుల్తాన్‌ను తరిమికొట్టమని చెప్పు ఎక్కడ దొరికితే అక్కడ ఆ దేవవిద్వేషి ప్రాణాలను హరించమని కూడా చెప్పు సోమనాధుని ఆదేశం ఇది సూర్యచంద్రుల కాంతులున్నంతవరకు ఘోఘూ చౌహాను వంశపు కీర్తి చంద్రికలు శాశ్వతమై వెలుగొందు తాయని కైలాసనాధు డనుగ్రహించినట్లు చెప్పు''

సజ్జనుడు సర్వజ్ఞుని పాదాలకు నమస్కరిస్తూ పరమేశ్వరుని ఆదేశాన్ని అందుకున్నాడు కంపిత స్వరంతో, తేజం ఒలికే చూపుల్తో 'స్వామీ! మీరు నిశ్చింతగా వుండండి ఘోఘూరాణా ఇరవైమంది పుత్రులూ, నలభై యార్గురు పౌత్రులు - నూట ముగ్గురు ప్రపౌత్రులు పరమేశ్వరుని ఆనతినందుకొని యుద్ధానికై కటిబద్ధులై యున్నారు మమ్మల్ని కాదని ముందుకు రావడానికి ఆ మ్లేచ్ఛునికి గుండెలున్నాయా?

''ధన్యుడివయ్యా చౌహాన్! వెళ్ళు. వెళ్ళి పరమేశ్వరుని ఆదేశాన్ని ఘోఘూ రాణాకు విన్పించు.''

''బ్రతికుంటే పదిహేను రోజుల్లో చేరుకుంటా తమరు మా సామంతుణ్ణి కనిపెట్టి ఉండండి.''

''నాన్నా! . సామంతుని ధ్వనిలో అవమాన దుఃఖం కట్టలు తెంచుకుంది సోమ నాధుని ఆజ్ఞను పాలించే హక్కు ఘోఘూరాణా సంతానంలో అందరికీ సమంగా ఉంది నే నబలుడను కాదు నేనూ మీ వెంట వస్తాను ''

సర్వజ్ఞుడు సామంతుని వెన్నుచరచి ''శెభాష్ చౌహానుల పౌరుషాన్ని నిలబెట్టావు మరి యిక్కడ నీ అవసరం వుంటే .?'' అని ప్రశ్నించాడు

సామంతుని ముఖంలో దిగులు కన్పించింది

''స్వామీ ఇక్కడి రాజపుత్రు లిక్కడే వుంటారు కదా! అవసరమున్నా ఘోఘూ దుర్గ చౌహాన్ అక్కడే ప్రాణాలర్పిస్తాడు నేనూ వెళ్తాను ''

సర్వజ్ఞుని ఉత్సాహస్ఫోరకమైన హాస్యం అందరికీ స్ఫూర్తి నిస్తున్నది -''సజ్జనా! నీ కుమారునిలో ఘోఘారాణా ప్రతాపం ఉట్టిపడుతున్నది ఇతన్ని కూడా తీసుకొని వెళ్ళు ఎంతవరకిలాంటి చౌహాను వంశీయులుంటారో అంతవరకు ధర్మమే జయిస్తుంది ''

సామంతుడు కృతజ్ఞతాపూర్వకంగా సర్వజ్ఞుని చరణాలకు నమస్కరించాడు. సర్వజ్ఞుడు అతన్ని ఎత్తి హృదయానికి హత్తుకున్నాడు.

''ఇక వెళ్ళిరా నాయినా! గో, బ్రాహ్మణ, ధర్మాలను విధ్వంసం చేసే వాళ్ళు నీకెదురు నిలువగలుగుతారా! వెళ్ళి విజయశ్రీని చేపట్టు''

''స్వామీ! ఎక్కడ దొరికితే అక్కడ మ్లేచ్ఛుని తల నరికి శ్రీ సోమనాథునికి సమర్పిస్తాం''

''వెళ్ళండి. వెళ్ళండి విజయాన్ని సాధించండి శివరాశీ! వీరి ప్రయాణానికి ఏర్పాట్లు చేయి మఠంలో వున్న మంచి ఒంటెల నిచ్చి పంపు ''

''మీరు దిగులుపడకండి గురుదేవా! ఈ ఎడారి బాటలు యితరులను విసిగిస్తాయి కాని మమ్మల్నేమీ చేయలేవు.''

''నాకది తెలియదంటావా?''

సజ్జన, సామంతులు సర్వజ్ఞునికి నమస్కరించారు. వెళ్తూ వెళ్తూ సామంతుడు చోళావైపు చూచాడు. చోళా ప్రశంసాముగ్ధ నేత్రాలతో చూస్తోంది ఆ కన్నుల్లో సందేశం కనిపించింది సామంతునికి ఆ సందేశం అతనిలో వీరత్వాన్ని ప్రేరేపిస్తున్నట్లనిపించింది.

సర్వజ్ఞుడీ విషయం గమనించకపోలేదు. ''సజ్జనా! వెళ్ళేటప్పుడు నీవూ, నీకొడుకూ సోమనాథుని దర్శనం చేసుకొని వెళ్ళండి. అక్కడ చోళా మీకు ప్రసాదం ఇస్తుంది ''

సామంతుని హృదయం కొట్టుకోడం ప్రారంభించింది ఈ చోళా సోమనాథుని ప్రియదాసి నిన్న నృత్యం చేసిన అద్భుత నర్తకి - తనకు ప్రసాదం ఇవ్వడానికి వస్తుందా?

రెండు ఘడియల తరువాత సామంతుడూ, సజ్జన సింహుడూ మహాదేవుని దర్శనం కొరకు వెళ్ళారు. చోళా ప్రసాదం ఇచ్చేందుకు కనిపెట్టుకొని కూర్చున్నది. ఇద్దరూ ప్రసాదం పుచ్చుకున్నారు. ప్రక్షాళన జలాన్ని శిరస్సున చల్లుకున్నారు. శౌర్యం పొంగులువారే హృదయాలతో శ్రీ సోమనాథుని పాదాలకు నమస్కరించారు

సామంతుని చూపులన్నీ దగ్గరవున్న ఆ నర్తకినే చూస్తున్నాయి ఇక వెళ్ళాలనుకుంటూ ఉండగానే మధుర ధ్వని వినిపించింది

''ఇంతకూ సర్వజ్ఞులు పంపిన కానుక అలాగే ఉండిపోయింది '' అంటూ ఒక బంగారు గిన్నెలో పోసిన విభూతిని వారి ముందు ఉంచింది చోళా

ఇద్దరు చౌహానులూ గర్వంతో ఉప్పొంగిపోయారు శంకరుని సేవా యజ్ఞంలో తామిక ఆహుతిగావాలనే కోరికతో సజ్జనుడు స్వయంగా రెండు కనుబొమ్మల మధ్యా విభూతి పెట్టుకున్నాడు. కాని సామంతుడు స్వయంగా తీసుకోలేదు తా నామె నృత్యాన్ని కన్నుల్తో చూచాడు నేత్ర సందేశం స్వీకరించాడు మరి ఈ యుద్ధయజ్ఞంలో తాను బలిగా అర్పింపబడేందుకు ఆమె చేతుల్తో నుదుట విభూతి ఎందుకు పెట్టకూడదు? ఉత్సాహంతో ఒక రెప్పపాటు అలాగే ఉండి తలను ముందుకు పోనిచ్చాడు చోళా సామంతుని కన్నుల్లో తొణికిసలాడే శౌర్యాన్ని చూచింది అతని ప్రతి అవయవంలో తనకై కదలి పోతున్న ఉత్సాహాన్ని చూచింది చోళా వ్రేళ్ళతో విభూతిని అతని నుదుట పెట్టింది

''విజయశ్రీతో త్వరగా తిరిగిరా వీరా!'' అని నెమ్మదిగా అన్నది

''తప్పక'' అని గర్వంతో సామంతుడు అన్నాడు చోళా మధుర నేత్రాలు ఆ యువకుణ్ణి తన స్మృతిపటలం మీద అంకితమొనరించాయి

అక్కడనుంచి సామంతుడు బయల్దేరాడు అప్పుడాతని శరీరమంతటా ప్రతి రక్తనాళంలోనూ-అనంతమైన విజయోల్లాసం పొంగులు వారింది.

సజ్జన, సామంతులు ఎనమండుగురు యోధులను తీసుకొని వడిగా ప్రయాణించే ఒంటెలమీద బయల్దేరారు తమతో ఆరితేరిన మార్గదర్శకులను కూడా తీసుకున్నారు.

చుట్టు తిరిగి కాకుండా, నేరుగా ఎడారిలోంచి వెళ్ళాలని సజ్జనుని ఊహ సౌరాష్ట్ర దారులు అతని కెక్కువ తెలియవు కాని ఎడారిలో అతని కెవరన్ననూ లెక్కలేదు ఇసుక విస్తారంగా ఉన్న ప్రతి క్షేత్రానికీ అతడు ప్రభువే కచ్ఛ నుంచి ఘోఘా దుర్గం వరకున్న దారులన్నీ తరచి చూడాలని అతని కోరిక ఆ సమస్త మరుభూమిలో అతనికంటే వడిగా ఒంటెలమీద ప్రయాణం చేయగల వీరుడే మరొకడు లేడు ఒంటెమీద అతడు ఎన్ని రాత్రింబగళ్ళు గడిపాడో! అతడెక్కిన ఒంటె ఎలాంటిదైనా పక్షిలా పరుగెత్తేది వాటితో అతడు సంభాషించగలడు. వాటి దుఃఖాన్ని గ్రహించగలడు వాటితో ఎంత పనైనా చేయించగలడు గాలితో పందెం కాచే ఘోఘా గఢం ఒంటెలు అతడి మడిమ తాపుకు గంగ వెర్రు లెత్తేవి. అతనికి కూడా ఒంటెలంటే మహా పిచ్చి ప్రేమ అతని ప్రాణాలకు ఒంటె మూగజీవాలు కాదు. మురళీనాదం విని నర్తించే గోపికలని అతని నమ్మకం

అలా వేగంగా ముందుకు నడిచారు. తన వెంట సామంతుణ్ణీ, ఒక మార్గదర్శినీ మాత్రమే ఉంచుకున్నాడు మిగతావారు మాత్రం ఒంటెల మీద వస్తున్నారు

సౌరాష్ట్ర అడువులను దాటి ఎడారిని సజ్జనుని బృందం సమీపించే సరికి మధ్యాహ్నం అయింది సముద్రతీరంలో నిల్చున్న వ్యక్తికి కనుచూపు మేర వరకు నీటి అలలే కన్పించినట్లు, సజ్జనుని ముందు ఇసుక తరంగాలే వ్యాపించి వున్నాయి సూర్య కిరణాలకు ఇసుక మెరుస్తూంటే, సజ్జనుడు కండ్లుకూడా తెరవలేక పోయాడు అటునుంచి ఎడారి దాటడం చాలా భయంకరమైన పని. అయినా అది దగ్గరి దారని సజ్జనుడికి తెలుసు కాని అందాలు చిందే తన ప్రియపుత్రుడు సామంతుడు వెళ్లవలసిన దారి కాదు

అతడు పుత్రుణ్ణి చూచాడు చేతితో సూర్యుని కిరణాలను తప్పించుకుంటూ, ధైర్యంగా సామంతుడు కూడా దుస్తరమై అగుపించే ఇసుక సముద్రాన్ని పరికిస్తున్నాడు. ఈ చిరు బాలుణ్ణీమార్గాన తీసుకుపోవడమా! ఏమంత సమంజసంగా లేదు అని యోచించాడు సజ్జనుడు

''బాబూ! మన మొక పని చేయాలి. నీవు ఆబూ మీదుగా 'ఝాలోర్' వెళు. నేను నేరుగా వస్తా ''

సామంతునికిది అర్థమైంది చూపుల్తో తండ్రిని దెప్పుతూ ''ఏం? యీదారిన వస్తే?'' అన్నాడు

''వస్తే ఏమీలేదు కాని ఒకే దారిన పోవడంకంటే ఇది మంచిది కదూ! ఈ దారి నాకూ కొత్తదే కనుక ఒకసారి వెళితేగాని తెలియదు మనం భమ్మరియాలో కలుసుకుందాం.''

''నాన్నగారూ! నిజం చెప్పండి నన్ను తీసుకు వెళ్ళడానికి భయపడడం లేదు కదా?''

''ఛీ! ఘోఘా బాపా సంతానం ఎప్పుడైనా భయపడుతుందా బాబూ!'' అంటూ పుత్రుణ్ణి కౌగలించుకున్నాడు సజ్జనుడు అతని మనస్సులో అద్భుతమైన వాత్సల్యం పొంగింది కండ్లు చెమ్మగిల్లాయి రెండు రోజులు ముందుగా ఘోఘా దుర్గం చేరుకోడానికి తన్నీ మార్గాన వెళ్ళబోతున్నాడు. దురదృష్టవశాత్తు ఈ రత్నంలాంటి కొడుకిక కంటికే కనబడకపోతే? కాని సామంతుడు బాల సహజమైన చాపల్యాన్ని ప్రదర్శించాడు

''అంత ముందుగా ఘోఘా దుర్గం చేరుకుంటారా? చూడండి! నేనే ముందుగా చేరుకుంటా''

''నీవు కాక నాతో సమానులు ఇంకెవరవుతారు బాబూ''

సామంతుడు తండ్రి కన్నుల్లో అశ్రువులను చూచాడు.

''అదేమిటి నాన్నగారూ?''

''ఏమీలేదు నాయనా! ఇసుక తళతళమంటూ మిరిమిట్లు గొలుపుతున్నది అంతే.''

నాలుగు ఘడియలసేపందరూ విశ్రమించారు రెండు ఒంటెల మీద తినుబండారాలూ, నీరు ఉంచుకున్నాడు తరువాత ఇంకొకసారి పుత్రుణ్ణి కౌగలించుకున్నాడు ఒక ఒంటె మీద తాను కూర్చొని, రెండోదానిమీద ఒంటెవాణ్ణి కూర్చో మన్నాడు తరువాత 'జయసోమనాధ్' విజయ నినాదంతో అంతులేని ఆ ఇసుక సముద్రంలోకి దూకాడు

సముద్రంలో దూకినట్లు, ఆ భయంకరమైన ఎడారిలో తండ్రి దూకడం సామంతుడు చూచాడు. తన తండ్రి ఒంటెను నడిపే ఒడుపును, కూర్చునే తీరునూ చూచాడు. గాలికి రెపరెపలాడుతూ పాయలైపోతూన్న తండ్రి నల్లని గడ్డాన్ని చూచాడు. ఆ తలపాగా ఎంత అందంగా కన్పిస్తోంది ఎంత నేర్పుతో ఆ ఎడారిలో పురోగమిస్తున్నాడు! కంటికి దూరమవుతూన్న తండ్రి స్వరూపాన్ని సామంతుడు గర్వంతో చూస్తూ నిల్చున్నాడు. అలాంటి తండ్రికి జన్మించడమే మహా అదృష్టం ఇక పది పదకొండు రోజుల్లోనో - మహా అయితే పన్నెండు రోజుల్లో పినతండ్రుల మధ్య, అన్నదమ్ముల మధ్య తిరిగి, తన తండ్రి ఒడిలో కూర్చుంటాడు. అప్పుడు రాజస్థాన్ దుర్గాలన్నిటిలోనూ ఈ తండ్రీ కొడుకుల వీరగాధలతో చౌహాను వంశ కీర్తులు వ్యాపిస్తాయి

మిగతా నాల్గు ఒంటెలూ సిద్ధమైనాయి. తండ్రి పురోగమించిన దారిని మరొకసారి చూచి, అతణ్ణి తిరిగి ఒకసారి చూడాలనే కోరికను అణుచుకొని, సామంతుడు ఒంటెలతో తన మార్గాన బయల్దేరాడు

సజ్జన చౌహాన్ ఎక్కిన ఒంటె పేరు 'పదమడి'. సౌరాష్ట్రంలో ఎక్కడా అలాంటి ఒంటె మరొకటి లేదు. సౌంజ్ఞలను గ్రహిస్తుందది. వాయువేగంతో పయనిస్తుంది సజ్జనుడు దానితో ముందుగానే స్నేహం చేసుకున్నాడు. అప్పుడప్పుడు 'పదమడీ' 'సతీ' అని పలకరించేవాడు. అది కూడా పెదవుల ధ్వనితో ప్రత్యుత్తరం ఇచ్చేది

'సోమనాధ దేవుని గౌరవమూ, ఘోఘాబాబు గౌరవమూ నీ మీద వుంది పదమడీ' అన్నాడు సజ్జనుడు.

తానా విషయం ఆకళించుకున్నట్లు మెడ వంచి వేగం హెచ్చించింది

'పదమడీ త్వరగా నడవాలి! ఘోఘాబాబు కులకాంతలు ముత్యాల హారతులతో నీకు స్వాగతమిస్తారు- తెలుసా?'

పదమడి తిరిగి ధ్వనిచేస్తూ మరింత వేగంగా పరుగులు తీస్తున్నది ముత్యాల హారతులందుకోడానికి తొందర పడుతున్నట్లున్నది దాని గతి.

సాయంకాలానికి ఒక దిబ్బ కన్పించింది దాని మీద రెండు చిన్న చెట్లూ, ఒక తాటి చెట్టూ ఉన్నాయి దగ్గరే శిథిలావస్థలో ఉన్న ఒక దేవాలయం ఉన్నది శిఖరం మీద ధ్వజం ఎగురుతున్నది

'మజిలీ చేరుకున్నాం పదమడీ! మజిలీ చేరుకున్నాం నీకు వెయ్యేండ్లు' అని ఆనందాన్ని వెలిబుచ్చాడు సజ్జనుడు

క్షణంలో రెండు ఒంటెలూ దిబ్బమీది కెక్కాయి అక్కడ రెండు మూడు పూరి గుడిసెలు ఉన్నాయి నలుగురైదుగురు ఒంటెల వాళ్ళు మంచాల మీద కూర్చుని ఏవో కబుర్లు చెప్పుకుంటున్నారు నాలుగు ఒంటెలు మోరలెత్తి చెట్ల ఆకుల్ని తింటున్నాయి తమ జాతి మిత్రులు రావడం చూచి ఆ నాలుగు ఒంటెలూ బిగ్గరగా అరుస్తూ స్వాగతం పలికాయి.

సూర్యుడు అస్తమించాడు క్రమేపీ చీకటి క్రమ్ముకుంటున్నది పడమటి అరుణ కాంతులు చుట్టూ వున్న ఇసుకకు ఎర్ర రంగు నద్దుతున్నాయి. నిర్జన ప్రదేశంలో ఆ ఒక్క చెట్టు నిల్చున్నదంటే అది భోలా శంకరుని కృపా విశేషమే అన్నట్లు గోచరిస్తోంది.

సజ్జనుడు ఒంటెను విశ్రమింపచేసి అక్కడే వున్న ఒంటెల వాళ్ళను పిలిచాడు

'ఏవయ్యా! తినడానికేమైనా ఉందా?'

'రండి బాబూ రండి! జొన్నరొట్టె లున్నాయి. చెరువు, బావి కూడా ఉన్నాయి '

అనవసరంగా కాలం వృధా చేయదల్చుకోలేదు సజ్జనుడు. ఒంటెలను పరీక్షించి నీళ్ళు త్రాగించమని 'సోనియా'కు వప్పగించాడు పన్నెండు గడియలు నడిచి మొదటి మజిలీకి చేరినా పదమడి అలసిపోలేదు. రెండో ఒంటె మాత్రం అలసినట్లు కన్పించింది. సజ్జనుడు ప్రేమతో దాని వెన్నున చరిచి పలకరించాడు. కాని దానిలో చురుకుతనం కన్పించలేదు ఒంటెల వాళ్ళను చూచి 'మీ రెందాకా వెళ్ళాలయ్యా!'' అని అడిగాడు

'రేపు ప్రొద్దునే 'హలవదా' వెళ్ళాలండి'

'అయితే మీ ఒంటెల్లో నాకు ఒకటిచ్చి నా ఒంటెను మీరు తీసుకోండి'

'వీల్లేదు బాబుగారూ! అయినా మీరెక్కడికి?'

'నేనా! ఇదిగో ఈ ఎడారి దారిన ఇప్పుడే వెళ్ళాలి'

'ఇప్పుడా! ఈ ఎడారి దాటిపోవడం సాధ్యమా బాబుగారూ?'

'అయితే మీ రెటు నుంచి వచ్చారు?'

'మాకు 'రణథంబీదేవి' మొక్కు ఉంది దానిని చెల్లించుకోడానికి వచ్చాం '

సజ్జనునికి నవ్వు వచ్చింది 'నాకు తక్షణం బయల్దేరవలసిన మొక్కు ఉంది.'

''అయ్యో! బాబూ! ఇక్కడ అమ్మవారు ఆన పెట్టింది ఈ దారిని పోయినవాడు తిరిగి రావడమంటూ ఇంతవరకూ లేదు బాబుగారూ మూడు వందల యోజనాలదాకా చెట్లూ, చేమా, నీరూ, పాడూ ఏమీ లేవని పెద్ద వాళ్ళంటారు ''

''ఫరవాలేదు మీ ఒంటెను ఒకటి యివ్వండి అది చాలు ''

''ఇవ్వడానికి వీల్లేదు బాబుగారూ! ఇవి మా యింటి ఒంటెలు ''

''మీ అంతట మీ రివ్వకపోతే, నా అంతట నేను తీసుకోవాల్సి వస్తుం''దని పిడికిలితో కత్తి పిడిని పట్టుకొని సజ్జనుడు అన్నాడు

''సోనియా! నీవు తిండి తిను నేను స్నానం చేసి, పదమడిని కడిగి తెస్తా తరువాత నీ ఒంటెను కడుగవచ్చు''

''తెల్లవారిం తర్వాత కడుగుతాను బాబూ ''

''నీకేమైనా పిచ్చా? వెన్నెల రాగానే మనం బయల్దేరాలి ''

''కాని ఈ ధా(త్రి- అమ్మవారి ఆనను లెక్కచేయకుండా '' అని సోనియా తన ప్రభావాన్ని వెల్లడించాడు

''భయపడుతున్నావు(ట్రా - ఇది సోమనాధ పరమేశ్వరుని ఆదేశం తెలుసా?'' అని పదమడిని తీసుకొని సజ్జనుడు చెరువుకు వెళ్ళాడు

''ఇక్కడ్నుంచి వెళ్తే ముందేమొస్తుం''దని ఆ నలుగురి వైపు తిరిగి సోనియా అడిగాడు

''మన్నొస్తుంది! మీ యజమానికి పిచ్చి ఎక్కినట్లుంది ఇంతవరకీ దారిన పోయినట్లు ఎన్నడూ మేము వినలే''దన్నాడు ఒక ముదుసలి

''మనుష్యులదాకా ఎందకయ్యా! పిట్టలు ఎగరటం కూడా చూడలేదు ''

''సరేలే ముందు తిందాం పదండి'' అంటూ సోనియా తన జొన్న రొట్టెలు తీసి అందరికీ పంచాడు రణధంబీదేవి పెట్టిన ఆనను అతి(క్రమించి వెళ్ళాలని మొండి పట్టుదల చూపే ఈ ఇద్దరినీ చూస్తుంటే ఆ నలుగురు ఒంటెల వాళ్ళకూ కంపరమెత్తింది అందుకని మూగజీవాల్లా కూర్చున్నారు సోనియా ఏదో మాట్లాడాడు వాళ్లూ అలాగే సమాధానం ఇచ్చారు మధ్య మధ్య ఆ దారిన వెళ్ళవద్దని మాత్రం చెప్తుతూ వచ్చారు

చౌహాన్ వీరుడికివంటే లెక్కేమిటి? సోమనాధ పరమేశ్వరుని ఆదేశాన్ని ఘోఘాబాబు కందించాలి అతను స్నానం చేశాడు పదమడి శరీరాన్ని రుద్ది బాగా కడిగాడు. బావిలోంచి నీళ్ళు తోడి తోలు తిత్తుల్లో పోసి పదమడి వీపు మీద వేశాడు మందిరంలోకి వెళ్ళి రణధంబీదేవి పాదాలకు నమస్కరించి ఒంటెలవాళ్ళను

సమీపించాడు పదమడి గోవులా అతణ్ణి వెంబడించింది స్నేహంతో లాలిస్తూన్న ఈ యజమానికి పదమడి తోడునీడ అయింది

సోనియా మాటామంతీ లేకుండా అన్నం మూట విప్పి సజ్జనుడికిచ్చాడు.

''సోనియా! వాళ్లు ఒంటె నిస్తామంటారా లేదా?'' సోనియా ముఖం పాలి పోయింది ''వాళ్ళు ససేమిరా వీల్లేదంటున్నారు స్వామీ!''

''అయినా, ఇప్పుడు బయల్దేరడం ఎలా బాబయ్యా! రణథంబీ అమ్మవారికి కోపం వస్తే''

''నీవు కూడా భయపడుతున్నావట్రా నేను లేనూ?''

''అమ్మవారికి కోపం వస్తే ఎవరు మాత్రం ఏమి చేయగలరు బాబయ్యా!''

''కోపం రావటమేమిట్రా? కోపం కాదు కృప వర్షిస్తుందను- నాకు తెలుసు.''

''అయినా ఇప్పుడు బయలుదేరడం మంచిదికాదు బాబయ్యా!'' అని సోనియా మొండికెత్తాడు

''ఇప్పుడే తక్షణం బయలుదేరాలి- పో పోయి ఒంటెను కడిగి తీసుకురా వెన్నెల వచ్చే వేళ అయిం''దన్నాడు సజ్జనుడు

సోనియా మూగమొద్దులా అలాగే నిల్చున్నాడు

'కదుల్తావా, కదలవా? అని కళ్ళెర్రజేసి దవడమీద కొట్టడానికి లేచాడు సజ్జనుడు. తక్షణం సోనియా తన ఒంటెను తీసుకొని చిన్న బుచ్చుకున్న ముఖంతో చెరువుకు వెళ్ళాడు.'

సజ్జనుడు తిండి తిని, పదమడిని సిద్ధపరచాడు. మిగతా రొట్టెల్ని మూటగట్టి, నీళ్ళు సరిపోతవో లేదో చూచుకున్నాడు ఇంతలో సోనియా ఒంటెను తీసుకు వచ్చాడు

'ఏమయ్యా! నా ఒంటె నిచ్చి రెండు రూపాయలిస్తా, మీ ఒంటె నిస్తారా?'

'వీల్లేదు బాబుగారూ!' అన్నాడొకడు నిస్సంకోచంగా

'ఒంటెనిచ్చి రెండు రూపాయలా?' రెండోవాడడిగాడు

'వెండి రూపాయలేనా?'

'ఆఆ వెండి రూపాయలే?'

'ఏడు తరాలు సేవ చేసిన ఒంటెను చంపాలని నీకు బుద్ధి పుట్టిందా భద్రా!' అన్నాడొక వృద్ధు

'లేదుబాబోయ్! నా ఒంటె నివ్వను'

'సరే మీ యిష్టం' అంటూ సోనియావైపు తిరిగి 'సోనియా! ఇక నడు, మనం బయలుదేరదాం' అన్నాడు సజ్జనుడు

'బాబయ్యా. '

'ఊ త్వరగా పద' సజ్జనునికి కోపం వచ్చింది కార్తీక మాసం విదియ చంద్రుడు అపుడే ఉదయించాడు. విస్తృతమైన ఆ ఎడారి అంతా రమణీయంగా కన్పిస్తున్నది చల్లని గాలి కూడా ప్రారంభమైంది. రణథంబీ దేవాలయం దగ్గరున్న చెట్టు నిర్మలమైన ఆకాశంలో చిత్రంలోని బొమ్మలా కన్పిస్తున్నది

సజ్జనుడు పదమడి నెక్కాడు సోనియా కొంచెం మందకొడిగా తన ఒంటె నెక్కాడు అక్కడనుంచి కదలడమతని కేమాత్రం ఇష్టంలేదు

'త్వరగా తిరిగిరండి బాబయ్యా!' అని అక్కడ కూర్చున్న యువకుడైన ఒంటె వాడు అన్నాడు.

'జయ సోమనాథ్' అను నినాదంతో సజ్జనుడు ఒంటెను ముందుకు నడిపించాడు వెన్నెలతో ఎడారి అంతా వెలుతురు మయమైంది. చిరుగాలీ, కార్తీక మాసపు చలీ చక్కిలిగింతలు పెడుతున్నాయి పదమడి హుషారుగా నడుస్తున్నది కోడి కూతకు లోపుగా కొన్ని యోజనాలు దాటవచ్చునని సజ్జనుడు అనుకున్నాడు కాని, ఆ ఒంటెలవాళ్ళు చెప్పిన మాటలను బట్టి సోనియా తన ఒంటెమీద గజగజలాడుతూ కూర్చున్నాడు. ఈ దారిలో అతడెప్పుడూ ప్రయాణం చేయలేదు పైగా అమ్మవారి మనసు నొప్పించి వచ్చాడు. కనుక అమ్మవారి కోపానికి బలికాక తప్పదని అతని విశ్వాసం. రౌతు మనస్సును కనిపెట్టినట్లే సోనియా ఎక్కిన ఒంటె కూడా చాలా నిదానంగా నడుస్తున్నది.

'సోనియా! ఉరికించు' అంటూ సజ్జనుడు పదేపదే హెచ్చరిస్తున్నాడు

సోనియా ప్రత్యుత్తరం ఇవ్వడం కూడా మానుకున్నాడు ఒకసారైతే సజ్జనుడికి మరీ కోపం వచ్చింది. తన ఒంటెను వెనక్కి నడిపించి, సోనియా ఎక్కిన ఒంటెను రెండు మూడు దెబ్బలు గట్టిగా కొట్టాడు. ఒంటె కూడా సోనియా గుణం అలవర్చుకున్నట్లు, దెబ్బలు పడగానే మొండికెత్తి అక్కడే కూలబడ్డది

'దిగరా సోనియా! దీని విషయమేమిటో తేలుద్దాం' అని పదమడి మీదినుంచి దిగి ఒంటెను చావబాదాడు ఎంతో కష్టం మీద అది తిరిగి లేచింది. సజ్జనుడు పదమడి నెక్కి రెండో ఒంటెను త్వరగా నడిపించేందుకు అదిలించడం మొదలుపెట్టాడు

ఈ మొండితనం చూపుతున్నది సోనియాయే కానీ ఒంటె కాదని సజ్జనుడు గ్రహించాడు. ఒంటె రౌతు ఆజ్ఞలనే మౌనంగా అనుసరిస్తున్నది 'నీవు పదమడి మీద కూర్చో సోనియా నేను దాన్నెక్కుతా. ఎందుకు పోదో చూద్దాం.'

'వద్దులెండి బాబుగారూ! ఇదిగో - వేగంగానే పోతుందిక' అంటూ సోనియా ఒంటెను పరుగెత్తించాడు. సజ్జనుడు వెనకపడిపోయాడు కాని కొద్దిసేపట్లోనే కలుసుకొని అది సరిగానే నడుస్తున్నది గదా అని అనుకొని ఆ ఒంటెను దాటి ముందుకు వెళ్ళాడు ఇంతలో సోనియా ఒంటె మళ్ళా మందగించింది

'నడిపించు! త్వరగా నడిపించరా' అన్నాడు వెనక్కుచూచి కాని ఆ ఒంటె అడ్డం తిరిగి నిల్చున్నది సజ్జనునికి కోపం ఆగలేదు వెనక్కు తిరిగి సోనియాను చావబాది 'పాడువెధవా! నీకే రావాలని లేదన్నమాట' అన్నాడు

'కాదు బాబూ! కాదు బాబూ!' అంటూ సోనియా ఒంటెను కొట్టాడు దాంతో ఒంటె లేచి గిరుక్కున వెనక్కు తిరిగి పిక్కబలం కొద్దీ రణధంబీ దేవాలయంవైపు పరుగెత్తడం మొదలుపెట్టింది. ఆ నడక ముందు పదమడి కూడా నడవలేదనే చెప్పాలి.

దూరమవుతున్నకొద్దీ సోనియా ఒంటె ఎగురుతూన్న ఒక నల్లటి మచ్చలా కన్పించింది కనుబొమ్మలు చిట్లించి దానివైపే చూస్తూ సజ్జనుడు నిల్చున్నాడు వెనక్కు వెళ్ళి సోనియాకు బుద్ధి చెప్పాలనిపించింది కాని కోపాన్ని ఆపుకున్నాడు

''పదమడీ! కైలాసనాధుని పని ఇక మనమీదే ఉంది తల్లీ''

అయిదవ ప్రకరణం

# గజనీ మహమ్మద్

## 1

బహుళ చవితి వెన్నెలలు అంతులేని ఆ ఎడారి అంతటా ఆనంద కాంతుల్ని వెద జల్లుతున్నాయి. సముద్రపుటలలవలె ఇసుక కూడా మెరుస్తున్నది చల్లని గాలిలో పదమడి ముసుగు మెరుస్తున్నది సజ్జనుడు ఏవో గీతాలు పాడుకుంటున్నాడు అతని గుండె ఆ పాటల లయకు నర్తిస్తున్నది చౌహాన్‌వీరులు అజేయులని అతనికి ప్రగాఢమైన విశ్వాసం ఘోఘాబాబు సంతానం ఎన్ని యుద్ధాల్లో పాల్గొనలేదు? ఇక ఈ మ్లేచ్ఛు డొక లెక్కా?

ఉత్తరాన ధృవ నక్షత్రం చుట్టూ వెలుతురు వ్యాపిస్తున్న వైపుకు సజ్జనుడు తన ఒంటెను నడిపించాడు అందమైన రాత్రి గతిస్తూన్నది పదమడి నడక కొద్దిగా మంద గించింది అతడు కూడా ఒంటె మీద ఒక నిద్ర తీసాడు అర్ధరాత్రి దాటింది ధృవ నక్షత్ర పరిసరాల్లోని వెలుతురు కూడా సన్నగిల్లింది ప్రభాత వాయువుల స్పర్శతో సజ్జనుడు ఒకసారి హుంకరించి ఒంటె ముగుదాడు చేతిలోకి తీసుకున్నాడు. తెలివిగలది కనుక పదమడి వడిగా నడక ప్రారంభించింది

ఒంటెల వాళ్ళన్నంతగా నిరాశాజనకంగా లేదా దారి ఎక్కడో ఒకచోట ఒక దిబ్బ నాల్గు చెట్లు కన్పిస్తూనే ఉండేవి సజ్జనుడు వాటి క్రింద కొంత విశ్రమించి, ఇంత తిని, నీళ్లు త్రాగి, పదమడికి కూడా మేత పెట్టేవాడు ఎడారిలో నేరుగా వెళ్తే దోపిడీ దొంగ లుంటారని అతడు విన్న మాటల్లో కొంత నిజాయితీ వుండవచ్చుననిపించింది

రెండో రోజూ, మూడో రోజూ సక్రమంగానే గడిచాయి పదమడికి దారిని పసిగట్ట గల నేర్పు వున్నది. కనుక త్వరగా ఏదో విశ్రాంతి స్థలం కన్పిస్తూనే ఉండేది నాల్గోరోజు మధ్యాహ్నానికి పదమడి అలసినట్లగుపించింది ఎండ కూడా తీక్షణ మవుతున్నది నాలుగు వైపులా ఇసుక సుళ్ళు లేవడం మొదలు పెట్టింది ఎక్కడా నీడ అనే మాట కన్పించలేదు ఎన్ని ఘడియలు గడిచినా కనీసం ఒక పక్షి కూడా ఎగురుతున్నట్లు కన్పించలేదు

ఇసుక మీద అన్నివైపులా ఎండ మెరుస్తున్నది సజ్జనుడి కండ్లు మిరుమిట్లు గొలి పాయి. శరీరం చమటతో తడిసి ముద్దయింది నలువైపులా చిచ్చుపెట్టినట్లు వడగాలి వీస్తున్నది సజ్జనుడి మనస్సులో అనుమానం కలిగింది ఈ దారి సరియైనదేనా? ముందు విశ్రాంతి స్థలం, నీళ్లూ అసలు దొరక్కపోతే మన గతేమిటి? అయినా

మహాదేవుని ఆదేశ పాలన కోసం కదా వచ్చింది మరి చౌహానులకు పరమేశ్వరునిపట్ల విశేషమైన విశ్వాసం ఉన్నది మ్లేచ్ఛుని ఆపడానికి వెళ్ళేటప్పుడు వెనుకడుగు వేయడం దేనికి? 'పరమ శివుడుండగా మనకిక భయమేమిటమ్మా పదమడీ?'

కాని నేడు పదమడి గాభరాపడుతున్నది మునుపటి చురుకుదనం నడకలో కన్పించటం లేదు

'పదమడీ! నీవు ఓడిపోయినావు సుమా' అన్నాడు సజ్జనుడు

ముట్టెతో ధ్వని చేసి కాదన్నది పదమడి అయినా మునుపటి చురుకు కన్పించలేదు సజ్జనుడు దాన్ని కాస్త విశ్రమింపజేసి నీళ్ళు త్రాగించాడు మెడను కౌగిట్లో పొదువుకొని సూర్యుడు అస్తమించేవరకు తన శరీరంతో పదమడి కన్నులకు నీడ నిచ్చాడు సాయంకాలానికి పదమడికి కొంచెం చురుకు పుట్టింది సజ్జనుడు ప్రయాణమయ్యేసరికి కొంచెం చల్లని గాడుపు కూడా ఆరంభించిందేమో, మునుపటి స్ఫూర్తి లభించింది ఒంటెకు

కాని, కటిక చీకటిలో ఎక్కువ దూరం నడవలేకపోయింది చంద్రోదయం తర్వాత మాత్రం చాలా దూరం నడిచింది

## 2

అయిదోరోజు సూర్యోదయంనుంచే వడగాలి మొదలైంది ప్రొద్దెక్కుతున్నకొద్దీ, గాలి దుమారంగా మారింది ఇసుక దుమారం సూర్య కాంతికి నిప్పుతో చేసిన మహా స్తంభాల్లా ఎగురుతున్నది సజ్జనుడికి గానీ, పదమడికి గానీ కండ్లు తెరవడమే అసంభవ మైంది రెండు జాములకల్లా అన్ని వైపులా సలసల మండే ఇసుక ఎగురుతూ కండ్లలో పడుతూండేసరికి ముందుకు నడక సాగలేదు. సజ్జనుడు పదమడిని పరుండబెట్టి, దాని మెడను కౌగిలించుకొని, దాని శరీరంతో తన ముఖాన్నీ, తన శరీరంతో దాని కండ్లను కప్పి, ఏదోవిధంగా మధ్యాహ్నాన్ని గడిపారు పదమడి తనపై యజమాని చూపే ప్రేమకు కరిగిపోయి సజ్జనుడి ఒడిలో మేకపిల్లవలె ఒదిగివున్నది

మధ్యాహ్నం దాటగానే వడగాలి ఆగిపోయింది సజ్జనుడు ఒంటె మీద బయలు దేరాడు అప్పటికే అతని నిబ్బరమైన గుండెలో భయం ప్రవేశించింది ఇలాగే మరో మూడు రోజులు గడిస్తే ఎలా? ఈ దారి సరైనదైతే రెండు మూడు రోజుల్లో విశ్రాంతి స్థలం రావల్సిందే కాని మరి రాలేదు ఎందుచేత? తను దారి తప్పలేదు కదా! ఎడారిలోపడి దాహంతో, వడగాలితో అలమటించి చచ్చే మనుష్యుల గతే తనకూ పట్టదుకదా!

రాత్రికల్లా పదమడి శిథిలమైపోయింది సజ్జనుడూ బాగా అలసి పోయాడు పదమడి పక్కనే పడుకొని నిద్రపోయాడు కాని ఇంతలో పదమడి లేచి భయంతో ఎగరడం మొదలు పెట్టింది సజ్జనుడు ఉలిక్కిపడి లేచాడు తెల్లవార వచ్చింది ఒంటె కండ్లు పెద్దవిచేసి, ముక్కుపుటాలుబ్బించి ఎగురుతున్నది.

'ఏవిటమ్మా! ఏమిటిది- నీ కేమైనా పిచ్చా?' పదమడి భాష నతడు అర్థం చేసు కున్నాడు. అక్కడ్నుంచి త్వరగా వెళ్ళాలని అది తొందరపడుతున్నది. సజ్జనుడు వెంటనే ఎక్కి ఉత్తరంగా నడిపించ జూచాడు. కాని అది కదల్లేదు సజ్జనుని లాలింపుల్నీ, కోపాన్నీ లెక్కచేయలేదు ఉత్తరంవైపు ససేమిరా నడవనన్నది లాలించి లాలించి విసిగి సజ్జనుడు రెండు దెబ్బలు వేసేసరికి, బాధతో మూల్గుతూ అతని ఆజ్ఞను లెక్కచేయకుండా తూరుపు వైపు పరుగెత్తింది ఉత్తరం నుంచి ఏదో ఆపద రాబోతున్నదని పసిగట్టే ఇలా పరుగెడుతున్నదని సజ్జనుడు చివరకు గ్రహించాడు

'శంకరా! నీ వేది సంకల్పించినా మంచికే స్వామీ!' అని గొణుక్కుంటూ, పుత్రుణ్ణి తనతో తీసుకొని రాకపోవడం ఎంతో మంచిదైందని మాత్రం అనుకోగలిగాడు తూర్పుగా అలా రెండు మూడుసార్లు మహా వేగంగా పదమడి వేగంగా పరుగెత్తుతుంటే సజ్జనుడికి అసలు రహస్యం తెలిసింది అతని వెనుకవైపు వాయువ్య మూలగా ఇసుక సుళ్లు లేస్తున్నట్లు కన్పించింది

''శివ-శివ! వెయ్యేండ్లు వర్ధిల్లు పదమడీ! నాకు ప్రాణ దానం చేశావీరోజు'' అంటూ పదమడిని అరచేతితో కొట్టి తన ప్రేమను వెల్లడించాడు

సూర్యుడు పైకి వస్తున్నకొద్దీ ఇసుక దుమారం పైకి లేస్తున్నట్లు కన్పిస్తున్నది పదమడి పంచప్రాణాలన్నీ బిగబట్టి తూర్పు వైపుకు పరుగెడుతున్నది సజ్జనుడు కూడా తన ప్రాణాలన్నీ పదమడి చేతుల్లో పెట్టాడు ఒంటె వేగం తగ్గితే వెనుక నుంచి తరుము కొని వస్తూన్న ఆ దుమారంలోంచి తప్పుకొనే మరో మార్గమే లేదు ప్రభాస నగరాన్నుంచి బయలుదేరి నాటికి పన్నెండు రోజులైనా పదమడి నూతన శక్తితో పరుగెడుతున్నది ఎడారి నెరిగిన ప్రాణి గనుక ఎడారిలోని భయాలు కూడా దానికి తెలిసినవే మేఘాలు క్రమ్ముకొంటున్నట్లు, వెనుకవైపు నుంచి ఆకాశమంత ఎత్తున ఇసుక దుమారం తరుము కుంటూ వస్తున్నది.

సజ్జనుడి సాహసం సడలి ఆశను కోల్పోయింది పదమడి ఎంతసేపని పరుగెడు తుంది? ఎక్కడికని పరుగెడుతుంది? ముందు చూడబోతే అంతులేని ఇసుక గుట్టలు, వెనుక యమునిలా ప్రాణాలు తీయడానికి వస్తూన్న ఇసుక దుమారం ఈ రెంటి మధ్యా

ఇక చావు తప్పదు సూర్యుడు నడినెత్తికి వచ్చాడు ఎదురుగా ఇసుక మెరుస్తూ కండ్లను మూసేస్తున్నది గాలి నిప్పులు చెరుగుతున్నది అప్పటికీ తిండీ, తిప్పలూ, విశ్రాంతీ లేకుండా పదమడి శ్రావణ నిర్ఘరణిలా ముందుకు పరుగెడుతూనే వున్నది

వెనక్కు చూస్తే ఆ దుమారం ఇంకా తరుముకొని వస్తున్నట్లే కన్పించింది ఒకసారి మాత్రం పెద్ద ఇసుక గుండంలో చిక్కుకుంటూ తప్పించుకొని దక్షిణం వైపుకు పదమడి పరుగెత్తింది కాని, అటు కూడా మృత్యుదేవత మ్రింగడానికి వస్తున్నట్లు కన్పించింది

ఉండి ఉండి ఒక్కసారిగా ఇసుక ప్రాణాలతో లేచి గిరగిర తిరగడం మొదలు పెట్టింది సలసల మండే ఇసుక రేణువులు గిరగిర తిరుగుతూ పెద్ద పెద్ద కుప్పలుగా పైకి లేస్తున్నాయి మహా స్తంభాలలా ఆకాశాన్నందుకుంటున్నాయి పదమడి భయంతో కూలబడి పోయింది సజ్జనుడు దాని మెడను పెనవేసుకొని, దాని ముక్కుల్లోంచి, కండ్లల్లోంచి, చెవుల్లోంచి ఇసుక దులిపి, తన ముఖాన్నీ తుడుచుకున్నాడు. ఇక ఈ సుడిగాలినుంచి బ్రతికి బైట పడడం అసంభవమే చనిపోయేటప్పుడు సజ్జనుడు తన మృత్యు సహచరిని ప్రేమతో లాలించాడు ఎటు చూచినా ఇసుక . ఇసుక ఇసుక దశ దిశలా ఎగురుతూ, ధగధగ మెరుస్తూ, నిప్పులు చెరుగుతూ, ప్రాణాలు అన్ను బట్టేట్టు, సూర్యగోళం బ్రద్దలై నేలరాలిన అగ్ని కణాలవలె ఇసుక ఒక మహా స్తంభాకారంగా సెగల నెగజిమ్ముతూ మహా చితాగ్ని జ్వాలల్లా కన్పిస్తోంది సజ్జను డొకసారి సోమనాథుణ్ణి స్మరించుకున్నాడు స్మృతి వీధిలో కన్పిస్తున్న సామంతునికి వీడ్కోలు నిచ్చాడు

కాని, ఇసుక సుడి వచ్చింది వచ్చినట్లే పోయింది గిర గిర తిరుగుతూ స్తంభాకారంగా పైకి లేచివచ్చిన ఆ ఇసుక దుమారం అతనిమీది నుంచే వెళ్ళిపోయింది. కండ్లు తెరచి చూచేసరికి ఆ అగ్ని స్తంభాలు దూరంగా ముందు వైపుకు పరుగెత్తుతున్నట్లు కన్పించింది

''బ్రతికి బైటపడ్డాం తల్లీ! . శంకరు డనుగ్రహించాడు పదమడీ!'' అంటూ ఒంటె ముఖం మీద ఇసుకను దులుపుతూ వెనక్కు తిరిగి చూచేసరికి, అసలు ఇసుక దుమారం ఇంకా వెనుకనే ఉన్నట్లు కన్పించింది ఇప్పటిదల్లా ఒక రుచిచూపి వెళ్ళింది అంతే ఎంత కుశాగ్రబుద్ధి పదమడిది! దానివల్లనే ఇసుక దుమారం నుంచి తప్పించుకోవడం జరిగిందా రెండు ప్రాణాలకూ. మృత్యుముఖం నుంచి బైటపడ్డ తర్వాత, తెలియని మార్గాన ఘోఘా దుర్గం వెళ్ళడం సాధ్యంకాదని సజ్జనుని నీరసపడిన హృదయానికి విశ్వాసం కుదిరింది మొండి పట్టుదల వదిలి, తేలిక మార్గంలో ముందుకు సాగిపోయాడు

సూర్యాస్తమయానికి తుఫాను తగ్గింది పదమడి ఆగి నాలుగు వైపులా ముక్కుతో వాసన చూచింది కొద్దిసేపట్లో చీకట్లు వ్యాపించాయి నిర్మలాకాశంలో చుక్కలు మెరుస్తు న్నాయి. పదమడి ఆనందంతో అరవడం మొదలుపెట్టింది

''భేష్ పదమడీ! భేష్!'' అంటూ సజ్జనుడు దానిని లాలిస్తూ, బుజ్జగించాడు రాత్రి గాడ్పులు వీస్తున్నాయి దాని మెడను పెనవేసుకొని కౌగలించుకున్నాడు ఆ రోజు పదమడి కాబట్టి సరిపోయింది లేకపోతే తను జీవించి ఉండడం కల్ల

సజ్జనుడు కూడా బాగా అలసిపోయాడు అందుకని అతడు కూడా పదమడి పక్కనే కాళ్ళుచాచి విచారాన్ని పరమేశ్వరాధీనం చేసి, గురక పెడుతూ నిద్రపోయాడు

## 3

ఉత్తర దిశలో నేరుగా వెళ్తే ఘోఘాదుర్గం తప్పక వస్తుందని మొదట సజ్జనుడు అనుకున్నాడు కాని ఇసుక దుమారం వల్ల తానిప్పుడెక్కడున్నదీ తనకే తెలియదు ప్రాణాల మీదకు వచ్చినప్పుడు ఇలా మూర్ఖంగా తెలియని దారిలో ఎందుకొచ్చినట్లు? సపాదలక్షకు ఎటు దారి? సురసాగరం ఎటు వైపుంది? ఝాలోర్ ఎక్కడ ఉంది?

అతనికి పరమేశ్వరుని మీద అమితమైన విశ్వాసం ఉన్నది కనుక జరిగినదంతా తన మేలుకేనని భావించాడు ఇలా ఘోఘా బాబు కూడా ఎన్నో బాధలు పడ్డాడు ఇప్పు డాయన పుత్ర పరివారం మధ్య శాంతంగా, గౌరవంతో వృద్ధాప్యపు ఆవలి తీరాన కూర్చుని తన పూర్వ పరాక్రమాలను వర్ణిస్తూ కాలక్షేపం చేస్తున్నాడు తను కూడా ముందు ముందు ఇలాగే ఘోఘాదుర్గంలో కూర్చుని ఈ పదమడి ప్రదర్శించిన పరాక్రమాన్ని తన పరివారానికి వర్ణించి చెబుతాడు అప్పుడు ఆనాటి వీరులంతా 'ఇంతటి సాహసం ప్రదర్శించడం సంభవమేనా?' అని నమ్మనైనా నమ్మరు గర్వంతో సజ్జనుడు మీసాలు మెలిత్రిప్పాడు ఘోఘాబాబు యవ్వనంలో చేసిన పరాక్రమాలను వందిమాగధులు నేడు పాడుతుంటారు అలాంటి పౌరుషాన్నే తానూ ఈనాడు ప్రదర్శించాడు

సామంతుడు ఝాలోర్ చేరే ఉంటాడు తాము వెళ్ళిన ఎనిమిది రోజులకు గాని అతను రాడు అప్పుడు ఆ పితృ భక్తికి హృదయం గర్వంతో ఎంత సమున్నతమవు తుందో? తరువాత . భార్య దగ్గర కూర్చుని, పరస్పర ప్రేమలో లీనమై ఈ వీరగాధను పదే పదే ఆమెకు వినిపిస్తాం.

మరి సామంతుని తల్లి తన అర్ధాంగి కూడా నిజమైన చౌహాన్ వంశపుదే తానింతకు తక్కువైన పౌరుషాన్ని ప్రదర్శించి ఉంటే సహించగలదా? . .

ఇక ఘోఘాబాబుకు తను ప్రియాతి ప్రియమైన పుత్రుడు సజ్జనుడి వయస్సులో తను కూడా అచ్చంగా సజ్జనుడి వలెనే ఉండేవాణ్ణని ఆయన అంటూండే వారు తను కూడా తండ్రి వయసులో తండ్రి వలెనే ఉంటానని అనలేదూ!

ఇలా సజ్జనుని ఊహాప్రపంచంలో భావాలు దొరలిపోతున్నాయి పదమడి తనకు తోచినట్లు నడుస్తున్నది ఎడారి అంతా శాంతించింది

ఎనిమిదో రోజు ఒక దిబ్బ, నాలుగు చెట్లూ కనిపించేసరికి సజ్జనుడు ఉత్సాహంతో హుంకరించాడు పదమడి చెప్పకుండానే అటువైపు పరుగెత్తింది దిబ్బమీద నర వాసన అంటూ లేదు కాని అదృష్టంకొద్దీ ఒక బావి, కావలసినన్ని నీళ్లు కన్పించాయి వాటిని చూచేసరికి సజ్జనునికి ప్రాణం లేచివచ్చింది నీళ్ళు తోడి పదమడికి పోసి, తాను తనివితీరా తాగాడు చాలా రోజుల తర్వాత నిశ్చింతగా స్నానం చేసి, పదమడి శరీరాన్ని శుభ్రంగా తోమాడు ఒంటెకు కూడా నాల్గు పచ్చని ఆకులు కన్పించాయి ఒంటె ఆ ఆకులు తిని అరమోడ్పు కనులతో నెమరువేసింది తదనంతరం ఆ రెండు ప్రాణాలు ప్రేమతో ఒకరి కొకరు తోడుగా నిశ్చింతగా నిద్ర కొరిగాయి

ఈ మృగ, మానవుల ప్రేమకు కరిగి ఆకాశంలోని తారకలు సుమన కిరణాలను వర్షించాయి తెల్లవారుఝామున సూర్యుడు ఉదయించగానే సజ్జనుడు అదిరిపడి లేచాడు. మాతృప్రేమతో పదమడి అతణ్ణి రక్షిస్తూ ఆనందాన్ని ప్రకటించింది

''ఇంకా ఎన్నో మజిలీలు దాటాలి పదమడీ'' అంటూ తోలుతిత్తుల్లో నీరు నింపి -దారి వెతికే పని పదమడికే వదిలి నిశ్చింతగా దాని మీద కూర్చున్నాడు

తొమ్మిదోరోజు తేలికగానే గడిచింది కాని ఉత్తరంవైపు బదులు పడమటి వైపుగా, ఘోఘాదుర్గానికి దూరంగా వెళ్తున్నట్లు ఆ రాత్రి స్ఫురించింది ఉత్తరంవైపు ఒంటెను నడిపించాలని ప్రయత్నించాడు కాని ఒంటె ఒక్క అడుగైనా అటు వేయలేదు మహా దేవుణ్ణి స్మరించుకుంటూ తుదకు తన భారాన్నంతా ఒంటెకు వదిలిపెట్టాడు అతను ఎప్పుడో పరాజయం పొందాడు ఇది తెలిసిన విషయమే ఇక ఏదో ఒక తేలికదారి దొరికితే అదే పదివేలని అతని భావం

ఎడారిలో పదవరోజు మొదలైంది అక్కడక్కడా మజిలీలు కన్పిస్తున్నాయి తేలిక మార్గంలో పడ్డట్టున్నది ఇక ప్రాణభయమంటూ లేదు గజనీ మ్లేచ్ఛుడు ఎక్కడ ఉన్నాడో? అయినా ఘోఘాబాబు నెదిరించడం సాధ్యమా? అతను కూడా దారిలో రాజులను హెచ్చరిస్తూనే వచ్చాడు సోమనాథుని మీద పగబూనినవాడు ఈ ఎడారి దాటి రాగలడా?

ఎడారిలో కాలుపెట్టి నాటికి పదకొండో రోజు. ప్రభాసనగరం నుంచి బయలు దేరి పదునెనిమిది రోజులైంది ఎడారిలో పెరిగే చెట్లు అక్కడక్కడా కన్పిస్తున్నాయి సపాదలక్ష వైపు వెళ్తున్నట్లతనికి కనిపించింది కొంత దూరం వెళ్ళాక పదమడి ఒక్కసారి మహావిపరీతంగా పెద్దగా అరిచింది సజ్జను డన్ని వైపులా చూచాడు మూడు మేఘాలు- మహా నల్లనివి-చిన్నవి ఆకాశాన్ని ఆవరిస్తూ కన్పించాయి. చూస్తుండగానే అవి మేఘాలు కావు ఏవో పక్షుల గుంపు లనిపించింది క్షణం తరువాత వేల సంఖ్యలో గ్రద్దలు మూడు గుంపులుగా, మహాకఠోరంగా అరుచుకుంటూ తూర్పు వైపుకు ఎగిరిపోయాయి సజ్జనుని హృదయం వణికిపోయింది ఒకసారి యుద్ధభూమిలో పోరాటం జరిగిన మరునాడు అత నిన్ని గ్రద్దల్ని చూచాడు ఆ తరువాత అంత గుంపును ఎన్నడూ చూచి ఎరుగడు - దగ్గరే ఏదైనా యుద్ధం జరిగిందేమో?

దూరంగా ఎగిరిపోతున్న గ్రద్దల అరుపులు అతని చెవుల్లో ప్రతిధ్వనించాయి ఇవన్నీ తన కపశకునాలే !

''పదమడీ! ప్రాణాంతకమైన యుద్ధం జరుగుతున్నది తల్లీ!''

పదమడి కూడా గ్రహించి గ్రద్దలు ఎగిరిపోయిన వైపుకే వడివడిగా నడిచింది.

## 4

కొంతసేపటికి పదమడి మళ్ళీ వికృతంగా అరిచింది. ఆ అరుపులో ఎంత భయం ఉన్నది!

'పదమడీ! ఏంతల్లీ! ఎందుకు భయం!' అంటూ అతను ఒంటెను చరుస్తూ లాలించాడు కొన్ని నిమిషాలు ముందుకు నడవగానే శవాల దుర్గంధం గుప్పున వచ్చేసరికి పదమడి అరుపుకు కారణం తెలిసింది

అక్కడే ఉన్న ఒక దిబ్బనెక్కి- ఒంటె నిలువునా వణుకుతూ ఆగిపోయింది.

దిబ్బకింద కొంత దూరాన ఒక పెద్ద గ్రద్దల గుంపు కన్పించింది. ఉత్తరంనుంచి దక్షిణం వరకు కనుచూపు మేర ఎక్కడ చూచినా గ్రద్దలు భూమిమీదో, ఎగురుతూనో కన్పించాయి సజ్జనుడు కారణం ఊహించుకున్నాడు అతని కండ్లు తిరిగాయి ఆ మూల నుంచి ఈ మూలవరకు సగమో పూర్తిగానో ఇసుకలో పూడుకొని పోయిన శవాలకు మధ్యగా ఒక దారి ఏర్పడి ఉన్నది అటునుంచి వెళ్ళిన ఏదో మహాసైన్యం చేసిన పనే కావచ్చు నిదంతా!

ఒంటె ముందుకు నడవలేదు సజ్జనుడు దిగి ఒంటె ముగుతాడు పట్టుకొని ముందుకు నడిచాడు దారిలో అడ్డంగా కూర్చున్న గ్రద్దలను ఎగరకొట్టాలని ప్రయ

త్నించాడు కాని- అవి మత్తుగా ఉన్నాయేమో - ఇతణ్ణి లెక్కపెట్టలేదు- కొన్ని మాత్రం లేచి ఆకాశంలో గిరగిర తిరుగుతున్నాయి- కాని దీనివల్ల శవాలు- ఎలాంటివో తెలుసుకో గలిగాడు ఏనుగులు-గుఱ్ఱాలు- ఒంటెలూ- మనుష్యులూ- అన్నీ ఉన్నాయి ఆ శవాల్లో - అత డూహించింది యదార్థమే యుద్ధావశేషాలు కావవి ముందుకు నడుస్తున్న ఏదో ఒక సైన్యం తాలూకు ప్రాణులు కాని ఇన్ని చచ్చినా ముందుకు నడుస్తూన్న సైన్యం ఎంత పెద్దదో!

ముక్కుపుటాలు అదిరే ఆ దుర్గంధాన్ని కూడా లెక్కచేయక ఎంతో సాహసంతో ఆ దారినే నడిచాడు ఇంత సైన్యం ఎవరిదో? సపాదలక్షది మాత్రం ఎన్నటికీ కాదు ఝాలోర్, చిత్తోడులదీ కాదు అయితే గజనీ మహమ్మదు సైన్యం కాదుకదా? అతడు ఆ పాడుదారికి కొంత ఎడంగా అటే నడుస్తున్నాడు పదమడికి ఈ భయానక దృశ్యం నుంచి దూరంగా వెళ్ళాలన్న ఆరాటం హెచ్చింది

ప్రొద్దుగూకే వేళకి ఒక గ్రామం కన్పించింది ఇక ఈ భయంకరమైన ప్రయాణం అయిపోయిందనే ఆశతో అతడు గ్రామంవైపు నడిచాడు ఇరవై, ముప్పై చెట్ల నీడల్లో ఉన్న ఒక చిన్న గ్రామం గ్రామం ఎలాంటి దైతేనేమి, రాత్రి హాయిగా నిద్రపోవచ్చు ననుకుంటూ గ్రామంలో ప్రవేశించాడు కాని గ్రామంలో నరసంచారం కానీ, ఒక పశువు కాని కన్పించ లేదు తలుపులన్నీ తెరచివున్నాయి దాదాపు అన్ని ఇండ్లూ శిథిలమైనాయి గుడి ముక్కలై, రాతి చెక్కలన్నీ చెదరువాటుగా పడివున్నాయి చెట్లకు ఒక్క ఆకైనా మిగల్లేదు! చెరువంతా బురద బురద! నలువైపులా పశువుల త్రొక్కిడి కనిపించింది బావిలో చేరెడు లోతున నీళ్ళు మాత్రమే మిగిలాయి ఆ పాడు సైన్యం అటు పోతూ పోతూ ఈ గ్రామాన్ని ఇలా నేలమట్టం చేసింది

భయమంటూ ఎరుగని సజ్జనుడు కూడా నిశ్చేతనమైన ఈ మృత్యు తాండవాన్ని చూచి వణకిపోయాడు యంత్రంలా అందినన్ని నీళ్ల తోడి స్నానంచేసి పదమడిని కూడా కడిగాడు అతని కేమీ తినబుద్ధి కాలేదు చెట్లకు మిగిలిన ఆ నాలుగాకులను తినమని పదమడిని విడిచివేశాడు చీకటి పడగానే ఆ ఎడారి గ్రామంలోని నిర్జన దృశ్యం అతణ్ణి కలవరపెట్టింది. కలవరపాటుతో మహాదేవుణ్ణి స్మరిస్తూ ఆ రాత్రి గడిపాడు

వేకువనే లేచి కుప్పలుగా శవాలు పడివున్న దారినే బయలుదేరినప్పుడు, ఈదారికాక మరోదారిన పారిపోవాలనిపించిం దతనికి అయినా ఈ మహా సైన్యం ఎవరిదో అంతు తెలుసుకోవాలనే కోరిక మాత్రం చావలేదు ఘోఘాదుర్గం- సపాదలక్ష- ఏమైనాయో ఊహించడానికే అతనికి ధైర్యం లేదు.

## 5

అలా సజ్జనుడు నాల్గైదు ఘడియలు నడిచిన తర్వాత ఎదురుగా ఎగురుతున్న దుమ్ము కనిపించింది అవేవో గుఱ్ఱాలు! పదమడి పరుగెత్తటానికి వెనక్కు తిరిగింది కాని ఇంతలోకే ఆ ఒంటెలు కూడా సమీపించాయి ప్రత్యుత్తరంగా సజ్జనుడు కూడా ఒక కేక పెట్టి పదమడిని ఆపాడు

ఆ వచ్చిన ఒంటెలు ఏడు అయిదింటి మీద మ్లేచ్ఛులు కూర్చున్నారు.

పెద్ద పెద్ద కన్నులు కర్కశత్వాన్ని కురిపిస్తున్నాయి పొడుగు గడ్డాలు కూడా ఉన్నాయి ఏవో కొత్త ఆయుధాలు ధరించారు చర్మాన్ని కట్టుకున్నారు. ఆకారాలన్నీ మహా భీకరంగా వున్నాయి. రెండు ఒంటెల మీద ఒంటెలవాళ్ళున్నారు ఈ దళ నాయకుడైన మ్లేచ్ఛుడు మదించిన యౌవ్వనంలో ఉన్నాడు. ఎర్రని శరీరం అతనిది. అతనేదో అనే సరికి ఆ భటులంతా సజ్జనుణ్ణి అన్ని వైపులా చుట్టుముట్టారు

నాయకుని ఆజ్ఞతో ఒక ఒంటెవాడు 'ఈ దారంతా నీకు తెలుసా?' అని అడిగాడు అతని గొంతులో తిరస్కృతి కన్పించింది అయినా అవమానాన్ని దిగమ్రింగి 'తెలుసు- అయినా మీరెవరు?' అని అన్నాడు

ఒంటెవా డీమాటలు నాయకునికి చెప్పాడు విని అతను పెద్దగా నవ్వాడు 'మేమెవ రమో నీకిప్పుడే తెలిసిపోతుంది కాని గుజరాతుకు వెళ్లడానికి సూటిదారి ఏది' అని అడిగించాడు

'ఎవరూ! వెళ్ళేది?' అన్నాడు సజ్జనుడు

'మేమే'

సజ్జనునిలో ఏదో ఒక మహాప్రేరణ కలిగింది ఈ మ్లేచ్ఛుడు గుజరాత్ వెళ్తాడా? సోమనాధ మందిరాన్ని ధ్వంసం చేయడానికి.. వీడు . అందుకే సోమనాధుడు తన నీదారిలో పంపాడు ఈ విషయం ఆలోచించుకుంటూ అతడు పెద్ద పెట్టున నవ్వుకున్నాడు . ఈ గజనీ మ్లేచ్ఛుణ్ణి నిండు ప్రాణాలతో తెగనరకమని సోమనాధు డాదేశించాడు కదూ! మరి ఆ ఆదేశాన్ని నెరవేర్చడానికి ఇంతకు మించిన అవకాశం తనకు లభిస్తుందా?

'అయితే తీసుకొని వెళ్తా పదండి '

'నీకు సరిగ్గా తెలిసా?'

'తెలుసు - నే నక్కడినుంచే వస్తున్నా '

'ఎన్నిరోజుల ప్రయాణమేమిటి?'

'ఆ! మహా అయితే పన్నెండు-పదమూడు రోజులు'

ఒంటెలవాడు ఈ మాటలు అనువదించి ఆ నాయకుడికి చెప్పాడు అతడి ఆనందానికి మేరలేదు!

'అయితే మాతోరా' అని నాయకుడంటే ఒంటెలవాడు ఆ మాటలు సజ్జనుడికి తెలిపాడు

'సరే పదండి' అంటూ వారితో నడిచాడు మరో గత్యంతరం మాత్రం ఏముంది?

అతని హృదయంలో ఆశాతరంగాలు లేస్తున్నాయి ఆహా! తన కొక్కడికే శ్రీసోమనాథుని ఆదేశాన్ని పరిపాలించే సదవకాశం లభించబోతున్నది కాని తానై వారి చేతుల్లో చిక్కిన తర్వాత వాళ్ళు తనను మోసం చేయాలని చూస్తున్నట్లు గ్రహించాడు. నాయకుడు ఒక కంట ఇతణ్ణి కనిపెడుతూనే వున్నాడు మనోభావాన్ని పై కగుపడనీయ కుండా అతడు మాత్రం పదమడిని చక్కగా మేపి నీళ్ళు త్రాగించాడు ఒంటెను గూడా తన ప్రక్కనే విశ్రమింపచేసి తానూ తినడానికి కూర్చున్నాడు తినడం కొంత అయిన తరువాత నెమ్మదిగా మ్లేచ్ఛులతో మాటలు కలిపాడు అత నేమడిగినా ఒంటెవాడు ఆ నాయకుణ్ణే అడుగుతూండేవాడు అతడు ఏదో ప్రత్యుత్తరం అంతుపట్టకుండా ఇస్తుండేవాడు

చివరకు సజ్జనుడికి ఒక ఉపాయం తోచింది తినడం పూర్తి అయిన తర్వాత ''ఇక నా దారిన నే పోతా''నంటూ లేచాడు

''ఎక్కడికి వెళ్తా''వని అడిగాడు ఒంటెలవాడు మ్లేచ్ఛనాయకునితో సంప్రదించిన తరువాత

''గజనీ సుల్తాన్ దగ్గరికి ''

మ్లేచ్ఛులు ఇది విని నవ్వారు ''ఆయనతో నీకేం పని?''

''మీకు చెప్పేది కాదు కాని దానివల్ల ఆయన పని సులభమవుతుంది ''

''నీవు ఎవడవు?''

''నేనా? నేను ఎడారిలో దారి చూపుతుంటాను ప్రయాణీకులకు దారి చూపడమే నా పని ''

ఒంటెలవాడు మ్లేచ్ఛ నాయకుని కీ విషయాలు చెప్పిన తరువాత ఏదో చాలాసేపు మాట్లాడుకుని ఒంటెవాడిచేత ''మేము నిన్ను మహమ్మదు దగ్గరికి తీసుకొని వెళ్తాం-రా'' అని చెప్పించాడు

సజ్జనుని ఉపాయం ఫలించింది కాని అతను దేన్ని ఊహించుకొని భయపడ్డాడో, అది నిజమే అయింది. సుల్తాను, నాందోల్, సపాదలక్ష (అజమేర్)లను దాటి ముందుకు

వచ్చాడు మరి ఇందరు రాజు లేమైనారు? అందరూ ఓడి నాశనమైనారా? లేక లేక దారి ఇచ్చారా? దారిలో ఘోఘా దుర్గం వచ్చిందా లేదా? ఇది తెలుసుకోవాలనే కోరిక కల్గినా, అడిగే సమయం కాదని ఊరుకున్నాడు

## 6

అలా పగలంతా ఒంటెలను పరుగెత్తిస్తూ చీకటి పడేంతవరకు ముందుకు సాగిన తర్వాత ఒక పెద్ద సైనిక శిబిరానికి చేరుకున్నారు అది సైనిక శిబిరమే కాని ఒక మహా నగరంలా కన్పిస్తున్నది సజ్జనుడు అంత సైన్యాన్ని ఎన్నడూ చూడలేదు అక్కడక్కడ దివిటీలు వెలుగుతున్నాయి వేలక్కొలది కరదీపికలు అటూ యిటూ కదలుతున్నాయి వెలుతురు కన్పిస్తున్నంత మేరకు గుడారాలు కన్పిస్తూనే ఉన్నాయి అక్కడ ఉన్న మనుష్యుల సంఖ్య కాని, ఏనుగుల, గుఱ్ఱాల, ఒంటెల సంఖ్యను కాని చెప్పడం సాధ్యంకాదు రంగు రంగుల బావుటాలు - దాదాపు పదివేలదాకా - ఎగురుతున్నాయి అనేక వేల గుడారాలను పంక్తులు తీర్చివేసారు పశువుల అరుపులూ, మనుష్యుల కోలాహలమూ - రక్షకభటుల హెచ్చరికలూ, సన్నాయి, భేరి, మృదంగ ధ్వనులూ- ఇవన్నీ కలసి ఒక మహా భయంకరమైన ధ్వనిని పుట్టిస్తూ ఆకాశాన్ని ఛేదిస్తున్నాయి

ఆ శబ్దాన్ని విని - ఆ దృశ్యాన్ని చూచి- సజ్జనుడు కంగారుపడ్డాడు ఇంత సైన్య ముంటుందని అతని ఊహకందని విషయం నేల ఆ మూల నుంచి ఇంత సైన్యంతో, ఇన్ని రాజ్యాలు దాటి, త్రాగడానికి ఒక్కచుక్కైనా నీరు దొరకని ఈ నిర్జనమైన ఎడారిలోకి ఈ మహమ్మదు తరలివస్తాడని కలలోనైనా సజ్జనుడు ఊహించుకోలేదు ఒక క్షణం పాటు నీరసపడ్డాడు

ఆత్మవిశ్వాసం సడలిపోవడం ప్రారంభించింది. ఇంతలో (శ్రీ) సోమనాధుని ఆదేశం విన్పించిందతనికి పరమేశ్వరుడే సంహరించ దలచుకుంటే ఇక రక్షించగలిగే దెవరు? రావణ రాక్షసుని లాంటి రాజు నాశనమవగా లేనిది ఈ మహమ్మదు ఒక లెక్కా నాలాంటి అల్పుని చేతుల్లోనే వీనికి కాలం మూడేట్టు బ్రహ్మ వ్రాసి ఉంచాడేమో! ఎవరికి తెలుసు?

ఆ చిన్న దళానికి నాయకుడుగా ఉన్న మ్లేచ్ఛుడు ఒక పెద్ద సర్దారు కాబోలు ఏదో 'సంకేతం' యివ్వగానే రక్షకభటులు పక్కకు తప్పుకొని దారి యిచ్చారు. వంగి వంగి కుడిచేతిని తలపైకి పెట్టుకొని అభివాదనం చేస్తున్నారు. ఆ మహాశిబిరంలో నడుస్తూ సజ్జనుడు అన్నివైపులా కలయ చూచాడు. అక్కడ మ్లేచ్ఛులేకాక, పంజాబీలు, రాజ

పుత్రులు కూడా కన్పించారు ఎన్నడూ చూడని యంత్రాలేవో వున్నాయి తిండి కొరత లేని కారణాన అంతులేని ఆ మానవ సాగరం సంతోషంతో ఊగిసలాడి పోతున్నది

సజ్జనుడు ఆ సైనిక శిబిరం చూచి మహా చిరాకు పడ్డాడు ఈ రాజపుత్ర వీరు లంతా తలలు వంచారా? ఘోఘా గఢం ఏమైనట్లు? ఘోఘా బాబు ఎక్కడ వున్నారు? ఈ ప్రశ్నలకు సమాధానం దొరక్క అతడు చలించిపోయినాడు

కొంత దూరం నడిచిన తర్వాత సజ్జనుణ్ణి ఒంటె దిగమన్నారు పదమడిని అపహ రిస్తారేమోననే భయంతో ''ఇలాంటి ఒంటె ప్రపంచమంతా గాలించినా దొరకదు ఇది లేకపోతే నేను ఎడారి దారులు చూపించలే''నన్నాడు

''నీ ఒంటె ఎక్కడికీ పోదు'' అని తనవెంట రమ్మన్నాడు సజ్జనుణ్ణి ఆ సర్దారు అతని వెనుక ఇద్దరు సైనికులున్నారు పారిపోవడానికి, ఒరలోంచి కత్తి దూయడానికి ఏమాత్రం ప్రయత్నించినా, మరుక్షణమే పీక తెంచేస్తారని అతనికి తెలుసు

ఎదురుగా ఒక తెల్లని చర్మపు గుడారం కన్పించింది చుట్టూ విచ్చు కత్తులతో బారులుగా చాలామంది సైనికులున్నారు వారి వెనుక కొద్దికొద్ది దూరాన విలుకాండ్రు. గుడారాన్ని సమీపించాలంటే ఆ బారుల్లోంచి వెళ్ళాలి నాయకుడాదారిన సజ్జనుడితో నడుస్తుంటే భటులు వంగి వంగి సలాములు చేశారు అంటే అతనంత ప్రముఖ సర్దారన్న మాట శిబిర ద్వారాన్ని సమీపించగానే అక్కడ నిల్చున్న ఒక సర్దారు లోపలికి వార్త చెప్పడానికి వెళ్ళాడు

లోపలనుంచి వచ్చిన సమాధానాన్ని ఈ సర్దారు అతివినయంతో సలాం చేస్తూ విన్న తర్వాత రాక్షసుల్లాంటి ఇద్దరు హబ్షీ సైనికులు డేరా తెరను పైకి ఎత్తారు

సజ్జనుడు అప్రయత్నంగా కండ్లు నులుముకున్నాడు అంతకు ముందు చూచిన దృశ్యాల్లోకల్లా అత్యద్భుతమైన భయంకర దృశ్యం అతనికి కనిపించింది. నల్లటి చింత మొద్దుల్లాంటి ముప్పైమంది సేవకులు కదలకుండా వెండి దివిటీలు పట్టుకొని ఆ ప్రదేశాన్నంతా వెలుతురుమయం చేస్తున్నారు లోపల ఇరువైపులా ఇద్దరేసి రాక్షసుల్లాంటి హబ్షీలు అర్ధ చంద్రాకారపు వెడల్పైన కత్తుల్ని పట్టుకొని గండశిలల్లా నిల్చున్నారు మధ్యన సుగంధ తైలంలో ఒక మహాజ్యోతి వెలుగుతున్నది

లోపల ఒక మూల పులి, జింక మొదలైన జంతువుల చర్మాలతో చేసిన పరుపు మీద దిండు నానుకొని ఒక వ్యక్తి రీవిగా తన ఎఱ్ఱని గడ్డాన్ని నిమురుకుంటూ కూర్చున్నాడు ఎర్రని నిండు కనుబొమ్మలక్రింద పెద్ద పెద్ద కండ్లు తళతళ మెరుస్తూ కోరచూపులు ప్రసరిస్తున్నాయి ఉక్కు గుదియల్లాంటి చేతులు నడుమున వ్రేలాడుతున్న విచ్చుకత్తితో చెరలాటం ఆడుతున్నవి

అతని దుస్తులు విచిత్రమైన చర్మంతో చేసినవి తల మీద పాగాలో నీలి తురాయి మెరుస్తున్నది కుడివైపున నడివయసు మ్లేచ్ఛు డొకడు కూర్చున్నాడు అతని నడుములో కలందాను, చెవిలో కలం ఉన్నాయి అతని ప్రక్కన మరొక సర్దారు - నిమ్నస్థాయికి చెందినవాడు కాబోలు - కూర్చున్నాడు అతడు మహాబలిష్టుడు. ప్రక్కనే మరొకడున్నాడు వీరిద్దరూ రాజపుత్రులుగా కన్పిస్తున్నారు పరుపుమీద కూర్చున్న వ్యక్తికి ఎడమ వైపున సజ్జనుని తీసుకు వచ్చిన సర్దారులూ, దుస్తులు ధరించిన మరొక వ్యక్తి కూర్చున్నాడు అంతా లోపలికి ప్రవేశించగానే మధ్య కూర్చున్న వ్యక్తి సింహంలా గర్జిస్తూ సజ్జనుణ్ణి తెచ్చిన సర్దారును పలకరించగానే అతడు వంగి వంగి నమ్రతతో ముందుకు నడిచాడు ఈతని పేరు సర్దార్ మసూద్

ఇహ గజనీ మహమ్మద్ కన్నోజ్, కాలింజర్, నగరకోట, మధురా నగరాలను ధ్వంసం చేసి, మధురానగర ద్విజపుంగవులను గజనీ నగర వీధుల్లో ఒక్కొక్కణ్ణి మూడు న్నర రూపాయల వెల కమ్మిన మహా కిరాతకుడు- గజనీ మహమ్మదు వీడేనా! అంతులేని భయంకరమైన ఎడారి దాటి దేవాధిదేవుడు- రాజపరమేశ్వరుడైన సోమనాధుని విగ్రహాన్ని తుత్తునియలు చేయ సంకల్పించుకున్న పాపి- దుష్ట సాహసికుడు వీడేనా? ఇది గ్రహించగానే సజ్జనుని నరనరాల్లో ఉత్తేజం పొంగిపోయింది ఏమాత్రం వీలు చిక్కినా కొదమసింహంలా ఎగిరి, ఒక్క గంతులో - ఒక్కగంతులోనే మీదపడి యజ్ఞపశువును నరికినట్లు నరికి వేసేవాడే పూజ్యపాదులు సర్వజ్ఞ గురుదేవులు ప్రసాదించిన ఆదేశాన్ని పరిపాలించేవాడే!

## 7

సజ్జను డనుకున్నట్లు - ఆ మధ్య కూర్చున్న వ్యక్తే గజనీ ప్రభువైన 'యామినుద్దౌలా మహమూద్ నిజాముద్దీన్ ఖాసిం మహమూద్' అతనికి పదునాలుగేండ్ల ప్రాయంలోనే రాటుదేరిన గజనీ యోధుల్లో పేరు ప్రతిష్టలు లభించాయి. గర్భదరిద్రుడైనా మహావైభవాల్ని అందుకున్నాడు ఖురాసాన్ రాజ్యాన్ని తీసుకొని క్షణంలో అన్నను దిగలాగి గజనీ రాజ్యాన్ని వశపరచుకున్నాడు బలీయమైన ఇచ్ఛాశక్తి, అపారమైన శౌర్యం కలసి అతని కొక సామ్రాజ్యాన్ని నిర్మించిపెట్టాయి. స్పర్శమాత్రంతో ఎవరినైనా వశపరచుకో గలిగేవాడు. కనుసన్నలతో అతని కోరికలు ఫలిస్తుంటాయి. తండ్రి వేసిన బాటలో భారత సంపదలను దోచుకోడం ప్రారంభించాడు అలసి, సొలసి ప్రతిభ

చెడిన లాహోర్ అతి తేలికగా వశమైంది ముల్తాన్ కూడా క్షణంలో పాదాక్రాంతమైంది హైందవ రాజు లాతని దయాభిక్షకు కొంగు చాచడం ఆరంభించారు అనేక సార్లు గ్వాలియర్, కన్నోజ్, ఢిల్లీ, సపాదలక్ష రాజ్యాల సంయుక్త సేనావాహినులు అతని దుర్నిరీక్ష్య ప్రతాపం ముందు తలలు వంచాయి ధనరాశిలా నగర కోట అతని చేతుల్లో పడిపోయింది విగ్రహ విధ్వంసకుడనే బిరుదు సంపాదించాలనే తీవ్రమైన కోరిక అతని కున్నది దానితో ఇస్లాం మతాని కతడు అజేయ సంరక్షకుడైనాడు యుగయుగాలుగా వైభవాంచలాలలో సుఖనిద్రలు పోతూన్న మధురా దేవాలయాన్నతడు భస్మం చేసాడు దేవతల మకుటమణులాతని భార్యల అందాన్ని ఇనుమడింప చేశాయి విగ్రహారాధకులకు సర్వ పూజ్యులుగా - మహామహులుగా వెలు గొందిన విద్వాంసులను గజనీ నగర వీధుల్లో బానిసలుగా అమ్మడం జరిగింది

అతని శౌర్యానికి సాటిలేదు ఉదారమైన హృదయమాతనిది అతని మెదడులో కవి కల్పనాశక్తి నర్తిస్తుండేది యుగయుగాల వరకు భవిష్యత్తులో మహోజ్జ్వలంగా ప్రకాశించే ఒకానొక అద్భుత కావ్యాన్నీ, నూతన నిర్మాణాన్నీ చేయాలని అతడు సంక ల్పించు కున్నాడు. మహమ్మదీయ శ్రేష్టుడైన ఖలీఫా ఉమర్‌ను అతడు అనుకరించాలి ఇస్లాం విజయ దుందుభిని ప్రపంచమంతటా మారుమ్రోగించాలి.

అతనిలో 'ఈరాని' తల్లి నుంచి సంక్రమించిన కళాత్మక సంస్కారాలు కొల్లలుగా వున్నాయి కవిత్వమంటే అతనికి అమిత ఆసక్తి శిల్ప కళతో గజనీ నగర శృంగారాన్ని తీర్చిదిద్దడానికి పూనుకున్నాడు సర్వ సమృద్ధులతో గజనీ సింహాసనాన్ని దేదీప్యమానంగా చేయదలచుకున్నాడు ఇతరుల మనస్సులను గెలవడమతనికి తెలుసు అతని హృదయంలో అన్ని జాతుల వారికీ స్థానం ఉంది కాని, అవి అతని జైత్రయాత్రా రధచక్రములను అడ్డగించరాదు అంతే లేనిచో..

విగ్రహపూజా వ్యతిరేకుడైనా- విగ్రహారాధకులంటే ప్రశంసిస్తుండేవాడు ఏ రాజ పుత్రుల నాతడు సర్వనాశనం చేశాడో వారి పౌరుషాన్ని చూచి ముగ్ధుడయ్యేవాడు.

ఎనలేని చాతుర్యంతో ఒక సహ సేనావాహినిని వ్యూహంగా తీర్చిదిద్దుకున్నాడు ఆ సేనావాహినిలో కాకసన్ నుంచి రాజపుత్రస్థానం వరకున్న ఖడ్గ విద్యా నిపుణులంతా ఉన్నారు కత్తిసాములో ఆరితేరిన జోదు ఎలా కత్తి తిప్పగలడో అలా అన్ని మహాస్త్రాలనూ అతడు ఉపయోగించగలడు అలాంటి మహాశస్త్రాస్త్రాలతో- ఇంత విశాలమైన భయంకర మరుభూమికి ఆ వైపు విరాజిల్లుతున్న విగ్రహారాధకుల దేవాధిదేవుణ్ణి సర్వ నాశన మొనరించి, పాడు చేయడానికి అచట మహా వైభవాలను దోచుకోడానికి విజయ యాత్రకు పరాక్రమించాడు

కాని ఎవరికి వారు తమ చిన్న చిన్న రాజ్యాల నీచమైన గొప్పదనాలలో మునిగి, శతాబ్దాల నుంచి సంక్రమించిన అహంకారంలో, గర్వంలో పడి కొట్టు మిట్టాడుకుంటూ సంకీర్ణ బుద్ధులైపోయిన రాజపుత్రులాతని ప్రభావాన్ని గ్రహించలేక పోయినారు అతని ప్రాబల్యాన్నీ, పరాక్రమాన్నీ నిరోధించలేక పోయినారు ఆ రాజపుత్రులందరూ చాలా సరళ స్వభావులు, నిశ్చలులు, హఠవాదులు- వీరులేకాని దురభిమానంవల్ల ఎదుటి వారి శక్తిని కొలవలేని అసమర్థులు పోరాటంలో ఆరితేరిన వత్తాసులే- కానీ కలసి పోరాడలేని పిరికిపందలు ఏక దేశాభిమానంకాని, ఏక ధర్మాభిమానం కాని లేక, ప్రతి ఒక్కడూ తానే రాజు కావాలనే సంకీర్ణ, నీచ, అహంకార ప్రవృత్తికి దాసానుదాసుడై పోయిన దౌర్భాగ్యుడు

## 8

సాలార్ మసూద్ అమీరు కాళ్ళ దగ్గర కూర్చుని ఏదో చెప్పిన తర్వాత, అంతా కొద్దిసేపు ఏదో సంభాషించుకున్నారు మధ్య మధ్య అమీరు కంఠధ్వని మాత్రం స్పష్టంగా విన్పిస్తున్నది

తరువాత అమీరుకు కుడివైపున కూర్చున్న వ్రాయసకాడూ, రాజపుత్ర సర్దారొకడూ- ఇద్దరూ సజ్జనుడి దగ్గరకు వచ్చారు రాజపుత్ర సర్దారు తనను సమీపిస్తుంటే సజ్జనుడికి ఒడలు భగ్గుమన్నది పీక పిసికి చంపి దూరంగా విసిరివేద్దామనిపించింది పరమేశ్వరాజ్ఞను-నెరవేర్చడాని కంత కంటే సులభోపాయం లభించకపోతే తన ప్రాణాలను కూడా లెక్క చేయకుండా- పరమ కిరాతకుడు- దేశద్రోహియైన ఆ రాజపుత్ర నర పిశాచి నిండు ప్రాణాలను వేటుకు నరికేవాడే వాడు రాజపుత్రుడే సందేహం లేదు.. సందేహం లేదు అమీరు మాటల్లో వాడి పేరు 'సంవేదరాయ్' అని తెలిసింది.

''మీదే వూరు?'' సంవేదరాయ్ అడిగాడు

''నాదా? నాది భమ్మరియా.''

''ఎక్కడికి వెళ్తున్నావ్?''

''సపాదలక్ష ఘోఘా దుర్గాల మధ్యకు.''

సంవేదకుడు, ఆ వ్రాయసకాడు ఏదో కొత్త భాషతో కాసేపు సంభాషించుకున్నారు ఆ వ్రాయసకాని పేరు అలుత్బీ. అమీరు కూర్చునే ఏదో అడిగితే దాని కతడు సమాధానం చెప్పాడు.

''ఎక్కడ నుంచి వచ్చానన్నావూ?''

''పాటణ నగరాన్నుంచి ''

''బయలుదేరి ఎన్ని రోజులైంది?''

''పదిహేను రోజులు ''

''ఆఁ ఏమిటీ'' సంవేదరాయ్ దిగ్భ్రాంతుడైనాడు

''అవునయ్యా!''

''ఏ దారిన?''

''ఇదిగో- ఈ ఎడారి బాటనే- నాకీ దారి తెలుసు ''

''దారిలో ఏయే దుర్గాలు వస్తాయి?''

''దుర్గాలు వచ్చే బాటంటే నెల పడుతుంది నేను వచ్చిన దారి నేరుగా ఆబూ పర్వతం నుంచి పాటణ నగరానికి పోతుంది ''

''మరి దారిలో మజిలీలున్నాయా?''

''లేకపోతే నేను ఒంటరిగా ఎలా వచ్చాను?''

''ప్రస్తుతం మనమున్న ఈ ప్రదేశం ఎక్కడిది?''

'ముఖ్య మార్గానికి చాలా దూరంగా వచ్చేశారు ఆ దారి ఎందుకు వదలి పెట్టారు?'

'ఆ దారి ఎంత దూరాన ఉంది?'

'ఈ సైన్యమంతా చేరుకోవాలంటే ఎనిమిది, పదిరోజులైనా అవుతుంది పైగా దారిలో మేవాడ్, ఝాలోర్, గుజరాత్, మాళవ సైన్యాలెదిరిస్తాయి '

'నీ కివన్నీ ఎలా తెలుసు?'

'నా కన్నీ తెలుసు లక్షాపాతిక సైన్యాలు మీ కోసం కాచుకు కూర్చున్నాయి '

'అయితే నీవు వచ్చిన దారి చూపిస్తావా?'

'చూపుతా! కాని నా ఒంటెను నాకివ్వాలి '

'ఎక్కడ వుంది?'

'అడుగో! అతను తీసుకెళ్ళా'డని మసూదును చూపాడు

తరువాత సంవేదుడూ, అలుత్బీలిద్దరూ అమీరు దగ్గరకు వెళ్ళి చాలాసేపు మాట్లాడుతూ కూర్చున్నారు

## 9

రెండ్రోజంత సజ్జనుణ్ణి తన శిబిరంలో నిర్బంధించి వుంచాడు మసూద్ మూడ్రోజు తెల్లవారకముందే, ముఖ్య మార్గంలో ఎదిరి నిల్చిన రాజపుత్ర సేనలతో కయ్యానికి కాలుదువ్వడం దేనికని పశ్చిమ దిశగా పదమడి వెనుక, గజనీ మహమ్మదు ముందుకు నడిచాడు ఘోఘూరాణా పుత్రుడు - పరమేశ్వరాజ్ఞను పరిపాలించ గలిగిన తన అదృష్టానికి పొంగిపోతూ తను వచ్చిన దారినే ఆ మహా భయంకరమైన ఇసుక తుఫానును కలుసుకునేందుకు వేగిరపడుతూ, తీయని గీతాలతో పదమడిని ప్రోత్సాహిస్తూ ముందుకు దారి చూపుతున్నాడు

ఆరవ ప్రకరణం

# నూతనమైత్రి

## 1

సామంతునికి చోళా స్మృతి నవ్యోత్సాహాన్ని ఇస్తున్నది తండ్రిని మరోమార్గంలో పంపినప్పుడే తను అతణ్ణి గెలవాలని నిశ్చయించుకున్నాడు ఈ నిశ్చయాన్ని సాధించడం చాలా సులభమని ఆ లేత హృదయానికి నమ్మకం కలిగింది ఒంటె గజ్జల ఘల్లు ఘల్లు ధ్వనులతో ఆబూ, చంద్రావతీ ప్రదేశాలను దాటి, శ్రీమాళవంలో క్షణం ఆగి పరమారుల రాజధానియైన ఝాలోర్ చేరుకున్నాడు

ఝాలోర్ సమీపంలో అతనికి మరో ఒంటెల దళం కన్పించింది సామంతుడు ఒంటె దిగగానే ఆయుధధారి యైన ఒక సుందర యువకుడు ఆ దళంలోంచి ముందుకు వచ్చాడు సామంతుని కాతణ్ణి ఎక్కడో చూచినట్లనిపించింది కాని జ్ఞాపకం రాలేదు

'ఎక్కడనుంచి వస్తున్నారు?' అని మధురంగా అడిగాడా యువకుడు

సామంతునికి హఠాత్తుగా జ్ఞాపకం వచ్చింది సోమనాథ మందిరంలో చోళా నృత్యం చేసినప్పుడు ఈ వ్యక్తి అక్కడే కూర్చొని వున్నాడు.

'మీరు వచ్చినచోటినుంచే'నని వెంటనే అన్నాడు

'పాటణ నుంచా!' యువకుడు ఆశ్చర్యంతో అడిగాడు

'ప్రభాస నగరం నుంచి సర్వజ్ఞులు, పాటణాధీశుడు భీమదేవుడు కూర్చున్నచోటే మీరూ కూర్చున్నారు '

'అక్కడే మీరు కూడా ఉన్నారా?'

సామంతుడు ఆ వ్యక్తి ఇక్కడికి ఎందుకు వచ్చాడో ఊహించుకున్నాడు 'అవును మీరు కూడా నాలా సోమనాధుని ఆజ్ఞాపాలనకే వచ్చారా? మీ పేరు?'

'నేను భీమదేవ మహారాజు మంత్రిని నా పేరు విమలుడు' అంటూ సామంతుణ్ణి ఒంటెల దళానికి దూరంగా తీసుకు వెళ్ళాడు

'మరి మీరో?'

'నేను ఘోఘారాణా మనుమణ్ణి నా పేరు సామంతుడు' అంటూ నవ్వి 'మీరు కూడా ఆ మ్లేచ్ఛుని కొరకే వచ్చారా?' అన్నాడు.

'మరి మీరో?' అని అడిగాడు అనుబవశాలి విమలుడు

'నేను ఘోఘాబాబు కీ వార్తను అందీయడానికి వెళ్తున్నాను నన్ను గురుదేవులు పంపారు మీ రెక్కడికి?'

'మీరు కలవడం ఎంత మేలు! ఈ ఝూలోర్ రాజు రావల్ మీకు బంధువు కదూ? మీరు కూడా నా వెంట వస్తే ఆయన్ను ఒప్పించవచ్చు'

'మీరాయనతో ఏమిటి చెప్పేది?'

'ఝూలోర్ సహకరిస్తానంటే పాటణ సైన్యాలు ఇక్కడికి వస్తాయి అప్పుడు సమిష్టిగా గజనీసుల్తానును యుద్ధభూమిలోనే తుదముట్టించవచ్చు'

సామంతుడు బిగ్గరగా నవ్వాడు 'వాడి నంతవరకు రానిస్తే కదా! దారిలోనే మరుభూమికి ఏకైక ప్రభువు మా ఘోఘారాణా లేరూ? సపాదలక్ష, హజార్‌గఢ నాందోల్, కన్నోజ్, సురసాగర రాజ్యాధిపతులు కూడా ఎదురు నిలవరూ?'

'మీరు చెప్పింది యదార్థం అయినా అధికస్య అధికం బలం సోమనాథుని కార్యం ఇది'

'మీరు భయపడనవసరం లేదు. ఘోఘాబాబు వాడిని బ్రతికి బైట పడనివ్వడం కల్ల'

'నా కా విషయం వేరే చెప్పాలా' అంటూ లౌకిక మెరిగిన విమలుడు సామంతుణ్ణి ఉత్సాహపరిచాడు వారిద్దరూ మాట్లాడుతుంటే వారి ఒంటెలు విశ్రాంతి తీసుకుంటున్నాయి ఇంతలో దుర్గ ద్వారం తెరచుకొని ఒక చిన్న ఒంటెల దళం బైటికి వచ్చింది దుర్గం నుంచి దిగి చూస్తూ చూస్తూనే ఉత్తరంగా వెళ్ళిపోయింది విమలుడు తదేక దీక్షతో ఆ దళం వైపే చూస్తున్నాడు

రాత్రి ఝూలోర్ ప్రభువైన వాక్పతిరాజు గద్దె మీద నడుం వాల్చి కాళ్ళు పట్టించుకుంటున్నాడు- వృద్ధు డతడు-అయినా కండలు తిరిగిన చేతులతనివి డెబ్బైయేండ్లు వచ్చినా ఆ ముసలి కన్నుల్లో పస చెడలేదు దగ్గరే సామంతుడు కూర్చున్నాడు వాక్పతిరాజు మధ్య మధ్య ప్రేమతో అతని వీపు నిమురుతున్నాడు గద్దె క్రింద విమలుడు సహజ వినయంతో కూర్చున్నాడు చుట్టూ అయిదారుగురు దగ్గిర బంధువులు, సహచరులు ఉన్నారు.

'మహారాజా! సర్వజ్ఞ గురుదేవులూ, మా మహారాజూ నన్ను పంపించారు. మన సామంత సింహులు కూడా అందుకే వచ్చారు తమతో అవసరమైన సహాయం ఉంది'

ఆప్త వర్గమూ, సేవకులూ లేచి వెళ్ళిపోయారు

'ఏమిటా విశేషం' అన్నాడు వాక్పతిరాజు

'గజనీ అమీరు సోమనాథుని దైవమందిరాన్ని విధ్వంసం చేయడానికి వస్తున్న విషయం మీకు తెలిసే ఉంటుంది?'

'ఆ హా హా హా. ఈ విషయం నా దుర్గంలో ప్రతి వ్యక్తికీ తెలుసు ' నవ్వుతూ అన్నాడు వాక్పతిరాజు

'ఎలా తెలిసింది?' సామంతుని కన్నులు కాంతితో మెరిశాయి

'ముల్తాను నాయకుడు అజయపాలుడిప్పుడే వచ్చాడు ఆ మ్లేచ్ఛుని దుర్గంనుంచి సందేశం తెచ్చాడు '

'మ్లేచ్ఛుని సందేశమా?' సామంత, విమలులిద్దరూ ఒకేసారి అడిగారు

'అయితే నేనే కొత్త విషయాలు చెప్పాలి మీకు. అమీరు ముల్తాను నుంచి నాకు కప్పం పంపించాడు '

'కప్పమా?'

'అవును! నా సహాయం కావాలట 'ఝాలోర్' మీదుగా వెళ్ళడానికి దారి యిమ్మన్నాడు 'సోన్గిరి' చౌహానులంటే గజగజ వణికిపోతున్నాడు అమీరు' అంటూ మీసాలు మెలివేశాడా వృద్ధుడు

'అయితే దారి యిస్తామన్నారా?' విమలుడు ఊపిరి బిగబట్టి అడిగాడు.

'కప్పం తీసుకొని కోశాగారంలో చేర్చాను '

'మరి సహాయం మాట?'

'గుజరాతుకు పోదలచుకుంటే పో నీ గతి నీది పరమాల్ రాజ్యంలో కాలు పెట్టావా, బ్రతికి బైటపడడం దుర్లభమవుతుంది జాగ్రత్త' అని చెప్పాను

'కానీ మామా! విమలుడు మీ సహాయం అర్థించడానికి వచ్చాడు. మీరూ, భీమ దేవుడూ ఏకమైతే మ్లేచ్ఛుడు హతమవుతాడు' అన్నాడు సామంతుడు మధ్యలో.

'ఛీ! భీముడికి నాతో పనేమిటి? నిరుడు మార్వారును జయించాలి. వెయ్యి గుఱ్ఱాలూ, రెండువేల ఒంటెలూ యివ్వమని అడిగితే మార్వారుతో మాకు చుట్టరికం వుందని తప్పుకోలేదూ? పో! పోయి తన గతి తనదేనని చెప్పు' అన్నాడు నవ్వుతూ వాక్పతిరాజు

'కాని స్వామీ! ఇది ఒక్క గుజరాతు విషయమా? మ్లేచ్ఛుడు సోమనాధ విధ్వంసానికి వస్తున్నాడు ఇది ధర్మకార్యం!' విమలుడన్నాడు.

'ఇవన్నీ మీ భీముడు నేర్పిన మాటలు. మధురా విధ్వంసం జరుగుతుంటే మీ భీముని సైన్యాలు ఎందుకు వెళ్ళలేదూ?'

'కానీ ఈ మ్లేచ్ఛుడు సపాదలక్ష, నాందోల్, ఝాలోర్, అబూ, పాటణ రాజ్యాలు నాశనం చేస్తూ ప్రభాస నగరం వరకు వెళ్ళడం మంచిదంటారా మహారాజా?'

'ఏమిటీ? పరమార్ల రాజధాని ఝాలోర్‌లో మ్లేచ్ఛుడు అడుగు పెడతాడా?'

'ఇటునుంచి కాకపోతే మరో మార్గాన వెళ్తాడు చివరికి గెలుపు అతనిదే కదా '

'ఆ! గెలవాల్సిందే! ఇలాంటి వాళ్ళను చాలామందిని చూచాం '

'అయినా దేవమందిరం విధ్వంసం కావడం క్షత్రియ లోకానికి అవమానకరం కాదా స్వామీ?'

'అది భీమ మందిరం! ఏం? తన దేవుణ్ణి రక్షించుకునే పాటి బలం లేదూ మీభీముడికి?'

'అయినా ఈ మ్లేచ్ఛుడు మన పొలిమేరల్లోంచి వెళ్ళి దేవ మందిరాన్ని ధ్వంసం చేస్తుంటే చూస్తూ ఎలా వూరుకుంటాం మామా? వాడు మన గో బ్రాహ్మణాదులకు శత్రువు- మన దేవ విరోధి మరి వాడికి మన రాజ్యంలోంచి దారి యిస్తామా?'

'అందుకే-ఝాలోర్‌లో అడుగు పెడితే మర్యాద దక్కదు జాగ్రత్త- అని చెప్పి పంపించా '

'మరోవైపునుంచే వెళ్తాడనుకోండిస్వామీ! ఐనా చస్తే మీ మనుష్యులే చస్తారు కదా? ధ్వంసమయ్యే దేవాలయాలు మీవే కదా?' అని ఉత్తేజ పరచేందుకన్నాడు విమలుడు

'ఓహో! నీవూ మీ దామోదర్ మెహతా దగ్గరే చదువుకున్నావన్నమాట మీతీయని మాటలకు పడిచచ్చే వాణ్ణి కాను నేను.'

'అయితే ఈ దేశద్రోహి నాపడానికి మీరు సహకరించరా? వాక్పతి రాజుకిది గౌరవదాయకమా మామా?' సామంతుడికి ఒళ్ళు మండింది

'మీ ఘోఘారాణా వలె ముఖస్తుతికి మొగం వాచేవాణ్ణి కానోయ్ నేను' అన్నాడు కొంచెం తిరస్కార భావంతో వాక్పతి రాజు.

సామంతుడు నిగ్రహం కోల్పోయాడు 'మామా!' మా ఘోఘారాణా జీవితం అంతా ఇతరుల సహాయం కొరకు తపించాడు ఆయనకు స్వపర విభేదాలు లేవు.

విమలుడు పరిస్థితిని శాంతింప చేయడానికి 'స్వామీ! మా ప్రభువు మీరు చెప్పినట్లు నడచుకోడానికి సిద్ధంగా వున్నాడు కదా!' అన్నాడు

'ఇప్పుడా? ఇప్పుడే ఎందుకు, ఆయన అబూ, మాళ్వా రాజ్యాలను జయించాలిగా, కానీ '

'ఇప్పుడాయన మీ చేతుల్లో వున్నారు దేవధామాన్ని రక్షించే భారం ఆయనపై వున్నది ఇక మీకు లోబడక తప్పదు కదా స్వామీ?'

'లాభంలేదు వాక్పతిరాజు యిచ్చిన మాటకు తిరుగు లేదు మ్లేచ్ఛునికి దారి యివ్వను మీకు సహాయమూ చేయను '

'స్వామీ! మ్లేచ్ఛుడు మా అందరినీ చంపి, మీ పైన పడితే ?'

'వాడి మొహం '

'ప్రభాస నగరం వరకు చిచ్చు రేపిన వాడికి భయమేమిటి స్వామీ!' విమలు డడిగాడు

'ఇదిగో! అంతా నీ రాజులాంటి వాళ్లు కారు తెలుసా? నీ వెప్పుడూ వాక్పతిరాజు శౌర్యాన్ని చూచి వుండవు వాడైతే రానీ!' కోపంతో వాక్పతి రాజన్నాడు

'మన శౌర్యం వాణ్ణి తరమడంలో వుంది '

'ఏమిటీ? పిట్ట కొంచెమూ కూతఘనమూ! పో! పోయి మీ ఘోఘూరాణా నడగవోయ్ వాక్పతిరాజు శౌర్యం ఎందులో ఉందో '

సామంతుడు వెంటనే లేచాడు 'మా ఘోఘూరాణా కంత గతి ఏమిటి? మరు భూమికి ఏకైక ప్రభువై ఆయన అక్కడ ఉన్నంతవరకు మ్లేచ్ఛుడు ఎన్ని గుండెలతో ముందుకు వస్తాడు? మీరు కండ్లు మూసుకొని గుడ్డిగా విలాసాలు అనుభవిస్తుండండి' అని అంటూ, ఆ ముసలి రాజు కోపంతో తన గొప్పతనాన్ని చాటుకోక ముందే అక్కడి నుంచి వెళ్ళిపోయాడు సామంతుడు

'ఆ ఘోఘూవంశం అంతా ఇంతే ' అని గొణుక్కుంటూ 'నీవు నీ రాజు దగ్గరికి వెళ్ళిపో నా మాటకు ఇక ఎదురు లేదు' అన్నాడు వాక్పతిరాజు

'రేపు ప్రొద్దున తిరిగి మిమ్మల్ని దర్శించుకుంటా '

'నాలో మార్పు అంటూ రాదు '

'అంతా మీ చేతుల్లో ఉంది ' అంటూ వినయంతో నమస్కరించి లేచి నిల్చున్నాడు విమలుడు వాక్పతిరాజు మళ్ళీ కాళ్ళు పట్టే నౌకర్లను పిలిపించాడు

## 2

వాక్పతిరాజు చూపిన స్వార్థం తలచుకొని సామంతుని హృదయం దహించుకొని పోతున్నది చిరాకుగా నడుస్తూ తన గుడారానికి వెళ్ళి ప్రయాణానికి సిద్ధపడమని అనుచరులకు చెప్పాడు కొంతసేపటికి గంభీర ముద్రతో విమలుడు కూడా వచ్చాడు సామంతుడు తల వంచుకొని చూపులు భూమి మీద నిల్పి కూర్చున్నాడు

''చౌహాన్ వీరా! అధైర్యం దేనికి?'' విమలుడు- ఈ సాహసియైన యువకుడికి నచ్చచెపుదామని ప్రేమతో ప్రయత్నించాడు

'వాక్పతిరాజు ఇంత పతితుడైనాడా? యమునిలా అమీరు దండయాత్ర చేయడానికి వస్తుంటే ఈయన లంచం తిని వాణ్ణి రానివ్వడమా? సూర్యచంద్రుల కీర్తి కూడా కళంకితమయ్యే గతి పట్టింది నేడే గనుక ఘోఘాబాబు ఉంటే వీడి పీక త్రెంచేవారే?'

'అలా అనడం భావ్యం కాదు మనమాయనకు అతిథులం '

'వాడి మొహం మీదే అనేవాణ్ణి వాక్పతిరాజిలాంటి మాటలనడమా?' పృథ్వి రసాతలానికి కుదించుకుపొయ్యే గతి పట్టింది

'నిరాశ పడకండి రేపు మళ్ళీ నచ్చ చెప్పడానికి ప్రయత్నిస్తా'

'వాడా! వాడు వినడయ్యా వినడు ఝాలోర్ దయ్యం పట్టిందతనికి గోబ్రాహ్మణాది వధ జరిగినా, సోమనాథుని ధ్వజం ధ్వంసమయినా అతనికి చింత కలుగదు మ్లేచ్ఛుల డబ్బు తిని చేసిన వాగ్దానం నిలబెట్టుకోవాలట! జాతి చింత గానీ ధర్మ చింత గానీ లేనే లేదే?'

'అయినా ఇలా బిగిసి కూర్చుని మటుకు చేయగలిగిందేమిటి? ఝాలోర్ మీదుగా కాక వాడు మరే దారిన వస్తాడు?'

'అసలు ఘోఘాబాబు వాణ్ణి ఎడారిలో ప్రవేశింపనిస్తే గదా!'

'వస్తాడే అనుకో ఒకవేళ వచ్చినా మార్వారు మీదుగానే రావాలిగా' అన్నాడు ఆలోచనతో విమలుడు

'అసలు రానివ్వడయ్యా, రానివ్వడు '

''ఇక్కడినుంచి మార్వార్ వెళ్ళాలి నేను మీరు కూడా వస్తారా?''

''ఎలాగా? ఘోఘా దుర్గానికి వెళ్ళి ఈ విషయం ఘోఘాబాబుకు చెప్పి హెచ్చరించాలి- ఇది సోమనాథుని ఆజ్ఞ''

''అమీరు ఘోఘా దుర్గం వెళ్ళాలంటే ఈ పాటికి వెళ్ళే వుంటాడు బాబూ!''

''అయితే ఈ పాటికి వాడి చర్మం ఒలిచి వుంటారు ''

''అలాగైతే కొంత పీడ విరగడైనట్లే''నని ఉత్సాహమిస్తూ ''మీకు నిద్ర బాగా వస్తున్నట్లున్నది'' అన్నాడు

''నిద్రా? ఇహ ఈ రాత్రంతా నిద్ర పట్టదు ఆ వాక్పతిరాజు మాటలు చెవుల్లో గింగురు మంటుంటాయి ''

''మీ కింకా బాల్యం పోలేదు. ఇలాంటి అనుభవాలు రోజూ ఉండేవే ఏదో ఉపాయం ఆలోచించాలిగాని వీటి కిలా భయపడితే ఎలా? మరి రాత్రికి మీరు కూడా వస్తారా?''

''ఎక్కడికి?'' అని అడిగాడు సామంతుడు ఆశ్చర్యంతో

''ఆ సుల్తాన్ సర్దారును మార్వర్‌కు పోకుండా ఆపాలి'' అని భావ గర్భితంగా చూస్తూ విమలుడన్నాడు

''ఇప్పుడేనా? - వెంటనే అయితే మంచిదే ఇప్పుడే వాణ్ణి పట్టుకుందాం'' అంటూ సామంతుడు లేచి నిల్చున్నాడు

''అయితే మీరు సిద్ధంగా ఉండండి మా వాళ్ళకు కూడా చెప్పి, వాక్పతిరాజు నుండి వీడ్కోలు తీసుకొని వస్తా''నంటూ హృదయ ముప్పొంగ చిరునవ్వును తొలకరింప జేస్తూ రూపు లేర్పడని ఏవేవో భావాలతో వాక్పతి రాజును దర్శించుకోడానికి విమలుడు వెళ్ళాడు

తన ఇచ్ఛకు నచ్చని అతిధులను పంపివేయాలనే వాక్పతిరాజు కూడా అనుకుంటున్నాడు సాధారణ మర్యాదలు చూపి కోట తలుపులు తెరిపించాడు సామంత విమలు లిద్దరూ వేగంగా ముల్తాన్ సర్దార్‌ను వెంబడించారు. చీకటి రాత్రి అయినా సూటి మార్గమే కనుక ఎక్కువ కష్టమనిపించలేదు.

''చౌహాన్! అతణ్ణి ఝాలోర్ నుంచి కొంతదూరం వెళ్ళనివ్వడమే మంచిది '' అంటూ తేనె లొలుకు శబ్దాలతో ''బాబూ నా దొక మనవి'' అన్నాడు విమలుడు- అతని చక్కని ముఖంలో ఓటమెరుగని చిరునవ్వు తొణికిసలాడింది. సామంతుడాతని వ్యక్తిత్వానికి ఎప్పుడో లోబడి పోయినాడు అందుకే వేగంగా మనస్సును కుదుట పరచుకో గలిగాడు

'ఇదిగో'నంటూ నేర్పుతో 'ఆ సర్దారు చాలా అనుభవజ్ఞుడు. వాడిని వెనక్కు రప్పించడమన్నా, ఆపడమన్నా చాలా కష్టం ఇక మీదా.. రాచ రీవి కనుక మాటల్లో ఎక్కడో ఒకచోట తప్పకుండా పట్టుబడతారు' అన్నాడు విమలుడు

'ఇదిగో' నా నోటి వెంట ఒక్క మాటైనా రానివ్వను సరేనా? మీరు ఆ వాక్పతి రాజుతో మాటాడేటప్పుడు చూపిన నేర్పుకు నేను స్తబ్ధుణ్ణైపోయినాను మీలాంటి మంత్రి మా ఘోఘా బాబుకుంటేనా

'బాబూ! మీ రింకా మా గురువుగారిని చూడలేదు.'

'మీకూ ఒక గురువా?'

'మా దామోదర్ మెహతాముందు నేనింకా పసివాణ్ణే ఆయన పెదవి కదిపితే చాలు ఎదుటివాడే ఏదైనా చేసి పెడతాడు పది సంవత్సరాలైంది ఆయనకు ఆవేశం రావడమంటూ నేను చూడలేదంటే నమ్ముతారా '

''అయితే చూచినట్లే ఆవేశం రానివాడూ మనిషేనటయ్యా?''

''రాజు, రోషం తెచ్చుకోగలిగితేనే గొప్పవాడు మంత్రి రోషం లేకుండా వుంటే గొప్పవాడు'' అని మా మెహతాజీ ఎప్పుడూ అంటుండేవారు

''అయితే మీకు కోపంరాదూ?''

''అప్పుడప్పుడు రానే వస్తుంది అందుకే నేను మా మెహతాకు సమానుణ్ణి కాదనేది ఆయనైతే ఈ వాక్పతిరాజు నిరాకరించే వాడేనా'' అంటూ విమలుడు నవ్వాడు సామంతుడు ప్రేమతో ఈ క్రొత్త స్నేహితుణ్ణి చూస్తూ వుండిపోయాడు మొదటి మజిలీ రాగానే అక్కడ తెలుసుకుంటే ముల్తాన్ సర్దార్ రెండో మజిలీలో విశ్రమించడానికి వెళ్ళినట్లు తెలిసింది సర్దారు ఝాలోర్‌కు దూరంగా వెళ్ళిపోవడం విమలుడికి నచ్చింది

కొద్దిసేపటికి వారు కూడా రెండో మజిలీకి చేరుకున్నారు. చాలా ప్రొద్దుపోయిన తరువాత చంద్రుడు ఉదయించాడు మసక వెన్నెలలో రెండవ మజిలీ దగ్గరున్న తాటి తోపు కెదురుగా ఒంటెల దళం కన్పించగానే విమలుడుకి చాలా ఆనందం కలిగింది సుల్తాన్ సర్దారుతో తన బుద్ధిబలాన్ని పరీక్షించుకొనే అవకాశం అతనికి లభించింది తన గెలుపులో పాటణ రాజ్య విజయమూ, శ్రీసోమనాథుని విజయమూ - రెండూ ఉన్నాయి త్వరగా రెండోమజిలీకి చేరుకొని అప్పుడే బయలుదేరబోతున్న ముల్తాన్ సర్దారు నాపాడు

''ముల్తాన్ సర్దారులకు ఝాలోర్ రాజుగారి సందేశం తెచ్చాను'' అన్నాడు విమలుడు

ఆ వృద్ధయోధుడు ఒంటె నెక్కుతున్నవాడల్లా ఆగి ముందుకు వచ్చాడు అతని కన్నులలో అనుమానం ఉట్టిపడుతున్నది

''ఎవరు నువ్వు? ఎక్కడినుంచి వస్తున్నావు?''

''నేను ఝాలోర్ నుంచి వస్తున్నాను. ఇతడు కుమార సామంతసింహుడు ఈ చౌహాను వాక్పతిరాజుకు మేనల్లుడు మీతో ఒంటరిగా నేను మాట్లాడాలి '' అంటూ ఒంటె దిగి ముందుకు వెళ్ళి వినయం ఉట్టిపడేట్టు నమస్కరించాడు ''మీకు నా మీద నమ్మకం కల్గడం లేదా?''

తీయగా మాటాడుతున్న విమల మంత్రిని సర్దారు శంకాసంకుచిత దృష్టితో కఠినంగా చూచాడు విమలుడు ఆయన్ను మిగితావారికి దూరంగా తీసుకొని వెళ్ళాడు

''నన్ను మా వాక్పతిరాజు గారు పంపారు. మీరాయనను కలుసుకొని, కానుక లర్పించారు.''

''మీ సైన్యాలకు తోవ ఇవ్వనన్నారాయన. యుద్ధం కూడా చేయనని వాగ్దానం చేశారు ఇప్పుడైనా నమ్మకం కుదిరిందా? నేను చెప్పింది సత్యమే. నా మాట అసత్యమైతే ఈ కుమారుణ్ణే అడగండి''

సర్దారుకు కొద్దిగా నమ్మకం కలిగింది.

''అయితే మిమ్మల్ని పంపడం దేనికిప్పుడు''

''మార్వారు ప్రభువు రణమల్లుడు మీ మాట వినడేమో ననుకున్నారు వాక్పతి రాజుగారు వారు మీతో యుద్ధం మాత్రం చేయనని వాగ్దానం చేశారుగదూ! దానికి గాను మీకు హామీ యిస్తున్నాం మేము.''

''హామీలు దేనికి? '' అని అనుమానం వెలిబుచ్చాడు సర్దారు

''పాటణ రాజు భీమదేవుడి కప్పుడే తనకు తోడుగా యుద్ధంలో చేరనని రణమల్ రాఠోర్‌కు కబురు పంపాడు'' అని పాచిక విసిరాడు విమలుడు

''ఏమిటీ''

''అవును-ఇక పదండి'' అంటూ ప్రయాణానికి వేగిరపడుతున్నట్లు నటించి ''భీమదేవునితో చేరవద్దని చెప్పేందుకు రాఠోర్ దగ్గరికి వస్తున్నాను'' అన్నాడు విమలుడు

''అలాగా'' అంటూ మితభాషియైన సర్దారు ఒంటె నెక్కాడు రెండు దళాలూ ప్రక్క ప్రక్కగా ప్రయాణం సాగించాయి సర్దారుకు మాత్రం కొంచమైనా నమ్మకం కలిగినట్లు లేదు నిద్రకు కళ్ళు మూతలు పడిపోతున్నట్లు నటిస్తూ కోరచూపుల్తో విమలుణ్ణే కనిపెడుతూనే ఉన్నాడు నోరు మెదిపి ఒక్క మాటైనా మాట్లాడలేదు విమలుడు కదిలించినా, ఉత్సాహం కనబరచలేదు

చాలా సేపటి వరకు ఒంటెల అడుగుల చప్పుడు తప్ప మరే సవ్వడీ లేదు సామంతుడు మాత్రం తాను చెప్పినట్లే మౌనంగా ఉన్నాడు విమలుడు తన ఒంటెను సర్దారు ఒంటెకు ప్రక్కగా పోనిస్తూ అతణ్ణే తదేకంగా చూస్తున్నాడు ఇద్దరూ జాగ్రత్తగా వున్నారు కాలం గడచినకొద్దీ విమలుని నిగ్రహం సడలిపోతున్నది.

అలా మౌనంగా ప్రయాణం సాగుతూనే వుంది ఘడియలు దాటి, రాత్రి గడచి పగలుగా మారుతున్నది. విమలుని గుండె వేగంగా కొట్టుకుంటున్నది

తూరుపు రేఖ ఉదయించే వేళకి విమలుని ఆవేదనకు అంతులేక పోయింది తుది అవకాశం కాస్తా చేజారి పోతున్నట్లనిపించింది సర్దారు చల్లని గాడ్పులకు కునుకుపాట్లతో

ఒంటె మీద కూర్చున్నాడు. విమలుడిక ఓపిక పట్టలేక తన ఒంటెను సర్దారు ఒంటె దగ్గరగా పోనిచ్చాడు. వెనక్కు తిరిగి తన అనుచరులకు సౌంజ్ఞ చేశాడు వెంటనే కత్తి దూసి మహా వేగంతో సర్దారుపై విసిరాడు

విమలుడు దిగ్భ్రమ చెందాడు మేల్కొని ఓరకన్నులతో విమలుణ్ణి చూస్తూనే వున్నాడు సర్దారు అతని కత్తి మొన విమలుని గుండె కానించి వుంది, ముసలాడు దీనికి సిద్ధంగా వున్నట్లుగానే వుంది కత్తి మొన గుండెలో దూరకముందే విమలుడు ఒంటె మీద నుండి క్రిందికి జారాడు సర్దారు కూడా వెనువెంటనే క్రిందికి దూకాడు

ఇరుపక్షాలూ మోహరించి నిల్చున్నాయి విమలుడు కత్తి మెరిపించగానే ఒంటెల మీదనున్న సైనికులు శత్రువుల పైకి విరుచుకుపడ్డారు కొన్ని కత్తులు తళతళమని మెరుస్తూ రవ్వలు రాల్చాయి కొన్ని బాణాలు గుండెలను చీల్చాయి కొన్ని ఒంటెలు భయపడి పారిపోయాయి. హాహాకారాలు చెలరేగాయి నలువైపులా కత్తియుద్ధ మారంభమైంది

విమలుణ్ణి ముగ్గురు సర్దారు సైనికులు చుట్టుముట్టారు సామంతుడు కత్తిని గిరగిర త్రిప్పుతూ మధ్యకు ఉరికాడు. సర్దారుకు నలువైపులా బాహా బాహీ యుద్ధం జరుగుతున్నది అంతా అక్కడికి పరుగెత్తారు. సర్దారు సైనికులు సర్దారునూ, విమల సామంతుల సైనికులు తమ ప్రభువులనూ కాచుకుంటున్నారు అయిదారు నిమిషాలు నిప్పులు కురిశాయి నలుగురైదుగురు గాయాలతో పడిపోయారు కోమలంగా కన్పించే విమలుడు మహా చాకచక్యంతో కత్తిని మెరిపిస్తున్నాడు చౌహాన్ వీరకేసరి సింహగర్జనతో, రక్తధారలు కురిపిస్తూ నలువైపులా విచ్చలవిడిగా విహరిస్తున్నాడు. సర్దారు కండ్లు ఒక క్షణం మైకంతో మూసుకుపోయాయి తీరా కండ్లు తెరచి చూచే సరికి విమలుడు దగ్గరే యుద్ధం చేస్తూ కన్పించాడు కండ్లు మూతలు పడుతున్నా, పెదవులు బిగించి బలాన్ని యావత్తూ సమీకరించి ఒక చేతిమీద కూర్చొని రెండవ చేత్తో దగ్గరే పడివున్న కత్తిని తీసుకొని విసరడానికి చెయ్యెత్తాడు.

అది సామంతుని కండ్ల పడ్డది. భయంకరంగా గర్జించి, ఒక్క గంతులో సర్దారుపై బడి అతణ్ణి ముక్కలు ముక్కలుగా నరికాడు. సర్దారు శరీరం నుండి రక్తం వరదలై పారింది. కడసారి శ్వాస పీల్చి విడిచాడు

సామంతుని గర్జన, అందరి దృష్టినీ అటువైపు ఆకర్షించింది సర్దారు చావడం చూచి, అతని మనుష్యులు ప్రాణాలు బిగబట్టుకొని పరుగెత్తారు

'భేష్ చౌహాన్ వీరా! భేష్' ప్రాణ దాతకు విమలుడు ధన్యవాదాలర్పించాడు

సామంతుని చూపులింకా సర్దారుపైనే వున్నాయి 'దేవ విద్వేషులంతా ఇలాగే చస్తారు' అంటూ విజేతలకు తగినట్లు, సర్దారు నడుమున వ్రేలాడుతున్న రత్నాలు పొదిగిన పిడికత్తిని తీసుకున్నాడు

'వాక్పతిరాజు పంపిన సందేశం ఇక్కడే మట్టిలో కలిసింది' అన్నాడు విమలుడు నవ్వుతూ

సర్దారు సైనికులు తొమ్మిదిమంది మరణించారు ముగ్గురు పట్టుబడ్డారు విమల, సామంతుల సైనికులు ఏడుగురు చనిపోయారు నలుగురు గాయపడగా- వారిద్దరితో చేరి నలుగురు సురక్షితంగా వున్నారు సామంతుడు తన దారిన తాను పోతానని తొందర చేశాడు

'చౌహాన్ వీరా! నాకు ప్రాణ దానం చేశావు నీకు దాసానుదాసుణ్ణి నేను ఈ చర్మంతో చెప్పులుకుట్టి ఇచ్చినా మీ ఋణం తీరదు' అన్నాడు విమలుడు

'మంత్రీ! దాసానుదాసులా అలా అనకూడదు నాకు ప్రాణమిత్రులు ఘోఘా ధుర్గాన్ని స్వగృహంగా భావించి ఎప్పుడైనా రావాలి' అన్నాడు ప్రేమమూర్తి చౌహాన్.

'మరి గుజరాతుకు వస్తే నన్ను మరచిపోవు కదూ!'

ఇద్దరు ఒండొరులను కౌగిలించుకొని, తరువాత తమ తమ మార్గాలలో వెళ్ళిపోయారు.

పట్టుబడ్డ సర్దార్ సైనికులను ఒంటెల మీద విరిచిగట్టి విమలుడు మార్వాడుకు బయలు దేరాడు బందీలైన సర్దారు సైనికులు గజనీ మహమ్మదు సైన్య సమాచారాలు చెబుతుంటే విమలుని విచారం మరింత అధికమైంది

గజనీ సైన్యంలో మూడువేల గుఱ్ఱాలూ, యాభైవేల విలుకాండ్రూ, మూడువేల ఏనుగులూ ఉన్నాయట ముప్పదివేల ఒంటెలమీద నీటి తిత్తులు వేశారట ఇదిగాక వేల కొలది సేవకులున్నారు దేశాలు దోచడమే వృత్తిగా పెట్టుకున్న ఒక దుష్టుని మహాభయంకరమైన సేనా సముద్రం అది. ఆ సైన్యం నడుస్తుంటే భూమి కదిలిపోతుంటుంది ఆ యుద్ధభేరీల నినాదాలకు ఆకాశం దద్దరిల్లుతుంటుంది విమలుడిదంతా విని దిగులు పడ్డాడు. మొదట ఇదంతా ఊహాగాన మనుకొని నవ్వాడు - కాని అతని గుండెల్లో ప్రవేశించిన భయం క్రమేపీ బలపడింది

ఏడవ ప్రకరణం

# ఘోఘూరాణా కీర్తి గీతిక

## 1

ఎమిలుల్ని వదిలిపెట్టి వెళ్తున్నపుడు అతని మనస్సు ఆనందంతో గంతులు వేసింది గజనీ అమీరుతో తలపడిన మొదటి రంగంలో తనదే పైచేయి అయింది మొదటి దెబ్బ ఘోఘూరాణాదే - నంటూ అతను లోలోపల తృప్తి చెందాడు

అతని వెంటనున్న మనుష్యులిద్దరిలోనూ ఒకడికే కొద్దిపాటి గాయాలు తగిలాయి మిగతా గాయపడ్డవారినీ, పట్టుబడ్డవారినీ విమలునితో పంపివేశాడు అతను సాధ్యమైనంత త్వరగా ఘోఘా దుర్గం చేరుకోవాలి కదా!

నాలుగోరోజు కొందరు మనుష్యులు - గుఱ్ఱాల మీదనో, ఒంటెల మీదనో, కాలి నడకనో ఎదురు వస్తూ కన్పించారు వివరాలు అడిగితే గజనీ అమీరు దండయాత్రకు భయపడి మార్వాడువైపు పరుగెత్తుకొని వస్తున్నట్లు తెలిసింది సామంతుడు వివరాలన్నీ అడిగాడు సపాదలక్ష దాకా వచ్చాడన్నారు కొందరు రెండే రెండు రోజుల్లో వచ్చి పడవచ్చున్నారు మరి కొందరు. అతని సైన్యాల్లో ఎగిరే ఒంటెలున్నాయని కొందరన్నారు అతని ప్రతాపంవల్ల మరుభూమిలో మహానదులు ప్రవహించాయన్నారు మరికొందరు

'వస్తున్నాడు - వస్తున్నాడు' వారికి తెలిసింది ఇదే ప్రజలు పారిపోవడానికి ఇది చాలు

రెండు రోజులలా ముందుకు ప్రయాణించగా ఎదురు వస్తున్న జన సమూహం ఎక్కువవడం మొదలైంది ఆబాలగోపాలం, గుఱ్ఱాలతో-పాడి పశువులతో మోయగలిగినంత సామానుతో ఊళ్ళకు ఊళ్ళే-పారిపోతున్నట్లు కనిపించింది. వాళ్ళు కొక దారీ తెన్నూ లేదు వార్త లింకా వింత రూపం దాల్చాయి. గజనీమహమ్మదుకు మూడు కండ్లూ, ఎనిమిది చేతులూ-ఆరడుగుల కత్తీ ఉన్నాయన్నా డొకడు మరొకడు అతని మహాసైన్యాన్ని తు చ తప్పకుండా వర్ణించాడు. ఒకనికి ఎగిరే ఏనుగులు కన్పించాయి. ఒకనికి రెక్కల గుఱ్ఱాలు కన్పించాయి. నల్లగా రెండు నోళ్లతో-నిలువునా మనిషి మాంసాన్ని పీక్కుతినే వాళ్లను చూచానన్నాడు మరొకడు. అమీరు అడుగు పెడితే చాలు-

ఆ చుట్టూ మేఘాలు క్రమ్ముకోడం చూచాడొకడు అతని కత్తి దూసినప్పుడు ఆకాశంలో మెరుపులు కన్పించాయి మరొకడికి

అసలు విషయం తెలుసుకోడానికి సామంతుడు ఎంతో ప్రయత్నించాడు. ఒక్కడికీ వాస్తవం తెలిసినట్లు లేదు అతడు సపాదలక్ష వరకు వచ్చాడన్నది మాత్రం నిస్సందేహం అయితే ఘోఘా దుర్గాన్ని దాటి వచ్చాడన్నమాట. లేదా ప్రక్కగా తప్పుకునైనా వచ్చి వుండాలి. సామంతుని మనస్సును భయం ఆవరించింది నాల్గువైపుల నుంచి పారిపోతున్న ప్రజల భయం, అతని మనస్సులో కూడా ప్రవేశించింది.

భయం ఆవహించినప్పటినుంచీ ఇంకా వేగంగా ప్రయాణం సాగించాడు. భమ్మరియా దగ్గర తన తండ్రి ఎదురు చూస్తూండాలి సర్వజ్ఞుని ఆదేశానుసారం సోమనాధ పరమేశ్వరుని ఆజ్ఞను ఘోఘాబాబుకు చెప్పాలి కాని అసలు ఏమి జరుగుతున్నదో, ఏమి జరుగనున్నదో కూడా అనూహ్యంగా వుంది అతనికి

అలా ఎనిమిది రోజుల వరకు పరుగెత్తుకొని వస్తున్న జనం అతనికి కన్పిస్తూనే వున్నారు తొమ్మిదో రోజు కొంచెం జనసమ్మర్దం తగ్గింది.

పదకొండో రోజుకల్లా ఎటు చూసినా నిర్మానుష్యం. గ్రామాలు పాడుబడ్డాయి మజిలీలో బాటసారులు కూడా కన్పించటం లేదు నాల్గు చెరగులా భయాందోళనలు ప్రాణాలతో సంచరిస్తున్నట్లగుపించాయి సామంతుని హృదయం కంపించడం మొదలైంది అయినా పెదవులు బిగించి ముందుకు సాగాడు సాక్షాత్తు యముడు ఎదురొస్తేమటుకూ తన కేమి భయం? తాను చౌహాన్ వీరుడు కదా!

రెండు రోజులలా ముందుకు నడిచాడు. నలువైపులా నిశ్శబ్దం శ్మశానంలో కూడా అంత నిశ్శబ్దత ఉండదేమో!

పదిహేనోరోజున గాయపడిన సైనికుడికి హఠాత్తుగా చాలా జబ్బు చేసింది. అతణ్ణి తనతో తీసుకువెళ్ళడం అసాధ్యమనుకొని, రెండో సైనికుణ్ణి కూడా గాయపడినవాడి సహాయానికి విడిచి పెట్టి, ఒంటరిగా సామంతుడు ముందుకు సాగాడు. ఆ సైనికులు ఆగమని ఎంత బ్రతిమాలినా ససేమిరా కాదన్నాడు చెప్పరాని భయంతో మనస్సు కుదించుకు పోతున్న కొద్దీ త్వరగా . అతి త్వరగా గమ్యాన్ని చేరుకోవాలనే తాపత్రయం కూడా అతని కెక్కువవుతూ వచ్చింది

ఏమీ తెలియని ఈ అనిశ్చిత భీతి కంటే, భయం నోటపడి రూపు మాయడమే మేలనిపించింది

ఇక భమ్మరియా అట్టే దూరం లేదు. ఒక్కరోజులోనే చేరుకోవచ్చు తన తండ్రి ఎదురు చూస్తుంటాడు అక్కడి నుంచి ఘోఘా దుర్గం చేరుకోవడం ఎంతసేపు?

## 2

వెనుకబడిన తన సైనికులను కలుసుకునేందుకు సామంతుడు ఒక రోజంతా చాలా నిదానంగా ఒంటెను నడిపించాడు ఎన్నో మారులు ఒంటెల అడుగుల సవ్వడి వినిపించిన ట్లనిపించడం - వెనుకకు తిరిగి ఆకాశపుటంచుల వరకు చూడటం జరిగింది కాని ఎక్కడా తన అనుచరుల జాడ కనిపించలేదు

పరిస్థితి మహా దారుణంగా ఉన్నది కనుచూపుమేర ఎటు చూసినా నిర్మానుష్యమే పైకెగిరే ఇసుక కదలే తాటిచెట్లు, మజిలీలలోని ఖాళీ గుడిసెలు, బోసినోరుల్లా కనిపించే వాకిళ్ళూ తప్పితే మరొకటి కన్పించదు ఇది నేరుగా పోయే ముఖ్య మార్గం మునుపు అతడు ఆ దారిన వచ్చినప్పుడు ప్రయాణీకుల గుంపులు ఎన్నో కన్పించాయి ఇరుప్రక్కలా గ్రామాల్లో కుక్కల అరుపులు విన్పించాయి మజిలీల్లో ప్రయాణీకులు గుంపులు గుంపులుగా కూర్చొని ఏవో కబుర్లు చెప్పుకుంటుండేవారు కాని ఇప్పుడా దారిలో ఒక్క మనిషి జాడగానీ, పశువు జాడగానీ లేదు ఈ నిర్మానుష్య దృశ్యం భీతి గొల్పుతోంది. గుండెదడ ఎక్కువైంది. ఇలా ఎవరూ కన్పించకపోతే మతి భ్రమిస్తుందేమోననే భయం కలిగింది

నలువైపులా నిశ్శబ్దమే దిక్కులన్నీ శూన్యహస్తాలను చాపి గొంతు పిసుకుతున్నట్లు అతనికొక క్షణంలో భ్రమ కలిగింది

సామంతుడు ఇంకా పసివాడే అలాంటి ఒంటరితనాన్ని ఎన్నడూ భరించి ఎరుగడు. ఒక్కసారి బిగ్గరగా అరుద్దామనుకున్నాడు ప్రాణం బిగబట్టి ఎలాగో అరిచాడు దాని ప్రతిధ్వనే వచ్చి అతని చెవుల్లో ప్రవేశించింది వణుకుతూ నలువైపులా చూచి సోమనాధుని స్మరించుకుంటూ ఒంటెను ముందుకు పోనిచ్చాడు అతను ముందుకు పోతున్నాడనా? కాదు, హృదయాన్నావరిస్తూన్న భయం నుంచి తప్పించుకొని దూరంగా వెళుతున్నాడు

ఇంతలోకే ఒక పెద్ద మజిలీ వచ్చింది అక్కడైనా తప్పకుండా ఎవరైనా కలవక పోతారా అని అనుకున్నాడు. భమ్మరియా ఆట్టే దూరం లేదిక అతని తండ్రి కూడా ఈ పాటికి అక్కడికి వచ్చే ఉంటాడు. వచ్చి ఉంటాడా? వచ్చి ఘోఘాబాబుకు సోమనాధుని ఆదేశం వినిపించేందుకు వెళ్ళి ఉంటే? వెళ్తే ఆయనదే పైచేయి, తాను ఓడిపోతాడు అక్కడ తన రాకకు బంధువులంతా ఎదురు చూస్తుంటారు. ఈ భయంకరమైన ప్రయాణం గురించి విని గర్వంతో ఉప్పొంగిపోతారు గజనీ మహమ్మదుకు భయపడి అంతా పారిపోతున్నారే! మరి తానో? ఎంత మూర్ఖులీ ప్రజలు

ఘోఘాబాబును నిర్జించి వాడు ముందుకు రావడమా? అమిరు సాక్షాత్తూ రావణుడే కావచ్చు మరి ఘోఘా దుర్గం దాటి వుంటే కనీసం వాని జాడైనా కనిపించవద్దూ?

ఇలా సంకల్ప వికల్పాలతో మధ్యాహ్నం అంతా ఒక గుడిసె నీడలో గడిపాడు రాక్షసుల దురాగ్రహానికి భస్మమైపోయిన నగరాల గురించి అతడు ఎన్నో కథలు చిన్నప్పుడు విన్నాడు ఈ మజిలీ అచ్చంగా అలాగే ఉంది బావిలో నీళ్ళు ఉన్నాయి కానీ కదలిక అంటూ లేదు చేదతాడు బిగిసి పనికిమాలినదైంది మందిరంలో దేవి విరాజిల్లుతున్నది కానీ ధూప, దీప, నైవేద్యాలు లేవు మూడు గుడిసెలు చెక్కుచెదరకుండా ఉన్నాయి. కాని ఒక్క పురుగు లేదు వాటిలో

ఒక గుడిసెలో పొయ్యి మీద ఏదో వండిన వస్తువు ఉంది క్రింద కట్టె లారిపోయి ఎన్నాళ్ళయిందో ఓ మూల నున్న మూకుడు నుండి మెతుకులను చీమలు బారులుగా తీసుకొని వెళుతున్నాయి ఏ మహాశాపం వల్లనో నిర్మానుష్యమైన శూన్యప్రదేశంలా ఉన్నదా మజిలీ

కొంతసేపటికి నెమ్మదిగా అతనికి భయం తొలగడం మొదలు పెట్టింది తన పిరికి తనానికి తనకే కోపం వచ్చి, తాను చౌహాను వీరుడే? - ఘోఘారాణా పౌత్రుడే? సాక్షాత్తు సోమనాధుని వార్తాహరుడే- ఈ విధంగా దిగజారిపోయి ఢీలా పడడమా? సాహసం కోల్పోవడమా? పెదవులు నొక్కుకుంటూ మనస్సును ఆవరించిన సంక్షోభాన్ని అణుచుకున్నాడు లేచి తిరిగి ప్రయాణానికి సిద్ధమైనాడు

దారిలో వేలకు వేలుగా గజనీ మ్లేచ్ఛులు అడ్డు నిల్చున్నా సరే- అతడు ఘోఘా దుర్గం చేరి తీరాలి తప్పదు అలా ఒంటె మీద కొంత ముందుకు నడవగానే దూరంగా ఆకాశంలో దుమ్ము కన్పించింది తప్పకుండా ఎవరో మనుష్యులై ఉండాలి ఆ దారినే వస్తున్నట్లున్నారు అబ్బ! ఎన్ని రోజుల తరువాత కంటికి మనిషి అంటూ కన్పించాడు? పరమ శత్రువైనా సరే మనుష్యులే కదా! వాళ్ళను చంపలేకపోవచ్చు కనీసం యుద్ధంలో హుంకరించవచ్చు తన రక్తం చిందితే, ఒక్కడి రక్తానైన్నా తాను ప్రవహింపచేయవచ్చు కానీ, నిర్మానుష్యం మాత్రం మహాదారుణం యుద్ధం అలా వున్నా, కనీసం మానవ సంసర్గం లభిస్తుంది కదా!

ఇలా అనుకుంటూ ధనుర్బాణాలను పదిలపరచుకున్నాడు ఒరలోని కత్తిని వదులు చేసుకున్నాడు పిడిబాకు తీసి చూసి బొడ్లో పదిల పరచాడు దూరాన ఆకాశపుటంచుల్లో రెండు ఒంటెలు చిన్న బొమ్మల్లా కన్పించాయి సామంతుని ఆనందానికి అంతు లేదు ఇద్దరు మనుష్యులు అతని వైపే మహావేగంగా వస్తున్నారు

దప్పిగొన్నవాడు జలాశయాన్ని చూచి పరుగెత్తినట్లు అతను కూడా వారివైపుకే ఒంటెను పరుగెత్తించాడు భయం తొలగి పోయింది అలా ఒంటెను పరుగెత్తిస్తూ సామంతుడు ఒక పొలికేక వేశాడు వచ్చే వ్యక్తులు కూడా అలాగే కేకలు వేశారు మానవ కంఠధ్వని వినిపించేసరికి సామంతునికి ఎంతో సంతోషం కలిగింది ఆ సంతోషంతో పూర్వపు సాహసమంతా తిరిగి వచ్చింది ఒక క్షణం క్రితం వరకు అతనిలో వ్యాపించిన దౌర్బల్యాన్ని తలచుకొని నవ్వుకొంటూ ముందుకు సాగాడు

''ఎవరయ్యా మీరు'' అని వారిలో పెద్దవాడు బిగ్గరగా కేక వేశాడు యువకుడు విల్లెక్కుపెట్టి సిద్ధంగా ఉన్నాడు సామంతుడిని చూచి 'జై సోమనాథ్' అని బిగ్గరగా గర్జించి కత్తిదూసి పోరాటానికి సిద్ధంగా నిలుచున్నాడు

''ఎక్కడికి వెడుతున్నావ్?'' అని పెద్దవాడు మళ్ళీ అడిగాడు

''ఘోఘా దుర్గానికి ''

ఒంటెలు దగ్గరకు వచ్చాయి

''ఎక్కడ నుంచి వస్తున్నావ్?''

''ఝాలోర్ నుంచి ఏం? ఏమిటి సంగతి'' అని కొత్తవాళ్ళ ప్రశ్నలకు విసిగి సామంతుడడిగాడు వాళ్లకూడా సామంతుని తలపాగా తీరును చూచి గుర్తించారు

''చౌహానువీరా! దారిలో మ్లేచ్ఛసైన్యం జాడ ఎక్కడైనా తెలిసిందా?''

సామంతుడదిరిపడి ''తెలియలేదే! మీ రెవరో చెప్పలేదు '' అని అడిగాడు

''మేం ''ఘోరవిటుల'' నుంచి వస్తున్నాం'' అన్నాడు పెద్దవాడు

''అయితే వాడి సైన్యమే కన్పించలేదా? ఆశ్చర్యంగా ఉందే- ఇంతకూ వాడెటు పోయినట్టూ?'' అన్నాడు రెండోవాడు

''నాకేం తెలుసు. దారిలో పాడుపడ్డ ఇళ్ళూ, ఊళ్లూ నిర్మానుష్యంగా వున్న మజిలీలు మాత్రమే కన్పించాయి ''

''ఇంతకూ వాడు ఎటు సాగిపోయాడు?'' అని పెద్దవాడు రెండోవాణ్ణే అడిగాడు

''మీరు వాణ్ణి ఎక్కడ చూచారు?'' సామంతుడు అడిగాడు

''మాకా? మాకెక్కడా కన్పించలేదు''అంటూ పెద్దవాడు మహాశౌర్యం ఉట్టి పడేట్టు నవ్వాడు

''ముల్తాన్ నుంచి బయలుదేరాడట.''

వాళ్ళిద్దరూ బిగ్గరగా నవ్వుతున్నారు ఆ నవ్వులో కర్కశత్వమూ, కఠోరభావమూ తొంగిచూస్తున్నాయి సామంతునికా నవ్వులోని ఆంతర్యం బోధపడలేదు పెద్దవాడు సామంతుణ్ణే ప్రేమతో చూస్తూ సమీపించాడు.

''ఏం బాబూ!'' అని ప్రేమతో, కరుణ ఉట్టిపడే మాటలతో ''ఘోఘా దుర్గం ఎందుకు వెళుతున్నావు?'' అని అడిగాడా పెద్ద వ్యక్తి

సామంతునికి నవ్వు వచ్చింది ''ఎందుకంటారేమయ్యా! ఘోఘా దుర్గం నా యిల్లు నేను ఘోఘారాణా పౌత్రుణ్ణి అక్కడికి కాక మరెక్కడికి పోవడం?''

కొత్త వ్యక్తులు ఒకళ్ళ నొకళ్ళు చూచుకున్నారు ఆ చూపుల్లో అర్థం గాని భావం ఏదో ఉంది పెద్దవాడు తన ఒంటెను సామంతుని ఒంటె దగ్గరకు పోనిచ్చి ప్రేమతో అతని వీపు నిమిరాడు

''చౌహాన్! ఎన్ని రోజులైంది బాబూ ఘోఘా దుర్గం నుంచి వెళ్ళి?''

''నేనా, మూడు మాసాలకు పైన కావచ్చింది '' అశ్రుసిక్త నేత్రాలతో సామంతుణ్ణి చూస్తూ ''ఈ మూడు నెలల్లో మూడు యుగాలు తలక్రిందైనాయి బాబూ నీవు మాతో రా వెళ్దాం'' అన్నాడు ఆ పెద్ద యోధుడు

పెద్దయోధుని మాటలు ఏదో మహావిపత్తును సూచిస్తున్నట్లనిపించింది సామంతునికి ''ఏం? ఏమైంది? వివరాలు చెప్పరేం?''

''ఇదంతా అడగకుండా ఉండడమే మంచిది నీవు వెనక్కు వెళ్ళు లేకపోతే మాతో రా ఈ మూడు నెలల్లో పృథ్వి రసాతలానికి కుదించుకు పోయిందయ్యా చౌహాన్ ''

''ఇంతకూ ఏం జరిగిందో చెప్పరేం?''

''ఏమిటి జరుగుతుంది? మన తేజం నాశనమై పోయింది'' అని అంటుంటే పెద్ద యోధుని కన్నుల్లో నీరు నిండింది

''చౌహాన్! బాలమదేవ మహారాజు వీరస్వర్గం పొందారు అతనితో పాటు ఇరవై యైదువేల ముప్పైయిద్దరు సైనికులు కూడా చనిపోయారు సపాదలక్ష శ్మశానం అయి పోయింది ''

''మరి మ్లేచ్ఛుడు?''

''మ్లేచ్ఛుడు గెలిచాడు రాజపుత్రులు చెల్లాచెదరై పోయినారు సారంగదేవుడు, రావులక్ష్మణ్ ఘోరవిటలిలో వున్నారు ''

''ఇంతకూ మరి మ్లేచ్ఛుడు ఎటు వెళ్ళినట్లు?''

''ఘోరవిటలిని ఎదిరించే సాహసం లేక వాడు ఎడారిలో పారిపోయాడు ఎటు వెళ్ళిందీ ఇంతవరకూ తెలియదు ''

''వాడిని వెదికేందుకు బయలుదేరారా మీరు?''

''అవును వాడి సైన్యం బెదిరిపోయింది అతని జాడ తెలిస్తే రాజపుత్రుల పౌరుషం చవి చూపవచ్చు ''

''అయితే నేను ఝూలోర్ నుంచి నేరుగానే వస్తున్నాగా దారిలో వాడు ఎక్కడా లేడు ''

''తప్పించుకొని పోయినట్లుంది '' అని పెద్దవాడు, తన అనుచరునితో అని సామంతుణ్ణి చూస్తూ ''రా!చౌహాన్ వీరా!మాతోరా వెళ్దాం-సారంగ దేవమహారాజు ప్రేమతో నిన్ను దరిచేర్చుకుంటారు'' అన్నాడు

''వీల్లేదు నేను తక్షణం బయల్దేరి ఘోఘాబాబు దగ్గరికి వెళ్ళాలి ''

''వద్దు వీరా! వద్దు మాతోపాటేరా'' అన్నాడు రెండవ వాడు

''మీతో రావడమేమిటి? నేను సూటిగా ఘోఘా దుర్గానికి వెళ్లాలి సరే! ఇక వెళ్లి వస్తా చీకటి పడేలోగా భమ్మరియాకు చేరుకోవచ్చు''

''వద్దు చౌహాన్! వద్దు - వెళ్ళవద్దు ''

''కాదు - నేను వెళ్ళక తప్పదు ''

''ఎవరు పొమ్మన్నారయ్యా నిన్ను?''

''ఎవరా? రాజపరమేశ్వరుడు శ్రీ సోమనాధుడు ''

''ఏమిటి నాయనా ఏమిటి?'' అంటూ సామంతుని ఒంటెను ఆపుదామని ప్రయత్నించాడు పెద్దవాడు

సామంతునికి అనుమానం కలిగింది ఈ రాజపుత్రులు ఆగమని తన్నెందుకని బలవంత పెడుతున్నారు? వీళ్ళు మ్లేచ్ఛుని బానిసలు కాదు కదా!

''అది ఘోఘాబాబుకు మాత్రమే చెప్పవలసిన విషయం'' అని గర్జిస్తూ సామంతుడు ఒంటెను వేగంగా నడిపించాడు అతని హృదయంలో ఉత్సాహపు కడలి పొంగింది కనుచూపు మేర ఘోఘా దుర్గం కన్పిస్తుంటే అతడు తిరిగివెళ్ళడమా!

పెద్ద యోధుని కన్నుల్లో నీరు నిండింది ఒక దీర్ఘమైన నిట్టూర్పుతో రెండవ వాణ్ణి చూచాడు అతని కన్నుల్లో కూడా నీరు తళతళ లాడింది అలా చాలా సేపు మూగ జీవాల/వలె ఉత్సాహంతో పురోగమించే సామంతుణ్ణి చూస్తూ నిల్చున్నాడు

భమ్మరియా చేరేంతవరకూ దారిలో మరెవ్వరూ సామంతునికి కన్పించలేదు అందుకని విషయాలన్నీ వివరంగా ఆలోచించుకోడానికి తగిన అవకాశం లభించింది. ముల్తాన్ అమీరుకు వశమైంది సపాదలక్ష సర్వనాశనమైంది చౌహాన్ వీరశిరోమణి యైన బాలమదేవుడు వీరస్వర్గాన్ని చూరగొన్నాడు అమీరు ఘోరవిటలిపై పడకుండా

ఏదారినో ముందుకు వెళ్ళాడు దారిలో గ్రామాలకు గ్రామాలు పారిపోయాయి. అయితే ఘోఘాదుర్గం ఏమైనట్లు? ముల్తాన్ నుంచి సపాదలక్షకు వచ్చే దారిలోనే కదా ఘోఘా దుర్గం ఉన్నది మరి? మ్లేచ్ఛుడు దీన్ని నేలమట్టం చేశాడా? లేక ప్రక్కగా తప్పుకొని సూటిగా సపాదలక్షకే వచ్చాడా? మరి ఘోఘాబాబు పరిస్థితి ఎలా వుంది? తన తండ్రి గతి ఏమైందో? సామంతుని హృదయం అనూహ్యమైన బాధతో మూలిగింది దృష్టి ఆకాశపుటంచులను వెదుకుతున్నది నోట సోమనాధుని నామం నర్తిస్తున్నది జ్యోతిస్వరూపుడైన సోమనాధ పరమ మహేశ్వరుని అజ్ఞాపాలకులగు తను, తన కుటుంబం- వీటి గతి ఎలా వ్రాసిపెట్టి ఉందో!

సామంతుని ఉత్సాహం సన్నగిల్లి, నిరాశ అలముకున్నది దూరాన భమ్మరియా దుర్గం కన్పించేసరికి అతనిలో ఒక క్షణికమైన ఉద్రేకం దీప్తించింది. మరుక్షణమే దుర్గం మీద ఎగురుతున్న గ్రద్దల గుంపు అతనికి కన్పించింది. మహా దుఃఖంతో 'అయ్యో' అని బిగ్గరగా అరిచాడు

ఆ విశాలమైన - నిర్జనమైన - ఏకాంతపుటెడారిలో ఆరు వందల అడుగుల దిబ్బపైన భమ్మరియా దుర్గం మృత్యుశాంతితో నిల్చున్నది ఎటు చూచినా నిర్మానుష్యం. నిశ్శబ్దం

భమ్మరియా కోట ఘోఘా దుర్గానికి రక్షణ దుర్గం అక్కడే దుర్గం నాయకుడుంటాడు భటులు కొందరు, కొన్ని ఒంటెలు కూడా ఉంటాయి ఒక రాజ సౌధం కూడా అక్కడ ఉంది దారినపోయే బాటసారులక్కడ విశ్రాంతి తీసుకుంటారు ఘోఘాబాబు ఆతిధ్యాన్ని పొందుతారు. బాటసారులకూ, యాత్రికులకూ, ఒంటెలకూ ఈ ప్రదేశమంటే చాలా యిష్టం అందుకని ఎక్కడ చూచినా సందడిగా ఉంటుంది అలాంటిది తలుపులన్నీ తెరచుకొని బోసినోరులా ఆ దుర్గం మహా భయంకరంగా కన్పిస్తోంది ద్వారం ముందు బాటసారులూ, ఒంటెలూ కన్పించడంలేదు సామంతుని హృదయంలో బాధ తీవ్రమైంది అశ్రుసిక్త నేత్రాలతో పైకి చూచాడు నిరంతరం భమ్మరియా మహదేవుని ధ్వజంతో శోభించే స్తంభం నేడు బోసిగా ఉంది ఘోఘాబాబు స్వాభిమానానికి పరమచిహ్నమైన ఆ ప్రతీకం నశించిపోయింది సామంతుని కండ్ల ముందు చీకట్లు అలముకున్నాయి కన్నీటిని తుడుచుకొని తిరిగి చూచాడు మాంగల్యాన్ని కోల్పోయిన స్త్రీవలె, భమ్మరియా ధ్వజం లేకుండా సౌభాగ్య విహీనయై ఉంది దుఃఖం గొంతులోకి పొంగుకొని వచ్చింది వెంటనే అక్కడి నుంచి ఒంటెను ముందుకు పరుగెత్తించాడు

నిజమే ఈ నిశ్చేతనమైన వాతావరణంలో తన ఒంటె తప్పితే కదిలేది ఇంకేదీ లేదు యమ మందిర ద్వారాల్లా- కోట తలుపులు కదలిక లేకుండా వున్నాయి బురుజులు అలాగే ఆకాశ మెత్తున ఉన్నాయి కాని ఎక్కడా పదధ్వని విన్పించలేదు ఒంటె మహా వేగంగా కోటకు చేరింది సామంతుడు ద్వారాలను సమీపించాడు ఒక ద్వారాన్ని ఎవడో విరగ గొట్టాడు లోపల ప్రవేశించగానే అన్నీ ఖాళీ గదులే కన్పించాయి ఒక గబ్బిలం తప తప కొట్టుకుంటూ వచ్చి అతని చుట్టూ తిరిగి వెళ్ళిపోయింది అబ్బ ఎంత భయానకం! తను ఇంతకు ముందు విశ్రమించిన మజలీవలె ఈ దుర్గం కూడా ఏ మహాశాపం వల్లనో, నిర్మానుష్యమై, చైతన్యశ్రీని కోల్పోయి పాడుపడింది అంతా మునుపటిలాగే ఉంది ప్రాణి సంచారం లేకుండా ఎన్నడూ అంగుళీయ స్పర్శకు నోచుకోని మధుర వాద్యంలా - నిశ్చేతనమై ఉన్నది ఈ నిర్మానుష్యాన్ని ఎలా భరించడం? సామంతుడు ఒంటెను దిగి ముగుతాడు పట్టుకొని నడక ప్రారంభించాడు

దుర్గ నాయకుని ఇల్లు బార్లా తెరచి వున్నది తలుపు దగ్గరకు వెళ్ళి గడప మీద నిల్చున్నాడు అలా నిల్చుని ఉలిక్కిపడ్డాడు ఆ నిశ్శబ్దంలో ఏదో భీతినిగొల్పే ధ్వని వస్తోంది ఒక పెద్ద ఎలుక పట్టపగలు చీకూ చింతా లేకుండా దేన్నో పట పట కొరుకుతున్నది బెదురనేది లేకుండా ఆ ఎలుక సామంతుణ్ణి నిలువునా చూచి ప్రక్కనే వున్న కన్నంలోకి జొరబడ్డది అతను లోపలికి నడిచాడు దుర్గ నాయకుణ్ణి పిలవాలనే చైతన్యం కూడా అప్పటికి అతనిలో లేదు

తనను చంపడానికి ఎవరో వెనుక నుంచి తరుముతున్నట్లు తలచి మధ్య మధ్య వెనక్కు చూచేవాడు మధ్య మధ్య తన పదధ్వనినో, ఒంటె అడుగుల సవ్వడినో విని నిలవునా కంపిస్తూ ముందడుగు వేయలేక అక్కడే నిల్చునే వాడు - పెద్ద సుత్తి దెబ్బల్లా అతని గుండె దడ, మెదడును కంగారు పెడుతోంది

ఒకసారి చెట్టు ఆకులు కదిలేసరికి అతను ఉలిక్కిపడ్డాడు మహా భయంతో ''ఎవరది'' అని బిగ్గరగా అరిచాడు-కాని ఆ అరుపే పాతిపెట్టిన మనిషి గొంతులోంచి వచ్చి నట్లు పాతాళం నుంచి వచ్చినట్లు ప్రతిధ్వనించి అతని చెవుల్లో జొరబడ్డది

సామంతుడు గుండె రాయిచేసుకొని, 'దుర్గ నాయకా, దుర్గ నాయకా, దుర్గ నాయకా' అని ముమ్మారు ఎలుగెత్తి అరిచాడు కాని అదే శబ్దం 'దుర్గ నాయకా, దుర్గ నాయకా, దుర్గ నాయకా' అని దుర్గమంతటా ప్రతిధ్వనించి మారుమ్రోగింది సామంతుడు తండ్రిని తలచుకున్నాడు ఇక్కడే తన కొరకు ఎదురు చూస్తూంటా నన్నాడు కదూ! 'నాన్నా! నాన్నా! నాన్నా!' అని ఏడుస్తూ బిగ్గరగా ఆర్తనాదం చేశాడు

మళ్ళీ అవే పదాలు వికటంగా ప్రతిధ్వనించాయి ఒంటె ముగుతాడు వదలిపెట్టి అలా దుఃఖంతో మందిరం వైపు పరుగెత్తాడు పండ్లు భయంతో గజగజ మంటున్నాయి శరీరంలో రోమ రోమం కంపించిపోతున్నది ఆ ఏకాంతంలో పెద్ద దయ్యాల గుంపు వెనుకనుంచి తరుముతున్నట్లు తోచి ముందుకు పరుగెత్తాడు అతనికి గాలి పీల్చుకొనే శక్తి కూడా లేదు ఎదురుగా అదిగో భమ్మరియా పరమేశ్వరుని దేవాలయం! మసక మసకగా అతని కది కన్పించింది ధ్వజ దండం తునా తునియలైపోయింది కలశాన్ని ఎవరో- ఎవరో- పగులకొట్టారు నల్లని పాల రాయి నందీశ్వరుని విగ్రహం రెండు ముక్కలై చెదురువాటుగా పడి ఉంది తన చుట్టూ సృష్టి మహా ప్రళయం తాండవం చేస్తున్నట్లు అతనికి అనిపించింది కండ్లు ఎర్రని జ్యోతుల్లా, భయాందోళనలతో అమానుషంగా రూపొందాయి శ్వాస ఆగిపోతున్నది కనురెప్పలు బరువుగా అదిరిపోతున్నాయి అలా మందిరంలోకి జొరబడి- ''తండ్రీ! శంభో, శంభో, శంభో'' అని గుండెలు వ్రయ్యలయ్యేట్లు ప్రతిధ్వనించింది

అతను పరమేశ్వరుణ్ణి సమీపించాడు చీకటి పొరలు క్రమ్మి కంటికి ఏమీ కనిపించ లేదు రెండు చేతులు జోడించి నమస్కరించాడు ఇష్ట దైవమూ- తండ్రి యైన పరమేశ్వరుని శరణు వేడాడు వెక్కి వెక్కి ఏడుస్తూ రాతి గడప మీద తల పెట్టి కన్నీరు వరదలుగా కారుస్తూ కాసేపు పడి వున్నాడు

తరువాత లేచాడు కండ్లు చీకటికి కొంచెంగా అలవాటు పడ్డాయి కొద్దిగా కని పిస్తోంది కూడా అలా తేరిపార జూచి ఒక్కసారిగా మహా భయంకరంగా వెర్రికేక వేసి వెనక్కు వచ్చాడు వికృత భూత, ప్రేత గణాలను చూచినట్లు రెండు కండ్లూ గట్టిగా మూసుకున్నాడు.

అక్కడ తన కుల దేవుడైన భమ్మరియా మహాదేవుని శివమూర్తి - రెండు తునకలై విడిగా పడి ఉంది ఉన్మాదిలా గుడ్లు తెరచుకొని మహా వికారంగా ఒకసారి- రెండుసార్లు- మూడుసార్లు బిగ్గరగా ఆర్తనాదం చేశాడు అతనికి స్పృహ తప్పడం మొదలైంది అలా వెనక్కు వెనక్కు జరుగుతూ గోడ కానుకొని క్రిందికి జారి పడిపోయాడు. దేవాలయం గిరగిర తిరుగుతోంది శివమూర్తి వెనుక ఎవరో ఒక వృద్ధుడు చేతిలో దీపం పట్టుకొని కనిపించాడు వృద్ధుణ్ణి ఎక్కడో చూచినట్లే వున్నది ఎక్కడా, ఎప్పుడూ అన్నది జ్ఞాపకం లేదు

ఇంతలో ఒక గబ్బిలం వచ్చి గిరగిర తిరుగుతూ అతణ్ణి తన్ని ఎగిరిపోయింది ఆకాశం బ్రద్దలయ్యేట్లు మహా భయంకరంగా అరిచి సొమ్మసిల్లి మూర్ఛపోయాడు తరువాత నలువైపులా కటిక చీకటి వ్యాపించింది

## 3

సామంతుని మెదడులో ఒక చిన్నారి సుందరి నర్తిస్తున్నది ఆమె అతని వైపు చూచి నవ్వింది కోమల హస్తంతో నుదుట విభూతి పూసి, ''వీరా! త్వరగా వస్తావు కదూ'' అన్నట్లు అతనికి వినిపించింది ఎవరో చేత్తో ఏదో తన చేత త్రాగించారు ఎవరి దా చేయి? ఆమెది కాదుకదా! ఆమెదే! ఆమెదే! ఆ అమృత హస్తాలు కాక సెగల నెరబోసే తన నరాలకు ఇంకేవి శాంతి నీయగలవు? అతనా చేతిని పట్టుకున్నాడు అవును ఆమె చేయే అలా అతనా చేతిని అదిమి పట్టుకున్నాడు ఈ జన్మలో- జన్మ జన్మాంతరాలలో - ఈ చేతులను ఇంకెవ్వరూ విడదీయలేరు రెండో చేయి అతని కపోలా లను మృదువుగా స్పృశించింది అతను కండ్లు తెరవాలని ప్రయత్నించాడు కాని లాభం లేకపోయింది ఆ సుందర వదనాన్ని చూడాలని బరువుగా రెప్పల నెత్తాడు కాని ఇదేమి విపరీతం? అతడా మృదువదనాన్ని చూడాలని ప్రయత్నిస్తుంటే అతనికిది ముదివగ్గు, ముడుతలు పడ్డ ముఖం గోచరించింది ఈ ముఖం ఆమెది కాదు ఎవరో పరిచితుడే ముసలివాడు ఆ ముసలి కన్నులు అశ్రుసిక్తమై స్నేహార్ద్రంగా అతణ్ణే చూస్తున్నాయి

కష్టపడి ఎలాగైతేనేం కండ్లు పూర్తిగా తెరిచాడు ఆ వ్యక్తిని పోల్చుకున్నాడు చిన్న నాటినుంచి చూచిన రూపమే అది అతని దగ్గరే తాను బలపం పట్టుకోవడం నేర్చు కున్నాడు ఆ వ్యక్తి ముఖంగానే తాను గాయత్రి నభ్యసించాడు అతనికి గుర్తు వచ్చింది ఈ రూపం రాజ గురువైన నందిదత్తుల వారిది కదూ!

''రాజగురూ'' అంటూ లేవబోయాడు నడుము విరిగిపోతున్నది నందిదత్తుని చేయూతతో లేచి కూర్చుని నలువైపులా భయాందోళనలతో చూచాడు

ఇదే ఇదే భమ్మరియా దుర్గం ఇదే ఆ శివమందిరం- ఇక్కడే శివమూర్తి ముక్కలై పడియున్నది వృద్ధ రాజ గురువు అతని వైపే చూస్తున్నాడు పరిసరమంతా నిశ్చేతనంగా ఉన్నది

''శాంతించు నాయనా- శాంతించు కొండంత బరువు నీ నెత్తిన ఉన్నది మరి ఇప్పుడే ఇలా అయితే ఎలా?''

''రాజ గురూ! ఏమిటండీ ఇదంతా! దుర్గం ఇలా . ఇలా యైపోయిందేం స్వామీ! మందిరం ఇలా ఎందుకున్నది? దేవదేవుడు నా దేవదేవుడు ఈ విధంగా ముక్కలై పడి వున్నా డెందుకండీ? మా ఘోఘాబాబు '' అంటూండగానే అతని కంఠం రుద్ధమైంది ఆపైన నోట మాట రాలేదు

''శాంతించకపోతే లాభం లేదు నాయనా సృష్టిని ప్రళయమావరించింది ''

**4**

''ఈ పాడుపడ్డ ప్రపంచంలో మిగిలింది నీవ్వూ, నేనే''

''ముందు ఘోఘాబాబు ఎక్కడున్నాడో చెప్పండి''

''నా స్వామి- ఆ అక్షయకీర్తి సంపన్నుడు- కైలాసంలో విరాజిల్లుతున్నాడు''

''ఆఁ ఘోఘాబాబు స్వర్గస్థులైనారా  శివశివా! ఏమి విపరీతం '' క్షణం ఆగి,

''మిగతా వాళ్ళేమైనారు? భమ్మరియా ఇలా పాడుపడిందెందుకు? చెప్పండి స్వామీ త్వరగా చెప్పండి ''

''చెప్పమంటావా? చెపితే వినే శక్తి ఉందా నాయనా?''

''ఉన్నది  ఉన్నది చెప్పండి  ఏం జరిగిందో చెప్పండి స్వామీ!''

''అయితే ఎన్నడూ కలలోనైనా అనుకోని విషయాలవి ముందీ మందు తీసుకో కొంత శాంతిస్తుంది ఇదిగో ఈ జావకూడా ''

మందు, జావ త్రాగేటంతవరకు నందిదిత్తుడు సామంతుణ్ణి ప్రేమతో చూస్తూ కూర్చున్నాడు

''చెబుతున్నా నాయనా చెబుతున్నా చెప్పాలంటే నా హృదయం దడదడలాడి పోతున్నది అయినా ఇలాంటి ఘట్టం ఎక్కడా- ఏ పురాణ ఇతిహాసాల్లోనూ- కన్పించదు సూర్య వంశీయుల కీర్తి సూర్యునిలా ప్రకాశిస్తున్న మాట నిజమే కాని ఘోఘారాణా ప్రతాప దీప్తుల ముందు ఆ ప్రశంస వెలవెల బోవలసిందే ఈ ఘట్టం జరుగుతుండగా చూచి- చెప్పేటందుకే పరమేశ్వరుడు నన్నింకా బ్రతికించి ఉంచాడు ఆయన ఋణం నేనెలా తీర్చుకోగలను?''

సామంతునికి ఓపిక సన్నగిల్లింది ''త్వరగా చెప్పండి  నేను వెళ్ళినప్పటి నుంచి ఈనాటి వరకు జరిగిన సంగతులన్నీ చెప్పండి''

''మీ తండ్రీ కొడుకు లిద్దర్నీ సాగనంపి నేను తిరిగి వచ్చాను జ్ఞాపకం ఉందా? నేనపుడు ఘోఘాబాబు దగ్గరికి వెళ్లాను చాలాసేపు మీ యిద్దరి శౌర్యాన్ని గురించే ముచ్చటించుకున్నాం మీ యిద్దరి వల్ల వంశం తరిస్తుందన్నారు ఘోఘాబాబు ''

''తరువాత?''

''కొన్నాళ్ళకు గజనీ మహమ్మదు బ్రహ్మాండమైన సైన్యంతో సోమనాథ పర[illegible] విధ్వంసానికి వస్తున్నాడని తెలిసింది ఆ వార్త విన్నప్పుడు మే మందరం [illegible] కున్నాం'' అని దీనంగా రాజ గురువు నిట్టూర్చాడు.

''ఘోఘాబాబు మీసాలు త్రిప్పుతూ అట్టహాసంతో 'రారా[illegible]లాహ కోటలో భీమపాలుడున్నాడు ముల్తాన్‌లో అజయసింహుడు కాచుకొని [illegible]వాడారి

ముఖ సీమలో నేనున్నాను  సపాదలక్షలో మా వీరకేసరి బాలమదేవుడున్నాడు  ఇక గడ్డి కరిపిస్తాం రారా'   అని గర్జించారు ''

''తరువాత?''

''కొన్ని రోజుల తరువాత విచారకరమైన వార్తలు వచ్చాయి  జయపాలుని పుత్రుడు భీమపాలుడు- తన గౌరవాన్ని మంట కలిపి మ్లేచ్ఛునికి దారి ఇచ్చాడు  ప్రాణాలకై మానాన్ని అమ్ముకున్నాడా నీచుడు - పిరికి పంద'' అంటూ వృద్ధుడు ముఖం త్రిప్పుకున్నాడు సామంతుడేమీ పలుకలేదు  ప్రాణాల కోసం మానాన్ని అమ్ముకోడం అతడూ చూచాడుగా!

''తరువాత ముల్తాన్ రాజు అమీరుతో చేరాడు  సూర్య, చంద్ర వంశీయులు గడ్డి కరచి అతని పాదదాసులైనారు  ముల్తాన్‌లో అలా అమీరు రాత్రింబవళ్లు వేడుకలు జరిపాడు  గోబ్రాహ్మణ సంరక్షణ విడిచి రాజపుత్రులు పరమేశ్వర విధ్వంసానికై వాడికి బాసటగా నిలిచారు  తరువాత ఒక రోజున అమీరు ఘోఘాబాబుకు సందేశం, సంధి, కానుకలు పంపాడు ''

''ఏమిటీ?''

''మే మందరం దర్బారులో మ్లేచ్ఛుని సందేశం వినేటందుకు కూర్చున్నాము ముల్తాను దాకా మ్లేచ్ఛుడు వచ్చాడని విన్నప్పటినుంచే ఘోఘాబాబు మాట్లాడడం మానివేశారు  వారికి కోపం వస్తే ఎలా కనిపించేవారో జ్ఞాపకం ఉందా? వారి కన్నుల్లో విద్యుల్లత మెరుస్తుండేది  పెదవులను బిగించి తల పంకించేవారు. మీసాలు కోపంలో భీకరంగా కనుపించేవి  అలా కోపం వచ్చినపుడు నేను తప్ప మరెవ్వరూ ఆయనతో మాటాడలేక పోయేవారు. కాని అపుడు నేను కూడా నోరు మెదల్చలేకపోయాను  ''

''తరువాత  ?''

''సంధి కానుకలను ఇద్దరు తెచ్చారు  ఒకడు యువకుడు - పేరు సాలార్ మసూద్  దీర్ఘకాయుడు పౌరుషాభిమానాలున్న మనిషి - రెండవవాడు నడివయసువాడు  దేశద్రోహి, ధర్మద్రోహి, మ్లేచ్ఛునికి సేవచేసి పలుకుబడి సంపాదించుకున్నాడు  దుబాసి పని చేస్తుంటాడు  పేరు తిలకుడు  వచ్చి రత్నమాణిక్యాల పళ్ళెరాన్ని మీ తాతగారి పాదాల దగ్గర పెట్టాడు. ఆయన ఇదంతా మౌనంగా చూస్తున్నారు. 'ఏమిటయ్యా ఇవి? ఎందుకు వచ్చారు?' అని నేనే అడిగాను ''

''తిలకుడు వినయంతో చేతులు జోడించి 'ఘోఘారాణా! మీ ప్రతాపానికి ముగ్ధుడై గజనీ అమీరైన యామినుద్దౌల్లా మహమూద్ ఈ సంధి కానుకలు పంపారు' అన్నాడు  అది వినేసరికి మీ తాతగారు ఉగ్రులైనారు. అయినా ఒక్క మాటైనా

మాట్లాడలేదు 'అతని కేమి కావాలి?' అని నేనడిగాను తిలకుడు వినయంతో 'ఈ దారిన ప్రభాస నగరం వెళ్ళేందుకు అనుజ్ఞ యివ్వమని ఘోఘా దుర్గాధిపతిని ప్రార్థించమన్నారు మా అమీరు, అని అన్నాడు ''

''అత డిది చెప్పగానే ఘోఘాబాబు చేతులు మీసాల మీదకు వెళ్ళాయి విస్ఫు లింగాలవలె మెరసే ఆ కన్నుల దీప్తి ముందు సూర్యుని తేజం కూడా వెలవెల పోవాల్సిందే ఏదో ఆశనిపాతమవుతుందని అనుకున్నాను ఎనుబది సంవత్సరాలుగా ఎవరికీ తల వంచని మహావీరుడు ఈ మ్లేచ్ఛుని ముందు తల వంచుతాడా? తిలకుడు ప్రత్యుత్తరం కొరకు ఎదురు చూస్తున్నాడు ''

కాసేపు ఎవ్వరూ పెదవి కదల్చలేదు పిడుగుపడే ముందు ఉరిమేటట్లు ఘోఘా బాబు కంఠధ్వని వినిపించింది 'మీ అమీరుకు మార్గం కావాలా? వెళ్ళి నా సోమనాథ పరమేశ్వరుని దివ్య ధామాన్ని నాశనం చేయడానికేనా? దానికై ఈ కానుకలు పంపాడా?'

''తిలకుడు అమీర్ మాటలుగా 'అవు'నన్నాడు సాలార్ మసూద్ మీసాలు దువ్వుతూ నిల్చున్నాడు ఆకాశాన్ని చీల్చుకొని పిడుగు పడ్డట్టుగా ఘోఘాబాబు ఎగిరి నిల్చున్నారు ఆయన కంఠధ్వనితో దుర్గం దద్దరిల్లింది 'పో! ఘోఘారాణా ప్రాణా లుండగా ఎడారిలో అడుగు పెట్టడానికి వీల్లేదని చెప్పు' అంటూ నిర్లక్ష్యంగా ముత్యాల పళ్ళెరాన్ని ద్వారం బయటికి తన్నారు ''

'ధన్యుడివి తాతా!' అన్నాడు సామంతుడు

''ధన్యుడా? నాయనా! అప్పుడాయన రుద్రుని అపరావతారంలా వెలుగొందారు వారి కన్నుల్లో సహస్ర సూర్యులు ప్రకాశించారు కంఠ ధ్వనిలో రుద్రుని భయంకర హుంకారం వినిపించింది బాహువుల్లో పరశురాముని శౌర్యం ఉబికింది తరువాత గంభీరమైన మౌనంతో దర్బారు విడిచి వెళ్ళిపోయారు సంధి కానుకలు తెచ్చిన ఆఇరువురూ వెలవెలబోయిన ముఖాలతో ఒకరి నొకరు చూసుకున్నారు.''

## 5

''పదిహేను రోజులపాటు యుద్ధ ప్రయత్నాలు సాగించాం దుర్గాన్ని కట్టుదిట్టం చేశాం ఆయుధాలకు సానపట్టాం వందిమాగధులు, రణగీతాలు వినిపించారు నుదుట రక్తతిలకాలు దిద్దుకొని సూర్య వంశపు వీరులంతా సంసిద్ధు లైనారు. వివిధ యుద్ధ వాయి ద్యాలు మారుమ్రోగాయి. చౌహాన్ కుల స్త్రీలు తమ భర్తలను ఉత్సాహపరిచారు నేను శత చండీ పారాయణ ప్రారంభించాను.''

''ఒకరోజు కోట బురుజు మీద నిల్చుని చూస్తుంటే కాలసర్పం జరజర ప్రాక్కుంటూ వస్తున్నట్లు ఆకాశపుటంచు నుంచి వస్తూన్న అమీరు సైన్యం కన్పించింది నేను భయంతో బెదిరిపోయాను ఇంత సైన్య మెక్కడైనా ఉంటుందా? అలా ఘోఘా బాబు వైపు చూచా ఆయన కన్నులు భయంకరంగా ఉన్నాయి కుడిచేయి కత్తి పిడితో చెరలాటం ఆడుతున్నది 'రాణాజీ! వీడి కింత సైన్యం ఉంటుందని కూడా అనుకోలేదు సుమా!' అని అన్నాను నేను ''

ఘోఘాబాబు పకపక నవ్వుతూ 'నందిదత్తా! త్రిశూలధారి అండ గలవారిని ఎవ రేమి చేయగలరయ్యా?' అంటూ కాసేపు ఆ వస్తూన్న సేనా వాహినిని చూచి హఠాత్తుగా వెనుకకు తిరిగి నా రెండు చేతులు పట్టుకున్నారు 'బ్రహ్మదేవా! మీరు మాకు కుల గురు వులు మీ ఆశీస్సులవల్ల తేజం పొంగిపొరలుతుంది నా కొక వాగ్దానం చేస్తారూ?' అన్నాడు

''సరేనన్నా! 'ఈ రాణా మాటకు ఎదురు లేదు ప్రాణాలు పోయినా సరే ఒక అంగుళం మేర కూడా వాడికి దారి యివ్వను. కాని నేను మరణిస్తే నాకు మీరే దహన క్రియలు జరపాలి సుమా! నా కొరకు పితృ కర్మలను గయలో చేయమని మా సజ్జన, సామంతులకు చెప్పాలి' అన్నారు మొదట వాగ్దానం ఇచ్చేందుకు నోరాడలేదు నా ప్రభువే లేనప్పుడు నే నెందుకు ఈ భూమికి భారంగా? కాని రాణాజీ ఆదేశాన్ని కాదనలేక అలాగే నని వాగ్దానం చేశా తరువాత ఘోఘాబాబు ఆనందంతో, ఉత్సాహంగా అడుగులు వేస్తూ రణశంఖం పూరించి సైన్య సమీకరణకు వెళ్ళారు.''

''తరువాత ఏమైంది స్వామీ?'' అన్నాడు సామంతుడు

''విధి వైపరీత్యం నాయనా ఘోఘా దుర్గంలో ఎనిమిది వందల మంది రాజ పుత్రులూ, మూడు వందలమంది ఇతరులూ ఉన్నారు ఏడు వందల మంది స్త్రీలు వున్నారు మరి శత్రుపక్షంలో ఒక మానవ మహా సాగరమే ఉప్పొంగుతున్నది అమీరు మళ్ళీ రాయబారం పంపాడు. తిలకుడు వచ్చి బ్రతిమాలాడు. 'అనవసరంగా మృత్యువాతను పడడం దేనికి' అని అన్నాడు. కాని లాభం లేకపోయింది. 'మృత్యువా? దాన్ని ఇదిగో పుట్టి నప్పటినుంచే ఈ పిడికిలిలో బంధించిఉంచా! పోయి పౌరుషం ఉంటే యుద్ధం చెయ్యమను' అని అన్నారాయన ''

''ఆ తర్వాత కోట తలుపులు మూసారు బురుజుల మీద విలుకాండ్రు గురిపెట్టి నిల్చున్నారు క్రింద ఎడారిలో నిల్చుని అమీరు పండ్లు పటపట కొరికాడు పదునెనిమిది అక్షౌహిణుల మ్లేచ్ఛ సైన్యం, పర్వతాగ్రాన కూర్చున్న గరుడరాజు వలె కోటపై విరాజిల్లు ఘోఘారాణాను ప్రశంసించింది. సాయంకాలం వరకు అమీరు ఎత్తుగడలను పరికి

స్తున్నాం అమీరు ఏమి చేస్తారు? మహోన్నతమైన ఘోఘా దుర్గాన్ని ఎవరు నిర్జించ గలరు? వాలుగా, అగాధంగా ఉన్న ఆ అగడ్త గోడమీదికి ఏనుగుకాని, గుర్రంకాని ఎక్క గలదా? ఆకాశాన్ని తాకుతున్న ఆ బురుజులమీదికి బాణాలు వేయడం మాత్రం సాధ్యమా?''-

సామంతుడు ఆత్రంతో వింటున్నాడు

''అమీరు భయపడ్డట్టు మా కనిపించింది ఘోఘా దుర్గాన్ని జయించడానికి యుగాలు పెనుగులాడాలి సోమనాథుని విధ్వంసం చేయాలనుకున్న వారి రాక్షస వాంఛ లలా చివికి పొయ్యేవే ఆ రాత్రంతా సైన్యంలో కోలాహలం వ్యాపించింది కరదీపికలు అటూ ఇటూ పరుగులెత్తాయి యుద్ధభేరీలు మ్రోగాయి. తెల్లవారుఝామున కోట ప్రక్కగా ఎడారిలో ముందుకు ప్రాకిపోతున్నదా సైన్యం మ్లేచ్ఛుడు ఓడిపోయాడు ఘోఘాదుర్గం ఎప్పటివలెనే అజేయంగా, మహోన్నతంగా నిల్చున్నది 'హరహర మహా దేవ్' అంటూ మేము చేసిన విజయ నినాదం వర్షఋతువులో మేఘగర్జనలా మ్లేచ్ఛ సైన్యాన్ని హడలగొట్టింది ''

## 6

అయినా మ్లేచ్ఛ సైన్యం సాగిపోతూనే ఉంది

''అపుడు ఘోఘాబాబుగారి కోపం ఏమని చెప్పను! కత్తి పిడి పట్టుకున్నారు. కన్నులు నిప్పులు కురిపిస్తున్నాయి '' ఆకలిగొన్న బెబ్బులిలా చూస్తున్నారాయన.

'పిరికి పందా! తప్పించుకొని పారిపోదామనుకున్నావా?' అని గర్జించారు ''ఆయన భావం మా కర్థమైంది వెనుకనుంచి అమీరు సైన్యాన్ని దునుమాడాలని ఆయన ఉద్దేశం. ఇదంతా విని రాణులందరూ వణికిపోయారు చౌహాన్ వీరులూ జంకారు. మన సంఖ్య ఎంత? మ్లేచ్ఛులో? శతసహస్రానేకులు. మహాదేవుని రక్షించడమా ఇది? కాదు. చూస్తూ మృత్యువాత పడేందుకు పరుగెత్తడమే నాకు ఆలోచించే శక్తి కూడా లేక పోయింది మౌనంగా 'శివకవచం' పఠిస్తున్నా ''

''ఘోఘాబాబు తిరిగి గర్జించారు. ఆయన ముఖంలో తొంబదేండ్ల మహోజ్వల మైన వార్ధక్య శోభ వెల్లివిరిసింది సోమనాథ మహాదేవుడే ఆయన్ను ఆవిధంగా ప్రేరేపించిన ట్లనిపించింది. 'నేను ఈ తొంభై ఏండ్లుగా సోమనాథుని ఆరాధిస్తున్నా ఈ మరుభూమిని ఏకచ్ఛత్రంగా డెబ్బైఏండ్ల నుంచి పరిపాలిస్తున్నాను. నా ఆజ్ఞ లేకుండా ఒక పక్షైనా అటు

నుంచి ఇటు, ఇటునుంచి అటూ కదలలేదే! నేడీ మ్లేచ్ఛునికి నా సోమనాథుణ్ణి ధ్వంస మొన రించడానికి దారి యిస్తానా? కుల కళంకకులారా! మీ రిక్కడే చావండి పిరికి పందలై అప్రతిష్ఠతో మరీ చావండి నేను ఈ జీవితమంతా 'జయసోమనాథ్' అనే విజయ గర్జన చేశాను నేను బ్రతికి ఉన్నంతవరకూ సోమనాథుని విజయ దుందుభులు మ్రోగుతూనే వుండాలి ''

''ప్రభూ! శత్రు సైన్యం అపారంగా ఉన్నది ఒక్కసారిగా అంతా హతమారిపోతాం అని దుర్గపాలుడు వణుకుతూనే అన్నాడు అతనన్నది నిజమే కాని ఘోఘారాణా ఉగ్రులై పోయారు ముఖం ఎర్రబారింది దుర్గ పాలుడిపై రౌద్రంతో విరుచుకుపడ్డారు ''

'మూర్ఖుడా! శత్రువు లెక్కువ మనం తక్కువ అని అనడం పిరికితనం నన్ను మోసగించి వాడు పారిపోయినాడు. ఇక నీకూ-నాకూ జీవించే అధికారం ఎక్కడుంది? సోమనాథుడు మన కప్పగించిన కార్యం నెరవేరలేదే! మనం ఊపిరి పీల్చడం కూడా ఇక పాపమేకదా! పరమేశ్వరుడే మనలనిక్కడికి పంపారు ఆయనే తిరిగి రమ్మంటున్నారు వెళ్ళండి, వెళ్ళి సిద్ధంకండి ' అంటూ రాణాజీ కత్తి దూశారు కారు చీకట్ల మధ్య మెరుపు తళుక్కుమన్నట్లు కండ్లు మిరుమిట్లుగొలిపాయి 'ధన్య-ధన్యరాణా' అంటూ నేను క్షణం స్మృతితప్పి పడిపోయాను రాణాజీ మాటలను విని ఎవరూరుకోగలరయ్యా! పరివారమంతా కత్తులు దూశారు రాజపుత్ర వీర మాతలు కంకణ నిక్వాణాలతో విజయ నాదాలు చేశారు నేను శివకవచాన్ని పఠిస్తూ అందరినీ రక్షించవలసిందిగా పరమేశ్వరుణ్ణి ప్రార్థించాను

''ఎటు చూసినా కోలాహలమే యుద్ధ భేరీలు మార్మోగాయి ఒంటెల అరు పులూ, అశ్వఘోషలూ ప్రతిధ్వనించాయి. కుంకుమ జల్లు కురిసింది సామంతా! దేవత లకు కూడా లభించని అదృష్టం - ఆ చౌహాను వీరుల యుద్ధోత్సవాన్ని చూచే అదృష్టం - నాకు లభించిందయ్యా. నా కన్నుల్లో ఆనందాశ్రువులు పొంగాయి ఆ అశ్రువుల పొర ల్లోంచి - ఆకాశం పైన విమానం మీద కూర్చుని పార్వతీ-పరమేశ్వరులు పుష్పవృష్టి కురి పించడం చూశాను ''

''ఘోఘారాణాజీ జరీ అంగరఖా తొడుక్కున్నారు కావి రంగు తలపాగా చుట్టారు. మెడలో ఎఱ్ఱని పూలమాల ధరించారు, చౌహాను వీరులంతా సిద్ధమైనారు నేను పరమేశ్వరుణ్ణి అర్చించి, కావి రంగు దుస్తులతో తేజం ఉట్టిపడుతూ నిల్చున్న ఆ పౌరుషమూర్తుల నుదుట కుంకుమ పెట్టి 'యావచ్చంద్ర దివాకరౌ' 'ఘోఘారాణా యశో గాథ మహోజ్వలమై తేజరిల్లుగాక' అని ఆశీర్వదించారు ఘోఘారాణా నన్ను

ద్వారం దగ్గరికి తీసుకొనిపోయి అందరికీ వినిపించేట్టుగా 'నందిదత్తా! నీ తండ్రి నాకు రాజ్యాభిషేకం చేసి సింహాసనం మీద కూర్చోపెట్టాడు నీవో! స్వర్గం చూరగొనే ముందు నాకు విజయమాల వేశావు. బ్రహ్మదేవా! నా కొక వాగ్దానం కావాలి. చౌహాన్ వీరులు వీర స్వర్గం అలంకరించగానే, వారి కులకాంతలను నీవు స్వాహా దేవునికి సమర్పించాలి. ఏమంటారమ్మా?' అంటూ కుంకుమాక్షతల పళ్ళెరాలతో గవాక్షాల చాటునున్న వీరాంగనలను సంభోదిస్తూ 'మీకు మాతో కైలాసయాత్ర చేయగల సాహసం ఉన్నదా?' అని హెచ్చరించారు ఆ స్త్రీలందరూ నవ్వారు పెండ్లి పేరంటాలకు వెళ్ళేటంత సంబరంతో నవ్వారు నాయనా! చక్కని పద్మాల లాంటి వారి ముఖంలో అంగీకారం తొణికిస లాడింది అందరి కన్నుల్లోనూ ఆనందభాష్పాలు నిండాయి. తరువాత 'జైసోమనాథ్' అని దిక్కులు పిక్కటిల్లేట్లు మహాభీషణంగా విజయనాదం చేశారు ''

''కోట తలుపులు తెరచుకున్నాయి. ఉదయాన సూర్యుని సువర్ణ కిరణాలకు పద్మాలు వికసించేటట్లు, చౌహాను వీరులందరూ కావి రంగు తలపాగాలతో, మిలమిల మెరిసే దుస్తులతో-కత్తులను తళతళ మెరిపిస్తూ, శత్రువుల ముందు చీకట్లు వ్యాపింప జేస్తూ - గజ్జె లందియలు ఘల్లుఘల్లున మ్రోగించే గుఱ్ఱాలనూ, ఒంటెలనూ నర్తింప జేస్తూ దుర్గంనుంచి క్రిందికి దిగారు. అందరికన్నా నాల్గైదు గజాల ముందు చౌహాన్ వీర శిరోమణి ఘోఘారాణా ఉన్నారు. కోటపై నుండి ఈ ముసలి కన్నులతో ఆ విజయ యాత్రను చూస్తూ నిలుచున్నాను. ఆ ఎడారి రాజ్యమంతా తన పరువు నిలుపుకోడానికి తన సర్వస్వాన్నీ అర్పణ చేసింది. ధన్యుడివయ్యా రాణా! ధన్యుడివి. ఘోఘా దుర్గమంతా చందనపు వాసనలతో గుభాళించింది కుంకుమ జల్లుతో శోభిల్లింది చందన వర్షం కురియగానే ఘోఘారాణా నా వైపు చూచారు అపూర్వ గౌరవంతో ఆయన నా వైపుగురువునైన నావైపు ఆనందాతిశయంతో చూశారు 'ఇన్నాళ్ళు నేను నేనుగా జీవించాను. నేను నేనుగా మరణిస్తున్నా. నిజమేకదూ' అని ఆ నవ్వు నన్ను ప్రశ్నించినట్లు అనిపించింది. 'ఘోఘాభాపా! ధన్యుడివి ప్రభూ! ధన్యుడివి' అని వణుకుతూన్న స్వరంతో నేను ప్రత్యుత్తరమిచ్చాను.''

''క్రింద ఉన్న మ్లేచ్ఛ సైన్యమీ దృశ్యాన్ని చూచి నిర్ఘాంతపోయింది. వీరి దివ్య పౌరుషాన్ని ఎంతగానో ప్రశంసించింది. తన దారిన తాను వెళ్తూన్న సైన్యాన్ని కలుసుకోవడం కొరకు ఈ రాణా ఎందు కింత వేగంగా వస్తున్నారో మొదట ఎవడూ గ్రహించలేక పోయినారు తరువాత ఈ చౌహాను వీరులు చంపడానికో-చావడానికో వస్తున్నారని తెలుసు కున్నారు. మ్లేచ్ఛ సైన్యాలు 'అల్లాహో అక్బర్' అని అరిచాయి. పచ్చని

తలపాగాలతో ఎఱ్ఱని గడ్డంతో అందరి దృష్టినీ ఆకర్షిస్తూ అమీరు తన సైన్యాలను నడిపించాడు సైన్యాలు లక్షావధి కత్తులతో చౌహాను వీరులనాహ్వానించాయి ఘోఘాబాబుగారికి ఉద్రేకం ఉప్పొంగింది నేర్పరైన ఈతగాడు సముద్ర తరంగాలను చీలుస్తూ బారలతో ముందుకు సాగేట్లు, ఘోఘాబాబు ఆ సైన్యంలోకి చొరబడ్డారు ఆయన గర్జనలు కోట దాకా విన వచ్చాయి ఆయన చేయెత్తితే చాలు చుట్టూ ఉన్న జనం విరగత్రొక్కుకుంటూ పరుగెత్తే వారు అంత జనసమూహంలో కూడా ఆయన తలపాగా మెరుస్తూ ముందుకు నడిచింది తరువాత కన్పించకుండా మాయమైంది తరువాత తిరిగి మెరుపులా మెరిసింది '' అంటూ నందిదత్తుడు ఏడ్చాడు సామంతుడు వెర్రివానిలా అలా నిర్ఘాంతపడి వింటున్నాడు

'' తిరిగి మెరిసింది మళ్ళీ పడిపోయింది వేలకొలది శత్రు కృపాణాలు వారి మృత్యుశయ్యకు గొడుగు పట్టినట్లు పైకి లేచాయి అవసానం అయిపోయింది - ఘోఘా బాబు కైలాసానికి చేరుకున్నారు - వారి అరుణ ధ్వజం క్రిందికి దిగింది ఇక నా కర్తవ్యం మిగిలింది కోటగోడ దిగి సోమనాధ మందిర ప్రాంగణంలోకి వెళ్ళా అక్కడ చౌహాన్ వీరకాంతలు గుమికూడారు కొందరు సేవకులూ, ఇతరులూ నిలువునా వణికిపోతు న్నారు వారందరూ వెనుక ద్వారం నుంచి బైటికి పంపివేయబడ్డారు స్వయంగా చావలేని పశువుల్ని చంపడం దేనికి?''

''నా కుమారునికి ఆయుధ విద్య రాదు అయినా ఘోఘాబాబుతో యుద్ధానికి పంపించా బ్రతికి వుండగా ముక్తిమార్గాన్ని చూపేవాళ్ళం మరణ సమయంలో వెంట ఉండ వద్దా? పురుషుల్లో మిగిలింది నే నొక్కణ్ణే మొండిగా గుండె రాయి చేసుకొని నా విధిని నెరవేర్చుకోవాలిక నాయనా! నాయనా! ఇదంతా చూడమని విధి నా నొసట ఎందుకు వ్రాసిపెట్టాడు?'' అంటూ నందిదత్తుడు వెక్కివెక్కి ఏడ్చాడు దుఃఖాగ్నికి గురియైన సామంతుని కా కన్నీళ్లు కూడా కరువైపోయాయి

''తరువాత తండ్రీ! వణికిపోతూన్న ఈ చేతుల్తోనే మందిరం ముంగిట చందన కాష్టాల చితిని పేర్చా. నా చేతులతో పెండ్లిండ్లు చేసి, నా చేతుల్తోనే పాపట బొట్టును దిద్ది, తమ పిల్లలకు పాఠాలు నేర్పి పెంచిన నా చిన్నారి తల్లులందరూ చిక్కగా వస్త్రాలంకారాలను ధరించి నెమ్మదిగా నేనున్న చోటికి వచ్చి నా పాదాలకు నమస్కరించారు. నా కండ్లు అశ్రువులతో నిండిపోయాయి అయినా వారి నుదుట చందన సింధూరాలుంచా వాళ్లు కూడా కుంకుమాక్షతలతో సూర్యభగవానుణ్ణి ఆరాధించారు. కులదేవతలను పూజించారు. చిరునవ్వులతో భర్తలను కలుసుకోడానికి వెళ్ళే అభిసారికల వలె నున్న ఆ వీరవనితలందరూ, తర్వాత నన్ను పూజించారు,'' అంటూ నందిదత్తుడు పొంగి వస్తున్న దుఃఖాన్ని మింగి వేశారు.

''తరువాత-ఆ లావణ్యవతులందరూ చితిపైకి ఎక్కారు తరువాత పరమేశ్వరా ఈ చేతుల్తో తండ్రిని - కులగురువును అయిన నేను వారికి దహన సంస్కారం చేశాను నాయనా నా ప్రతి అవయవం కంపించిపోయింది నోట పరమశివుని నామం వెలువడు తున్నది అప్పుడు నా ముందు శ్రీ సోమనాధుడూ- నా కర్తవ్యమూ-ఈ రెండే ఉన్నాయి ''

''ఆ-అగ్ని-నాయనా - ఒక్కసారి గప్పుమన్నది ఆ సౌందర్యం అంతా ఆ జ్వాలల్లో పడి బూడిదైపోయింది వారి హాహాకారాలు వినలేక నేను మందిరంలోకి పరుగెత్తా - పరుగెత్తి సోమనాధుని లింగానికేసి నా తలను కొట్టుకున్నా ఈ పాడు ప్రాణాలను అప్పుడే విడిచిపెట్టేవాణ్ణి కాని రాణాజీ కిచ్చిన వాగ్దానం నన్ను కట్టివేసింది నీకూ-నీ తండ్రికీ ఈ విషయం చెప్పేదాకా బ్రతకాలిగదా అప్పుడే నన్ను ఎందుకు తీసుకుపోలేదయ్యా పరమేశ్వరా?'' అంటూ నందిదత్తుడు దుఃఖాన్ని నిగ్రహించుకోలేక ప్రాంగణంలో రాతిపై తల కొట్టుకొని ఏడ్వనారంభించాడు

కొంతసేపటికి తేరుకొని నందిదత్తుడు ప్రారంభించాడు ''తరువాత తండ్రీ కోట గోడ మీదికి పోయి చూస్తే ఏముంది? ఏడు ఘడియల్లో ఘోఘూరాణా వీరులంతా రూపుమాసిపోయినారు ఒక్కొక్క వీరుడు ఊహాతీతమైన పరాక్రమాన్ని ప్రదర్శించి శంకరుని సన్నిధికి వెళ్ళారు మ్లేచ్ఛదళం ఒకటి దుర్గం మీదికి రావాలని యత్నిస్తున్నది

''నా సమయం కూడా ఆసన్నమైందనుకున్నా నేను. కాని మన రహస్య ద్వారం జ్ఞాపకం వచ్చి పరుగెత్తి అందులో జొరపడ్డాను మ్లేచ్ఛులు ఆడుతూ పాడుతూ 'అల్లాహో అక్బర్' అని కేకలు వేస్తూ వస్తున్నారు లోపల్నుంచి ఎవరైనా ప్రతిఘటిస్తారేమోనను కున్నారు వాళ్ళంతా కాని తలుపులు తెరచి ఉన్నాయి ఎవరైనా మాటున నక్కి బాణాలు విసురుతారేమోననే భయంతో నెమ్మదిగా లోపలికి వచ్చి, దుర్గంలో నిర్జనంగా వున్న వీధు లను చూచి చకితులైనారు తరువాత అరుచుకుంటూ నలువైపులా వ్యాపించారు అలా మందిర ప్రాంగణంలోకి కూడా జొరబడ్డారు నేనొక రంధ్రంలోంచి ఇదంతా చూస్తూనే ఉన్నా వాళ్లట్లా వచ్చి ఎదురుగా ఆకాశమంత ఎత్తున మండుతూన్న చితినీ- దానిపై సర్వదగ్ధమైన ఆరు వందల వీర నారీమణుల శవాలను చూచారు చూచి ప్రాణాంతకమైన భయంతో పరుగెత్తారు ఇద్దరు మాత్రం భయపడలేదు ఆ యిద్దరూ మందిరంలోకి జొర బడ్డారు. ఒకడు శిఖరం మీదికి ఎక్కి ధ్వజాన్ని విరగొట్టాడు పరమేశ్వరా! స్వామీ! ఇదంతా చూడడానికి నన్నెందుకు ఉంచావు స్వామీ?'' నందిదత్తునికి తిరిగి దుఃఖం పొంగివచ్చింది

''తరువాత?'' ''తరువాత అంతా బయలుదేరారు సర్పాకృతిలో సైన్యం కదిలి పోయింది అంతా వెళ్ళిన తరువాత భయంతో గజగజ వణికిపోతూ- కేవలం విధి నిర్వ

హించుకునేందుకు ప్రాణాలను బిగబట్టుకొని బైటికి వచ్చా వచ్చి చూస్తే ఏముంది నాయనా? ఏముంది? మన ఘోఘాదుర్గం- మన ఘోఘాబాబు కీర్తిపతాక- స్మశానమై పోయింది ప్రాణాల కంటే అధికమనుకున్న ప్రతిదీ- ప్రతి వస్తువూ సర్వనాశనమైంది కాని, కాని '' నందిదత్తుని గొంతు దుఃఖంతో పూడిపోయింది ఇంకా రాణాజీకి అగ్ని సంస్కారం చేయవలసి ఉందిగా నాయనా పరమేశ్వరునికై ప్రాణాలర్పించడం ఆయన వంతు ఇక చచ్చినవారికి మోక్షమిప్పించడం నా వంతు! నెమ్మదిగా వణుకుతూన్న కాళ్ళతో క్రిందికి దిగాను- దుర్గం మీద గ్రద్దల గుంపు ప్రోగైంది క్రింద ఎడారిలో శవాలమీద గ్రద్దలు గుంపులు గుంపులుగా వ్రాలుతున్నాయి ఏదో విధంగా గుండె బిగబట్టుకుని క్రిందికి దిగా అబ్బ నా రాజపుత్ర వీరకుమారులు- ఎంత పౌరుషం చూపారయ్యా! కనీసం ఒక్కొక్కడు అయిదుగురినైనా చంపందే చావలేదు కదా! ఎంతగానో వెదికితే గానీ ఘోఘారాణా శవం కన్పించలేదు ఎలాగో వెతికి దూరంగా తెచ్చాను తిరిగి దుర్గంలోకి వెళ్ళి గంధపు కట్టెలు తెచ్చి చితి పేర్చాను నాయనా- నా రాజు- నా జీవిత సహచరుడు- ఘోఘారాణాకు దహన సంస్కారాలు కూడా చేశాను ఇక అక్కడ ఉండలేకపోయాను నా శరీరం దహించుకొనిపోతున్నది నాలుక తడి ఆరిపోతున్నది గ్రద్దలు శవాలను పీక్కు తింటున్నాయేమో భరించరాని దుర్గంధం వేస్తోంది

''అప్పుడా భయంకర ప్రేత భూమిలో ప్రాణాలతో ఉన్నది నే నొక్కణ్నే చచ్చే అధికారం కూడా నాకు లేదుగా నాయనా, అక్కడినుంచి వెంటనే పరుగెత్తాను దారిలో ఒంటెలవాళ్ళు నన్ను చూచి ఎవరో పేద బాపడని జాలితో భమ్మరియా తెచ్చి వదిలి పెట్టారు ''

''మరి మ్లేచ్ఛ సైన్యం?'' సామంతుడడిగాడు

''మ్లేచ్ఛ సైన్యం భమ్మరియాకు రాక నేరుగా సపాదలక్షకు వెళ్ళింది ఇక్కడికి చాలా కొద్దిమంది మ్లేచ్ఛులు వచ్చి ఉంటారు లేకపోతే దేవమూర్తి నింకెవరు ధ్వంసం చేస్తారు? ఇక చివరికి నే నిక్కడే ఉండిపోయాను మీలో ఎవరో ఒకరు ఇక్కడికి తప్పక వస్తారని నా విశ్వాసం ''

''అంటే ఘోఘా వంశంలో మిగిలిందిక '' అంటూ పొంగి పొరలుకొని వస్తున్న దుఃఖంతో సామంతుడు అడిగాడు

''నీవూ- నీ తండ్రీ అంతే నాయనా''

''ఆయన గతి ఎలా ఉందో దేవునికే తెలుసు'' అంటూనే ఒకరి నొకరు కౌగలించు కొని భోరున ఏడ్చారు

సామంతుడు ఆ రాత్రి యావత్తూ మందిరం ముందు ఇటూ అటూ తిరుగుతూ గడిపాడు అతని పితృప్రేమ, దుఃఖమూ, క్రోధమూ, ప్రతీకార వాంఛా - అన్నీ కలిసి అతని గొంతులో హాలాహలాన్ని నింపాయి దుఃఖభారంతో అణగిపోతున్న ఆ బాలుని సోమనాథుడు కనికరించాడు ఉద్రేకాల అనుభూతి పొందే ధైర్యస్థైర్యాలు నశించాయి దాంతోపాటు అతని బాల్య చాపల్యం కూడా తొలగిపోయింది తెల్లవారేసరికి అతడు శవంలా శుష్కించి, నిర్నిమేషంగా ఉన్మాదిలా నేలమీద చూపులు నిలిపి కూర్చున్నాడు

''ఏమిటి నాయనా ఆలోచిస్తున్నావు?'' అని నందిదత్తుడు వచ్చి పలుకరించాడు

''నేనా'' క్రూరంగా, శుష్కంగా నవ్వుతూ హఠాత్తుగా ముదిమి పైబడ్డ ఆ పసి హృదయుడు ''ఆలోచించడానికి ఏముంది? నేను నాన్నగారిని వెదకడానికి వెళ్తా మరి మీరు?'' అని అడిగాడు

''నీవు రమ్మంటే నీ తోటే వస్తా నీవు కన్పించావు అంతే చాలు ఇక నా జన్మ తరించింది నాయనా ఇంకా ఈ బొందిలో ప్రాణమంటూ ఉంటే ప్రభాస నగరంలో శ్రీసోమనాథుని పాదాలకు సమర్పించుకుంటా ''

''అయితే బయలుదేరండి మన మార్గం కూడా ఒకటే సోమనాథుని చేరుకోక ముందే అమీరు కంటబడతాడుగా బ్రతికితే వాడైనా బ్రతకాలి లేకపోతే నేను ''

రెండు ఘడియల తరువాత తండ్రినీ, మ్లేచ్ఛ సైన్యాన్నీ వెదకడానికి సామంతుడు నందిదత్తునితో బయలుదేరాడు కాని వచ్చిన దారిన మాత్రం కాదు రణథంబీ గుడివైపు నుంచి నేరుగా భమ్మరియా వెళ్తానని తన తండ్రి చెప్పాడు కనుక అదే దారిలో వెదకాలని నిశ్చయించుకున్నాడు నందిదత్తుడు కూడా సమర్థించాడు ఈ విషయాన్ని నందిదత్తుని బాల్యంలో అతని తండ్రితో సహా ఘోఘూరాణా సోమనాథ శివమూర్తిని ఈ దారిన తెచ్చాడు మరి దారి అంటూ వుంటే సజ్జనుడింతవరకూ ఎందుకు రాలేదు? ఇద్దరికీ ఒకే భయంకరమైన సమాధానం స్ఫురించింది.

ఎనిమిదవ ప్రకరణం

# పితాపుత్రుల సమాగమం

## 1

గజనీ మహమ్మదు సైన్యాలు అలా ఒకటి రెండు మూడు రోజులు సజ్జనుణ్ణి అనుసరించి పడమటి దిశగా నడచాయి నాల్గోరోజు సైన్యంలోని పసుల కాపరులు ఇది ప్రయాణ దారి కాదనీ- ఈ దారిన వెడితే నరసంచారం అంటూ ఎరుగని భయంకర మైన ఎడారి ఇక ముందు వస్తుందని గోలపెట్టారు ఈ విషయం ఆ నోటి నుంచి ఆ నోట బడి మసూద్ చెవికి చేరింది. మసూద్ సజ్జనుణ్ణి బెదిరించి చూచాడు కాని అతడు చలించలేదు ఇదే సరైన దారి- రాదలచుకుంటే రండి, లేకపోతే మీ దారి మీరు చూచు కొండని అన్నాడు అతని పట్టుదలవల్ల మసూద్‌కు తిరిగి విశ్వాసం కుదిరింది

అయిదో రోజు ఎండ వేడి ఎక్కువైంది గుర్రాలన్నీ చేవచచ్చి పడిపోయాయి. జనం గగ్గోలు పెట్టారు అశాంతి అలముకున్నది అమీరు కీ విషయం తెలిసింది సజ్జనుణ్ణి అతని సమక్షానికి తెచ్చారు కాని అతను చెక్కుచెదరలేదు. నేర్పరులైన మార్గదర్శకులను పిలిపించి అనేక మార్గాలను గురించి చర్చించాడు సజ్జనుణ్ణి పరీక్షించాడు కాని అతని కున్నంత పరిచయం ఆ దారులతో తమకు లేదని వాళ్ళందరూ అంగీకరించారు

కానీ, ఆరో రోజున అందరికీ విశ్వాసం పోయింది ఒంటెలు ముందుకు నడవలేదు మార్గదర్శకులు మొండికెత్తారు ముందు ముందు తుఫాన్ చెలరేగే ప్రాంత మున్నదని తాము చెప్పలేదా? సైన్యంలో కూడా అలజడి ప్రారంభమైంది ఉత్తర ప్రాంత సైనికులు ముందుకు నడవ నిరాకరించారు తిరుగుబాటు జరిగే సూచనలు కాన వచ్చాయి

కాని 'అనహిలవాడ' వెళ్ళాలంటే ఆ దారినే వెళ్ళాలని సజ్జనుడు దృఢంగా పద మడిని పట్టుకొని నిల్చున్నాడు అతని మీద అందరికీ నమ్మకం తొలగిపోయింది ఒక్క మసూదుకు మాత్రమే నమ్మకమున్నది సాయంకాలం గాడ్పు మొదలైంది ఇసుక పైకెగురుతున్నది ఏనుగులు పడి రొప్పుతున్నాయి చురుకైన గుర్రాలు కూడా తపించి పోయాయి ఒంటెలు వెనుకంజ వేశాయి సైనికులంతా దాహం- దాహం అంటూ తపించారు

అమీరు మసూదును పిలిపించి మరికొందరు మార్గదర్శకులను వెంట బెట్టి కొని మరొక రోజులో చేరగలిగే మజిలీదాకా వెళ్ళి చూడండని ఆదేశించాడు మొత్తం సైన్యాన్ని మూడు భాగాలుగా చేసి దూర దూరంగా నడిపించమని 'ఆజ్ఞాపించాడు బలహీనులు, గుర్రాలు, ఏనుగులు అన్నిటికంటే వెనుక మూడవ భాగంతో ఉండేట్టు ఏర్పాటు చేశాడు సజ్జనునికి ఈ ఏర్పాట్లు ఏ మాత్రమూ నచ్చలేదు కాని తను చేయగలి గింది ఏమీ లేక అతడు పడమటి దిక్కున అలముకొంటున్న మేఘాలను చూచి ''రుద్ర రూపా! పరమేశ్వరా! నీ ప్రళయ తరంగాలను ఎక్కడ దాచావు స్వామీ? ఎందుకయ్యా ఇంత ఆలస్యం తండ్రీ?'' అని ప్రార్థించాడు

సజ్జనుడు మసూద్‌తో ముందుకు నడిచాడు రెండు మూడు ఘడియలు గడిచిన తరువాత ఇసుక సుడులు లేవడం మొదలైంది ఒకటి రెండు సార్లు ఆ సుడిగుండంలో పడకుండా తప్పించుకున్నాడు మిగతా మార్గ దర్శకులు చెప్పిన మాటలు నిజమేనని పించాయి మసూద్‌కు సజ్జనుడు మాత్రం చలించలేదు కాని మసూద్ బెదిరిపోయాడు

పదమడి కూడా ఈ విషయాన్ని గ్రహించింది మిగతా ఒంటెలు ముందుకు నడవ డానికే భయపడుతుంటే పదమడి ఆనందంతో నర్తిస్తూ అన్నిటికంటే ముందు ఉండేది సజ్జనుడు మిగతా మార్గదర్శకుల్ని పిరికి పందలని దెప్పుతూ ''నా ఒంటె నడుస్తుంటే మీ వాటి కేం రోగం'' అని ఎత్తిపొడిచేవాడు

కాని పడమటి వైపు ఇసుక బ్రహ్మాండంగా లేస్తున్నట్లు కన్పించింది మసూద్ సజ్జనుణ్ణి చూచాడు అతడు ఎప్పటిలా చిరునవ్వుతో, చెక్కుచెదరకుండా కనిపించాడు

'మరి ఇదేమిటి' అని సాలార్ అరిచాడు

'ఈ తుఫాను నిమిషంలో ఆగిపోతుం'దన్నాడు సజ్జనుడు

గాలి వేడి ఎక్కువైంది. ఇసుక గిరగిర తిరుగుతూ స్తంభాకారంగా వాయువేగంతో పరుగెడుతూ వస్తూన్నట్లు కన్పించింది మసూద్ సజ్జనుని చాతుర్యాన్ని గ్రహించి ' ఓరి పిశాచీ! ఎవడవురా నీవు?' అని కత్తి దూసి అడిగాడు. 'నేనా?' సజ్జనుడు పకపక నవ్వుతూ 'మ్లేచ్ఛుడా! నేను ఘోఘూరాణా కుమారుణ్ణిరా. ఈ ఎడారి భూమికి ప్రభువును- అదిగో - నా సోమనాథుని మూడవ కన్ను తెరచుకున్నది - అటు చూడరా' అంటూ తన వైపు వస్తూన్న తుఫాను వైపు చేయెత్తి చూపి మహా గర్వంగా వికటాట్టహాసం చేశాడు అతని భయంకరమైన నవ్వు మేఘం గర్జించినట్లు వినిపించింది

ఒంటెలవాళ్ళు ఆ విషయాన్ని మసూదుకు తెలిపారు అతనికి కోపం వచ్చింది కానీ ఒంటెల తత్తరపాటువల్ల ఏమీ చేయలేక పోయినారు అతని ఒంటె తోక పైకెత్తి

వెనక్కి తిరిగి పరుగెత్తింది మిగతా ఒంటెలు కూడా దాని వెనుకనే చెంగు చెంగున దూకుతూ పరుగెత్తాయి

పదమడి ఆ వస్తూన్న తుఫాను వైపే ముఖంపెట్టి నిల్చున్నది సజ్జనునికి అక్కడి నుంచి అంగుళమైనా కదలాలని లేదు అలా నిల్చొని పారిపోతున్న ఒంటెలను తిరస్కార దృష్టితో చూచాడు ఇక ఏమిటి చేయడం? ఎటు చూచినా మృత్యువే మసూద్‌తో వెళ్తే అతని చేతుల్లో చావాలి తుఫానుకు ఎదురు నిలిస్తే దానిలో అణగారాలి ఇంతలో పదమడి మహా భయంకరంగా అరచి అతణ్ణి హెచ్చరించింది

ఇక అయిదువందల అడుగుల దూరాన ఉంది తుఫాను కొన్ని నిమిషాల్లో అతణ్ణి కబళించబోతున్నది పదమడి అతని ఆదేశం కోసం ధైర్యంతో ఎగురుతున్నది

ఎంత భయానకమైన పరిస్థితి! ! అతని ఊహాప్రపంచంలో ఎన్నో చిత్రాలు కన్పించాయి తొంభై సంవత్సరాల ముదిమిలో కూడా ఉక్కు శరీరంతో ఆనందాశ్రువు లతో పుత్రుని ప్రతాపాన్ని చూస్తూ నిల్చున్న తన తండ్రి కన్పించాడు తనకై హారతులతో ఎదురు చూస్తున్న వీరపత్ని - తన అర్ధాంగి కన్పించింది తన ప్రాణాలకు ప్రాణమైన పుత్రుడు - దారిలో 'నాన్నా నాన్నా' అని విలపిస్తూ తన ఒడిలో చేరాలని తపిస్తూ కని పించాడు తన మీద విశ్వాసముంచుకొని సోమనాథ మందిరంలో కూర్చున్న సర్వజ్ఞ గురు దేవులు కన్పించారు అతని కన్నులముందు, సోమనాథ పరమేశ్వరుని మూర్తి దేనికొరకై తన సర్వస్వాన్ని సమర్పిస్తున్నాడో ఆ తన కులదేవత భవ్యమందిరం నర్తించాయి

అతని హృదయం గర్వంతో ఉప్పొంగిపోయింది ఆనాటి వరకూ ఎవ్వరూ చేయ సాహసించని పనిని ఆనాడు తానొక్కడే చేశాడు ఒక్కడే మ్లేచ్ఛసైన్యాన్ని సంహరించాడు ఈ విషయం తెలిస్తే ఇక ఘోఘూబాబు పాదపద్మాలను అర్చించ నారంభిస్తారు యుగాల వరకూ - ఎక్కడెక్కడ వీరపూజ జరిగినా - పరాక్రమాన్ని వర్ణించినా - ఒంటరిగా మ్లేచ్ఛుని సైన్యాలను హతమార్చి సోమనాథుని దివ్య ధామాన్ని కాపాడిన చౌహాన్ వీరశిరోమణియైన సజ్జనుని పరాక్రమాన్నే ఆచంద్రతారార్కంగా వర్ణిస్తారు

ప్రళయతేజం అతని చూపులను హరిస్తున్నది పదమడికి తొందర ఎక్కువైంది - ఇక్కడ ఇలా నిల్చుని చావడమేనా? తిరిగి అతని కన్నుల ముందు ఊహాచిత్రాలు నర్తించాయి పొడుగు గడ్డంతో - పచ్చని తలపాగాతో మహా భయంకరంగా కన్పిస్తూన్న మహమ్మద్ గజనీ మూర్తి కన్పించింది. ఎడారిలో - తుఫానులో తపించి, తపించి, చస్తున్న మ్లేచ్ఛుల శవాల చుట్టూ తిరిగే గ్రద్దలు కన్పించాయి

సజ్జనుడు కిలకిల నవ్వుతూ క్రిందికి వంగి ఆప్యాయంగా పదమడి మెడను కౌగి లించుకున్నాడు దానిని రెండు చేతులా పెనవేసుకొని ప్రేమతో 'పదమడీ!' అని పలక

రించి 'ఇక వెనక్కు తిరుగు త్రిభువన పరమేశ్వరుడైన శ్రీ సోమనాధుని చిచ్చర కన్నువై వెనక్కు తిరుగు' అని ఒంటెను వెనుకకు మరలించి గాలికంటే వడిగా తుఫానుకు ముందు ముందు పరుగెత్తించాడు

మసూద్, మార్గదర్శకులు ప్రాణాలు బిగబట్టుకొని పరుగెత్తుతున్నారు దారిలో రెండు ఒంటెలు జారిపడ్డాయి దాంతో ఇద్దరు మార్గదర్శకులు వెనుకపడిపోయారు మసూద్ వాళ్ళ ముఖమన్నా చూడలేదు అతడు వెనుకకు పరుగెత్తమని సైన్యాలను ఆదే శించాలి సైన్యంలోని మొదటి భాగం అతనికి కన్పించింది మసూదు ఆజ్ఞలను విని వినడంతోనే త్రాహి త్రాహి అంటూ సైనికులు వెనుతిరిగారు

మసూద్ కొత్త ఒంటెను ఎక్కాడు ముందుకు వెళ్ళి రెండోభాగపు సైన్యాన్ని కూడా వెనుకకు పారిపొమ్మని ఆదేశించాడు అమీర్ కూడా అతని తోటే ఉన్నాడు మూడు నిమిషాల్లో మసూదు అమీరు కావిషయాన్ని వివరించాడు అరచేత ప్రాణాలతో పరుగెత్తడం కంటే మరో దారి లేదు ఆ మహా విజేత భయంకరమైన విపత్తును గ్రహించాడు వెంటనే ఒంటెను పరుగెత్తించాడు పెద్ద సర్దారులను పిలిచాడు భేరీ ధ్వనులతో పతాకలు తీసుకొని సైన్యాన్ని సరిదిద్దడానికి ఇటూ అటూ పరుగెత్తనారంభిం చారు అతని పతాక కన్పించే చోటల్లా ధైర్యం తిరిగి నెలకొనేది అలా రెండో భాగాన్ని మహా కష్టంతో సరిదిద్ది వెనుకకు పరుగెత్తించాడు మూడో భాగాన్ని కూడా సరిదిద్దించి వెనుకకు నడిపించమని ఆదేశించాడు ఆజ్ఞా పాలనకై సేనాపతులిద్దరు వెంటనే నియుక్తులైనారు

మొదటి భాగంలో కల్లోలం, హాహాకారాలు చెలరేగాయి అమీరు, మసూదు లిద్దరూ అటు పరుగెత్తారు వారి ఆదేశాలు వినే అవకాశం కూడా ఎవరికీ లేదు. పశ్చిమ క్షితిజం నుంచి ఇసుక సుళ్ళు పైకిలేస్తూ మహావేగంతో ముందుకు వస్తున్నాయి అమీరు తుఫానును చూశాడు. ఇక ఈ భాగాన్ని కాపాడడం అసంభవమని గ్రహించి వెనుకకు తిరిగి రెండో భాగానికి చేరుకున్నాడు. మొదటి భాగం ఒక సుశిక్షిత సైన్యంగా కాక చెల్లా చెదురై చూస్తూ, నేల కొరిగే పశువులతో, మానవులతో ఒక మహా మారణరంగంగా తయారైంది. వేడిగాలి వీస్తున్నది. ప్రతిచోటా సుడిగాలి వీస్తున్నది వెనక్కు చూస్తే

ప్రజలు దిగ్భ్రాంతులై తమప్రాణాలను రక్షించుకొనే మాట సహితం మరచి, పడ మటి వైపు నిర్ఘాంతపడి చూస్తూ నిల్చున్నారు

. మహా కాంతులతో కండ్లకు మిరిమిట్లుగొలిపే సైకతా కిరణాల మహా ప్రకాశంతో బంగారు గుట్టాన్ని ఎక్కి జాజ్వల్యమాన ప్రకాశంతో ఉగ్రరూపుడైన శ్రీ సూర్యభగవా

నుడు ప్రళయతాండవ మొనరించడానికి తరుముకొని వస్తున్నట్లు కన్పించింది అంతు లేకుండా ఆకాశ గర్భాన్ని చీలుస్తూ స్తంభాకృతితో గిరగిర తిరుగుతూ పైపైకి లేస్తున్న మహాగ్ని శిఖలను చీల్చుకొని భయంకర ప్రళయ వేగంతో, విడివడిన జటాజూటంతో, ధగ ధగ మెరసే మహా ఖడ్గంతో, రౌద్ర రూపంతో ఒంటె నెక్కి వికట తాండవం చేయడానికి వస్తున్నదా గంభీరమూర్తి. ఆ దివ్యమూర్తి కన్నులు మహాగ్ని జ్వాలలు కురిపిస్తున్నాయి అతని భయంకరమైన వికృతాట్టహాసం మ్లేచ్ఛసైన్య హృదయాలలో చిచ్చుపెట్టి దహించి వేస్తున్నది తేజోరూపుడైన ఆ పరాక్రమ మూర్తిని పారిపోతున్న సైనికులు చూచారు హిందూ సైనికుల నోట 'సూర్యనారాయణప్రభూ! తండ్రీ!' అని దీనంగా వెలువడింది 'సైతాన్ రే సైతాన్' అని భీతితో మహమ్మదీయ సైనికులు అరిచారు అంతే పరుగెత్తె ఆశను కూడా విడిచి గుండె నీరై ఆ ఎడారిలో సొమ్మసిల్లి పడిపోయారు హిందూ సైనికులు క్షమాయాచనలు చేశారు మహమ్మదీయులు అల్లాను శరణు వేడారు తుఫానుకు అధిష్ఠానమైన ఆ తేజోమూర్తి విజయాట్టహాసంతో సైనికులను త్రొక్కుకుంటూ-వారిని దాటి ముందుకు వెళ్ళి పోయాడు

పదమడి మున్నెన్నడూ ఎరుగనంత వేగంగా పరుగెత్తుతున్నది దాని కాళ్ళలో విద్యుత్తు ప్రవహిస్తున్నది ఆనాడు తన శరీరం పార్థివ నిర్మితం కాదు తాను కూడా సాక్షాత్తు దైవమూర్తియే పదమడి కూడా ఈ విషయాన్ని గ్రహించింది

ఆ సూర్యభగవానుడు పైపైకి తరుముకు వస్తున్నాడు అతడిని వెన్నంటి జ్వాలలు వెలిగ్రక్కుతూ మహా భయంకర ధ్వనితో సైకతా స్తంభాలు పరుగెత్తుకొని వస్తున్నాయి మధ్య మధ్య 'జై సోమనాథ్' అనే భయంకర నినాదం దిక్కులను కదిలించి వేస్తున్నది

సైనికులు ప్రతిచోటా చెల్లాచెదురుగా ఇసుకలో పూడుకుపోతున్నారు దేవ విధ్వంసానికి పూనుకున్న రాక్షస సైన్యాన్ని తునుమాడేందుకు బయలుదేరిన చాముండేశ్వరి వాహనమైన వ్యాఘ్రం కుప్పించి దుమికినట్లు, 'పదమడి' తన పాద ఘట్టనలతో సైనికుల కపాలాలను అణగద్రొక్కుతూ ముందుకు నడుస్తున్నది వారిపైనుంచి అగ్ని జ్వాలలు సర్వత్రా వ్యాపిస్తూ, తపింప చేస్తూ, అణగద్రొక్కుతూ ముందుకు వస్తున్నాయి. ఆ తుఫాను ధ్వని కంటే మహా భయంకరంగా మధ్య మధ్య సజ్జనుని కంఠం నుండి 'జై సోమనాథ్' అనే నినాదం మేఘ గర్జనలా వినిపిస్తున్నది

ఒక ఇసుకదిబ్బ మీద నిల్చొని అమీరు అలా వస్తున్న రాజపుత్ర వీరుణ్ణి చూచాడు

'మసూద్! మసూద్! ఎవరది? ఆ విగ్రహం? సైతాను కాదుకదా?' అని అమీరు ప్రశ్నించాడు

'కాదు స్వామీ! ఆ ఘోఘూరాణా కుమారుడతడు '

'ఏమిటీ?' అని అమీరు దిగ్భ్రాంతు డైనాడు- అతని శరీరం కంపించి పోయింది హృదయం భీతితో కుదించుకుపోయింది అలా దిగులుగా ఇసుక గుట్టల క్రింద అణగారి హతమవుతూన్న తన సైన్యాన్ని చూచాడు ఒక దీర్ఘమైన నిశ్వాస విడిచి 'అల్లా కృపవల్ల సైన్యాన్ని మూడు భాగాలుగా చేశాం కనుకనే రెండైనా దక్కాయి ' అని ఒంటె దిగి పడమటి దిక్కుగా మోకాళ్ల మీద కూర్చుని అల్లాకూ, పైగంబర్‌కూ ధన్యవాదాలు సమర్పించాడు

తుఫాను సైన్యంలో ప్రథమ భాగాన్ని కబళించి చెదిరిపోయింది వడి తగ్గి ఆ ఇసుక దిబ్బ ముందు నిలిచిపోయింది ఆగిన తరువాత చూస్తే అందరి శరీరాలమీదా నాల్గడుగుల ఇసుక మెరక వేసింది అందు పదమడి, సజ్జనులు కౌగలించుకొని అనంత శాంతిలో లీనమైపోయినారు

## 2

సుల్తాను ప్రజ్ఞావిశేషం వల్ల సైన్యంలోని రెండు భాగాలు చావు తప్పి బైట పడ్డాయి రోజూ కొద్ది దూరం నడుస్తూ, అన్న పానాదులను తగ్గించి, పగలల్లా ప్రార్థనలు చేయిస్తూ, పాషండులైన ఖురాసాన్ రౌతుల చేత, అసంతృప్తితో కల్లోలాన్ని రేపుతున్నవాళ్లను అణచివేస్తూ, అనేక మాయోపాయాలతో సైన్యం ఛిన్నాభిన్నం కాకుండా కాపాడుకున్నాడు అమీరు అలాంటి క్లిష్ట పరిస్థితుల్లోనే అమీరు ప్రతిభ కన్పించేది నిరాశ పడడమంటూ అతనికి తెలియదు ఎట్టి పరిస్థితుల్లోనూ నిగ్రహాన్ని కోల్పోడు ఎన్ని సలహాలు వచ్చినా అతని లక్ష్యం మారదు రాత్రింబవళ్లు ఏదో ఒక వాహనం ఎక్కి సైన్యంలో మూల మూలలా తిరుగుతుండేవాడు కొందిరిని వినోదంతో, కొందరిని భయంతో, మరికొందరిని మతా వేశంతో ఉద్రేకపరుస్తూ ఉత్సాహంతో సైన్యాన్ని నడిపించేవాడు అతను కన్పించినచోట అనాథలు సంతృప్తులై, అశక్తులు శక్తిమంతులై చైతన్యం పొందేవారు. హిందూ సైనికుల్లో మాత్రం ఈ ఉపాయాలన్నీ నిష్ప్రయోజన మైనాయి

'సూర్యభగవానుడే యుద్ధానికి తలపడితే ఇక మానవమాత్రు లొక లెక్కా?' అని తర్కించుకుంటూ హిందూ సైనికులు నిరాశతో నీరసులై పోయినారు ఈ హిందువులు కొందరు దోపిడీ చేసి ధనం సంపాదించుకోడానికీ, మరికొందరు నిర్వీర్యులైన తమ రాజుల ఆదేశానికి లోబడీ అమీరు సైన్యంలో చేరారు కాని తాము మానవమాత్రునితో యుద్ధం చేయడానికి కాక, తమ దేవదేవుడైన సాక్షాత్తూ సోమనాథునితో తలపడడానికి

వెళ్తున్నామని వారు గ్రహించారు దానితో వారికి నైజ కర్తవ్యం గుర్తుకు వచ్చింది అసంతృప్తి ప్రబలి పోయింది

రెండో రోజు అమీరు శిబిరంలో ముఖ్య సర్దారులంతా సమావేశ మైనారు ప్రతి సర్దారూ ఏదో ఒక పితూరీ తెచ్చాడు ఏనుగులు నడవలేక పోతున్నాయి గుర్రాలు డీలా పడి పోయాయి ఆహారం, నీరూ తగ్గిపోయాయి హిందువులు ధైర్యం కోల్పోయారు మహ్మదీయుల్లో ఉత్సాహం నీరసించింది మార్గదర్శకులకు దారి తెలియడం లేదు రాజ పుత్ర సైన్యాలు ఎదురు నిల్చున్నాయి ఒకటేమిటి- ఇలా ఎన్నో చెప్పారు పరుపు మీద, దిండ్ల నానుకొని కోరచూపులతో పరీక్షగా అమీరు అన్నీ విన్నాడు ఒక్క మసూదు మాత్రమే ఉత్సాహంతో ప్రతి ప్రశ్నకూ ఖురాన్‌లోని ఉదాహరణలతో ప్రత్యుత్తరం ఇస్తున్నాడు ఇంతలో ముల్తాన్ సర్దారు వద్ద నుంచి ఇద్దరు వార్తాహరులు వచ్చారని కబురు వచ్చింది కబురు వినడంతో ప్రతివ్యక్తి ముఖంలోనూ అనేక విషమ భావాలు కన్పించాయి ఆశాన్వితులు ఆనందించారు నిరుత్సాహితులు వేడిగా నిట్టూర్చారు అమీరు ఆ వార్తా హరులను లోనికి తెమ్మని ఆజ్ఞాపించాడు అందరూ మౌనంగా ఆ సందేశాన్ని వినడానికి ద్వారం వైపు చూపులు నిలిపి కూర్చున్నారు కొద్దిసేపట్లో నందిదత్త, సామంతులతో మసూద్ లోనికి వచ్చాడు

వీళ్ళిద్దరూ గుజరాత్‌కు ఎడారిలోంచి దగ్గరి దారి వెదుకుతూ అమీరు జాడ తెలుసుకొని గజనీ శిబిరాలను చూచారు నందిదత్తుడు సామంతుణ్ణి పారిపొమ్మన్నాడు కానీ, సామంతుడు వినక మ్లేచ్ఛసైన్యాన్ని సమీపించి అమీరును కలుసుకోవాలని రక్షక భటులకు తెలిపాడు మొదట రక్షకభటులు ఆశ్చర్యపడ్డారు దేశదిమ్మరులైన హిందూ బాటసారు లేమిటి? అమీరును కలుసుకోవాలని కోరడమేమిటి? అంతవరకూ కనీవినీ ఎరుగని విషయమది చివరికి ముల్తాను సర్దారు తనను ఝాలోర్ నుంచి సందేశం ఇచ్చి పంపాడని సామంతుడన్నాడు క్రమేపీ అధికారులకీ విషయం తెలిసి అమీరు దగ్గరకు చేరుకున్నది

## 3

సామంతునికపుడు ఇరవై సంవత్సరాలే అయినా అతని ఆకారం అతి భయంక రంగా రూపొందింది అతని కన్నులు చలనం కోల్పోయి ఉన్మాద భావాల్ని వెల్లడి స్తున్నాయి ముఖంలోని సౌకుమార్యం నశించి వికృతమైన విచార రేఖలు అలము కున్నాయి గత కొన్ని నాళ్ళ అనుభవం వల్ల, హృదయ మంధనంవల్ల, కసి అతని చూపుల్లో, ముఖంలో, కంఠ ధ్వనిలో కన్పిస్తున్నది నోరు మెదపడమే కష్టం. కదిపితే

మాటలు కర్ర విరిచినట్టు వెలువడ్డాయన్నమాటే నందిదత్తుడు లోలోపల శివకవచాన్ని పఠిస్తూ, నేలకు చూస్తూ అతణ్ణి అనుసరించాడు

సామంతుడు ప్రవేశించగానే అందరూ కొత్త వార్తలు వినేందుకు సిద్ధంగా సర్దుకొని కూర్చున్నారు సామంతుణ్ణి సన్నిధికి తీసుకు రమ్మని మసూదు నాజ్ఞాపించి, ''తిలకా! ఇత డెక్కడ నుంచి వచ్చాడో అడుగు'' అని అమీరు ఆదేశించాడు తిలకుడు లేచి వచ్చి సుల్తాను, సామంతుల సంభాషణలను అనువదిస్తూ వచ్చాడు

''ఎక్కడ నుంచి వస్తున్నావ్?''

''ఝాలోర్ - మార్వాడ్ మార్గం నుంచి ''

''ఎవరు పంపించారు?''

''ముల్తాన్ సర్దార్ ''

''ఏమిటి విశేషం?''

'వార్త అమీరుకు మాత్రమే తెలుపమని మా సర్దారులు చెప్పారు' అని నిశితంగా అమీరును చూస్తూ సామంతుడు అన్నాడు

'ఎక్కడున్నాడా ముల్తాన్ సర్దారు?'

'ఇప్పుడే వీరందరి ముందే చెప్పమంటారా?'

'ప్రభువులు చెప్పమని ఆదేశిస్తున్నారు '

'ముల్తాన్ సర్దారు ఈ ప్రపంచంలో లేరు '

'ఏమిటీ?' అని ఒకేసారి పలువురు సభామర్యాద విడిచి ప్రశ్నించారు అమీరు లేచి వచ్చి కలవరపాటుతో 'ఎక్కడ? ఎప్పుడు? ఎవరి చేతుల్లో?' అని ఆవేదన ప్రకటించారు

'ఝాలోర్ మార్గంలో మరణించారు. ఇరవై రోజులైంది హిందూ యోధులు చంపారు' అని క్లుప్తంగా చెప్పాడు సామంతుడు

'నీ మాటలు నమ్మడానికి మాకు నిదర్శనమేమిటి?'

సామంతుడు బొడ్లోంచి ముల్తాన్ సర్దారును చంపి తీసుకున్న రత్నాల పిడిబాకును తీసి మసూదు కిస్తూ 'ఇదిగో అతని పిడిబాకు ఇదే దానికి నిదర్శనం' అన్నాడు.

మసూదు తిలకులిద్దరూ ఆ పిడిబాకును పరీక్షించి 'జహాఁపనా! ఇది అతనిదే-తాము అతణ్ణి అనుగ్రహించి బహూకరించిన బాకు ఇదే' అన్నారు అమీరు దిగాలుపడి కూర్చున్నాడు ప్రభృత్యుల్లు రాతిబొమ్మలై, నిర్భయంగా అచంచలంగా నిల్చున్న సామంతుణ్ణి చూస్తూ ఉండిపోయారు. చాలాసేపు ఎవరూ నోరు విప్పలేదు.

'నీవేజాతి వాడివి?' అన్న అమీరు ప్రశ్నకు తిలకుడనువదించాడు

'రాజపుత్రుణ్ణి '

'బాకు ఇస్తూ ముల్తాన్ సర్దారు మాకు ఏమైనా సందేశం ఇచ్చాడా?'

'వీరందరిముందు-ఇక్కడే-చెప్పమంటారా?'

'చెప్పు, ఇక్కడే చెప్పు' అని అమీరు స్వాభిమానంతో అన్నాడు

అమీరును నిశితంగా చూస్తూ, ఈటె పోటులాంటి మాటలతో నెమ్మదిగా 'మార్వాడ్, ఝాలోర్ రాజులకు లంచమివ్వడానికి అతణ్ణి మీరు పంపారు కదూ!' అన్నాడు సామంతుడు

కూర్చున్న వాళ్లంతా ఈ పెంకి యువకుని మాటల పరిణామం ఎలా ఉంటుందో నని ఎదురు చూస్తున్నారు సామంతుడీ భయసంక్షోభాల నేనాడో అధిగమించి మృత్యు భీతిని కూడా నిర్లక్ష్యం చేశాడు

'తరువాత?'

'మార్వాడ్, ఝాలోర్ రాజ్యాలు మీ లంచాలను కాలదన్నాయి అంతేకాదు- ఆ ఉభయ దేశాల సేనలూ గుజరాత్ సేనతో కలసి తమతో యుద్ధానికి సిద్ధంగా ఉన్నాయి ' నెమ్మదిగా, స్పష్టంగా చెప్పిన సామంతుని మాటలు అందరి మనస్సులనూ బాణపు ములు కుల్లా గాయపరిచాయి

అమీరు విచలితచిత్తుడై ఒకడుగు ముందుకేసి నలుమూలలా ఆవరించిన భయ ముద్రలను పరికించి రెండు కండ్లూ మూసుకున్నాడు

సామంతుని గంభీర ధ్వని తిరిగి వినిపించింది ''ప్రాణం పైనా, పేరు ప్రతిష్ఠల పైనా తీపి ఉంటే వచ్చిన దారి తిరిగి పోవడమే మేల'ని చెప్పి కడసారిగా ఊపిరి విడిచారు ముల్తాన్ సర్దార్''

అన్నివైపులా నిశ్శబ్దం అలముకున్నది పైపైకి ఆవరిస్తూ వస్తూన్న బాధలు అంద రినీ హడలగొట్టాయి అందిరికంటే ముందు ఈ భయాన్నుంచి అమీరు తేరుకొని 'యా అల్లా' అన్నాడు సామంతుడు మినహా మిగతా అందరూ దిక్కులేని పక్షుల్లా అయిపోయి నారు అతడు తదేకంగా అందరి ముఖాలలో వ్యాపించిన దైన్యాన్ని చూచాడు రెప్పపా టంత కాలంలో ఒర నుండి బాకును లాగి ఎవరూ గమనించక ముందే కొదమసింహంలా ఒక్క దూకులో మసూద్, తిలకులను దాటి, అమీరుపై విరుచుకు పడ్డాడు బాకు తళు క్కున మెరిసి అమీరు మెడపై పడ్డది అందరూ హాహాకారాలతో లేచి నిల్చున్నారు

పిడిబాకు మెడలో దిగబడకుండా నేర్పుతో సామంతుని కుడి మణికట్టును కుడి చేత్తో పట్టుకొని లేచి పసిపాపను పై కెత్తినట్లు అతణ్ణి తన ఎడమ భుజం మీదికి ఎత్తి

నేలకు కొట్టాడు అప్పుడు అతని ప్రచండ శరీరం - పట్టులో నలిగిపోయిన సామంతుని కంటెనూ, హాహాకారాలతో లేచి నిల్చున్న సర్దారులకంటెనూ, కత్తులు దూసి సామంతుని పైకి వస్తూన్న మిత్రుల కంటెనూ సమున్నతంగా ప్రతిభావంతంగా కన్పించి అందరి దృష్టులనూ ఆకర్షించింది అతని ముఖం జేవురించింది మహా భయంకరంగా నవ్వుతూ 'మహమ్మద్ గజనీని చంపడమంటే నవ్వులాట కాదు అల్లాహో అక్బర్' అని గర్జిస్తూ సామంతుణ్ణి అదిమాడు సామంతుని చేయి మెలితిరిగి పిడిబాకు జారిపోయింది అమీరు నవ్వుతూ సామంతుణ్ణి పైకెత్తి నేలమీద విసిరి కొట్టాడు ఒక్క క్షణంలో అమీరు తన సర్వాధిక్యతను రుజువు చేశాడు క్షణం క్రితం స్థైర్యం చెడి డీలాపడిన హృదయాల్లో అతనిపై శ్రద్ధాభక్తులు అలముకున్నాయి

క్రింద పడీ పడగానే సామంతుడు లేవబోయాడు కాని రక్తదాహంతో అనేక ఖడ్గాలు అతని వైపు కొరకొర చూస్తున్నాయి

'ఖబడ్దార్! కత్తులను ఒరలో పెట్టండి అని అమీరు ఆదేశించాడు సామంతుడు నిశ్చలంగా ధైర్యంతో చూపరులను ముగ్ధులను చేస్తూ లేచి నిల్చున్నాడు క్రోధంతో అనిమేషంగా అమీరును చూచాడు '

అమీరు చూపులు సామంతుణ్ణి ప్రశంసించాయి 'ఇతనిని ఎవ్వరూ చంపరాదు అల్లా తన భక్తులను తానే రక్షించుకుంటాడు' అని అన్నాడు

తిలకుడు నుదిటిని వ్రేళ్ళతో తట్టుకుంటూ 'జహాపనా! ఇప్పుడే నాకు జ్ఞాపకం వచ్చింది ఇంతసేపూ ఈ వ్యక్తిని ఎక్కడో చూచినట్లున్నదే అని ఆలోచిస్తున్నాను ఈ ముసలి బ్రాహ్మణుడు ఘోఘా రాణాగారి రాజగురువు నే నక్కడికి వెళ్ళినపుడు ఇతణ్ణి అక్కడే చూచాను' అన్నాడు

'ఘోఘా రాణా గారా!' మసూద్ ఆశ్చర్యానికి అంతులేదు 'అతని కుమారుడే మన వేలకొలది సైన్యాలను మొన్న హతమార్చాడు '

విదేశ భాషలో జరిగిన ఈ సంవాదం సామంతుని కర్థం కాలేదు కాని ఘోఘా బాబు పేరు, నందిదత్తుని గురించిన ప్రసంగం మాత్రం కొద్ది కొద్దిగా అర్థమై స్వాభిమానం ఉట్టిపడేట్లు 'ఘోఘా రాణా గారా! అవును నే నా మహావీరుని మనుమణ్ణే నన్నుకూడా నా పితరుల వద్దకు పంపు చూస్తావేం' అన్నాడు తిలకుడు సామంతుని మాటలు అమీరుకు చెప్పాడు ఆ మాట లర్థమైనవాళ్ళు అతని స్వాభిమానాన్నీ, నిశ్చల సౌందర్యంతో మహోద్రేక మూర్తిగా వెలుగొందే అతని రూపాన్నీ చూచి లోలోపల చేతులు జోడించారు మసూద్ పెదవులు బిగించి సామంతుణ్ణి నరకడానికి అనుమతించమని అమీరును కోరాడు

వీరభూమి అని పేరుపొందిన దేశంలో పుట్టుకతోటే అమీరు నాయకుడైనాడంటే అది తేలికగా లభించిన పదవి కాదు కష్టాలలో ఎదిర్చి నిల్చోడం, హృదయాన్ని తన గుప్పిట్లో ఉంచుకోడం, మహాసంఘటనల్లో మహత్తర ఖ్యాతి నార్జించడం అతనికి సహజంగా లభించిన గుణాలు నవ్వుతూ, చూపులతో సామంతుణ్ణి ప్రశంసిస్తూ ముందుకు వచ్చాడు ఒక చేత్తో మసూద్ తిలకులను వెనుకకు నెట్టి కుడిచేతిని సామంతుని భుజంమీద ఆన్చి అతని కళ్ళల్లోకి తదేకంగా చూచాడు

అమీరు ఏమి చేస్తాడో అని అందరూ చకితులై మౌనంగా చూస్తున్నారు

''తిలకా! ఘోఘారాణా వంశం తన పరాక్రమం వల్ల 'అబుల్ ఖాసిం మహమూద్' కీర్తిని కూడా పేలవమొనరించిందని ఘోఘారాణా పౌత్రునికి చెప్పు ఘోఘారాణా స్నేహాన్ని అర్థించినా మా సైనికులను వేలకొలదిగా తెగనరికాడు మొన్న మొన్న ఘోఘారాణా కుమారుడు మహాప్రళయాన్ని వెంట తీసుకొని నా సమస్త సైన్యాన్నీ చిన్నాభిన్నం చేసి హడలగొట్టాడు ఈ రోజున నీవు అద్భుతమైన సాహసాన్ని ప్రదర్శించి నాప్రాణాలను అపహరించడానికే పూనుకున్నావు' అని కూడా అతనికి చెప్పు''

తిలకుడు ఈ మాటలనువదించేసరికి సామంతుడు ఆదుర్దాగా 'ఘోఘారాణా కుమారులా? ఏరీ ఎక్కడ ఉన్నారు? ఆ మహాపురుషుడే నా తండ్రి - ఏరీ-' అని అడిగాడు అంతవరకు నిగ్రహం ప్రదర్శించిన సామంతుని కంఠం నుండి ప్రేమ, ఆవేదన కట్టలు త్రెంచుకొని కరుణ రసాన్ని ప్రవహింపచేసాయి.

'తిలకా! ఇతనికి నామాటగా చెప్పు. అంతటి మహావిజేతను, పరాక్రమశాలిని మహమ్మద్ తన జన్మలో చూడలేదని చెప్పు ఒక్కడు కేవలం ఒక్కడు - ఇంతటి మహా సైన్యంతో మమ్మల్ని ఎడారిలో త్రిప్పుతూ తీసుకొని వెళ్లాడు నా పదివేల మృతసైనికుల మధ్య - ప్రతీకారమే అవతారమెత్తి వచ్చినట్లు నే డతడు - ఆ శవాల మధ్య శాశ్వతంగా విరాజిల్లుతున్నాడు '

'ధన్యుడివి నాయనా నీ జీవితం తరించింది' అన్నాడు నందిదత్తుడు అతని కన్నుల వెంట గర్వాశ్రువులు రాలాయి

'నా తాతను చంపావు నా తండ్రిని కూడా సంహరించావు నా వంశాన్నే నాశనం చేశావు మరి నన్నెప్పుడు ?'' అన్నాడు సామంతుడు

'మహమ్మదు ఎంతటి వీరుడో అంతగా వీరులను గౌరవిస్తాడు నిన్ను నేను విడిచి పెడుతున్నా నీ కిష్టమున్న చోటికి పో కానీ సామంతా అల్లా మా వైపున ఉన్నాడని జ్ఞాపకం ఉంచుకో '

ఈ మాటలు వినేసరికి సామంతుని కన్నులు క్రోధంతో మెరిశాయి 'అమీర్! విశ్వసంహారకుడు, త్రిభువన పరమేశ్వరుడైన శ్రీ సోమనాథుడు విరాజిల్లుతున్నంతకాలం నీ వాక లెక్కా?'

అమీరు నవ్వి, 'మసూద్ - వీరిద్దరినీ తీసుకొని నువ్వు తమ యిష్టం వచ్చిన చోటికి వెళ్ళమను' అంటూ సర్దారులను చూచి 'అల్లా నన్ను రక్షిస్తున్నంత వరకూ ఇలాంటి వీరులతో ప్రతిరోజూ కయ్యం వచ్చినా వియ్యంగానే స్వీకరిస్తా'నన్నాడు

తరువాత చక్కని అభినయ ముద్రతో ఓట మెరగని స్వీయ గౌరవాన్ని ప్రదర్శిస్తూ 'మసూద్! ఈతని మీద ఈగనైనా వాలనీయకు' అని కటువుగా ఆదేశించాడు

మసూద్ నందిదత్త, సామంతులతో వెళ్ళిన తరువాత అమీరు మిగతా సర్దారుల వైపు తిరిగాడు అంతటి చక్కని సదవకాశాన్ని చేజార్చుకొనే మూర్ఖుడా! ప్రేమతో అందరినీ చూచి 'మిత్రులారా! అల్లా నేడు నాకు కొత్తగా ప్రాణం పోసి విజయం మనదేనని సూచించాడు. మనకు అండగా రావు లక్ష్మణ్ సైన్యాలతో నిల్చున్నాడు ఈ యువకుడు చెప్పిన మాటలు నిజమైనా, ఇకముందు మార్వడ్, ఝాలోర్, గుజరాత్ సైన్యాలున్నా యన్నమాట మీకు యిష్టం వచ్చిన వారితో మీరు పోరాడండి నేను వెళ్లదలచుకొన్నంత మేరకు వెళ్ళి తీరాలి విగ్రహారాధకుల దేవాధి దేవుణ్ణి నాశనం చేయడానికి మీరెవ్వరూ రాక పోయినా సరే- నేను వెళ్లక తప్పదు ఇష్టం ఉంటే నన్ను అనుసరించండి. లేకుంటే తిరిగి వెళ్ళండి ' అని మహాగంభీరంగా అన్నాడు.

ఆ చివరి క్షణాలలో వాతావరణం అంతా మారిపోయింది అప్పుడు మరొక ప్రత్యుత్తరమేముంటుంది! సర్దారులంతా సవినయంగా తమ ప్రగాఢ విశ్వాసాన్ని ప్రదర్శిస్తూ అతడి ముందు మోకరిల్లారు ఈ ఆకస్మిక పరివర్తనను తలచుకొని అమీరు నవ్వుకున్నాడు

తొమ్మిదవ ప్రకరణం

# ఘోఘూరాణా భూతం

## 1

దుర్గపాలకుడు మంచం మీద గురకలు పెడుతూ నిద్రపోతున్నాడు అతని పేరు అర్జునుడు ఆ గురక రోజూ వినవస్తూనే ఉంటుంది. రక్షక భటులకు అత నక్కడే ఉన్నాడని తెలుసుకోడానికి అదొక గుర్తు. అర్ధరాత్రి దాటింది. నీల దుర్గంలో నివసించే స్త్రీ పురుషులందరూ నిద్రిస్తున్నారు.

పాటణ ప్రభువు భీమదేవుని రాజ్యపు సరిహద్దులో ఉన్నది ఆ దుర్గం దానికి మూడు వైపులా అంతా అడవి ఆ అడవిలోంచి వచ్చే గాలి ఎందరో కలసి రోదిస్తున్నట్లు రోజూ వినవస్తూంటుంది ఆ రోదన ధ్వనితో అర్జునుని గురక శ్రుతి కలిపి నేటి కెన్నాళ్ళ నుంచో వినవస్తున్నది. ఆ సమ్మిళిత స్వరానికి తాళం వేస్తున్నట్లు 'ఖట - ఖట' మంటూ- ఒక కొత్త శబ్దం ఆనాడు వినవచ్చింది నిద్రిస్తూన్న దుర్గపాలకునికి గూడా ఆ శబ్దం వినిపించింది నిద్రాభంగమై అర్ధ జాగ్రతావస్థలో 'ఖట-ఖట-ఖట' మని వినవచ్చే ఆ నూతన ధ్వని విన్నాడు ఎంత ఆశ్చర్యం! ఆ దుర్గానికి రెండు యోజనాల దూరాన ఒక మంచి మజిలీ ఉన్నది ఆ మజిలీ నుంచి అర్ధరాత్రి ఎవ్వరూ ఈ కారడవి దాటి రావడానికి సాహసించరు మరి ఈనాడు అంత వేగంగా - వచ్చేది ఎవరు?

దుర్గపాలకుడు చెవులు రిక్కించి విన్నాడు ఒంటెలు కాబోలు- ఒకటి . రెండు కాదు మూడు, అది భ్రమ కాదు కదా? కాదు ధ్వని క్రమేపీ స[illegible]పిస్తున్నది. ఒంటెలను పరుగెత్తిస్తూ ఎవరో వస్తున్నారు దుర్గపాలకుడు ధనుర్బాణాలను పదిల పరచుకున్నాడు కత్తిని ఒరలోంచి తీశాడు

బురుజు పైకి ఎక్కి ఎడారి వైపు చూచాడు చుక్కల మసక వెలుతురులో స్పష్టంగా ఏమీ కన్పించడంలేదు కాని శబ్దం మాత్రం స్పష్టంగా వినబడుతున్నది అనిమేషంగా తీక్షణమైన చూపులతో ఆ అంధకారాన్ని చీల్చి చూడాలని ఆ ముసలి దుర్గపాలకుడు ప్రయత్నించాడు రోధిస్తూన్న మనుష్య ధ్వనిలా ఆ అడవిలోంచి గాలి ధ్వని వినపడుతున్నది కొంతసేపటికి దూరాన మూడు నీడలు సమీపిస్తున్నట్లు కనిపించాయి అవి

ఒంటెల ప్రేత మూర్తుల్లా గోచరించాయి దుర్గపాలకుడు వణికి పోయాడు ప్రాణరహిత మూర్తుల్లా కన్పించే ఆ ఒంటెలు దుర్గాన్ని సమీపించగానే ఎనమండుగురు విలుకాండ్రు కోట బురుజుపై కెక్కి గురిచూచి నిల్చున్నారు కానీ వారి అందరి చేతులు గజగజలాడి పోతున్నాయి

''ఎవరు వారు?''

''నేను ప్రభాస నగరానికి వెళ్ళాలి అవసరమైన పని ఉంది.'' అని మహా గంభీర మైన ధ్వని వినవచ్చింది

''మీ పేరేమిటి?''

''నేను చౌహానుణ్ణి ద్వారాలు తెరిపించు- కొత్త ఒంటెలు కూడా కావాలి'' మాటాడే వ్యక్తి కంఠంలో అధికార స్వరంతో పాటు ఆందోళన కూడా కనిపించింది దుర్గపాలకుడు వెంటనే ద్వారాలు తెరిచాడు. తెరవడంతోటే మరొక వ్యక్తి ఒంటె దిగి లోపలికి వచ్చాడు దుర్గపాలకుడు ఒంటిరిగా ఉన్నందువల్ల భయపడుతున్నాడు; ఇంకా ఆ ఒంటెలు అతని దృష్టికి నీడల్లాగే కనిపిస్తున్నాయి

''అర్ధరాత్రి ఇంత తొందరేమిటయ్యా'' అని అడిగి త్రుళ్ళిపడ్డాడు అతని శరీరంలో గగుర్పాటు కలిగింది యువకుని ముఖం ఎండిపోయి, వివర్ణమై, అప్పుడే చితి నుంచి లేచిన ప్రేత ముఖాన్ని పోలియున్నది అతని కన్నులు స్థిరమై మహాతేజంతో భయంకరంగా ఉన్నాయి

'త్వరగా మూడు ఒంటెలు-మంచివి చూచి ఇవ్వు వెంటనే ప్రభాస నగరం వెళ్ళాలి నీవు తక్షణం దుర్గాన్ని విడిచిపెట్టి వెళ్ళిపో'

''దుర్గాన్ని విడిచి పెట్టాలా? చేతులకు గాజులు తొడుక్కుని కూర్చున్నానా? ఆ వస్తున్న గజనీ మహమ్మదుకు భయపడా?'' అర్జునుడు అపహసిస్తూ నవ్వాడు

'దుర్గపాలకా! పిచ్చిగా మాటాడకు గజనీ అమీరంటే ఎవరో నీకు తెలుసా? దావానలం లాంటి వాడు. పదిరోజుల్లో వచ్చేస్తాడు వచ్చి అంతా కాల్చి దగ్ధ పటలం చేస్తాడు! సాధ్యమైనంత త్వరగా అడవిలోకి పారిపో '

'ఏయ్ యువకుడా! నేను దుర్గపాలకుణ్ణి తెలుసా? నీలాంటి పిరికి పందను కాను '

యువకుడు నవ్వాడు ఆ నవ్వు కర్కశంగా, అసహ్యంగా వినిపించింది

అర్జునుడు నిలువునా నీరైనాడు ఇతడు మనిషా లేక భూతమా?

యువకుడు తిరిగి నవ్వి 'నేను పిరికిపందనా? ఘోఘారాణా పేరు ఎప్పుడైనా విన్నావా?' అని అడిగాడు

అర్జునుడు ఘోఘారాణాకు పరమ భక్తుడు ఎడారిలో ఒక మూలనున్న ఈ దుర్గ పాలకుడు ఘోఘారాణాను గురించి ఎన్నో కట్టుకథల్ని నలుగురికీ వినిపిస్తూ జీవితం గడిపాడు అనేక సంవత్సరాల పూర్వం 'మూలరాజదేవు'ని కాలంలో అతను ఘోఘా రాణాను ఒకసారి కలుసుకున్నాడు. అప్పటి నుంచి తనకు ఘోఘారాణాతో సన్నిహితత్వం అంటుండేవాడు దుర్గపాలుని పూర్వస్మృతి స్వచ్ఛమైంది యాభైయేండ్ల పూర్వం చూచిన ఘోఘారాణా మూర్తి అతని కండ్లకు కన్పించింది అతని శరీరం పులకరించింది అదే రూపం-అవే కన్నులు-అవే మీసాలు-ఇది ఘోఘారాణా భూతం కాదు కదా! ఘోఘాబాబూ! స్వామీ మీరు కూడా ' అంటూ చేతులు జోడించి 'స్వామీ ' అని ఆర్తితో అన్నాడు

ప్రేమమూర్తి నవ్వినట్లు యువకుడు మౌనంగా నవ్వాడు

'ఘోఘాబాబును గజనీ మహమ్మదు సంహరించాడు ఇక సోమనాధ మందిర వినాశనానికి వాడు నలుమూలలా విధ్వంసకాండ చేస్తూ పురోగమిస్తున్నాడు నీవు చస్తావే తప్ప వాణ్ణి నిరోధించలేవు వెంటనే అడవుల్లోకి పారిపో బ్రతికి ఉంటే వెనుకనుంచి బాధించు '

'రాణాజీ మరి మీ రెక్కడికి వెళ్తారు?'

'ప్రభాసం సోమనాధుని రక్షణకు.. త్వరగా కానీ '

ఆ యువకుడే ఘోఘారాణా భూతమని దుర్గపాలునికి గట్టి నమ్మకం ఏర్పడ్డది దాంతో మారు మాటాడలేక వెంటనే చక్కని ఒంటెల నిచ్చాడు తరువాత ఆ యువకుడు అనుచర సహితంగా అంధకారంలో లీనమై పోయాడు

'నాన్నగారూ-వారు ఎవరు?' దుర్గపాలుని పుత్రుడు ప్రశ్నించాడు సోమనాథుని రక్షించడానికి వచ్చారు

''ఘోఘారాణాగారా?''

'అవును. యాభైయేండ్ల పూర్వం ఎలా ఉండేవారో అచ్చంగా అలాగే ఉన్నారిప్పటికీ '

పుత్రుడు తండ్రిని దిగులుగా చూచాడు 'తన తండ్రికి పిచ్చి పట్టలేదు కదా!'

అర్జునుడు పుత్రుని ముఖ కవళికలను గమనించాడు 'యమ సదనం నుంచి తిరిగి వచ్చారు నాయనా ఇక త్వరగా పద సోమనాధుడే మనలను ముందుగా మేలుకొలిపాడు '

2

మార్వాడ్ నుంచి పాటణ నగరానికి వెళ్ళే మార్గమధ్యంలో ప్రతి గ్రామంలోనూ ఇదే విషయం గజనీ మహమ్మదు వస్తున్నాడని వార్త గాలిలో తేలి నలుమూలలా వ్యాపించింది మార్వాడునుంచి అపుడపుడు వచ్చే యాత్రీకులు కూడా అమీరు సైన్యాన్ని గురించి తమకు తోచినట్లు తెలుపుతుండేవారు అనేకులు అమీరు దండయాత్ర నిజమేనని నమ్మారు కానీ అలాంటి వాళ్లను కొందరు అపహాసిస్తూ 'తల్లి కడుపున చిచ్చుపెట్టి పుట్టాడు కాబోలు! దేవునిపైకి దండయాత్ర చేసి బ్రతకడమే?' అని అంటూండేవారు ఇప్పటి వార్తలు మరో రూపాన్ని ధరించాయి దుర్గపాలకుడైన అర్జునుని అనుచరులే పారిపోయి వచ్చారు ఎడారి రాజ్యానికి ఏకైక ప్రభువైన ఘోఘూరాణా చనిపోయారు అంతేకాదు భూతమై వచ్చి 'పారిపోకపోతే బ్రతికి బైటపడటం కల్ల' అని దుర్గపాలకుణ్ణి హెచ్చరించారు అక్కడి నుంచి ఘోఘూరాణా భూతం ఒంటెనెక్కి సోమనాధుని రక్షణకు వెళ్ళింది

ఒక వ్యక్తి ఈ భూతాన్ని గురించి దుర్గపాలకుడు చెబుతుండగా విన్నాడు దుర్గపాలకు డీ విషయాన్ని దారిలో ఒక పెండ్లివారికి చెప్పాడు అపుడక్కడ ఆ వ్యక్తి కూడా ఉన్నాడు స్వయంగా దుర్గపాలకుడు చెప్పినదంతా ఇలా విన్నాడు 'మూలరాజదేవుని కాలంలో దుర్గపాలకునికి ఘోఘూరాణాతో పరిచయమేర్పడింది అది యాభై ఏండ్లనాటి మాట ఇపుడు ఘోఘూరాణా శరీరాన్ని విసర్జించారు యాభై ఏండ్లు గడిచినా ముమ్మూర్తులా అపుడున్నట్లే ఇప్పటికీ వున్నారు. ఆయన కన్నుల్లో జ్యోతులు వెలుగుతున్నాయి శరీరం చితి మీది నుంచి దిగివచ్చినట్లుంది. మెడమీద పెద్ద గాయం కూడా కన్పించింది ఆ గాయంలోంచి రక్తం పైకి చిమ్ముతోంది దుర్గపాలకుడు ఆయనను వెంటనే గుర్తించాడు. ఘోఘూరాణా ఎడారికి ఏకైక ప్రభువు. ఆయన ప్రాణాలు పోయాయి కనుక ఇక గుజరాతు నాక్రమించుకోడానికి అమీరుకు ఎక్కువ కాలం పట్టదు ఇక మిగిలిందేమిటి?'

రెండో గ్రామ ప్రజలు ఈ కొత్తవ్యక్తి చెప్పిన మాటలను నమ్మారు మొన్న నడిరాత్రి గ్రామపెద్ద కొన్ని ఒంటెలను చూచాడు అవన్నీ గాలిలో తేలిపోతున్నట్లు తన ఇంటి ముందు నుంచే వెళ్లాయి మొదటి ఒంటెమీద ఘోఘూరాణా ఉన్నారు ఆయన కన్నుల్లో నిజంగానే జ్యోతులు కన్పించాయి వెళ్తూ 'గ్రామ ప్రజలందరితో అడవిలోకి పారిపోండి గజనీ మహమ్మదు వస్తున్నాడు. ఒక్కణ్ణి కూడా ప్రాణాలతో వదలడు

ధైర్యముంటే వెనుక నుంచి పీడించండి' అని చెప్పాడు ఆయన కంఠధ్వని పాతాళం నుంచి వచ్చినట్లు వినిపించింది

మరో గ్రామంలో ఒక స్త్రీ నీళ్ళు తీసుకొని పోతుండగా ఘోఘూరాణా కన్పించారు ఆయన మంచినీళ్ళివ్వమని అడిగారు మొదట ఆ స్త్రీ భయపడింది. ఆయన కన్నులకు రెప్పపాటే లేదు! ఎలా ఉంటుంది? చనిపోయిన తర్వాత కండ్లు మూతలు పడతాయా? ఎన్ని నీళ్లు పోసినా ఆయన దాహం తీరనేలేదు మ్లేచ్ఛుని చేతుల్లో ప్రాణం కోల్పోయిన వ్యక్తికి దాహం తీరుతుందా మరి? ఘోఘూరాణా వెడుతూ 'అమ్మా! అడవుల్లోకి పారిపొమ్మని మీ గ్రామ ప్రజలతో చెప్పు గజనీ మహమ్మదు వస్తున్నాడు' అని చెప్పారు. అదే మాట. ధ్వనికూడా అదే. చిలవలకు పలవలుగా పెరిగాయి ఒకడు ఘోఘూరాణా గుండెల్లోంచి రక్తం ఎగజిమ్ముతుండగా చూచానన్నాడు ఒంటెల డెక్కలలోంచి నిప్పు రవ్వలు రాలుతుంటే చూచాడట మరొకడు. ఒకడు ఘోఘూరాణాకూ, ఆయన సహచరులకు అన్నం పెట్టాడు. కాని ఆయన తినలేదు. నిజమే! ప్రేతాలకు ఆకలి ఎక్కడుంటుంది? ఇలాంటి మాటలతో ప్రజల భయం మితిమీరి పోయింది వీలైనన్ని సామానులతో ప్రజలు అడవుల్లో తలదాచుకోడానికి పరుగెత్తడం ప్రారంభించారు వారి ప్రతి రక్తనాళంలోనూ కల్పనాతీతమైన భయం ప్రవేశించింది ప్రతి గ్రామంలోనూ, ప్రతి వ్యక్తికీ ఘోఘూరాణా ఒంటెల డెక్కల చప్పుడు వినిపిస్తూండేది. ఆకాశపుటంచుల వైపే ఏ వస్తువు కదలినట్లు కన్పించినా ప్రజలకు ఘోఘూరాణా భూతమే జ్ఞాపకమొచ్చేది.

## 3

ప్రభాస నగరంలో పూజ్యపాదులు సర్వజ్ఞ గురుదేవులు పూజ ముగించుకొని పరమేశ్వరునికి బిల్వార్చన చేయడానికి బయలుదేరారు. తేజంతో, గౌరవదీప్తితో వెలుగొందే ఆయన ముఖంలో ఎప్పటిలా శాంతి విలసిల్లుతోంది. ఒకచేత పంచపాత్ర, ఉద్ధరిణి - మరొక చేత స్వయంగా కోసి తెచ్చిన బిల్వపత్రాలు ఉన్నాయి

గజనీ మహమ్మదు దండయాత్ర గురించి ప్రభాస నగరానికి కూడా కొన్ని వార్తలు వచ్చాయి కాని వాటివల్ల కల్లోలం పుట్టేంత విపరీతమేమీ కన్పించలేదు 'వాడు ముల్తాన్‌లో చచ్చాడు ఎడారిలో అణగారి పోయాడు' అని కొందరు యోధులు చమత్కరిస్తూండేవారు! సాక్షాత్తు పరమేశ్వరుడిక్కడ విరాజిల్లుతున్నంత వరకూ సౌరాష్ట్రంలో

అడుగు పెట్టడం సాధ్యమా? అదీగాక భీమదేవ సోలంకి అమీరును తెగనరికేందుకు సిద్ధంగా కూర్చుంటే ఇక కావల్సిందేముంది?

మొదట దామోదర్ మెహతా అమీరు దండయాత్రను గురించి చెప్పినపుడు సర్వజ్ఞుని హృదయంలో కూడా క్షణికమైన సంక్షోభం చెలరేగింది కానీ ఆ తరువాత అంతగా చెప్పుకోదగ్గ వార్త ఏమీ రాకపోవడంవల్ల సర్వజ్ఞునికి భయం కలగలేదు అమీరు సైన్యం ఎడారిలో దాహంతో తపించి నశించిందని ఒక పుకారు పుట్టింది నిజమే. పరమేశ్వరునితో పోరాటానికి తలపడితే వేరు గతి ఏముంటుంది? ఆ మాత్రం ఆలోచించడమైనా మనసులోనే పరమేశ్వరుడైన శ్రీ సోమనాధుని చుట్టూ అనాద్యనంతాలవంటి శాంతి, నియమిత వాతావరణమే విలసిల్లుతున్నది సృష్ట్యాదిలో అవతరించిన మూర్తికి సృష్ట్యంతంలోనే క్షతి శక్తి, శాంతుల ఆనంద తత్వానికి మ్లేచ్ఛునిలాంటి బుద్బుదాల వల్ల హాని కలుగుతుందా? నిత్యమూ పుజాదికాలు నెరవేరుతూనే ఉన్నాయి నృత్యం జరుగుతూనే ఉన్నది భక్తుల సాధనకు అంతరాయం లేదు. సూర్యుని ఉదయాస్తమయాల మధ్య అన్ని వేళలా సోమనాధుని అరుణపతాకం గాలిలో నర్తిస్తూనే ఉన్నది

సర్వజ్ఞుడు పావుకోళ్ళతో మందిరానికి వెళ్ళాలని ఒక అడుగు వేశాడో లేదో! ఒక శిష్యుడు వచ్చి 'గురుదేవా! ఎవరో వచ్చారు' అన్నాడు

సర్వజ్ఞుడు ఆ అగంతకుణ్ణి తీసుకురమ్మని ఆదేశించకముందే ఆ వ్యక్తి లోపలికి వచ్చాడు ప్రేతంలా వివర్ణమై, విశాలమైన, భయానకంగా కన్పిస్తూన్న నేత్రాలతో వికృత మూర్తిలా కన్పించే ఆ అగంతకుడు లోపలికి వచ్చి సర్వజ్ఞుని పాదాల మీద రొప్పుతూ 'నమఃశివాయ' అని అన్నాడు

'శివాయ నమః! లే నాయనా, ఎవరు నువ్వు?' అగంతకుడు లేచాడు నుదుట దైన్య రేఖ లెన్నో అలముకొని ఉన్నాయి

'గుర్తించలేదా గురుదేవా?' అతని కంఠంలో విషాదం ప్రవహించింది సర్వజ్ఞుడతని మీసాలను గుర్తించి, బిల్వపత్రాలనూ, పాత్రనూ శిష్యునికి అందించారు 'ఎవరూ? సజ్జన చౌహాన్ పుత్రునివి కదూ! ఇక్కడి కెలా వచ్చావయ్యా?'

'అవును గురుదేవా!' పొంగివస్తూన్న దుఃఖాన్ని వణకుతూన్న పెదవుల్లో అణచుకొని అన్నాడు సామంతుడు

సర్వజ్ఞుడు ఎంతో వాత్సల్యంతో అతని భుజాలమీద చేతులు వేసి లోపలికి తీసుకొని వెళ్తూ, 'ఎవ్వరినీ లోనికి రానివ్వ'కని శిష్యుడితో చెప్పారు లోపలికి వెళ్ళి కూర్చొని, ''ఏం బాబూ! సజ్జనుడు ఎక్కడున్నాడు? ఘోఘారాణా క్షేమమేనా?'' అని ఆతురతతో అడిగారు

సామంతుని కన్నుల్లోంచి అశ్రుధారలు ఓడికలు కట్టాయి కంఠ ధ్వని బొంగురు పోయింది ''గురుదేవా'' అని ఆవేదనలో ''ఘోఘూరాణా వంశంలో ఎంతవరకు ఒక్కడైనా జీవించి ఉంటాడో అంతవరకు శత్రువులను నాశనం చేస్తూనే ఉండాలని తమ రాదేశించారు కదా! నేను తప్ప మిగతా అందరూ ఆ ఆదేశాన్ని శిరసావహించా''రని సామంతుడు కన్నీరు కారుస్తూ అన్నాడు

''ఎలా?'' సర్వజ్ఞుని ముఖంలో విచార రేఖలు అలుముకున్నాయి

''ఘోఘూబాబా మా వంశంతో సహా దుర్గం దగ్గరే సంహరింపబడ్డారు మానాన్నగారు '' అని సామంతుడు పెల్లుబికి వస్తూన్న దుఃఖంతో ''మా నాన్నగారు పదివేల మంది మ్లేచ్ఛసైనికుల్ని ఎడారిలో త్రిప్పి చంపి కైలాసం చేరుకున్నారు'' అంటూ వెక్కుతూ చెప్పాడు సర్వజ్ఞులు అతణ్ణి వాత్సల్యంతో - వేదనతో గుండెకు చేర్చుకున్నాడు

''దుఃఖపడకు నాయనా! దుఃఖపడకు పరమేశ్వరాజ్ఞను పరిపాలించిన వాళ్ళకు కైలాసం లభిస్తుంది మరి నీ విషయం. ''

''అమీరుని చంపాలని నే నాతని సైన్యంలోకి వెళ్ళా. పిడిబాకుతో పొడుద్దామని వాడి పైకి దూకాను కాని పట్టుబడ్డా ఈశ్వరాజ్ఞను నెరవేర్చలేకపోయినా- దౌర్భాగ్యుణ్ణి నా వంశంలో నే నొక్కణ్ణే మిగిలాను ఆ మ్లేచ్ఛుడు నన్ను చంపనైనా లేదు.''

త్రిశూలపాణి నిన్ను కాపాడుతున్నపుడు నిన్ను వాడెలా చంపగలుగుతాడయ్యా? శాంతించు దుఃఖించక చెప్పు ముందీ మంచినీళ్ళు త్రాగు

ఓడికలు కడుతూన్న అశ్రువుల్ని ఆపుకుంటూ బహుకష్టం మీద సామంతుడు జరిగిన విషయమంతా చెప్పాడు. అతను చెపుతున్నంతసేపూ సర్వజ్ఞుని మనస్సులో శ్వాసోచ్ఛ్వాసాలతో 'ఓం నమశ్శివాయ' అనే ధ్వని వ్యాపించింది

''అయితే అమీరు ఎంతవరకు వచ్చి ఉంటాడు?''

''నాలుగైదు రోజుల్లో ఆబూ పర్వతాన్ని సమీపిస్తాడు ఈలోగానే రావచ్చు కూడా ''

''భీమదేవుడు వాడికై పాటణ నగరంలో ఎదురు చూస్తున్నాడుగా! అతన్ని దాటి రావడం సాధ్యమా!'' అని సర్వజ్ఞుడు హృదంతరాళాల్లోంచి అన్నట్లు అన్నాడు

''గురుదేవా! అదే మూర్ఖపు పని ''

''ఏమిటి?''

''అమీరు నెదిరించిన వాడు ''

''నీ భావం?''

''గురుదేవా! అమీరన్నా, అతని బలం అన్నా ఎలాంటిదో ఎవరికీ తెలియదు వాడు రాక్షసుడే కావచ్చు కాని వాడికి మనుష్యులను జయించే నేర్పు ఉన్నది కార్తికేయుని కున్నంత యుద్ధ కళ ఉన్నది అతని సైన్యం సముద్రంలా అనంతమైనది పాటణ నగరం ఒక ఘడియలో సర్వనాశనం అవుతుంది ''

''సామంతా! నీకు పినాకపాణియైన పరమేశ్వరునిపై నమ్మకం ఉన్నదా?''

''ఉన్నది - స్వామీ - ఉన్నది కానీ మీరు చెప్పే ఈ వీరుల బుద్ధిబలం మీద మటుకు నాకు నమ్మకం లేదు మేము కూడా ఇక్కడ గజనీ మహమ్మదు పేరు విన్నప్పుడు చిటికవేసినంతలో చెండాడవచ్చుననుకున్నాం వాక్పతిరాజూ అలాగే అనుకున్నాడు మాతాతగారు ఘోఘూరాణా కూడా అలాగే అనుకున్నారు కాని సర్వనాశనమైంది కదా! చౌహాన్ బాలమదేవుని వంటి మూర్తి కూడా అలా అనుకునే యుద్ధంలో సర్వనాశన మైనాడు నేను స్వయంగా అమీరు సైన్యంతో తిరిగాను అతనితో మాట్లాడాను అతని భుజశక్తిని పరీక్షించాను అతని ప్రోత్సాహ శక్తి లోతులు వెదికాను వాడు సాక్షాత్తు త్రిపురాసురుడు స్వామీ!''

''అయితే పరమశివుని చేతుల్లో నాశనమవుతాడు ''

''పరమశివుని చేతుల్లో జరిగితే జరగవచ్చు కాని, భీమదేవుని చేతుల్లో మాత్రం జరుగదు ''

''అయితే నీ వనేదేమిటి నాయనా?''

''నేను చెప్పవలసిందంతా దారిలో చెబుతూనే వచ్చా- మీకు అద చెబుతాను అమీరు వస్తే దారి వదలండి పాటణ నగరం దాటి సౌరాష్ట్రలోకి రానివ్వండి- తరువాత వెనుక నుంచి బిగించడం- అలసిపోయి ఓటమితో సగం చెడి తిరుగు ముఖం పట్టిన పిమ్మట అతని సైన్యాలను రూపుమాపండి ఇది తప్ప మరో మార్గం లేదు గురుదేవా! మరో మార్గం లేదు ''

''మరి ఇక్కడికి వస్తే!''

''అందుకే నే నిక్కడికి వచ్చాను గురుదేవా తమరు కూడా ప్రభాస నగరాన్ని ఖాళీ చేసి వెళ్ళిపోండి తరువాత అమీరు వస్తే వస్తాడు. వచ్చి నిర్జన ప్రభాసాన్ని దర్శిస్తాడు.

కొద్దిసేపు సర్వజ్ఞులు నిమీలితంగా ఉండి నిట్టూర్చారు ''

''అంటే మ్లేచ్ఛునితో ప్రత్యక్షపోరాటం కష్టం కనుక ఇక్కడికే రానిచ్చి శ్రీకృష్ణుడు శుక్రాచార్యుడై దైత్యులను సంహరించినట్లు వాళ్ళను నాశనం చేయమంటావు- ఇంతేనా నీ ఉద్దేశ్యం?''

''అవును స్వామీ.''

సర్వజ్ఞులు గడ్డం నిమురుకుంటూ ''నన్ను ప్రభాస నగరం విడిచి పెట్ట మంటావు నా పరమేశ్వరుణ్ణి మరొక చోటికి తరలించమంటావు ఇంతేనా?''

''అవును స్వామీ''

''సకల జగద్రక్షకుడైన సోమనాథుణ్ణి ఈ మ్లేచ్ఛుల భయంతో దాచి పెట్టమంటావు కదూ?'' ఏదో దీర్ఘమైన ఆలోచనలో ఉన్నట్లు స్వప్నంలో కలవరిస్తున్నట్లు- కండ్లు నులుముకుంటూ అన్నాడు సర్వజ్ఞుడు

''వేరే ఉపాయమేమీ లేదు స్వామీ!''

''సృష్ట్యారంభంలో పుట్టి శతానేక జ్వాలల్లో పరమ శోభతో - ప్రళయ సము ద్రాంతర్గత మహాగ్ని సమూహం వలె తేజోరూపుడై - క్షయాభి వృద్ధి రహితుడును, అనిర్వచనీయుడును, అవ్యయుడును, జగత్తు కంతటికీ మూలరూపుడును అయిన ఈ జ్యోతిర్లింగ మూర్తిని స్థానభ్రంశం చేయమంటావా?'' సర్వజ్ఞుని మాటలు శివపురాణ పఠనంలా వినిపించాయి

సామంతుడు ఈ ప్రవాహాన్ని అర్థం చేసుకొనే శక్తి లేక చకితుడై చూస్తూ ఉండి పోయాడు

''-మరి ఆదిశంకరావతారమగు లకులేశుల పాశుమత మఠానికి గురువుగా ఉన్న నేను చంద్ర నిర్మితమైన ఈ మందిరాన్ని విడిచిపెట్టి పారిపోవాలా?''

''గురుదేవా! ''

సర్వజ్ఞులు వ్రేలితో సామంతుణ్ణి ఆపారు అలా కొద్దిసేపు కండ్లు మూసుకొని కూర్చుని తరువాత తెరిచారు వారి కన్నుల్లో అలౌకిక తేజం కన్పించింది సామంతునికి.

''నాయనా! భగవానుని జ్యోతిర్లింగం ప్రళయకాలంలో కూడా ఇక్కడ నుంచి కదలదు ఇక పరమేశ్వరు డెక్కడ ఉంటే అక్కడే నేను కూడా. మ్లేచ్ఛుడేమైనా చేయనీ ''

సామంతుని హృదయం గజగజ వణికిపోయింది అతని కన్నుల ముందు తన కుల దైవమైన శివమూర్తి శిలాఖండాలై కదులుతున్నట్లు కన్పించాడు కాని సర్వజ్ఞుని నిర్ణ యాన్ని భవిష్యత్తు మటుకు వ్యతిరేకించగలదా?

''కానీ గురుదేవా! . ''

''ఇక అనుమానానికీ, దిగులుకూ తావులేదు పరమేశ్వరునికీ, మ్లేచ్ఛునికీ మధ్య నిల్చోగల వీర పురుషుడు ఎవ్వడూ లేనినాడు నేనే నిల్చుంటా. ఏమి జరుగుతుందో చూద్దాం పరమశివ శక్తిని ఎవరు నిరోధించగలరయ్యా! ఈ వృద్ధుని నొసట ఆ పూర్వ ఋషులు ప్రదర్శించిన పరమ ప్రతాపం వ్రాసి ఉందేమో ఏమి చెప్పగలవు?''

ఈ తేజోరాసి ముందు సామంతుడేమి మాట్లాడగలడు?

''అయితే భీమదేవుని సైన్యాలను ఇక్కడికి పిలిపించండి గురుదేవా! అక్కడైతే ఒక లిప్తకాలంలో నాశనం అవుతాడు ''

''ఈ యుద్ధ వ్యూహాలు పన్నడం నా పని కాదు కావాలంటే ఒక ఉత్తరమిస్తా దానిని తీసుకొని రేపు ప్రొద్దున్నే పాటణ నగరం వెళ్లు భీమదేవ, దామోదర మెహతాలతో సంప్రదించు-తరువాత- వారేమంటారో చూడు ''

''సరే స్వామీ! ఈ రాత్రి యిక్కడే విశ్రమించి ప్రొద్దున్నే లేచి బయలుదేరుతా ''

''సరే మళ్ళీ కలుసుకో నే నిపుడే మళ్ళీ స్నానం చేసి పరమేశ్వరునికి బిల్వార్చన చేసేందుకు వెళ్ళాలి ''

గత నాలుగు మాసాలుగా పడిన పాట్లు, అనుభవించిన దుఃఖంవల్ల సామంతునిపై శతాబ్దాల పెనుబరువు వచ్చినట్లయింది పూజ్యులైన పెద్దలు గురుదేవులు, తల్లులు, అక్క-చెల్లెండ్రు, అన్నదమ్ములు-అందరూ నిలువునా అగ్నికి ఆహుతై, గ్రద్దలకు బలియై నిలువునా ప్రాణాలను కోల్పోవడం విన్నాడు తన తండ్రి దేవతలకు కూడా అసాధ్యమైన విధంగా మృత్యుదేవుని ప్రేమతో కౌగలించుకోడం విన్నాడు ప్రపంచంలోకెల్లా గర్వోన్నతమై వెలుగొందిన ఆ ఘోఘా వంశంలో ఇక మిగిలింది తానొక్కడు తన కొక నివాసం లేదు నా అన్నవాడు లేడు శాంతి లేదు ఇంకా తాను జీవిస్తున్నాడంటే అది సోమనాధుని ఆజ్ఞాపాలనకే అమీరును తుదముట్టించడం తన బ్రతుకునకు వేరు ప్రయోజనం ఏమీ లేదు కానిచో అందరూ చావగా తానొక్కడు బ్రతికి బైటపడడం దేనికి?

సర్వజ్ఞుని దగ్గరనుంచి వస్తూ అతడిదే ఆలోచిస్తున్నాడు సర్వజ్ఞునిలో కన్పించిన ఆత్మవిశ్వాసం, పట్టుదలా సామంతునికి కూడా మనోబలాన్ని ప్రసాదించాయి ఆబూగిరికీ, ప్రభాసకూ మధ్య ఏమి జరిగినా జరగవచ్చు త్రికాలవేదియైన సర్వజ్ఞుని దృష్టి భ్రమాత్మకమనడం సాహసం కదా!

అతడు మందిరంవైపు తిరిగాడు అతని ఆలోచనలో తిరిగి పూర్వ స్మృతి ప్రవేశించింది. ఈ సోమనాధుని మందిరంలోనే అతని సర్వస్వం ఉన్నది అక్కడే తన కుల దైవము తన తాతగారి గురుదేవులు విరాజిల్లుతున్నారు. అక్కడే ఆ దేవమందిర ప్రాంగణంలోనే తనకూ తన తండ్రికి భస్మమిస్తూ 'వీరా! త్వరగా తిరిగిరా' అని అన్న అతని హృదయాధి మూర్తియైన నర్తకి ఉన్నది. ప్రతిరోజూ వానికామె మాటలు జ్ఞాపకం వస్తూ ఉండేవి అలా ఆ విషయాలు అతడి జీవితాన్నంతటినీ ఆవరించుకున్నాయి తనైతే ఎట్లాగూ అటూ ఇటూ తిరుగుతూ అమీరు ప్రాణాలను హరించటానికి వెళ్ళవలసిన

వాడే తిరిగి ఈ మందిరంలో అడుగు పెడతానని కలలోనైనా అనుకున్నాడా? తీరా వచ్చిన తర్వాత ఈ శుష్క జీవితంలో కనీసం ఒక్క మధు బిందువుతోనైనా తన జిహ్వను తడుపుకుంటే యేం?

నెమ్మదిగా మందిరంలో ప్రవేశించి నలుమూలలా చూచాడు. ఆ ఫాలము, ఆ నవ్వు, ఆ శరీర లావణ్యము అక్కడే ఏ మూలో కన్పిస్తాయని అతని ఆశ కాని అది ఫలించలేదు గుండె బరువుతో సామంతుడు భగవానుని పాదాలకు మోకరిల్లాడు బిల్వ పత్రాలను సమర్పించాడు పీడిత హృదయంతో స్తుతించాడు. ఇన్ని దినాలుగా పడిన కష్టాల ప్రభావం నాడు అతనికి కన్పించింది అతడు సర్వజ్ఞునితో అంతా చెప్పాడు బరువంతా దించినట్లయింది కొన్ని రోజుల క్రితం వరకు అతడు ఒంటరిగా భయాకులిత హృద యంతో నిర్జనారణ్యంలో తిరుగుతూండేవాడు ఆ దృశ్యం అతని కన్నులకు కట్టిన ట్లయింది. అతని మనస్సు చలించి నడవలేక సభా మండపంలో ఒక మూల కూర్చొని మోకాళ్ళ మీద తల ఆనించుకొని బిగ్గరగా ఏడ్చాడు ఒకరి తరువాత ఒకరుగా తన బంధువులను తలచుకొని దుఃఖించాడు అనేక కథలకు అధిష్ఠాన దేవుడై వెలుగొందిన మహా వీరుడు తన ఘోఘారాణా ఏకాకియై అమీరును ఎడారిలో ముప్పుతిప్పలూ పెట్టి పీడించిన మహావీరుడు తన తండ్రి తన తల్లి - దేవతా స్త్రీవలె మహా తేజోరాశి కాలి పోయిన ఆమె చేతులు రెండూ ఆశీస్సులిస్తున్నట్లు అతనికి కన్పించాయి సుమన కిశో రంలా సుకుమారియైన తన చెల్లెలి కాలిపోయిన ముద్దుల అడుగులు అతనికి కనుపించాయి ఒక్కటేమిటి? అవన్నీ తాను చేసుకున్న కర్మలకు దుష్ఫలితాలు

భగభగ మండుతున్న నిప్పురవ్వల్లా అతని కన్నుల్లోంచి అశ్రువులు రాలుతున్నాయి గుండె పగిలి ఎక్కిళ్ళు వస్తున్నాయి

అలా దుఃఖిస్తూ ఎంతసేపు కూర్చున్నాడో? చివరికి ఒక మధురమైన స్త్రీస్వరం అతని నా మూర్ఛనుండి మేలుకొలిపింది ఎదురుగా ఒక ఇరువది యైదేండ్ల నర్తకి దయార్ద్ర దృష్టితో అతణ్ణి చూస్తూ నిల్చున్నది.

'ఎందుకీ దుఃఖం వీరా! పరమేశ్వరుడు ఏది తలపెట్టినా మన మేలుకే ' ఈమె కూడా ఒక నర్తకే ఆ చోళా కూడా నర్తకియే కానీ యీమె కన్నులు కాటుకతో కామ వాంఛను గుమ్మరిస్తున్నాయి. మరి ఆ బాలనర్తకి కన్నుల్లో? నేటికీ అమాయక నేత్రాలు అతని ఊహాఫలకం పైన ముద్రితమయ్యే వున్నాయి.

'వీరా, ఏడ్చి ఏమి లాభం. నాతో రా నిన్ను ఆనందింప చేస్తా'నన్నది కండ్లు తిప్పుతూ ఆ ప్రౌఢ నర్తకి.

'నన్నానందింప చేస్తావా నర్తకీ? నా కన్నీటిని తుడువగలవారు ఈ ప్రపంచంలో లేరు '

'పొరపాటు త్రిపురసుందరీ దేవి దయదలచినచోట కన్నీటికి తావు లేదు లే లేచి నా వెంట రా' అని కటాక్షంతో సామంతుణ్ణి వశపరచుకోడానికి ప్రయత్నించింది ఆ నర్తకి

'ఎక్కడికీ? అంటూ సామంతుడు లేచాడు సర్వజ్ఞుని అనుచరులు అతని కొరకు ఎదురు చూస్తుంటారని తెలుసతనికి అయినా ముందు తన హృదయభారాన్ని దించు కోవాలి ఆ నర్తకి మెడవంచి నెమ్మదిగా 'ఈ రోజు త్రిపురసుందరీదేవి ఉత్సవం నాకు తోడు ఇంకెవ్వరూ లేరు నీవు రా జన్మజన్మాంతరాల పాపాలు తొలగిపోతాయి '

'త్రిపురసుందరి ఉత్సవమా?' సామంతుని కా మాటలు అర్థం కాలేదు దేవా లయంలో ఒక సురక్షిత స్థానంలో శంకరుని అర్థాంగియైన త్రిపురసుందరి జఘనము పూజిస్తారని అతడు ఎపుడో విన్నాడు ఆపూజను పరంపరాగతంగా దీక్ష స్వీకరించిన స్త్రీపురుషులే జరుపుతారు అచట జరిగే పూజా విధులన్నీ మహాభయంకరమైనవి వర్ణింప రానివి. కాని వాటిని గురించి తెలుసుకోవడం సాధ్యంకాదు సామంతునికపుడు ఆ పూజా విధులను తెలుసుకోవాలనే కోరికకూడా లేదు 'అయితే నేనెందుకు? నేను దీక్ష స్వీకరించలేదుగా?' అన్నాడు

'స్వీకరించావు. రాత్రి మహాశక్తి కలలో కన్పించి చెప్పింది.'

'ఏమనీ?'

'నీవే మహాశక్తికి నిజమైన భక్తుడివని నాకు చెప్పింది '

'అవును ''ఒక వీరుడు నా పరమేశ్వరుని మండపంలో కూర్చుని విలపిస్తున్నాడు అతడే నన్నూ, నా పతినీ కాపాడుతా''డని మహాశక్తి నాకు చెప్పింది '

''నీవు చెప్పేది నిజమేనా?''

''అంతేకాదు, నిన్ను తన చరణాల దగ్గరికి తీసుకురమ్మని కూడా ఆదేశించింది ''

''ఏమిటీ! స్వయంగా పార్వతి తనను నేను ఉద్ధరిస్తానని అన్నదా? ఆ అమీరు తన చేతుల్లో సంహరింపబడతాడా!'' అతని హృదయంలో ఉద్వేగం ఉప్పొంగింది ''తానేనా ఆ పరమ శివుని దివ్యమందిరాన్ని రక్షించే ధన్యజీవి?''

''నీ పేరేమిటి?''

''నా పేరు కుండల. దేవదాసిని. పోదాం రా ''

సామంతుడు లేచి నర్తకి ననుసరించాడు క్రమేపీ అతని మనస్సు కుదుటపడ్డది హొయలు కురిపిస్తూన్న ఆ నర్తకి వయ్యారం తిలకించాడు చోళాకూ, ఈమెకూ ఎంత

వ్యత్యాసం! ఆమె ప్రతి అవయవం నుంచి శివభక్తి నిర్మలమై ప్రవహిస్తుంది ఈమె బూటకపు విలాసిని సామంతుని హృదయం ఆశాన్వితమయింది మేరు పర్వతంలా ఉన్న ఈ సోమనాధుని దేవాలయాన్ని తాను రక్షిస్తాడా? ఈ నర్తకి చెప్పింది నిజమా లేక బూటకమా? కాదు అలా కాదు ఘోఘా వంశంలోకల్లా మరి తా నొక్కడే బ్రతికి ఉండడానికి కారణం?

సామంతుడు ఆ నర్తకి ననుసరించాడు ప్రక్కనున్న ద్వారం నుంచి అతను మిగతా దేవదాసీలుండే చోటికి వచ్చాడు అంతవరకూ కనీవినీ ఎరుగని ఈ వాతావరణంలో పడి ఒక క్షణంపాటు అతని ఉద్వేగ, నిరుత్సాహ భావాలు మాయమయ్యాయి ఇతరులకు చొరరాని ఆ మహాశక్తి - త్రిపుర సుందరి - దేవాలయంలోనికి మహామాయ అతనిని పిలిపించింది

కుండల ఒక చిన్న తలుపు దగ్గరకు వెళ్ళి గొళ్ళెం కొట్టి చప్పుడు చేసింది

''ఎవరది?''

''నేను కుండలను''

''దొరికాడా?'' అని ఆగంతకుడు నిద్రమత్తుతో అడిగాడు

''దొరికాడు''

''అయితే తీసుకురా''

తలుపులు తెరచుకున్నాయి కుండల సామంతునితో లోనికి ప్రవేశించింది అక్కడే ప్రాంగణంలో ముగ్గురు బైరాగులు కూర్చున్నారు వారి శరీరంమీద తెల్లని బూడిద తప్ప మరేమీ లేదు ముగ్గురి కన్నులూ జ్యోతుల్లా ఉన్నాయి ఏవో మంత్రాలు గొణుగుతున్నారు

తలుపు తెరిచిన బైరాగి గోడ మూల నున్న ఒక దివిటీ తెచ్చి సామంతుని ముందుంచి 'ఎవరు నీవు?' అని అడిగాడు

'నేను చౌహానును.'

'మహాశక్తికి భక్తుడివేనా?'

''సోమనాధునికీ-జగన్మాత యగు మహాశక్తికీ-ఈ యిద్దరికీ భక్తుణ్ణే.''

''ఇతడు. ఇతడే నాకు కలలో కన్పించాడు'' అన్నది కుండల.

''నీ గుండెల్లో ధైర్యం ఉన్నదా?'' అని అడిగాడు రెండో బైరాగి

''ఏమి చేయడానికి?''

''సజీవంగా మహాశక్తి దీక్ష పొందడానికి ''

సామంతుడు నలువైపులా చూచాడు కుండల అక్కడినుంచి వెళ్ళి ఏమిటో చేస్తోంది ఆమె తన వస్త్రాలు విప్పివేస్తున్నట్లు అతనికి కనిపించింది దివిటీ వెలుగుకు, తొలగిపోతూన్న చీకట్లోంచి కొన్ని నీడలు బైటికి వెడుతున్నట్లు అతనికి కన్పించాయి అవి మనుష్యుల నీడలే!

త్రిపురసుందరి మందిరంలో స్వీకరించే దీక్షను గురించి తాను మునుపు విన్న విషయాలు తిరిగి సామంతునికి జ్ఞాపకం వచ్చాయి అయితే ఆ భయంకర పద్ధతులతో తనకు దీక్ష నివ్వబోతున్నారా? పరమేశ్వరా! అమీరు అలా ఈ దేవమందిర విధ్వంసానికి వస్తుంటే, తాము పాటణ నగరానికి పరుగెత్తవలసిందే-ఇక్కడ ఈ భీభత్స దీక్ష పొందడానికి రావడమా?

''ఏమిటీ చెప్పు ధైర్యం ఉన్నదా?''

''ధైర్యమా? లేదు ఆ ధైర్యం లేదు''

'ఏమిటీ?' అని ఆ ముగ్గురు బైరాగులూ ఒక్కసారి అరచి అతణ్ణి సమీపించారు

'ఈ నిధుల పూర్తికి నేను దీక్ష తీసుకోను నేను దానికి తగను '

'మరెందుకురా ఇక్కడికి వచ్చింది పాపీ? - నీచుడా ' అంటూ ఒక బైరాగి అతని మెడపట్టుకొని 'మహాశక్తికి ఆగ్రహం వస్తే ఏం చేస్తావు?' అని అన్నాడు

'నా అంతట నేను రాలేదు అదిగో ఆ కుండల నన్ను రమ్మన్నది నే నిక్కడ ఉండను ఇప్పుడే వెళ్తా '

'వెళ్తావా? ఎక్కడికి వెళ్ళేది? మహామాయ మందిరాన్ని కలుషితం చేసి వెళ్తావా?' అంటూ ఒక బైరాగి సామంతుని రెక్కపట్టుకున్నాడు

'నన్ను వదులు' అని బైరాగి పట్టు విడిపించుకోడానికి వ్యర్థప్రయత్నం చేశాడు సామంతుడు ఇంతలో మరో బైరాగి వెనుకనుంచి వచ్చి అతని చేతులు ఒడిసిపట్టుకొని 'వదిలిపెట్టాలా?' అని విరగబడి నవ్వాడు

''వదలండి - కుండలా! నన్నిందుకా ఇక్కడికి తెచ్చింది?'' అని ఆక్రోశంతో అరిచాడు సామంతుడు

''పాడు వెధవా! నా కల ఇలా పాడౌతుందనుకున్నానా? మహా మాయకు నా మీద కనికరం కలిగిం దనుకున్నా. కానీ నీవు ఒట్టి చచ్చు వెధవవని నాకేం తెలుసు? ఇక చావు'' అని చీకట్లోంచి కుండల ఏడుపు గొంతుతో అరిచింది.

''మహామాయ మందిరాన్ని భ్రష్టం చేసి ఇంతవరకూ ఎవడూ ప్రాణాలతో బయట పడలేదు ''

బైరాగులు సామంతుణ్ణి ఒక స్తంభానికి కట్టివేశారు. ఇక పెనుగులాడి కూడా లాభం లేదనుకున్నాడతడు. బ్రతకాలనే కోరిక కూడా అతనికి లేదు

''అయితే నా కోసం ఎదురు చూడవద్దని గురుదేవులకు కబురు పంపించండి స్వామీ!'' అన్నాడు సామంతుడు

బైరాగులు త్రుళ్ళిపడి 'సర్వజ్ఞులా?' అంటూ వెనక్కి అడుగు వేశారు

''అవును వారు నా కోసం ఎదురు చూస్తుంటారు ''

ఒక బైరాగి తీక్షణంగా సామంతుణ్ణి చూచాడు. అతని కేదో స్ఫురించింది 'అట్లాగా అయితే అలా ఎదురుచూస్తూనే ఉండనీ' అని మహావికృతంగా అట్టహాసం చేసి, నేలమీద అక్కడే పడివున్న ఒక త్రిశూలాన్ని తీసుకొని సామంతుని గొంతుకకు గురిపెట్టాడు

పదవ ప్రకరణం

# చోళా సామంతులు

## 1

సామంతుడు తన అంత్య సమయం సమీపించిందనుకున్నాడు అతనికి జీవించాలని కూడా లేదు కన్నులు రెండూ మూసుకొని ఒకసారి సోమనాథుని స్మరించుకున్నాడు ఘోఘారాణాను జ్ఞాపకం చేసుకున్నాడు. ఇక కొన్ని క్షణాలలో తన తల్లిదండ్రులను కలుసుకోడానికి వెళ్ళబోతున్నాడతడు

ఇంతలో కుండల మహాభయంకరంగా అరుస్తూ 'వద్దు వద్దు ఈ రోజు ఇక్కడ పురుష రక్తం ఒక్క చుక్కైనా చిందరాదు ' అని ఆ బైరాగులను వారించింది

బైరాగులు త్రుళ్ళిపడి ఆగిపోయారు 'ఉత్సవ సమయంలో పురుష రక్తం మందిరంలో పడితే పృథ్వి పాతాళంలోకి క్రుంగిపోతుంది '

'ఆ సర్వజ్ఞుడే వీణ్ణి ఇక్కడికి పంపించాడు.' అన్నాడొక బైరాగి పండ్లు కొరుకుతూ

'ఉండు - నే నితణ్ణి ఒప్పిస్తా '

'వద్దు వద్దు - నా కల అంతా అబద్ధం '

'అయితే శివరాశి గారినడుగుదాం, ఏమి చేయమంటారో?'

ముగ్గురు బైరాగులూ నెమ్మదిగా ఏదో మాట్లాడుకున్న పిమ్మట కుండలతోపాటు ఇద్దరు బైరాగులూ లోపల ద్వారంలోకి వెళ్ళిపోయారు సామంతునికి ఇదంతా అర్ధ-స్వప్నావస్థలో వున్నట్లున్నది ఆ లోపలి ద్వారంలో త్రిపురసుందరి మందిరంలో ఎలాంటి భీభత్స, భయానకమైన క్రియలు, కామోద్రేకం కలిగించే క్రియలు జరుగుతున్నవో కదా! అమీరు సర్వనాశన మొనరించడానికి వస్తున్నాడని ఈ మూర్ఖులకు ఏం తెలుసు? - అందుకే అమీరును ఓడించడానికి మూలవిరాట్టు అయిన తనను ఇలా బంధించి వుంచారు ఈ నీచులు-ప్రపంచమంతా మృత్యువాత పడబోవడంలేదు కదా!

కుండల మహా గాబరా పడ్డది. దేవదాసీల్లో ఆమె అందరికంటే ఆకర్షకురాలు. ఏదో ఒకరోజు కొత్త గురువుకు కొత్త గంగయై వెలుగొందాలని ఆమె ఆశ. ప్రతి మూడు నెలల కొకసారి ఈ ఉత్సవం వచ్చినపుడల్లా తనకు అమ్మవారి పూనకం రావాలనీ, త్రిపుర సుందరి రూపంగా తననే పూజించాలనీ ఆశ పడుతుండేది. కానీ గత సంవత్సరం

పూనకం వచ్చేంత యోగ్యత తనలో లేదు నిన్ననే తనకా యోగ్యత వచ్చింది కలలో కనపడింది మహాశక్తి కలలో కన్పించిన విధంగా అదేచోట ఒక పురుషుడు కూడా కనిపించాడు కానీ చివర కంతా మట్టిలో కలిసిపోబోతున్నది

శివరాశిని పొందాలని ఆమెకు మరో కోరిక ఉంది. సర్వజ్ఞుని తరువాత ఇతనే మఠానికి అధిపతి అవుతాడు అతని కనికరం లభిస్తే తన కోరిక ఫలిస్తుంది శివరాశిని వశపరచుకోడం తేలికేగాని తన వాడుగా చేసుకోడం కష్టం అతనిలో నిగ్రహం లేదు పైగా అతని మనస్సు చోళామీద ఉన్నది కుండలకి మిగిలింది ఒక్కటే ఆశ ఉత్సవంలో తనకు అమ్మవారి పూనకం వచ్చి శివరాశి పూజాచార్యుని హోదాలో తనను ఒక్కసారి పూజిస్తే చాలు తరువాత అతని చూపును తన వైపు త్రిప్పుకోవచ్చు

త్రిపురసుందరి పూజ అంటే సామన్యమైనది కాదు మహాశక్తి ఎవరో ఒకరిని పూనడం - ఆ స్త్రీ మహాచమత్కారాలు ప్రదర్శించడం పరిపాటి. ఉత్సవ సమయం సమీపిస్తున్నకొద్దీ కుండలకు కలవరం ఎక్కువైంది తన కల కల్లయింది మందిరంలో కను పించిన వీరుడు మందిరాన్నే అపవిత్రం చేశాడు ఇది ఇలా ఉండగా మహాశక్తి పూనకం వచ్చే వాళ్ళకు ఒక మూర్ఛలాంటి మైకం కమ్ముతుంది కానీ కైపెక్కేట్టు సురాపానం చేసినా తనకా మైకం రాలేదు మరి ఈ అవకాశాన్ని కూడా చేజార్చుకోడమేనా?

సామంతుణ్ణి తెచ్చిన ద్వారం వద్దకు కుండల ఆ యిద్దరి బైరాగులతోనూ వచ్చి తలుపు తెరిచింది అరుగో శివరాశి! అవకాశం చేజారిపోతున్నది తరువాత తన గతి?

కుండల తొంగి చూచింది శివరాశి సిద్ధేశ్వరునితో వస్తున్నారు ఇక మహాశక్తిని నమ్ముకొని లాభంలేదు తానే మహాశక్తి అలా అనుకొని గట్టిగా అరిచి మూర్ఛ వచ్చినట్లు నటిస్తూ రెండు చేతుల్తో తల పట్టుకొని, వెంట వచ్చే సాధువులు తనను పడకుండా పట్టుకొనక ముందే విరుచుకు పడిపోయింది

బైరాగులు కుండలను అమ్మవారు పూనిం దనుకొని 'జయ జగజ్జ' అంటూ ఆమెకు శైత్యోపచారాలు చేయ నారంభించారు

శివరాశి మహా కోపంతో కాళ్ళు నేలమీద కొడుతూ సిద్ధేశ్వరునితో పాటు ప్రవేశించాడు గురుదేవుని మీద మొదటిసారిగా అతనికి విశ్వాసం సడలిపోయింది గురుదేవుడు ఆనాడు చేసిన పనివల్ల ప్రపంచమంతా అపవిత్ర మైందని అతడు అనుకున్నాడు లకులేశ మఠాధిపతులు - జ్ఞానసముద్రులు- రుద్రావతారులైన సర్వజ్ఞులే నేడు ధర్మాన్ని కాలదన్నారు చోళా త్రిపురసుందరి లౌకిక రూపంగా పూజింపబడడానికి యోగ్యురాలైనా, ప్రొద్దుటనే ఆమెను అమ్మవారు పూనినా ఈ గురుదేవులు ఆమెను పూజించరాదని శాసించారు

చోళా ఇంకా ముద్దరాలే, బాలికే త్రిపురసుందరికొరకేర్పడ్డ వామాచార పూజా విధులంటే భయపడుతుంది మొన్నటి ఏకాదశి వరకు ఎన్నిసార్లు ఆమెను మందిరానికి తీసుకొని రమ్మని చెప్పినా ''ఇంకా బాలిక, ఈ పూజలకు యోగ్యురాలు కాదు'' అని ఆమె తల్లి అంటూ వచ్చింది ఇప్పు డా ఆటంకాలు లేవు మొన్న ఏకాదశికి పరమేశ్వర సన్నిధిలో నృత్యం చేసే యోగ్యత కూడా లభించింది ఇంకా ఆమె బాలికయేనా! అదీగాక నేడు సాక్షాత్తూ త్రిపురసుందరి ఆమెను పూనింది! ఈ యోగ్యతకై మిగతా దేవదాసీలు తపిస్తూంటారు ప్రొద్దుననగా మూర్ఛపోయింది ఆమె మాటలు- చేతలు సాక్షాత్తూ శంకరుని అర్ధాంగియే చోళా అని ప్రకటిస్తున్నవి శివరాశికి ఆనాడు చోళాను త్రిపురసుందరికి ప్రతిమూర్తిగా చేసి పూజించాలని చాలా కోరికగా ఉన్నది

శివరాశి దృష్టికి చోళా చాలా చిత్రంగా కన్పించింది మొన్నటి ఏకాదశి నుండి ఆమె పూర్తిగా మారిపోయింది ఆమె కన్నులు ఏవో లోకాలను వెతుకుతుండేవి ఆమె చూపుల్లో-చేతల్లో అర్థంకాని ప్రత్యేకత ప్రవేశించింది మామూలు స్త్రీలతో చోళాను పోల్చడం కష్టమేనని శివరాశి గుర్తించాడు కానీ దానితోపాటు అతని మోహం కూడా వ్రేళ్ళు పాదుకొన నారంభించింది చోళా శివరాశి అనుగ్రహాన్ని సంపాదించడం గంగకు కూడా ఇష్టమే కానీ చోళా హృదయంలో నిర్మల భక్తి, నిష్కల్మష శ్రద్ధ ఉన్నాయి వాటిని కాదని బలవంత పెట్టడం అసాధ్యమని ఆమెకు తెలుసు

పాపం! శివరాశి ఈ ఉత్సవ సమయంలో చోళాను మహామాయ మూర్తిగా పూజించి సన్నిహితత్వం పెంపొందించుకోడానికి ఇన్నాళ్లుగా ఎదురు చూచాడు కానీ గురుదేవులు తరతరాలుగా వచ్చే ఆ పూజా విధిని ఆపి ధర్మ భంగం చేశారు శివరాశి విద్వాంసుడే, నమ్మకస్తుడే, గురుభక్తుడే కానీ గురుదేవుని కున్నంత విశాల భావం, నిర్మల దృష్టి అతనికి లేవు. ఒక నర్తకి మొండి పట్టువల్ల ఈ విధంగా ఆచారం మంటకలిసిం దనే కసి అతనిలో మతోన్మాదాన్ని రెచ్చగొట్టింది. చోళామీద అతనికున్న మోహం కామేచ్ఛ ఈ ఉన్మాదానికి తోడైనాయి.

అతని కండ్లు ఎర్రపడ్డాయి. ఆచారాల విషయంలో జోక్యం కలుగచేసుకోడానికి గురుదేవులకు మాత్రం అధికార మేమున్నది? వారు ధర్మ రక్షకులు కదా! ధర్మ వ్యతిరేకం ఎందుకు చేశారు? గ్రుడ్డిగా గురుభక్తి అంటూ ఈ అన్యాయం సహించడమా? శాస్త్రాలన్నీ తప్పులా? ఈ సర్వజ్ఞులు చెప్పింది ఒప్పా? మరి ఈ పూజావిధికి బాధ్యత తనదైనప్పుడు తన కర్తవ్యం ఏమిటి? అలా ఆలోచిస్తూ అతడు ప్రవేశించేసరికి స్పృహ తప్పిన కుండల నెత్తుకొని బైరాగులు ఎదురుపడ్డారు

''ఆచార్యా! కుండలను అమ్మవారు పూనింది ''

శివరాశి ఆకలిగొన్న పులిలా హుంకరించాడు ''ఛీ! దీన్ని వదిలి పెట్టండి నాటకం ఆడుతున్నది నాటకం అమ్మవారు చోళాను ఆవేశించింది ''

''ఏమిటీ?'' అంటూ బైరాగులు కుండల నక్కడే నేలమీద పడవేశారు శివరాశి తన కసి ఎవరి మీద నైనా తీర్చుకోవాలి కదా! అందుకని కుండల దగ్గరకు వెళ్ళి కాలితో తన్ని ''లే పాడుముండా లేవకపోతే ఒక తన్నుకు ఎముకలు విరుగుతాయి'' అన్నాడు

కుండల భయపడి లేచి కూర్చుంది

''దీనిదంతా మోసమని నేను చెప్పలేదూ అమ్మవారు చోళానే పూనింది.''

కుండల చీకట్లో నిరాశతో కుప్పలా కూలబడిపోయింది స్తంభానికి కట్టి వున్న సామంతుడు నవ్వు ఆపుకోలేక పకాలున నవ్వాడు

ఇంతలో ఒకరి తరువాత ఒకరుగా పన్నెండుగురు బైరాగులు అర్ధనగ్నంగా లోపలికి వచ్చారు అందరి కండ్లూ కైపెక్కి ఉగ్ర స్వభావాన్ని కనబరుస్తున్నాయి

ఒక వృద్ధ బైరాగి ముందుకు వచ్చి ''రాశిగారూ! ఇంత కాలం నుంచి ఆగకుండా వస్తున్న మహా శక్తిపూజ ఇలా ఆగిపోవడమేనా? ఇదేదో కాలమాసన్నమైనట్లుంది?'' అన్నాడు

శివరాశి కూడా తిరిగి రెచ్చిపోయాడు నేనూ అదే అంటున్నా ''ఈ కుండలి దంతా ఒట్టి మోసం మహాశక్తి పూనిన చోళాను పూజించడానికి వీల్లేదని గురుదేవులు ఆదేశించారు '' శివరాశి విసిరిన మాటల్లోని ఆంతర్యం గ్రహించేందుకు బైరాగులకు అట్టే కాలం పట్టలేదు వృద్ధ బైరాగి ముందుకు వచ్చి కైపెక్కిన గుడ్లను పెద్దగా చేసి ''మహాశక్తి-త్రిపురసుందరీ దేవిని పూజించకుండా నిరోధించగల శక్తి ఎవరికుంటుందో చూస్తా ఆచారాలను తిరస్కరించే వ్యక్తి గురు పదవిలో ఉండడానికి అర్హుడా?'' అన్నాడు

''నిజమే'' నంటూ సిద్ధేశ్వరుడు భావసూచకంగా శివరాశిని చూచాడు. శివరాశి ముఖంలో పరస్పర భావాల సంఘర్షణ స్పష్టంగా కన్పిస్తూనే ఉంది గురుభక్తియా లేక ఆచారాల పట్టుదలా? నిగ్రహమా లేక చోళా మీది మోహమా?

వృద్ధుడు వచ్చి శివరాశికి నమస్కరించి ''రాశిగారూ! మీరు తప్పితే ఈ ఆచారాలను నిలబెట్టేది ఎవరు? అనాది నుండి వచ్చే విధులు పాడైపోవడం నేను చూడలేను ''

''త్రిపురసుందరి పూజ జరిగి తీరాలి '' సిద్ధేశ్వరుడు అగ్నికి ఆజ్యం పోశాడు సర్వజ్ఞుణ్ణి దిగలాగి గురు పదవి పొందడానికి శివరాశికి ఇదే సదవకాశం ఈ బైరాగుల విశ్వాసాన్ని చూరగొంటే తనకు గెలుపు తప్పదు

శివరాశి కూడా తన నిశ్చయాన్ని తెలిపాడు ''నిజమే, మహాశక్తి పూజ జరగకుండా ఉండకూడదు సిద్ధేశా! పద చోళాను తీసుకొని. వద్దాం దేవీపూజ

ఆగిపోవడం నేను సహించను'' అంటూ సిద్ధేశ్వరునితో చోళాను తెచ్చేందుకు శివరాశి వెళ్ళాడు బైరాగుల ఆనందానికి మేర లేదు సర్వజ్ఞుడా సమయంలో పూజలో మునిగి వుంటారని శివరాశికి తెలుసు కనుక ఆయనకీ సంగతి కూడా తెలియదు

శివరాశి వెళ్ళడంతోటే సామంతుని హృదయం వణికిపోయింది చోళాను చూడాలని ఉన్నా, ఈ సమయంలో ఇలా చూడడమా! రెప్ప వాల్చకుండా, నిట్టూర్పులతో ద్వారంవైపే చూడడం మొదలుపెట్టాడు తన కట్లను చూచుకున్నాడు కానీ వాటిని బలవంతాన గానీ, చాతుర్యంతోగానీ విప్పడానికి వీల్లేదు తన కుటుంబం సర్వనాశనమైనా ఈ ఒక్క స్వప్నసుందరి మీద ఆశలు పెట్టుకొని జీవిస్తున్నాడతడు ఆ దివ్యమూర్తిని కూడా దుర్మార్గులు నాశనం చేయాలని చూస్తున్నారు ఈ వినాశక దృశ్యాన్ని కూడా చూడవలసిన గతి తనకు పట్టింది అతని ముఖం మీద నిరాశారేఖలు వ్యాపించాయి

2

చోళా అర్ధ మూర్ఛితావస్థలో ఉన్నది కన్నులు మూసుకుపోయి భక్తిభావోన్మాదాన్ని ప్రకటిస్తున్నాయి ముఖం విహ్వలమైపోయింది అరుణ పల్లవాలలాంటి ఆమె పెదవుల్లోంచి మధ్య మధ్య 'శంభో, నా స్వామీ, ప్రభో! ' అనే మాటలు వెలువడుతున్నాయి కొన్ని రోజుల నుంచి ఆమెకు ఇలాంటి మూర్ఛ తరచుగా వస్తూనే ఉంది ఆ మూర్ఛావస్థలో అప్పు డామె పార్వతియై-భిల్లాంగనయై కైలాస స్థాణువులమీద పరమశివునితో విహరి స్తున్నది దగ్గరే చోళా తల్లి దిగులుపడి కూర్చున్నది మొదలిదంతా పిచ్చి లక్షణాలని అనుకున్నది కానీ సర్వజ్ఞులు 'శివ సమర్పణం'లో ఉదాత్త స్థాయిని చేరుకుంటున్న లక్షణాలే గాని పిచ్చిదనం కాదని చెప్పారు.

అలాంటి సమయంలోనే కోపంలో శివరాశి, సిద్ధేశ్వరులు వచ్చారు వారిని చూడగానే గంగ అదిరిపడ్డది

'ఏమిటి స్వామీ! ఎందు కిటు వేంచేశారు?' అని భయపడుతూ అడిగింది గంగ

'చోళా' అని శివరాశి మాట పూర్తి చేయకముందే దూరంనుంచి ఎక్కడిదో, ఏదో ఒక మహా శంఖధ్వని వినిపించి చోళా ఆతుర భావంతో లేచి కూర్చున్నది

'నా స్వామి శంఖనాదం!' అంటూ విహ్వలయై నలువైపులా చూచింది 'అమ్మా... అమ్మా! నా ప్రభువు పిలుస్తున్నాడు. నన్ను తీసుకొనిపోవా పరమేశ్వర సన్నిధికి స్వామీ! - వస్తున్నా . వస్తున్నా '

శివరాశి నవ్వాడు అతనికన్నీ కలసి వచ్చాయి 'చోళా! . నిన్ను పరమశివుడు పిలుస్తున్నాడు నిన్ను తీసుకొని వెళ్ళాలనే నేను వచ్చా.'

చోళా ఒక్క ఉదుటున లేచి అభిసారికలా మహోత్సాహంతో శివరాశిని సమీ పించింది 'నిజమేనా రాశిగారూ? అయితే వస్తున్నా వస్తున్నా . నా స్వామి దగ్గరికి - నాజటాధారి శంభుని దగ్గరికి తీసుకువెళ్తారా?' పరమేశ్వర సన్నిధికి చేరుకోవాలని ఆమె పెదవులు వణికిపోతున్నాయి శివరాశి ఆమె భుజం మీద చేయి వేసి ద్వారంవైపు నడిపించాడు

గంగ అడ్డం వచ్చి 'ఏమిటిదంతా రాశిగారూ? ఈ పిచ్చిదాన్ని ఎక్కడికి తీసుకు వెళ్తున్నారు?' అని క్రోధంతో ప్రశ్నించింది.

'సిద్ధేశ్వరా! గంగను ఇక్కడే వుంచు. అక్కడికి ఈమె రానక్కరలేదు' అని శివరాశి చోళాతో ద్వారం దాటాడు సిద్ధేశ్వరుడు గంగను ఇంట్లోపెట్టి తలుపులు బైటనుంచి బంధించాడు.

చోళా త్రిపురసుందరి మందిరానికి రావడం చూచి సామంతుడు ఆశ్చర్యపడ్డాడు. శివరాశి విలవిల తన్నుకుంటూన్న చోళాను బంధించి బలత్కారంగా తెస్తాడని అతడు భావించాడు కానీ ప్రియుని సమాగమాపేక్షలో లజ్జాసంభ్రమాలు ముప్పిరిగొన అంది యల ఘల్లులారవంతో వచ్చే ప్రియురాలిలా చోళా మందిరంలోనికి ప్రవేశించింది జింకలా ఎగురుతూ ప్రపంచమంటే ఏమిటో ఎరుగని ముగ్ధ, భావనిర్ఝరిణి ప్రవహింపచేస్తూ ముందుకు నడిచింది ఆమె ముఖంలో ప్రణయోల్లాసం తరగలై తేలుతున్నది సామంతు డామెను ఆదిలో చూచినప్పటికంటే ఇప్పు డామె ముఖంలో తేజం వేయిరెట్లు ఎక్కువగా కన్పించింది అతనన్నీ మరచిపోయి అలా విస్తుపోయి చూస్తున్నాడు.

'ఏడీ నా నాథుడు? ఇక్కడే - ఈ మందిరంలోనే వున్నాడా?' అంటూ చోళా నలువైపులా చూచింది ఆమె కన్నులు మహోజ్జ్వలంగా ఉన్నాయి. అయినా తన చుట్టూ ఏమున్నదో కూడా చోళాకు తెలియడం లేదు

''ఇక్కడే నేడు శివుడు నీ కొర కెదురు చూస్తుంటాడు'' శివరాశి అన్నాడు

చుట్టూ చేరిన బైరాగులు దివిటీల కాంతిలో ఈ త్రిపురసుందరిని చూచి తలలు వంచుకొని స్తవన పఠనం ప్రారంభించారు. అక్కడినుంచి చోళా మెరుపు మెరిసినట్లు లోపలి ద్వారంలో జొరబడ్డది శివరాశి, బైరాగులతో ఆమె వెనుకనే లోపలికి వెళ్ళాడు. క్షణంపాటు చోళా ప్రదర్శించిన శివభక్తి అందరి హృదయాల్లోని విషయవాసనలను తుడిచివేసింది

చోళా అధీరయై లోపలికి ప్రవేశించింది తనను పూజించడానికి అక్కడ చీకట్లో ఉత్సాహంతో ఎదురుచూస్తూ నిల్చున్న స్త్రీ పురుషులు ఆమెకు కన్పించలేదు ఆమె వేషం కూడా పూజ కనుకూలించేటట్టు లేదు శరీరం మీద లేపనమన్నా లేదు మంత్ర పూరితమైన సురను కూడా త్రాగలేదు కానీ వీటిని గురించి ఆ నిమిషంలో ఎవరికీ జ్ఞాపకం లేదు భగవాన్ శంకరుని కలుసుకోడానికి ఆతురభావంతో ప్రణయ విహ్వలయై పరుగెడుతూన్న సాక్షాత్తు త్రిపురసుందరిగా అందరికీ కనిపించింది చోళా ముసలి పూజారి ప్రతి మూడునెలల కొకరిని అమ్మవారు పూనడం చూచాడు కానీ నేడీ దృశ్యం వల్ల అతనికి వూపిరి ఆడలేదు 'జయ మహామాయ!' అని ఆర్ఘ్యమిచ్చా డంతే ఆపైన ఏవిధులూ నెరవేర్చలేకపోయాడు నోట మాట రాలేదు శివరాసి అవకాశం కొరకు ఎదురు చూస్తున్నాడుకదా! సర్వజ్ఞుణ్ణి దేవదాసీ గణ నాయకి గంగ శివునిగా ఆరాధిస్తుందే, మరి చోళా తనను అలా ఎందుకు పూజించరాదు అతను చోళా ఎదురుగా గర్భద్వారం దగ్గర నిల్చుని ప్రక్కనే వున్న త్రిశూలాన్ని చేతిలోకి తీసుకున్నాడు

చోళా పరుగెడుతూ మందిరంలోకి వచ్చి అడ్డంగా నిల్చున్న శివరాశిని చూచి కాతర నేత్రాలతో ప్రశ్నిస్తూ 'శివరాశీ! ఏడీ నా నాథుడు? నా స్వామి?!' అని అతి దీనంగా అడిగింది.

'ఇరుగో' అని శివరాశి రెండు చేతులనూ చాపి అన్నాడు కానీ చోళా శివరాశి భావాన్ని కూడా గ్రహించలేకపోయింది అతణ్ణి చేతులతో ప్రక్కకు నెట్టి-పరుగెడుతూ - గర్భద్వారంలో జొరబడ్డది 'స్వామీ! ప్రభూ ! వచ్చాను ఇదిగో నేను వచ్చాను స్వామీ. ' అంటూ అశ్రుధారలు వరదలై చెక్కిళ్ళను తడుపుతూ ప్రవహిస్తుండగా శివ లింగాన్ని కౌగిలించుకున్నది కౌగిలించుకొని లాలించ నారంభించింది మండపంలో నిల్చున్న స్త్రీ - పురుషులు ఈ పవిత్ర ప్రణయాన్ని భక్తిప్రపత్తులతో చూస్తున్నారు

లాలిస్తూ లాలిస్తూ చోళా మూర్ఛపోయింది అపుడు అందరికీ మైకం వదిలింది నియమాల ననుసరించి పూజాదికాలు కాకముందే చోళా శివమూర్తిని స్పర్శించింది ఆమె కట్టుకున్న వస్త్రాలు ఇంకా శరీరంమీదనే ఉన్నాయి లేపన క్రియ జరగలేదు. మహా మాయ చిహ్నాన్ని పూజించడం జరగలేదు త్రిపురసుందరికి జరిగే రహస్య పూజలను ఉల్లంఘించి తన పవిత్ర భక్తితో భీభత్స రసారాధకులైన ఆ భైరవులను పవిత్రభావ జగత్తు లోకి తెచ్చిందామె కానీ ఆ భక్తి మత్తు వదలడంతోటే చోళా అనుసరించిన ఈ నవీన పూజా విధిపట్ల అయిష్టం ప్రకటించారు

పాపం శివరాశి గురువుగారి ఆజ్ఞలను ధిక్కరించినా, గౌరవాన్ని ఎదిరించినా మొగం వాచినంతపనైంది అతడికి పిచ్చెక్కినట్లయింది బైరాగులు మాత్రం 'పూర్తిగాని విధులన్నీ పూర్తికావాలి' అని సణగడం ప్రారంభించారు

అయితే మూర్ఛావస్థలో ఉన్న చోళాను తీసుకొనివెళ్ళి విధిపూర్వకంగా సంసిద్ధ మొనర్చి మహాశక్తి పూజాకార్యాన్ని పూర్తిచేయమని ఒక బైరాగి సలహా ఇచ్చాడు

## 3

సర్వజ్ఞులు ప్రాణాయామం చేద్దామని కూర్చున్నాడు కానీ చిత్త శాంతి లేదు ధ్యానాసక్తి వున్నా మనస్సు పరిపరి విధాల పరుగెడుతున్నది. అమీరు మాట పదేపదే మెద డును పీడిస్తుండేది. ఇంతలో చోళా రోదిస్తున్నట్లు ఆయన ధ్యానమగ్న మనస్సుకు కన్పించింది. చోళా అరుస్తున్నది ఆమె నవమానిస్తున్నారు. శివభక్తి రూపు గైకొన్న ఆబాలిక నెవరో నిర్బంధిస్తున్నారు. ధ్యానభంగమై ప్రాణాయామం విడిచి పెట్టి గబగబా నడుస్తూ, చంచల దృష్టులతో నలుమూలలా చూస్తూ దేవదాసీలుండే వీధికి వెళ్ళాడు ఒకరిద్దరు శిష్యులు సర్వజ్ఞుడు తొందరగా నడవడం మొదటిసారిగా చూశారు. కానీ, భక్తి శ్రద్ధలతో నిండిన వారి మనస్సులు ఈ విషయాన్ని గురించి అట్టే ఆలోచించలేదు

గంగ యిల్లు గొళ్ళెం వేసి ఉంది. సర్వజ్ఞు డది చూచి వెనక్కి తిరగగానే ఇంట్లోనుండి గంగ రోదన ధ్వని వినిపించింది త్వరగా తలుపు తెరచి లోపలికి ప్రవేశించాడు గంగ బోర్లాపడుకొని కుమిలి కుమిలి ఏడుస్తున్నది

'ఏడుస్తున్నా వెందుకు గంగా? ఎందుకు?'

గంగకు దుఃఖం పొంగివచ్చింది 'గురుదేవా! నా పిచ్చితల్లిని శివరాశి దేవీ మంది రానికి ఇప్పుడే తీసుకొని వెళ్ళారు. ఇక దాని గతి ఏమికాను?'

సర్వజ్ఞునికి కోపము వచ్చింది. ఆయన దృష్టి గత అనేక సంవత్సరాల తపస్సుతో పవిత్రమైంది త్రిపురసుందరి పూజల్లో వామ మార్గీయ పద్ధతులన్నీ నీచాతి నీచమైనవనీ, జుగుప్సాకరమైనవనీ, అధమ, హీన, అసహ్య భావాలకు ఆలవాలమైనవనీ ఆయనకు చిన్న ప్పుడే నమ్మకం కల్గింది ఆ మార్గాలను పూర్తిగా సంశోధించాలని ఆయన ప్రయత్నం కూడా ప్రారంభించాడు 'పూర్తి ఇష్టంలేందే దీక్ష పొందరాదు దీక్ష పొందనిదే ఈపూజల నెవరూ చేయరాదు తనో లేక శివరాశియో తప్ప మరెవ్వరూ ఈ మహోత్సవం జరుపరా'దని ఆయన మొదటనే నియమాలను విధించాడు. వర్షానుకవర్షాలయింది.

ఈనీచ పూజావిధులంటే ఆయనకు అసహ్యంవేసి; అప్పటినుంచి ఆవైపు వెళ్ళడం కూడా మాని వేశాడు అపుడపుడు శివరాశి పూజాచార్యుడుగా వెళ్ళేటపుడు ఎన్నో నీతులు చెప్పి అతనిని కూడా ఆపాలని చూచేవాడు నెమ్మది నెమ్మదిగా ఈ మందిరం చుట్టూ ఒక పెద్ద ప్రాకారం లాంటిది నిర్మించాడు ఈ మందిరం మానవత్వానికి కళంకమని ఆయనకు గట్టి విశ్వాసం ఉన్నా, ఆ ఆచారాల కొరకు పడిచచ్చే భావుకు లున్నంతవరకూ అకస్మాత్తుగా ఆపడం సాధ్యంకాదు. ఇంతేకాదు, లకులేశమత సిద్ధాంతాల్లో, ఆచారాల్లో ఎన్నో మార్పులు రావాలని, దాని అవసరం ఎంతైనా వుందని భావించి ఆ మార్గంలో త్వరత్వరగా ఆయన ఎన్నో మార్పులు క్రమేపీ చేస్తూ వచ్చాడు బైరాగిశిష్యులు, భావుక భక్తులు ఈ మార్పులనసహ్యించుకునేవారు శివరాశి లాంటి శిష్యునికి కూడా ఈవిషయంలో ఉత్సాహం లేదని స్ఫురించినపుడు ఆయన మనస్సు సంక్షోభం పొందేది చోళా విషయంలో మట్టుకు ఈవామాచార పద్ధతిలో దీక్ష యిప్పించ తగదని ఆయన నిశ్చయించుకున్నాడు ఆయన తన సంకల్పాన్ని శివరాశికీ, గంగకూ తెలియజేశాడు. శివరాశి ఈ విషయంలో అంగీకరించడని కూడా తెలుసు అందుకే ప్రొద్దున శివరాశి చోళాను అమ్మవారు ఆవేశించింది అని చెప్పడానికి వచ్చినపుడు 'చోళాను దేవీమందిరానికి తీసుకువెళ్ళరా'దని శాసించాడు ఆయన శివరాశి ముఖంలోని ఆకామవాంఛలను పసికట్టాడు కానీ శిష్యునిలో కన్పిస్తూ వచ్చిన ఇతర దోషాలను క్షమించనట్లే మనస్సులో క్షమించాడు. కానీ మనస్సులో క్షోభ చెలరేగింది. ఇంతలో సామంతుడు వచ్చినందువల్ల మాటలో పడి జాగ్రత్తగా వుండడం మరచిపోయాడు. కానీ గంగ చెప్పిన మాటలు వినగానే ఆ పుణ్యమూర్తి హృదయంలో రౌద్రం రగుల్కొంది. క్షణంపాటు ఆలోచించి ఎన్నో సంవత్సరాలనుంచి తాను సంకల్పించుకున్న పనిని ఆనాడు చేయదలచాడు

'నాకు తెలియనిది సరే. . ఆ దివిటీ తీసుకొని పద '

గంగ కన్నీళ్ళు తుడుచుకొని దివిటీ నందుకున్నది సర్వజ్ఞుడు ఆమెను వెంటబెట్టు కొని వెళ్ళి త్రిపురసుందరి మందిరపు రహస్య ద్వారాన్ని పట్టాడు. అక్కడ కాపలా కాస్తున్న బైరాగి తలుపు తెరచి గురుదేవుని చూడగానే భయంతో వణికిపోయాడు.

'గురుదేవ్!'

'అవును నేనే .నీ విక్కడే ఉండు '

బైరాగి భయంతో బిగిసిపోయి అక్కడే రాయిలా నిల్చున్నాడు

గంగ తెచ్చిన దివిటీ మసక వెలుతురులో స్తంభానికి కట్టబడివున్న సామంతుణ్ణే సర్వజ్ఞుడు చూచాడు

''సామంతా! నీవా ? ఇక్కడ?''

''నన్ను త్రిపురసుందరి దీక్ష ఇవ్వడానికి తెచ్చారు గురుదేవా!'' అంటూ మహా కర్కశంగా సామంతుడు నవ్వి ''నేను తీసుకోనని అంటే ఇదిగో ఇలా బంధించారు ఒక బైరాగి నన్ను చంపుతానన్నాడు కూడా ఆయన కొరకే నేను ఎదురుచూస్తున్నాను'' అన్నాడు

''సమస్త ప్రభాస సంరక్షణ భారాన్ని వహించిన నిన్ను ఇక్కడే చంపుదామనుకున్నారా? వినాశనాన్ని త్వరగా ఆహ్వానించేందుకు పరమేశ్వరా! వీళ్ళ కీ విపరీత బుద్ధులు ప్రసాదిస్తున్నావేమయ్యా స్వామీ! ఇదిగో నువ్విటురా! ఇతని కట్లు విప్పు'' అని అక్కడి బైరాగిని ఆదేశించాడు అతడు వెంటనే కట్లు విప్పాడు

''చోళా కన్పించిందా?''

''కన్పించింది ఇపుడే రాశిగారితో లోపలికి వెళ్ళింది'' సామంతు డన్నాడు

''తనంతట తాను వెళ్ళిందా?!''

''ఆహా! చక్కగా ఎగురుతూ, గెంతుతూ ''

''అవును గురుదేవా! శివరాశి వచ్చి పరమేశ్వరుడు నీ కొరకు ఎదురు చూస్తున్నాడు అని చెప్పేసరికి నా పిచ్చితల్లి సంతోషంతో పరుగెత్తింది ప్రొద్దుటినుంచే దానికీ భక్తి విహ్వలత వచ్చింది ''

''తనంతట తాను వెళ్ళిందా?'' సర్వజ్ఞులు ప్రశ్నించారు తనంతట తాను వెడితే ఆపడం ఎలా?

''లేదు స్వామీ! లేదు ఈ దీక్ష నది సంతోషంతో చేస్తే అంగీకరించదు '' అని గంగ మొత్తుకున్నది

''విచిత్రపు మనుషులు మీరంతా '' అన్నాడు సామంతుడు

సరేనంటూ సర్వజ్ఞుడు లోపలికి నడిచాడు గంగ, సామంతుడు అతని ననుసరించారు లోపలికి వెళ్ళి త్రిపురసుందరి మందిరం ముంగిట నిలిచారు అక్కడ సామంతునికి అనేక భూతాలు కన్పించాయి వెంటనే అతడు కండ్లు మూసుకున్నాడు ఒకే ఒక కరదీపిక వెలుతురులో చప్పట్లు కొడుతూ, స్త్రీ పురుషు లెందరో త్రిపురసుందరీ స్తవనం చేస్తూ గుండ్రంగా తిరుగుతున్నారు వీళ్లు మానవులా? లేక మానవ ఛాయలా? ఏమైనా కావచ్చు తన ఆప్తబంధువుల శవాలు చూచినపుడు శరీరంలో వణుకు పుట్టినట్టే తిరిగి సామంతునికి వణుకు పుట్టింది

వామాచారుల నీచ భీభత్స పద్ధతులను చూచి ఊహించుకోగానే అతని కన్నుల ముందు చీకటి అలముకున్నది

అందరూ ముగ్గురు నలుగురు వ్యక్తుల చుట్టూ తిరుగుతున్నారు అందులో ఒకని చేతులో దివిటీ వుంది పాడుతూన్న పూజారులు హఠాత్తుగా ఆగిపోయారు ఆ అడుగుల ధ్వనినీ, తాళాలనూ, స్తవనాన్నీ చీల్చుకుంటూ ఏదో ఆర్తనాదం, కేకలు విన వస్తున్నాయి ఆ ధ్వని ఎవరిదో సర్వజ్ఞుడూ, గంగా గ్రహించారు సామంతుడు కూడా గ్రహించాడు సర్వజ్ఞుడు ముందుకు ఒక అడుగు వేశాడు గంగ నిలువునా గజగజలాడి పోతున్నది కానీ సామంతుడు తనను నిగ్రహించుకోలేక పోయినాడు వరలోంచి కత్తి లాగి సింహంలా గర్జిస్తూ ఆ భీభత్స రసారాధకుల మీద విరుచుకు పడ్డాడు కత్తితో వచ్చి పైబడుతూన్న ఆ కాలభైరవుణ్ణి చూచి స్త్రీ పురుషులు దారి యిచ్చారు మధ్య వృద్ధబైరాగి దివిటీ పట్టుకొని నిలుచున్నాడు ఒక లావుపాటి ఆడమనిషి చోళాను కదలకుండా పట్టు కున్నది ఆమె తన్నుకుంటున్నది అప్పుడే ఆమెకు స్పృహ వచ్చింది స్పృహ రావడంతోటే చుట్టూ ఉన్న స్త్రీ పురుషులను చూచి అరవనారంభించింది ఎదురుగా కూర్చుని శివరాశి ఆమెకు హారతులిస్తున్నాడు

సామంతుడు ఒక్క గంతులో ఆ పట్టుకుని నిల్చున్న స్త్రీని ప్రక్కకు నెట్టి, విడి పించుకోడానికి పెనుగులాడుతున్న చోళాను తన బాహువులలోకి తీసుకున్నాడు. శివరాశి చేతిలోని హారతుల కాంతిలో అతని కత్తి ధగధగ మెరుస్తూ చూపరులకు కంపనం కల్గిస్తున్నది

'రాశీ! ఏమిటిదంతా?' సర్వజ్ఞుని ధ్వని వినిపించగానే రాశి కండ్లు తెరిచాడు ఒక వైపు కాలభైరవాకారంగా సామంతుడు విచ్చుకత్తితో మహారౌద్రమూర్తిలా నిల్చున్నాడు ఎదురుగా గురుదేవులు చూపులతో అతని హృదయాన్ని చీలుస్తూ ఉపాలంభనం ప్రద ర్శిస్తూ నిల్చున్నారు అతని చేతులు వణికాయి చేతుల్లోని హారతిపళ్ళెం క్రిందపడి పోయింది

''గురుదేవులు- గురుదేవులు - గురుదేవులు'' - భీతిగ్రస్తులైన స్త్రీ పురుషు లందరూ గుసగుసలారంభించారు

''రాశీ! ఈరోజు నీవు మహామాయ పూజాపద్ధతిని చెడగొట్టావు '' సర్వజ్ఞుని కంఠంలోంచి ఖేదం పొంగింది 'చోళాను బలవంతాన మూర్ఖంగా యిక్కడికి తెచ్చావు.'

'కాదు కాదు . చోళా తనంతట తాను కోరి వచ్చింది' అన్నాడు సాహసించి శివ రాశికి అండగా సిద్ధేశుడు

'అందుకే అరుస్తున్నదా? సిద్ధేశా! నీవీ లకులేశ మతంలో చెడబుట్టావు నీ ముఖం చూడరాదు రాశీ! తక్షణం యిక్కడినుంచి వెళ్ళిపో రేపు నీకు ప్రాయశ్చిత్తం తెలుపుతా'

'లేదు గురుదేవా! ఆమె తనంతట తానే వచ్చింది.'

'అవునవును' వృద్ధబైరాగి కూడా సమర్థించాడు అతని ప్రక్కనే నలుగురైదుగురు బైరాగులు వచ్చి చేరారు. వారి ముఖాల్లో గురువుపట్ల వ్యతిరేకత స్పష్టంగా కన్పిస్తున్నది. ఒకరిద్దరు ఇనుప కంచీలను పట్టుకొని గల గల ఊపుతూ సర్వజ్ఞుణ్ణి బెదిరిస్తున్నారు

శాంతగంభీరుడై సర్వజ్ఞుడు దిగులుగా అందరినీ ఒకసారి చూచాడు.

'మీరందరూ కలసి నేడు ఈ మందిరాన్ని పాడుచేశారు చూడండి కండ్లుంటే చూడండి-చోళాను ఎంత సిగ్గుతో- అసహ్యంతో- భయంతో మీ రూపాలను చూస్తున్నదో చూడండి ఇది మహామాయ మందిరం డంభాచారుల మందిరం కాదు అత్యాచారుల నిలయం కాదు. విషయలోలుర ఆలయం కాదు ఎంతవరకు మీరీ పాపానికి సరిగా సంపూర్ణంగా ప్రాయశ్చిత్తం చేసుకోరో అంతవరకు ఈ మందిరం ఈరోజు నుంచే మూసి వేయబడుతుంది '

''మందిరం మూసివేయబడుతుందా? ఎవరా పని చేసేది?'' వృద్ధ బైరాగి ముందుకు వచ్చి మహాభయంకరంగా అన్నాడు ఇనుపకంచీ పైకెత్తడానికి అతని చేతులు తహతహలాడుతున్నాయి

సర్వజ్ఞుడు కిలకిల నవ్వాడు. ''ఎవరా? నేను-స్వయంగా- లకులేశ మతాధిష్ఠాతనైన- నేను స్వయంగా. .''

''అంత శక్తి ఉందా?'' ఆ ముసలి బైరాగి చేయి పైకెత్తాడు. సామంతుడు ఒక్క గంతులో వాడి చేయిని పట్టుకోబోయాడు.

''సామంతా! నీవు తప్పుకో'' శాంతంగా సర్వజ్ఞుడన్నాడు ''హరదత్తా! నన్ను చంపాలనుకుంటున్నావు కదూ? ఇదిగో .. నా తల. నీ గురువు తల .. నీ అధోగతి పూర్తి చేసుకో'' అంటూ తల వంచాడు.

వృద్ధుని కండ్లలో పిచ్చిచూపు లేర్పడ్డాయి. చేతిలోని కంచీ జారి క్రింద పడింది. కండ్లు తిరిగి కుప్పలా నేలమీద కూలిపోయాడు సర్వజ్ఞుడు వెనక్కు తిరిగి బైటికి వచ్చి శతాబ్దాల నుంచీ మూసివేయని త్రిపురసుందరి మందిర ద్వారాలను మూసివేశాడు.

''ఇన్నాళ్ళూ మీరు మూటకట్టిన పాపం పండి త్రిపురసుందరి మూడో కన్ను తెరిచింది. అదుగో. రాక్షసునిలా అమీరు ఈ మందిరాన్ని ధ్వంసం చేయడానికి వస్తున్నాడు ఎంతవరకు ప్రాయశ్చిత్తం చేసుకొని మీ పాపాలను కడిగివేసుకోరో, ఎంత వరకు ఈ అమీరు బాధ విరగడకాదో అంతవరకు నేను తప్ప మహామాయను ఇంకెవ్వరూ పూజించకూడదు '' ఈ మహత్తరమైన ఆత్మశక్తి ముందు తలలు వంచి అందరూ మెల్లగా అక్కడి నుంచి జారుకున్నారు.

సర్వజ్ఞుడు కాసేపు అలాగే మందిర ప్రాంగణంలో నిల్చున్నాడు చోళా తల్లి ఒడిలో తల పెట్టుకొని తనకు కలిగిన విపత్తును తలచుకొని వెక్కి వెక్కి ఏడుస్తున్నది సామంతుడు ఒక గోడ నానుకొని శూన్య దృష్టితో చూస్తున్నాడు

''గంగా! చోళాను ఇంటికి తీసుకొని వెళ్ళు ఈ దివ్యధామం గతి ఏమి కానున్నదో? సామంతా!''

''స్వామీ!''

''నాయనా! చాలా ప్రొద్దు పోయింది. ఇక ప్రయాణానికి సిద్ధంకా ''

''మీ ఆజ్ఞ . ''

''గంగా! ఈ చౌహాన్‌ను గుర్తించావా? ఇతనికీ, ఇతని తండ్రికీ చోళా మునుపు భస్మం ఇచ్చింది. జ్ఞాపకం ఉన్నదటే? చోళా!''

చోళాకు ఆ భక్తిభావపు పొంగు తగ్గిపోయింది. సామంతుణ్ణి గుర్తించింది సామంతుడు కూడా ఆమెను సమీపించాడు ఇద్దరూ ఒకరి నొకరు చూచుకున్నారు

''గంగా! చౌహాన్ వీరుడిపై పదిహేను రోజుల్లో మహావిపత్తు వచ్చి పడింది ప్రపంచమంత పెద్ద కుటుంబంలో మిగిలింది ఇతనొక్కడు ఇతడు కూడా శ్రీసోమనాథుని సేవ కొరకు మాత్రమే జీవిస్తున్నాడు. ఇతణ్ణి నీ వెంట తీసుకుపోయి భోజనపు ఏర్పాటు చెయ్యి. ఇంతవరకు ఏమీ తినలేదు పాపం మన ఆశలన్నీ ఇతని మీదే ఉన్నాయి'' అంటూ చూపులు నేలకు దింపి ఖేదపూర్వకంగా నిదానంగా అడుగులు వేస్తూ సర్వజ్ఞుడు వెళ్ళిపోయాడు

చోళా సిగ్గుతో కుదించుకొని పోతున్నది కొద్ది సమయానికి పూర్వం తనను ఏ పరిస్థితిలో సామంతుడు చూచాడో - దానిని తలచుకొని భూగర్భంలో అణగిపోదా మన్నంత వేదన అనుభవిస్తున్నది గంగ అతణ్ణి ప్రేమతో వెంట తీసుకొని వెళ్ళింది

''చౌహాన్! వెళ్దాం రా! నీవనుభవించిన కష్టాలేమిటో నాకూ చెప్పవూ?''

చాలా రోజుల తరువాత సామంతుడు తన దీన గాథను చెప్పుతూ హృదయ భారాన్ని దించుకుంటూ ఆనందంతో ఆ రాత్రి గడిపాడు. ఈ మహా సాహసమూర్తి చెబుతున్న ఘట్టాలు వింటూంటే చోళాకు కూడా నూతనోత్సాహం కలిగింది

పదకొండవ ప్రకరణం

# అనహిలవాడ పట్టణం

## 1

రెండు వందల సంవత్సరాల అనహిలవాడ కీకారణ్యాం మధ్య ఒక చిన్న దుర్గం ఆ దుర్గాధిపతులైన 'చావడా' వంశీయులు ఏటేటా కొంతమంది జనాన్ని వెంటబెట్టుకొని ఇరుగు పొరుగు దుర్గాలను దోచుకుంటూ, పరిసర గ్రామాల్లో పన్నులు వసూలు చేస్తూ భిల్లులను అడవుల్లోకి తరుముతుండేవారు ఈ 'చావడా' వంశీయుల ఆగడం ఒకప్పుడు పెరగడం, మరొకప్పుడు తగ్గడం- ఒకప్పుడు పరిసర దుర్గాధిపతుల దండయాత్రలకు జంకి 'పావాదుర్గం' లో తలదాచుకోవడం, వేరొకప్పుడు వీరప్రభావం లాట, సౌరాష్ట్ర ప్రాంతాలకు వ్యాపించడం జరుగుతుండేది

అయినా ఈ దుర్గం నొసట బ్రహ్మదేవుడు సువర్ణ రేఖలు తీర్చిదిద్దాడు వి.శ 1017లో చాళుక్య వంశ రత్నమైన మూలరాజదేవుడీ దుర్గానికి రాజైనాడు అప్పటినుంచి దీని స్వరూపమే మారిపోయింది చుట్టూ ఉన్న అడవులను కొట్టివేశారు ఆ ప్రదేశంలో చక్కని గ్రామాలు వెలిశాయి రాజ శక్తి ఈ గ్రామీణుల జీవితాలకు శాంతి భద్రతలను ప్రసాదించినందువల్ల శ్రీమాళం, కన్నోజ్, ఉజ్జయిని, భృగుకచ్ఛ ప్రాంతాల నుండి నాగరిక ప్రజలు వచ్చి ఈ గ్రామాలలో నివాసాలేర్పరచుకున్నారు గుజరాత్ ప్రాంతీయులైన వీరజాతీయులందరూ మూలరాజదేవుని ఛత్రచ్ఛాయల్లో ఏకమై ఆయన ఆధిపత్యాన్ని స్వీకరించారు ఈతని తెలివితేటలవల్ల అనహిలవాడ విస్తరించడమే గాక, అద్వితీయమైన ప్రతాపాన్ని ప్రదర్శించడం మొదలయింది ఒకనాడు ఒక కుగ్రామంగా వున్న ప్రదేశంలో ఈనాడు ఖంభాత, భరూచ, దూంగరోల వ్యాపారులు తమ వాణిజ్య కేంద్రాలను స్థాపించుకున్నారు అనేక ప్రాంతాలనుంచి విద్వాంసులు వచ్చి సంస్కారాలకూ విద్యలకూ, మహా కేంద్రంగా ఆ ప్రదేశాన్ని రూపొందించారు మునుపు మట్టి యిండ్లు వున్నచోట మహా సౌధాలు వెలిశాయి ఆకాశాన్ని ముద్దాడుతూ తలలెత్తుకుని నిల్చున్న మందిర శిఖరాలు ఆనాటి ప్రజల ధర్మ ప్రవృత్తినీ, వైభవాన్నీ వెల్లడిస్తున్నాయి ఈ గ్రామాల దగ్గరే ఒక మహా దుర్గం నిర్మింపబడింది ఒకప్పుడు దుర్గంగా ఉన్న ఆ చిన్న ప్రదేశమే నేడు అనహిలవాడ పట్టణమైంది

మూలరాజదేవుని ప్రతాపం క్రమేపీ విస్తరించింది నెమ్మదిగా జునాగఢ్, కచ్ఛ, లాట రాజ్యాల ప్రభువులు మూలరాజదేవునికి లొంగిపోయారు ఆ సమస్త ప్రదేశానికీ మూలరాజదేవుడు మకుటమణిలా వెలుగొందాడు ఝాలోర్, మార్వాడ్ స్థానిక రాజ్యాధిపతులు అతనితో మైత్రి నెరపుకున్నారు ఇలా నానాటికీ బలపడ్తున్న ఈ రాజన్యుని ప్రతాపాన్ని అణగద్రొక్కడానికి ఉజ్జయిని చక్రవర్తి ఎన్నో ప్రయత్నాలు చేశాడు గానీ లాభం లేకపోయింది మూలరాజదేవుడు చనిపోయే నాటికి అనహిలవాడ పట్టణం పశ్చిమ ప్రాంతాలకు రాజధానిగా రూపొందింది

ఈ మహానుభావుని కులదైవం శ్రీ సోమనాథ పరమేశ్వరుడు పరమేశ్వరుడు వీరి వంశాన్ని కరుణాదృష్టితో కాపాడాడు కానీ, మూలరాజ దేవుని పుత్రుడైన చాముండుడు, పౌత్రుడైన దుర్లభసేనుడు దుర్మార్గులై సంకీర్ణ బుద్ధులైనందువల్ల ప్రజలు గడగడ వణకి పోవడం మొదలుపెట్టారు అప్పుడు లకులేశ సాంప్రదాయానికి గురువులు, సోమనాధ మఠాధిపతులైన సర్వజ్ఞ గురుదేవుల ఆశీస్సులచే భీమదేవుడు ఈ సింహాసనాన్ని అధిష్ఠించాడు

## 2

నేడు గజనీ సుల్తాను సోమనాధుని భవ్య మందిరాన్ని విధ్వంసం చేయడానికి వస్తున్నాడు ఈ సమయంలో పరమేశ్వరానుగ్రహం వల్ల ధనుశ్శాస్త్ర పారంగతులైన భీమదేవ మహారాజు వంటి పౌరుషమూర్తి ఆ సింహాసనాన్ని అలంకరించి ఉన్నాడు మ్లేచ్ఛ విధ్వంస వ్రతాన్ని స్వీకరించాడాయన లోహ కోటాధిపతి, వీర బాలమదేవుడు చేయజాలని ఈ కార్యాన్ని చేయాలని నిశ్చయించుకున్నాడు ఆ మహావీరుని గర్జారవం పల్లెపల్లెలా వ్యాపించింది కచ్ఛ, సోరఠ, శ్రీమాళ, గుజరాత, లాట, కొంకణదేశ వీరమూర్తుల హృదయాలలో ఆ సింహగర్జన ప్రతిధ్వనించింది దేశాలుగా వేరై వున్నవి ప్రాంతాలైనాయి అందరి ఆశాదృక్కులు అనహిలవాడ మీద కేంద్రీకృతమైనాయి విభిన్న రాజ్యాల రాజులందరూ ఒకే పతాక ఛాయలో ఏకమౌదామని తపించడం ప్రారంభించారు అంత వరకూ ఈర్ష్యాజ్వాలల్లో మాడి చస్తున్న రాజులు ఆ విపత్సమయంలో భీమదేవుని ఆజ్ఞలు శిరసా దాల్చడమే మహాప్రసాదమని భావించారు భృగు కచ్ఛం నుంచి దాదా చాళుక్యుడు వేంచేశాడు పూర్వవైరాన్ని విస్మరించి జూనాగఢం రాజు రత్నాదిత్యుడు వచ్చాడు కచ్ఛ ప్రాంతం నుండి కమాలఖాణీ, అబూనుంచీ త్రిలోచనపాల పరమార్ విజయం చేశారు 'ద్వారక' నుంచి 'బారస్పాడా' వరకు 'దమన' నుంచి 'అబూ' వరకు ప్రజల హృదయ

కుహరాలలో '(శ్రీ) సోమనాథ పరమేశ్వర పరమధామాన్ని' రక్షించడమే తమ పరమావధి అను నినాదం గాలిలో వలయాలుగా వ్యాపించింది ఈ మనోరథాన్ని విజయవంత మొనరించడానికి (శ్రీ) భీమదేవ మహారాజే పరమసాధన స్వరూపులని విశ్వసించారు అనహిలవాడ స్వధర్మ రక్షణకూ, స్వాతంత్ర సంరక్షణకూ కేంద్రమైంది ఒకే వీరుని ఆజ్ఞ, కేంద్రాభిమానం ఆ మ్లేచ్ఛుని ఎదిరించేందుకై ఏకాగ్రమైన చింత- ఈ మూడూ గుజరాత ప్రజల నైక్యపరచి ఒక విశిష్టమైన మహత్తును సృష్టించాయి

భీమదేవుడు ఈ అందరి మధ్య విద్యుల్లతలా మెరుస్తుండే వాడు ఒక్కొక్క చోట మహా శౌర్యాన్ని రగుల్కొలుపుతుండేవాడు మరొకచోట భయంకర రౌద్రాన్ని ప్రదర్శించి నైరాశ్యతను నిర్మూలించేవాడు విశాలమైన అతని కను కొలకుల్లోంచి నిరంతరం యుద్ధాగ్ని జ్వాలలు ఆకలితో పెల్లుబుకుతుండేవి గుఱ్ఱంపై పరిసర ప్రాంతాలను పర్యటించి ఉత్సాహ కాంతులను వెలయించేవాడు సైన్యాలను వ్యూహాలుగా తీర్చిదిద్దేవాడు ప్రతివ్యక్తీ మ్లేచ్ఛుణ్ణి ఎదిరించడానికి రావాలి అని పల్లె పల్లెలా, వాడ వాడలా చాటింపించాడు ఈ స్వాగతాన్నందుకొని వివిధ ప్రాంతాల నుంచి వీరయోధులు ఈ రణ మహోత్సవంలో పాల్గొనడానికి ఉత్సాహంతో ప్రతిరోజూ ప్రవాహంలా వస్తుండేవారు వీరందరికీ ఆయుధాలు యిచ్చి, వాటి ప్రయోగం నేర్పి, దళాలుగా విభజించి వారికి కావలసిన సదుపాయాలు చేకూరే ప్రణాళిక లేర్పరచి రేయింబవళ్ళు, అన్నపానాదులు కూడా లెక్కచేయకుండా కోట గోడలో ప్రతి అణువును అభేద్య మొనర్చి, రక్షించడానికి భీమదేవుడూ, విమలమంత్రీ అవిరళ కృషి సల్పుతుండేవారు

ఈ ఉత్సాహ తరంగాలు ఇంటింటా వినిపించాయి. దీనితో వీరరక్తం ఉప్పొంగి నారీమణులు యోధవరులను హారతులతో రణరంగానికి సాగనంపేవారు యువకుల హృదయాలలో ఉత్సాహం ఉప్పొంగి పోతున్నది వీరాంగనలు గుండెదడతో యోధుల ఫాల భాగాలను సింధూరంతో అలంకరించేవాళ్ళు మ్లేచ్ఛుని ఆక్రమణ నాపడానికి కటిబద్ధుడైన భీమదేవుణ్ణి గురించి కట్టుకథలు చిలవలు పలువలుగా వ్యాపించాయి. ఈకథలతో ప్రజల హృదయాలలో సమరోత్సాహహం మహా సాగరంలా ఉప్పొంగింది ఆసాగర మధనానికి మేరు పర్వతంలా భీమదేవుడు నవ్వులు వెదజల్లుతూ, యువక హృదయాలను ఉత్సాహంతో ముంచెత్తుతూ ప్రతిచోటా తానై తిరుగుతుండేవాడు

రాజ దుర్గంలో ఒక చిన్న గదిలో దామోదర మెహతా కూర్చున్నాడు. ఆయన కంటికి నిద్రపట్టి ఎన్నాళ్ళయిందో! మ్లేచ్ఛుని ఆక్రమణ వార్తలు వస్తున్నకొద్దీ అతని విచారం అధికమవుతుండేది ఆయన చేసిన ఏర్పాటు వల్ల మొట్ట మొదటే అనహిలవాడలోని

ముదుసళ్ళనూ, స్త్రీలనూ, పసివారినీ 'పావాగఢా'నికి పంపడం జరిగింది వేదపండితు లను ఖంభాత, భరూచ ప్రాంతాలకు పంపాడు మిగతా జనాన్ని దూర ప్రాంతాలకు పొమ్మని హెచ్చరికలు చేయించాడు అమీరు అనహిలవాడను ఎంతకాలం చుట్టుముట్టి ఎదిరించినా, తరగకుండా ఉండడానికి ధాన్యాలతో లక్షలుగా గాదెలు, పాతరలు నింపించాడు జలాశయాలలో నెల రోజులకు సరిపోయే నీరు నింపించాడు ఖంభాత ప్రాంత నౌకలన్నింటినీ యుద్ధ నౌకలుగా తీర్చి దిద్దించాడు

ఇంతటితో దామోదర్ మెహతాకు తృప్తి కలుగలేదు గుజరాత్‌లోని ప్రతి గ్రామ సంరక్షణనూ తన పైన పెట్టుకున్నాడు' గజనీ మ్లేచ్ఛుని అత్యాచారాలు విని, అట్టివి తిరిగి జరగకుండా గ్రామాలలోని స్త్రీలను, పాపలనూ సురక్షిత స్థలాలకు పంపించాడు

ఇన్ని పనులున్నా ఈ పౌర శిరోమణి పెదవుల్లో ఎపుడూ చిరునవ్వు దొంతరలు పొయలై చిలుకుతుండేవి విమల మంత్రి అన్నట్లు, ఆయనకు కోపం వచ్చినట్లు ఎప్పుడూ కనిపించలేదు ఎన్ని గుంపులున్నా తాను స్వయంగా దారి చేసుకొని తీయని మాటలతో పురోగమించే మహా సౌమ్యమూర్తి దామోదర్ మెహతా

ఇన్ని హంగులతో వీర గుజరాత్ మ్లేచ్ఛుణ్ణి కదనరంగానికి ఆహ్వానిస్తూ నిలుచున్నది

## 3

నేటికి మూడు రోజుల నుంచి ప్రతి సైనికుని జిహ్వామీదా ఒకే మాట నర్తిస్తున్నది ఆ మాటవల్ల ప్రజలందరిలోనూ నిరాశ అలుముకుంటున్నది మరుభూమిని ఏకాధి పత్యంతో ఎదురు లేకుండా ఏలుతున్న ఘోఘారాణాను అమీరు సంహరించాడు ఘోఘాబాబా భూతం సోమనాధుని రక్షించడానికి గుజరాత్‌కు వచ్చిందట మేమా భూతాన్ని చూచామని చెప్పేవాళ్ళు కూడా చాలామంది ఉన్నారు చాలామంది ఆ భూతంతో మాట్లాడారు అమీరు వస్తే పారిపోయి, వాడు తిరుగు ముఖం పట్టిన తర్వాత వెనుక నుంచి ఎదిరించండనీ, దోచుకోండనీ ఆ భూతం చెప్పింది ఈపుకార్లు పెరుగుతున్న కొద్దీ సాహసుల హృదయాల్లో కూడా కలవరం బయలుదేరింది దుర్గపాలకుడైన అర్జునుడు ఆ భూతాన్ని చూచాడు, మాట్లాడాడు ఈ విషయం గురించి భీమదేవునితో మాట్లాడడానికి అనహిలవాడకు వచ్చాడు; ఈ విషయం నిజమేనని సైనికుల వాదం. ధనుర్వేత్తయైన భీమదేవుడీ మాటను నిర్లక్ష్యంగా త్రోసిపుచ్చాడట. త్రోసిరాజంటే మట్టుకు జరిగిన విషయం కాకుండా పోతుందా? ప్రజల హృదయంలో ఇలా అనేక అపోహలు వ్యాపించాయి

ఎక్కడ చూచినా ఇదే చర్చ ఘోఘారాణా భూతం వారి యవ్వనంలో ఉండే విధంగా వుంది ఇపుడే చితిమీద నుంచి దిగి వచ్చినట్లు కన్పించేంత తెల్లగా ఉంది దాని శరీరం మెడ మీద ఒక పెద్ద గాయం ఉంది దానిలోనుంచి రక్తం ఎగజిమ్ముతోంది ఈ వర్ణన పలుమార్లు వ్యక్తంచేయడం వల్ల అనహిలవాడ ప్రజల మనోనేత్రాలకు సాక్షాత్తు ఘోఘారాణా భూతమై కన్పించడం ప్రారంభించాడు

పట్టణానికి నలుమూలలా యోజన పర్యంతం సైనిక శిబిరాలు ఉన్నాయి ఆరోజు కారోజు సైన్యం కూడా పెరిగిపోతున్నది ఒకరోజు ఆ శిబిరాల సరిహద్దుల్లో రక్షక భటులు కూర్చుని ఏవో కబుర్లు చెప్పుకుంటున్నారు ఆ కబుర్లు కూడా ఘోఘారాణాను గురించే. ఆనాడు మరో విషయమే స్ఫురించనటువంటి పరిస్థితి ఏర్పడింది ఇంతలో దూరంగా దుమ్మురేగుతున్నట్లు కన్పించింది సైనికులు కబుర్లు మాని ఆయుధాలు తీసుకొని అటువైపు చూస్తూ కూర్చున్నారు సౌరాష్ట్ర మార్గాన నాలుగు ఒంటెలు మహా వేగంగా పరుగెత్తుకొని వస్తున్నాయి రక్షక భటుడు ఒక్క కేకతో అక్కడికి కొంత దూరాన ఉన్న మరోభటుణ్ణి హెచ్చరించాడు ఒకరి నుంచి మరొకరికి ఈ హెచ్చరిక అందరికీ చేరింది

ఒక రక్షక భటుడు ఆ ఒంటెల వాళ్ళను కలుసుకోడానికి ముందుకు నడిచాడు ఆ ఒంటెలలో ఒక దానిపై యువకుడు కూర్చున్నాడు రక్షక భటునికి పైప్రాణాలు పైనే పోయాయి అదుగో! అవే భయంకర నేత్రాలు! చితినుంచి అప్పుడే దిగి వచ్చినట్లు కన్పించే చర్మం! అదిగో! మెడలో గాయం

''ఎవరు మీరు?'' గడగడ వణకుతూ భటుడు ప్రశ్నించాడు

''చౌహాను సోమనాథం నుంచి వస్తున్నా భీమదేవ మహారాజులుం గారిని కలుసుకోవాలి ''

''ఘోఘాబాబూ!'' చౌకీదార్ దీనంగా సంబోధించాడు. యువకుడు నవ్వలేదు 'నిజమే మరి! భూతాలు నవ్వడమేమిటి? పోనీ ''నేను కాద''న్నారా? సత్యాన్ని ఎలా కాదంటారు?' ఒంటె మీద కూర్చున్న వ్యక్తి ముందుకు నడిచాడు రెండో రక్షక భటుని నోట కూడా ఇవే మాటలు అతను కూడా ఆ మూర్తిని గుర్తించాడు. అతని నోరు కూడా కదలలేదు

మూడవ వాడూ అంతే! ఒకళ్ళ తరువాత ఒకళ్ళకు ఈ విషయం తెలిసింది యువకుడు నిశ్చింతగా రాజదుర్గం వైపు నడిచాడు

రాజదుర్గం దగ్గరకు చేరుకోగానే అక్కడ దుర్గద్వారం వద్ద ఒక పెద్ద సైనికుల గుంపు కన్పించింది చీకటి అప్పుడప్పుడే అన్నివైపులా ముసురుకుంటున్నది యువకుడు

ఒంటెను పడుకోబెట్టాడు అతనూ, మరొక వృద్ధ బ్రాహ్మణుడూ దానిమీది నుంచి దిగారు సైనికులు వారి చుట్టూ మూగారు

''భీమదేవ మహారాజును దర్శించుకోవాలి సోమనాథ నగరాన్నుంచి సందేశం తెచ్చాను ''

అప్పుడే ఒక వృద్ధ దుర్గపాలుకుడు ద్వారం వెలుపలికి వచ్చి గుంపును దూరం చేశాడు అతని వెంట ఒక కరదీపిక కూడా వచ్చింది ఆ వృద్ధుడు అలా ఏర్పడ్డ దారిన వచ్చి యువకుణ్ణి సమీపించి చూచాడు అతని హృదయం వణికిపోయింది రెండుచేతుల్తో గట్టిగా కండ్లు మూసుకొని ఎలాగో తలపాగా పడిపోకుండా పట్టుకున్నాడు

''ఘోఘాబాబూ! అయ్యయ్యో ఇంకేముంది?'' అంటూ రెండు చేతుల్తో తల పాగాను పట్టుకొని ద్వారం వైపు తిరుగు ముఖం పెట్టాడు ఇక సైనికుల పరిస్థితిని వర్ణించడం దేనికి?

''అర్జునా! వెళ్ళి తక్షణం ప్రభువులను కలుసుకోవాలని శ్రీ భీమదేవులకు విన్నవించు ''

దుర్గపాలకుడు కరదీపికా సహాయంతో వేగంగా అదృశ్యమయ్యాడు ఆ యువ కుడూ, వృద్ధుడూ చీకట్లో అక్కడే నిల్చున్నారు ఒక నిమిషంలో సైనికులు కూడా చెల్లా చెదు రైనారు ఘోఘారాణా భూతం ముందు నిల్చోడమే! యువకుడు నెమ్మదిగా వారిని అనుసరించాడు

## 4

రాజదుర్గంలో సభాభవనం మంత్రాలోచనకై కిక్కిరిసి ఉన్నది మధ్యన భీమదేవుడు మీసాలు మెలిద్రిప్పుతూ సింహాసనాన్ని అలంకరించాడు కుడివైపున జునాగఢ ప్రభువు రత్నాదిత్యుడు కూర్చున్నాడు మధ్య వయస్కుడు, విశాలవక్షుడు, నర శార్దూలంలా కన్పిస్తాడాయన పాత పగను విస్మరించి ఈ మహాకార్యంలో చేదోడు అయినాడు ఆయన దగ్గరే కచ్ఛ ప్రాంత మహాయోధుడు, వృద్ధుడు అయిన కమలఖాణీ కూర్చున్నాడు పండి పోయిన గడ్డంలోంచి మిలమిల మెరుస్తున్న ఆయన ముఖ కవళికలో ఎన్నో సంవత్సరాల అనుభవం పాయలై కన్పిస్తుంది ఒక కన్ను లేకపోయినా మిగిలిన కంట్లోనే శత్రువుల రెండు కండ్లను పొడిచివేయగల దక్షత, దూరదృష్టి గోచరిస్తాయి భీమదేవుని ఎడమవైపున భరూజ రాజు 'దద్దా' కూర్చున్నాడు భీమదేవుని పరాక్రమం వల్లనే అతడు వచ్చాడిక్కడికి బాధ ఎప్పుడు తీరుతుందో ఎప్పుడు స్వస్థలం

చేరుకుంటామోననే విచారం అతని ముఖంలో స్పష్టంగా కన్పిస్తుంది అతని ప్రక్కనే పద్దెనిమిదేండ్ల ఉత్సాహమూర్తి, మహారాజుకు ప్రియశిష్యుడు త్రిలోచన పాలుడు ప్రశంసా ముగ్ధనేత్రాలతో భీమదేవుణ్ణే చూస్తూ కూర్చున్నాడు ఆ ప్రక్కనే భీమదేవుని మంత్రు లిద్దరూ కూర్చున్నారు ఆ ప్రక్కగా చుట్టూ ఇతర మంత్రులూ, సేనాపతులూ ఆసీనులైనారు.

అందరి మనసులలో ఒకే సమస్య ఆలోచనలను రెచ్చగొడుతోంది అమీరుకు ఎదురుపోయి పోరాడడమా లేక ఇక్కడికే రానిచ్చి ఎదుర్కోవడమా?

''ఎదురు పోవడమే నా నిశ్చయం మొదటి దెబ్బ రాణా కొట్టాలి మన సైన్యం ముందు వాడొక లెక్కా'' అని గర్జించాడు భీమదేవుడు.

దామోదర్ మెహతా వినయంతో నవ్వి తలూపాడు ''మహారాజా! ఇన్ని సైన్యాలను గెలిచిన వాడిని అంత నిర్లక్ష్యం చేయడం ఎలా?''

''మన సైన్యాన్ని కూడా చూడండి మరి! వాడు వచ్చేసరికి రెండింతలు కాదూ? అదిగాక వాడు అలసిపోయి వస్తున్నాడు మన కలాంటిదేముంది?''

''దేశం కూడా క్రొత్తే వాడికి'' అన్నాడు రత్నాదిత్యుడు

''వాడికి మరుభూమి మాత్రం కొత్తది కాదా? మనం ఎదురుపోయి ఓడిపోయా మంటే ఇక సోమనాథ దాకా వాడికి ఎదురేముంది? ఇక్కడే ఉంటే వాడు చుట్టుముట్టినా కనీసం ఆరునెల్లు పడుతుంది మనల నెదిరించడానికి ''

''అలా ఓడిపోతాడు కూడాను'' అని సమర్థించాడు త్రిలోచన పాలుడు.

''అలా వీల్లేదు '' భీమదేవుని దృఢ స్వరం వినిపించింది. ''ఈ సైన్యంతో పట్టణంలో కోట మధ్య బందీలా కూర్చుంటే ఎంత అపకీర్తి?'' అంటూ భీమదేవుడు లేచి కూర్చున్నాడు ''పిడుగులా వానిమీద విరుచుకొని పడాలని ఉంది నాకు. వాడి సైన్యాన్ని నేలమట్టం చేయాలని ఉంది. త్రిపురాసురుని లాంటి ఈ రాక్షసుణ్ణి చంపడానికే పరమేశ్వరుడు నన్ను నియమించాడు మెహతాజీ! మనం ఎదురుపోక తప్పదు. మనలనెవ్వరూ నిరోధించ లేరు గుజరాత్ వీరుల బాహు పరాక్రమంతో వాణ్ణి తరిమి తరిమి కొడదాం మనలో ఎవ్వరైనా పిరికిపందలుంటే ఇండ్లకు వెళ్ళిపోవచ్చు మనం తప్పక ఎదురేగాలి. వాణ్ణి ఓడించి అమరకీర్తిని పొందాలి.'' భీమదేవుని కన్నుల్లో గర్వ రేఖలు వెల్లివిరిశాయి

''మహారాజులకు జయము, భీమదేవునికి జయము'' అని అనేక వీరులు భీమ దేవుణ్ణి శ్లాఘించారు వారి రక్తనాళాలు ఉప్పొంగాయి నవ చైతన్యం పెల్లుబికింది

''అయినా ఎడారిలో అలసి సగం చచ్చినవాడు ఏమి చేయగలడండీ?'' అని రత్నాదిత్యుడు తిరిగి మెహతాను ప్రశ్నించాడు

''అలసిపోక పోయినా అలసిపోయేట్లు చావగొట్టాలి మెహతాజీ! మీరు పట్టణంలో ఉండండి. వెనుక నుంచి మాకు ఆహార పదార్థాలు అందజేస్తుండండి. నాహృదయంలో జ్వాలలు రేగుతున్నాయి ఈ దేవ విద్వేషిని సంహరించి గుజరాత్ ప్రాంతాన్ని మళ్ళీ పరమ పునీతం చేస్తాను'' అంటూ చుట్టూ ఉన్న వీరులను సంబోధించి ''శ్రీ సోమనాధుని కృపాకటాక్షం, ఆశీస్సులు కురిపించే చోట ఈ మ్లేచ్ఛుడంటే భయపడడం దేనికి? ఏమంటారు తమరంతా?'' అని అడిగాడు భీమదేవుడు

''తమరన్నది యదార్థం మహారాజా!'' అని అనేక గొంతులు ఉత్సాహంతో ఆమోదించాయి

వృద్ధుడైన కమలఖాణీ కన్నుల్లోంచి సెగలు ఎగజిమ్మాయి ''భయమా? మనం గాజులు తొడుక్కుని కూర్చున్నామా?'' అని భీకరంగా గర్జించాడు

భీమదేవుడు ఒక్కసారిగా లేచి నిల్చున్నాడు. ''ఎవడా మాట అనేది?''

## 5

''మహాప్రభూ! ఘోఘూరాణా'' అని పై ప్రశ్నకు సమాధానం యిచ్చినట్లు అర్జున దుర్గనాయకుడు భయంతో వణికిపోతూ, తడబడుతూ లోపలికి ప్రవేశించి అన్నాడు అతని తలపాగా చెదిరిపోయింది కన్నుల్లో భయంవల్ల నీరు క్రమ్ముకున్నది. చేతులు వణికిపోతున్నాయి. దుర్గపాలకుని రూపం చూచి అంతా ఆశ్చర్యపడ్డారు

''ఏమిటి దుర్గనాయకా! ఏం జరిగింది?'' అని కొంచెం కటువుగా భీమదేవుడు ప్రశ్నించాడు.

''ఘోఘూరాణా వచ్చారు మహాప్రభూ!'' అని తడబడే నాలుకతో ఆ నాలుగు మాటలూ ఉచ్చరించి కళ్ళు మూసుకున్నాడు. స్థిమితంగా కూర్చున్నవాళ్ళంతా లేచి నిల్చున్నారు అందరూ నవ్వడానికి ప్రయత్నించారు కానీ ఆ నవ్వులో ఎంత దారుణమైన భయం ఇమిడి ఉన్నదో స్పష్టంగా తెలుస్తోంది. వణుకుతూన్న దుర్గపాలకుణ్ణే భీమదేవుడొక్కడే ధైర్యంగా చూస్తున్నాడు

వెంటనే సామంతుడు కూడా లోపలికి ప్రవేశించాడు దృఢ శరీరం, వివర్ణమైన ముఖం, ఏకాగ్ర దృష్టులతో స్థిరంగా సభను లోతులంట కలయచూస్తూ ప్రవేశించాడు అదే ముఖం! అవే కన్నులు! అదే గాయం!

''మహారాజా నేను ఘోఘూరాణా మనుమణ్ణి సామంత సింహుణ్ణి'' అంటూ భీమదేవుడుకి సాష్టాంగ నమస్కారం చేసి, ''భీమదేవ మహారాజుకు జయం, జై సోమనాథ'' అని గర్జించాడు ఇంతలో విమలుడు అతణ్ణి గుర్తించి, ఇతరులింకా తేరుకోక ముందే ''చౌహాన్ వీరా! వేంచేయండి! వేంచేయండి'' అని సన్మానించాడు

భీమదేవుడు వేగంగా ఎదురేగి సామంతుణ్ణి గాఢంగా హృదయానికి హత్తుకున్నాడు ''చౌహాన్ వీరా! మీ వంశం రాజపుత్రుల తరతరాలను తరింపచేసిందయ్యా! రా వీరా!''

సామంతుడు వినయపూర్వకంగా భీమదేవుని కౌగిలిని విడిచి, నిర్వికారమైన, భావశూన్యమైన ముద్రతో కొంచెం దూరంగా తొలగి నిలుచున్నాడు. అతడు సజీవుడనే విశ్వాసం సభాసదులందరికీ నెమ్మదిగా కలగడం మొదలైంది ఒక్క అర్జున దుర్గపాలునికి మాత్రం విశ్వాసం కుదరలేదు.

''ఆసీనులు కండి చౌహాన్ నాయకా'' అంటూ భీమదేవుడు సామంతుని చేతులను ప్రేమతో పట్టుకొని ఉచితాసనంపై కూర్చోబెట్టి ''ఎక్కడినుంచి విజయం చేస్తున్నారు? మాకు ఏదేని సందేశం తెచ్చారా?'' అని అడిగాడు

''నేను సర్వజ్ఞ గురుదేవుల దగ్గర నుంచి వస్తున్నాను ''

''ప్రభాస నగరం నుండా! తమ రక్కడికి ఎప్పుడు వెళ్లారు?'' దామోదర్ మెహతా అడిగాడు

''నేను అమీరు సైన్యంలోంచి బైటపడి నేరుగా ప్రభాస నగరం వెళ్ళాను నాతో మా రాజగురువులు నందిదత్తులు కూడా ఉన్నారు ప్రాంగణంలో ఎదురు చూస్తున్నారు ''

''ఎవరూ ? పూజ్యపాదులు నందిదత్తులా? బైట నిల్చోడం దేనికి? నేనే వారిని లోపలికి తీసుకువస్తా''నని దామోదర్ మెహతా తన రాజగురువుతో పాటు మహోజ్జ్వల కీర్తి సంపన్నుడైన ఘోఘూరాణా వారి వృద్ధ రాజగురువులను యోగ్యసన్మానంతో స్వాగతమిచ్చేందుకు వెళ్ళి వినయపూర్వకంగా ఆహ్వానించాడు సభాభవనంలోకి అడుగు పెట్టగానే నందిదత్తుని కండ్లలోంచి కరుణాజాహ్నవి కట్టలు తెగి ప్రవహించింది ఇలాంటి సమయంలో ఈ వినయం, ఈ సన్మానం ఆయనకు ఒక విధంగా భరింపరాని వైనాయి

అందరూ కూర్చున్న తరువాత భీమదేవుని ప్రశ్నకు సంక్షిప్తంగా ఘోఘూరాణా వంశం యొక్క విధ్వంస గాధను నందిదత్తుడు వివరించాడు

''మీరు అమీరు సైన్యాన్ని ఎప్పుడు విడిచారు?'' ప్రస్తుతానికి ప్రసంగాన్ని మారుస్తూ దామోదర్ అడిగాడు

''మార్వాడ్ సరిహద్దుల దాపున అక్కడి నుంచి నేరుగా గురుదేవుని హెచ్చరించ డానికి సోమనాథం వెళ్ళాము వెంటనే మహావేగంగా ఇక్కడికి వచ్చాము ''

''అమీరు ఎంత దూరాన ఉన్నాడు?''

''పదిహేనురోజులు పట్టవచ్చు ఇక్కడికి రావడానికి ''

''మీరు అమీరు సైన్యాన్ని చూచారా?'' భీమదేవుడడిగాడు

''ఆఁ చూచాను '' విచార వదనంతో సామంతుడారంభించాడు ''అతని సైన్యంలో తిరిగాను సైన్య శక్తిని గ్రహించాను అమీరు బలాలు కూడా చవిచూచాను ఇదే గురుదేవులకు విన్నవించాలని వెళ్ళాను కానీ, నేను చెప్పదలచుకున్నదంతా తమకే చెప్పమని నాకు గురుదేవులు చెప్పారు ఇక మీరే సోమనాథునికి కుడిభుజంలాంటివారు ''

'గురుదేవుని ఆజ్ఞ శిరసావహిస్తాను' వినయంగా భీమదేవుడన్నాడు 'చౌహాన్ వీరా! మీరు చెప్పదలచుకున్నదంతా సంతోషంగా చెప్పండి నిజమే మీరు వేళకు అందుకున్నారు '

'అన్నింటికంటే ముందు ఒక విషయం చెప్పదలచుకున్నాను అమీరును యుద్ధంలో ఎదిరించాలని నిశ్చయించుకొని ఉన్నట్లయితే, ఆ నిశ్చయాన్ని విడిచి పెట్టండి ' సామంతుడు నిశ్చలంగా నెమ్మదిగా ఈ మాటలనేసరికి సభయావత్తూ కలచివేసినట్లైంది అందరూ ఏకాగ్రతతో ఆశ్చర్యంగా వినడం ప్రారంభించారు అప్పుడే వారందరూ వేరే నిశ్చయానికి వచ్చారు కదూ?

'ఏమిటీ? చాళుక్య వీర వంశంలో పుట్టినవాణ్ణి నేను - ప్రత్యక్ష పోరాటాన్ని మాను కోవాలా?, భీమదేవు డీ మాటలంటున్నపుడు కోపంతో కెంపెక్కిన దృష్టులు సామంతుణ్ణి నిలువునా దహించివేస్తాయేమో ననిపించింది '

సామంతుడు శాంతంగా కూర్చున్నాడు అతని చిరునవ్వులో తిరస్కారం ఉట్టి పడుతుంది బాల్యంలోనే జన్మ జన్మాంతరాల దుఃఖం పైబడి పసితనంలోనే వృద్ధాప్యం అతణ్ణి ఆవరించింది 'నన్ను క్షమించండి మహారాజా! సామంతుని మాటలను సభ నిశ్శబ్దంగా వింటున్నది ఇలాంటి అహంభావపు మాటలు వినీ వినీ నేను విసిగిపోయాను చాళుక్యప్రభూ! సంకీర్ణ బుద్ధులై అంతఃకలహాలతో మునిగి తేలుతున్న మన రాజపుత్ర రాజులను తెగ నరకడానికి ఈ అమీరును సోమనాథుడు మన దగ్గరికి పంపినట్లు నాకు తోస్తున్నది '

రాజులు క్రోధంతో, మిగతావారు ఆశ్చర్యంతో ఈ యువకుని ములుకుల్లాంటి మాటలను వింటున్నారు భీమదేవుని చేయి ఆవేశంతో కత్తి పిడిమీదికి వెళ్ళింది దాంతోటే సామంతుని దృష్టి కూడా అటు పరుగెత్తింది. సామంతునికి భీమదేవుని భావం అర్థమయింది భీమదేవుడు కూడా ఇది గ్రహించి సిగ్గుపడి చేతిని కత్తిపిడి మీద నుంచి తీసుకున్నాడు

'చాళుక్యరాజా! అమీరును గోటితో మీటవచ్చునని అపోహ పడుతున్నాం మన మంతా కానీ, కొండచిలువ నోటపడ్డ జీవాల్లా మనం వాడి చేతుల్లో పడిపోతున్నాం ఈ గర్వంవల్లనే ఘోఘారాణా వంశం సర్వనాశనమైంది బాలమదేవుడు యాభైవేలమంది యోధులతో హతమారిపోయినాడు తమరూ ఆ మంటలలో దూకడానికే పరుగెడు తున్నారు '

'అయితే నీవు చెప్పేదేమిటి? ఇక్కడినుంచి మేమందరం తిరిగి పోవాల నేనా?' రత్నాదిత్యుడు ఎత్తి పొడుస్తున్నట్లు అన్నాడు

'పొమ్మనడంలేదు మీ యిష్టంవచ్చినట్లు చేయండి కానీ, చేసే ముందు అమీరు ఎటువంటి వాడో ఆలోచించుకోండి నా మాటలు మీకు రుచించకపోవచ్చు కానీ మీరు సమీకరించిన ఈ సైన్యం అంతా కలసి అమీరును అర ఘడియ కూడా నిలువరించలేదు '

'అయితే అనహిలవాడ, జునాగఢ, లాట.. ' అని రత్నాదిత్యుడు ఏదో అనబోయి ఊరుకున్నాడు

భీమదేవుడు మీసాలు మెలిద్రిప్పుతూ సామంతుణ్ణి చూస్తున్నాడు ఇంతకీ వీడు మిత్రుడా, శత్రువా? మధ్యలోనే మాట్లాడదామనుకున్నాడు కానీ, సామంతుడి మాటలకు తల ఊపుతూ అంగీకారం తెలుపుతున్న దామోదర్ మెహతాను చూచి నిగ్రహించుకున్నాడు.

'మహారాజా! అమీరు శక్తినిగానీ, అతని ప్రయత్నాలు కానీ ఏమాత్రం తమరు గ్రహించి ఉన్నా నా మాటలే మీ నోట వచ్చేవి ఇప్పుడు మీ దగ్గర ఉన్న సైన్యానికి పదిరెట్ల సైన్యం ఎక్కువగా ఉన్నా అమీరును ఓడింపజాలరు '

'మేము అలా భయపడే వాళ్ళము కాము ' భీమదేవుని స్వరం కఠోరమైన తిరస్కార భావాన్ని ప్రకటించింది. 'మనం తక్కువ, శత్రువు లెక్కువ అని అనడం పిరికి పందల లక్షణం '

సామంతుని ముఖం క్రోధంతో జేవురించింది కానీ, పెదవులు బిగించి కోపాన్ని దిగమ్రింగాడు ముఖాన్ని తీక్షణత ఆవరించింది కన్నుల్లో అలౌకిక తేజం క్రమ్ముకున్నది కూర్చున్నవాడల్లా లేచి భీమదేవుని పాదాలను స్పృశించాడు చేతులు జోడించి నమస్కరించాడు. తోక త్రొక్కిన త్రాచు బుసలు కొడుతున్నట్లు అతని నోట వాగ్బాణాలు కఠోరంగా వెలువడ నారంభించాయి

'అమాయకంగా భీమదేవుడు కాక మరెవరైనా నన్ను పిరికిపంద అని అన్నట్లయితే ఆ నాలికను తెగ నరికేవాణ్ణి చాళుక్యరాజా! కానీ, నేను మీతో పోట్లాడడానికి రాలేదు

సోమనాధ పరమేశ్వరుని సంరక్షించడానికి ప్రయత్నిస్తున్నాను మీకు మీ రాజవైభవాలపై మోజు ఉన్నది కానీ నాకు అమీరును ఓడించడం తప్ప మర్తో కోరికే లేదు మీరిప్పటికి అమీరు పేరు మాత్రమే విన్నారు కాని మా తాతగారు అమీరుని ఆపటానికి తన వంశా న్నంతా బలి చేశారు అమీరును అంతులేని ఎడారిలో ముప్పుతిప్పలు పెట్టి చంపాలని అపూర్వ పౌరుషాన్ని ప్రదర్శించారు మా నాయనగారు నేను ఒంటిరిగా వాడి సైన్యంలో చొరబడి వాణ్ణి నాశనం చేద్దామని బాకుతో పొడిచాను ' సామంతుని కన్నుల్లో నీరు సుళ్ళు తిరిగింది కంఠం దుఃఖంతో పూడుకొని పోయింది 'నేను అనుకొన్నట్లు జరిగి ఉంటే ఈ రాజపుత్రు లందరూ ఏకమై సాధించి యుండని పనిని ఒక్కణ్ణే నెరవేర్చి ఉండేవాణ్ణి కానీ కానీ సోమనాధునికి ఇంకా అతడు చావాలని లేదు కాబోలు! సరే మహారాజా! నేనూ, నా వంశమూ చేసినంత పని మీరు చేయగలిగితే పరమేశ్వరుడు తప్పక తమకు యశాన్ని ప్రసాదిస్తాడు' అంటూ నతుడై సామంతుడు పెద్ద పెద్ద అంగలతో ద్వారం వైపుకు నడిచాడు ఇంతలో దామోదర్ లేచి వెళ్ళి అతని కెదురుగా నిల్చున్నాడు

'చౌహాన్ వీరా!' అమృతం చిలికేటట్లు సంభోదిస్తూ ''ఘోఘా దుర్గ చౌహాన్ వీర శిరోమణులను పిరికిపందలనక ముందు మా మహారాజు తమ నాలుకను కోసివేసు కుంటారయ్యా! ఘోఘారాణా వంశజులు సూర్యకాంతిని తిరస్కరించే ప్రతిభాశాలురు కారా?'' అని అన్నాడు దామోదర్

భీమదేవుడు కూడా లేచి అతణ్ణి తన బాహుబంధనాల్లో చేర్చుకున్నాడు గద్గద స్వరంతో ప్రాయశ్చిత్తం స్ఫురింపచేస్తూ ''చౌహాన్! నన్ను క్షమించు, నేను త్వరపడ్డాను అసలు నా ప్రవృత్తే అంత మేమంతా శౌర్యాన్ని ప్రదర్శించాలనుకుంటున్నాము కానీ నీవెపుడో మీ పూర్వుల జన్మ జన్మాలను తరింపజేశావు వీరా, నన్నుక్షమించు'' అంటూ తిరిగి అతణ్ణి ప్రేమతో హృదయానికి హత్తుకున్నాడు

సామంతుని మనస్సు ఈ పరివర్తనం వల్ల కరిగిపోయింది నెమ్మదిగా తిరిగి ఆసనం మీద కూర్చున్నాడు

## 6

''కూర్చోండి సామంతసింహా! మీరు చెబుతున్న మాటలే నేనూ మహారాజుకు చెబుతున్నాను'' అన్నాడు దామోదర్

''మెహతాజీ! ఇలా చెప్పాలంటే నా గుండె పగిలిపోతున్నది నేనూ శక్తి సామర్థ్యాలూ, పట్టుదలా కల వంశంలోనే జన్మించాను మానం పోయేకంటే ప్రాణం పోతేనే మంచిదని నేనూ భావిస్తాను కానీ, గత ఒకటిన్నర మాసాలలో నేను పడిన బాధల

అనుభవం వల్ల మీలాంటి గురుజనుల ముందు తల ఎత్తి సలహా ఇవ్వడానికి సాహసిస్తున్నాను'' అన్నాడు ఖేదం ఉప్పొంగే స్వరంతో సామంతుడు

''అలా అనకు చౌహాన్! నీవు చెప్పదలచుకున్నదంతా చెప్పు'' అన్నాడు భీమదేవుడు

''మహారాజా, అమీరు సైన్యం- సైన్యంకాదు. అదొక మానవ మహా సాగరం మహా ఉంటే మీ దగ్గర ఇరవై వేల పదాతి, అయిదువేల అశ్వదళమూ. .''

''కాదు ఎనిమిది వేలు ''

''సరే ఎనిమిదేలే ఏనుగులూ, ఒంటెలూ కలిపి మహా ఉంటే రెండు మూడు వేలు ఉండవచ్చు అమీరు దగ్గర ముప్పదివేల రౌతులున్నారు రెక్కలు కుట్టుకొని ఎగిరే గుర్రాలున్నాయి పదివేలకు పైగా ఏనుగులే ఉన్నాయి అంతూ దరీ లేని భయంకరమైన సేనావాహిని ఉన్నది దాదాపు ముప్పైవేల ఒంటెల మీద నీళ్లు మోయించి ఎడారి దాటాడతడు. కోటలను ఛేదించే అభూతపూర్వమైన భయంకర యంత్రాలున్నాయి అతని ముందు మనమొక లెక్కా? నగర కోట నుండి మార్వాడు వరకూ ఎవరికి వారు వేర్వేరుగా పోరాడిన రాజపుత్రులందరూ ఏకమై ఎదిరించి ఉంటే అప్పటి అదృష్టం ఎలా వుండేదో!'' అని సామంతుడాగాడు సభ యావత్తూ దిగ్భ్రాంతితో వింటున్నది

''తరువాత''

''ఇది సైన్యాన్ని గురించి ఇక అమీరు విషయం వేరు ఇంత సైన్యాన్ని నడిపించగల అద్భుతమైన కౌశలం అతనిలో వున్నది నిమిషంలో ఎవరితోటైనా పొత్తు కుదుర్చుకోగల చాకచక్యం అతని సొత్తు పిరికి వారిలో ధైర్యం రేకెత్తించగల ప్రతిభావంతు డతడు అతని వ్యూహరచనా నైపుణ్యానికి ఎదురులేదు మహారాజా! అతనితో ఎదిరించి పోరాడడమా?''

''అయితే ఏమి చేయమంటావు? గోబ్రాహ్మణ పరిపాలక బిరుదాంకితులమైన మనం విదేశీయుల అరికాళ్ళ క్రింద పడి దేశం నాశనమౌతుంటే అంగీకరించుతామా? స్త్రీలు, వృద్ధులు పొందే అవమానాన్ని చూస్తూ సహిస్తామా? మన యిష్టదైవాన్ని సంరక్షించడానికి కనీసం ప్రాణాలనైనా సమర్పించవద్దంటావా వీరా?''

''మహారాజా! నేను అలా అనగలనా? మీరు మొండి పట్టుదలతో పోరాడాలి ప్రాణాలను అర్పించియైనా సరే ప్రభాస నగరాన్నీ, ఈ పట్టణాన్నీ రక్షించి తీరాలి ''

''మరి అది ఎలా సాధ్యపడుతుంది?''

''అమీరును సౌరాష్ట్రంలోకి రానీయండి-నిరోధించకండి ఇప్పుడు ఎంత తక్కువ సైన్యాన్ని మనం కోల్పోతే ముందు ముందు అంత మేలు మనకు. వాడు తిరుగు

ముఖం పెట్టిన తరువాత వెనుకనుండి వాడిని తుదముట్టించాలి ''

''నిజమే అమీరును ప్రత్యక్షంగా ఎదిరించడం అపాయకరమని నేనూ అంగీకరిస్తాను ఈ పట్టణంలో ఉండే, అతణ్ణి ఎదిరిస్తే బాగుంటుందని నా ఉద్దేశం'' అని దామోదర్ తన భావాల్ని వెలిబుచ్చాడు

వాడు ఇదివరకు నిర్జించిన కోటలను తలచుకుంటే ఇదొక లెక్కా?

''అది నిజమే ''న్నాడు విచార సూచకంగా మెహతా

''పట్టణం విడిచి అడవుల్లో తలదాచుకుంటే నా పరువు ఇంకేముంటుంది?''

''అదీగాక, సైన్యంలో మాత్రం ఉత్సాహం నిలుస్తుందా?'' అన్నాడు త్రిలోచన పాలుడు

''ఏమైనా కానీయండి నేను ఇక్కడ్నుంచి కదలడం కల్ల. ఇది నా పట్టణం - నాతాత ముత్తాతల పట్టణం అమీరును ఓడించక ముందే నా ప్రాణాలు పోవలసి ఉంటే, ముందే ఈ కోటగోడల క్రిందపడి ప్రాణాలర్పిస్తా ''

'కానీ దీనివల్ల సోమనాధుడు రక్షింపబడతాడా?' సామంతుడు నెమ్మదిగా అన్నాడు ఆ మాటల్లో దాగియున్న తిరస్కారం కొరడా దెబ్బలా అందరి హృదయాలనూ కదిలించి వేసింది

'మరింతకూ ఏమి చేయమంటావు?'

''నా కొకే దారి కన్పిస్తోంది '' అంటూ సామంతునివైపు చూచి, 'అమీరు సైన్యాలతో యుద్ధం చేశాడు నిర్మానుష్యతతో ఇంతవరకు పోరాడి ఎరుగడు ఈ శత్రువే అతణ్ణి ఆలపించి సంహరించగలడు' అన్నాడు మెహతా.

''నీ ఉద్దేశ్యం?''

''పట్టణాన్ని పట్టణ మార్గాన్నీ ఖాళీ చేయడమే వాడెంత వేగంగా వచ్చినా సరే ''

''నా ఉద్దేశం కూడ అదే మెహతాజీ!'' అని సమర్థించాడు సామంతుడు

''మరి ఇక నేను చేయవలసిందేమిటి? పారిపొమ్మంటారా?'' భీమదేవుని స్వరంలో నిరాశ తాండవించింది

''కాదు కాదు మహారాజా! మీరు సర్వ సైన్యాలతో ప్రభాస నగరానికి వెళ్ళండి మీకు విజయం లభించాలని ఉంటే అమీరుకు సౌరాష్ట్రపు దుర్గమారణ్యాల రుచి చూపాలి'' అన్నాడు చిరునవ్వుతో మెహతా

''కానీ ప్రభాస దుర్గం చిన్నది కదా!'' రత్నాదిత్యుడు తన సంశయాన్ని ప్రకటించాడు.

''చిన్నదైతే-అరఘుడియలో పెద్దదిగా చేస్తాం అక్కడైతే పరమేశ్వరుని అండ, గురు దేవుల స్ఫూర్తి లభిస్తాయి అక్కడ రాజపుత్రులు పోరాడడమంటే తమ రాజధానిని సంరక్షించుకోడానికి కాదు తమ పరమదైవం, యిష్టదేవుడు శ్రీ సోమనాథ పరమేశ్వరుని రక్షించుకోడానికి, ప్రాణాలు అరచేత పెట్టుకొని పోరాడడానికి స్ఫూర్తి ప్రవహిస్తుంది స్వామీ! ఇహంలో విజయం - పరంలో కైలాసం తప్ప మరే స్వార్థభావమూ వారిలో ఉండదు.''

భీమదేవుని విశాలమైన నేత్రాలలో అపూర్వ కాంతులు మెరిశాయి చేతులు మీసాల మీదికి పరుగెత్తాయి అతని కన్నులముందు జలజాత అయిన ఒక బాల నర్తకి తళుక్కున మెరసి వెంటనే మాయమైంది

''మెహతాజీ! సరే అక్కడే పోరాడుదాం నా ఇష్టదేవుని సన్నిధిలో అపూర్వమైన పౌరుషాన్ని ప్రదర్శిస్తా దానవ సైన్యాలను సముద్రంలో అణగద్రొక్కుతా '' భీమదేవుని కంఠంలో మహా గౌరవం దీప్తించింది

''మెహతాజీ! మీ ఆలోచన అద్భుతంగా ఉంది ఈ ఒక్క ప్రయత్నం కొరకు మన సర్వశక్తులూ ధారవోయగలిగే చిల్లర యుద్ధా లనేకం కంటే ఇదొక్కటే మెరుగు నేను మాత్రం ఇక్కడే ఒంటిరిగా ఉంటాను'' అని అన్నాడు సామంతుడు

''మిమ్మల్ని అలా ఒంటరిగా చావనిస్తామా చౌహాన్ వీరా!''

''నాకు అలా చావాలని మాత్రం ఉందా? అమీరు కాళ్ళు నా భూమి మీద ఉన్నంత వరుకు. సరేకానీ నాకు కొంతమంది సైనికుల్ని మాత్రం ఇవ్వండి నేను ఘోఘారాణా భూతాన్ని కదా ఈ వంకతో వాణ్ణి ఏడిపించగలను· మీకు సహాయం కూడా చేయగలుగుతాను ''

''కానీ నీవు నా వెంట ఉండకపోతే ఎలా సామంతా?'' భీమదేవుని కంఠంలో ఆర్ద్రత తొణికింది

''అలా అనకండి మహారాజా! వాడు వస్తే రావచ్చు కానీ నేను మటుకు వాణ్ణి తిరిగి పోనివ్వను ''

''అందాకా నేను రానిస్తేగా?''

''మహారాజు చిరాయువై వర్ధిల్లాలి.''

''సామంతుడన్నదీ నిజమే '' మెహతా సాలోచనగా అన్నాడు. ''నేను స్వయంగా ఖంభాత రేవు నుంచి ప్రభాస నగరానికి కావలసిన వస్తు సంభారాలు సముద్ర మార్గాన సేకరిస్తా మరైతే ప్రభాస నగరాన్ని కూడా త్వరగానే ఖాళీచేయాలి కదా?''

''మరి విమలుడు నా దగ్గరే వుంటాడుగా?''

''మీ ఆజ్ఞ శిరసావహిస్తాను మహారాజా!'' అని విమలుడు నమస్కరించాడు.

## 7

ఆ రాత్రే భీమదేవుడు పై నిర్ణయాన్ని కార్యాన్వితం చేయించాడు గుఢచారి రౌతులు గ్రామాలను ఖాళీ చేయమని చెప్పడానికి పరిసర గ్రామాలకు బయలుదేరారు రాత్రికి రాత్రే పట్టణంలో సమీకరించిన ధాన్యాదులను ప్రభాసానికి బండ్లలో తరలించారు తెల్ల వారక ముందే సైన్యమంతా ప్రభాసం వైపుకు నడిచింది మధ్యాహ్నం భీమదేవుడు పట్ట ణాన్ని విడిచే వేళకు సామంతుడు, నందిదత్తుడు మహారాజు ఇచ్చిన అయిదు వందల మంది గుఢచారి రౌతులు తప్ప ఒక్క పురుగు మిగలలేదు

పోతూపోతూ సామంతుని మనసు మార్చడానికి భీమదేవుడు చాలా ప్రయత్నించాడు కానీ సామంతుడు ససేమిరా వీల్లేదన్నాడు

సైన్యం అంతా తరలిపోయిన తర్వాత సామంతుడు దుర్గంలో ఎత్తయిన బురుజు మీదికి ఎక్కి ఆకాశపుటంచుల వైపుకు నిషాక్తమైన చూపులను నిలిపాడు

''ఓరి మ్లేచ్ఛుడా రా, ఇక నీవో నేనో ''

# ప్రభాసంలో ప్రయత్నం

1

అమీరు దండయాత్ర కంటే భీమదేవుడు సైన్యంతో వస్తున్నాడనే వార్తతో ప్రభాస నగరంలో ఒక అద్భుతమైన చైతన్యం వ్యాపించింది పరమేశ్వరుని ఛత్రచ్ఛాయల్లో నివసి స్తున్న ప్రభాస ప్రజలకు అమీరు అంటే భయమంటూ లేనేలేదు త్రిపురాసురుని వంటి వాణ్ణే మూడవకంటి మంటతో మాడ్చి చంపిన మహానుభావునికి ఈ మ్లేచ్ఛుడొకలెక్కా! విజయం చేకొని విచ్చేస్తున్న సైన్యాలకు స్వాగతమిచ్చినంతగా ప్రజలు హడావిడి చేస్తున్నారు ప్రతి గడపకూ పసుపు రాసి - ద్వారాలను తోరణాలతో అలంకరించారు మందిర శిఖరాలు నూతన పతకాలతో శోభిల్లాయి మృదంగ వాద్యాదులు వాడ వాడలా సంగీత సౌరభాన్ని వెదజల్లుతున్నాయి ప్రతి శివాలయంలోనూ రుద్రాభిషేకం ఆరంభమైంది. శ్రోత్రియుల మహోదాత్త స్వరాల నుంచి మంత్రాలు మహా వీచికలై వెలువడి మందిరాలలో ముఖరిత మైనాయి ''అరుగో. విచ్చేస్తున్నారు. సాక్షాత్తూ పరమేశ్వరుని అవతార మూర్తులు ధనుర్విద్యా పారంగతులు యవన సంహారకులు సాధుజన సంరక్షకులు - భీమదేవులు విజయం చేస్తున్నారు '' ఇదే ధ్వని ప్రతి హృదయంలోనూ ప్రతిధ్వనించింది

2

చోళా ముఖ్యమందిర శిఖరంమీద ఒక మూల నిల్చుని వ్యాకుల నయనాలతో అన హిలవాడ నుంచి వచ్చే బాటవైపు చూస్తున్నది ఆమె ముఖం అరుణరాగ రంజితమైంది హృదయం వేగంగా కొట్టుకుంటోంది రాజాధిరాజు, సాక్షాత్తు రుద్రరూపుడు, చోళాను కాపాలికుని బారి నుండి రక్షించిన వీరమూర్తి భీమదేవుడు వస్తున్నాడు అంతేకాదు, భీమ దేవు డామెను తన చేతుల్లోకి తీసుకొన్నాడు. ప్రతి అవయవాన్నీ స్పర్శించాడు . ఆనాటి మధురమోహనమైన వెన్నెల - నాడు సాగరంలో వెలినీడల మీగడ తరగల్లో గావించిన జలక్రీడ - కాపాలికుని భయంకర వికటాట్టహాసం - మూర్ఛావస్థలో చూచిన ఆ గంభీర

వదనం-శౌర్యానికి ప్రత్యక్షరూపమై రూపొందిన ఆ మీసాలు - మిలమిల మెరిసే ఆ మోహసంభరిత నేత్రాల-పసిపాపలా ఆమె ఒదిగిపోయిన ఆ విశాల బాహువులు సమస్త జీవన సాగరాన్ని మహోల్లాస తరంగాలతో కలచివేస్తున్న నాటి మధురస్మృతులకు చిగురులు తొడుగుతున్న ఆనాటి రేయి ఎంత యత్నించినా మరపుకురాదు నేడు అదే ముఖం, అవే మీసాలు, అవే కన్నులు, అవే భుజస్కంధాలు త్రిపురాసుర సంహారానికై పూనుకున్న పరమేశ్వరుని అవతారంగా రూపొంది వస్తున్నాయి మాటల కందని మహోల్లాసంతో ఆ మహానుభావునికి స్వాగతం పలకడానికి ఆకాశపుటంచులవైపు చూస్తూ నిల్చున్నది చోళా సముద్ర వాయు వీచికలు ఆమె ముంగురులను, వస్త్రాలను నర్తింపజేస్తూ, ప్రతి రక్తనాళంలో విలక్షణమైన ఉద్వేగాన్ని నింపుతున్నాయి ''అరుగో వస్తున్నారు రుద్రరూపులైన భీమదేవులు'' అనేది నినాదమై ఆమె శరీరంలోని కణకణాన్నీ స్పందింపచేస్తోంది

రెండు రోజుల నుంచీ సోమనాథపరమేశ్వరుని స్వరూపం కూడా తెలియకుండా మారిపోయింది యుద్ధ తత్పరుడైన రుద్రుడు జటాజూటం మీద మకుటం ధరించాడు దానిపై మయూర పక్షాలు వెలుగొందుతున్నాయి త్రిశూలధారియైన పరమశివుడు ధనుశ్శాస్త్ర పారంగతుడైన పినాకపాణిగా కన్పించాడు

దేల్వాడా నుంచి వచ్చే దారి కనుచూపు మేరకు కన్పిస్తోంది. వందల కొలది బండ్లు ధాన్యం మోసుకొని ఆ మార్గాన నడుస్తున్నాయి చివరికి దుమ్ము సుళ్లు తిరుగుతూ లేచింది అడవిలోంచి లెక్కింపరానంత మంది అశ్వికులు కన్పించారు చోళా హృదయంలో ఉద్వేగం ఎక్కువైంది అశ్వారోహులు నలుగురైదుగురుగా పంక్తుల్లో వస్తున్నారు ఒక క్షణం ఆనందంతో చోళా అరిచింది అశ్వారోహు లందరికంటే ముందు జరీజీనుతో అలంకృతమైన తెల్లని గుఱ్ఱంమీద ఛత్ర ఛామరాలతో శ్రీ భీమదేవ మహారాజు వస్తున్నాడు గుఱ్ఱం టకటక అడుగులేస్తూ కులుకుతూ నడుస్తుంటే సూర్యకిరణాలకు, ముఖపట్టీ పైనా, జీనులో, కళ్ళెంలో పొదిగిన మణులు ధగధగ మెరుస్తున్నాయి ఈ తేజపుంజం మధ్యన శ్రీ భీమదేవుని శ్యామల వదనం మహా కాంతివంతమై ఠీవి ఒలకబోస్తున్నది

అలా సమీపిస్తున్న భీమదేవుని ధనుస్సునూ, అమ్ములపొదినీ చోళా గుర్తించింది అతనిలో ప్రకటితమవుతున్న అపార శక్తిని గ్రహించింది రుద్రావతారులవలె ఆ మహా మహుడు మహోగ్రుడై దుర్ధర్షుడై వెలుగొందుతున్నాడు భగీరథునివలె ఆ మహా పురుషుడు తన వెంట రథ, గజ, తురగ, పదాతి సైన్యాలను నిరంతరం మహోత్తుంగమై ప్రవహించే గంగలా తెస్తున్నాడు

శిఖరంమీద ఒక మూల నిల్చొని ఆమె క్రింది కోటను బాగా చూడగల్గుతున్నది ప్రభాస ముఖద్వారం దగ్గర గురుదేవులు అనహిలవాడ ప్రభువును గౌరవించడానికి నిల్చున్నారు వారి ప్రక్కనే పద్దెనిమిది రోజుల ఉపవాసంతో శుష్కించి, చేత నుంచుకొన్న శివమూర్తితో శివరాశి కూడా నిల్చున్నాడు గురుదేవులు అతనికి ప్రాయశ్చిత్త రూపంగా విధించిన తపశ్చర్య ఇంకా పూర్తికాలేదు అక్కడే చాలామంది ఇతర శిష్యులు కూడా ఉన్నారు పురజనులు కూడా గుమిగూడారు ఇదంతా రుద్రావతారులైన భీమదేవుణ్ణి గౌరవించడానికే

నలుదిక్కులా మేఘం గర్జించినట్లు భీమదేవ మహారాజు 'జయ్ సోమనాథ్' అని నినాదం చేశారు ఆ నినాదం చీలికలై ముప్పదివేల సైనికుల గొంతుకల్లోంచి ప్రళయ ధ్వనిలా 'జయ్ సోమనాథ్' అని ప్రతిధ్వనించింది అదే స్వరం ప్రత్యుత్తర రూపంలో గురుదేవులు, శిష్యులు, పురజనులు గర్జించిన 'జయ్ సోమనాథ్' అనే నినాదంతో కలిసి ఆకాశాన్ని దద్దరిల్లచేసింది వెంటనే వేలకొలది భేరీకాహోళులు మ్రోగాయి భీమదేవుడు కోటను సమీపించాడు పైకి చూచాడు ఒక క్షణం ఆయన దృష్టి ఆకాశంలో రెప రెప లాడుతూ ఎగురుతూన్న ధ్వజంమీద నిలిచింది. అక్కడి నుంచి శిఖరం మీదికి వెళ్ళింది ఒక క్షణం రెండు క్షణాలు - చోళా కూడా ఆయన్ను చూచింది సిగ్గుపడింది తనకు తెలియకుండానే ఆమె చూపులు క్రింద నిల్చున్న గురుదేవునివైపు పరుగెత్తాయి ఆమెకు తన అల్పత్వం గోచరించి గుండె ఆగిపోయింది. మ్లేచ్ఛసంహార దీక్షాదక్షుడు పాటణ ప్రభు వెక్కడ? అల్పప్రాణియైన సాధారణ దేవదాసి తానెక్కడ? ఎవరో తీవ్రంగా గాయ పరచి నట్లు కుమిలిపోతూ వెనుదిరిగి చూడనైనా చూడకుండా అక్కడి నుండి క్రిందికి పరు గెత్తింది సాక్షాత్తు తన పరమశివుడు రానే వచ్చాడు కానీ తాను నిర్జీవమై అన్యర్థమై ఉన్నది.

3

అలా రొప్పుకుంటూ, మనస్సులో రేగిన అలజడిని ఆపుకుంటూ, గొంతు సవ రించుకుంటూ క్రిందికి దిగగానే ''చోళా! ఎక్కడికీ ఆ పరుగెత్తడం?'' అని గంగ పిలిచింది.

'ఎక్కడికీ లేదు ..ఎక్కడికీ లేదమ్మా' అంటూ అడుగు ముందుకు వేసి ఏదో ఆలోచన స్ఫురించి ఆగిపోయింది గుండె వేగంగా కొట్టుకుంటున్నది వెంటనే ఎగిరి తల్లి మెడను కౌగలించుకొని ''అమ్మా, మధ్యాహ్నం అయింది కదూ? ఇప్పుడు నృత్యం చేయడం ఎవరి వంతే?'' అని అడిగింది.

''కుండలది - ఎందుకు?''

''నేను నృత్యం చేస్తా- ఇప్పుడే- వెంటనే''

''మధ్యాహ్నం అయింతర్వాత బాగుంటుందా?''

''వీల్లేదే నేనే చేస్తా''

''సాయంకాలం నీకు అవకాశమిస్తా. సరేనా''

''కాదమ్మా. ఇప్పుడే చేస్తా ఇప్పుడే నన్ను చేయనివ్వకపోతే జిహ్వా కోసుకొని చస్తా తెలుసా.''

''కుండల నొచ్చుకుంటుందే పిచ్చితల్లీ!''

''అయితే నీవు బ్రతిమాలుకో! నా మీద ఒట్టు నన్ను ఆపవద్దమ్మా! నన్ను ఆపకు.''

గంగ చోళాను చూసింది ఆ కాతర నేత్రాలు, ఆయాసంతో ఎగురుతూన్న గుండె, దిటవు కోల్పోయి వెలువడుతున్న కంఠధ్వని గంగ గ్రహించింది

''సరే మరి నీవు సిద్ధం కా, నేను కుండలను ఒప్పిస్తా ''

నవ్వుతూ, ఎగురుతూ చోళా పరమేశ్వరుని ముందు నృత్యం ఆరంభించింది. యుద్ధ తత్పరుడైన శివుని ఆరాధిస్తున్నదప్పుడు దాని కనుగుణంగానే ఆమె రూపం కూడా మారింది అడుగుల సవ్వడిలో అదొక కొత్తదనం కన్పించింది. అభినయంలో రౌద్రం అలముకున్నది. కానీ చూపులు మటుకు శివునిపైకాక దేవాలయ ద్వారంవైపు ఉన్నాయి భీమదేవుడు దర్శనానికి వస్తాడు వచ్చి ఆమెను గుర్తిస్తాడు ఆమె మరి రుద్రావతారులైన ఆ మహారాజు కొరకు నృత్యం చేస్తోంది

భేరీధ్వని సమీపించింది కోలాహలం కూడా దగ్గరగా విన్పిస్తున్నది. కోట ద్వారం లోంచి గురుదేవ, భీమదేవులు ప్రవేశించారు. వారి వెంట మిగతా రాజులు, మంత్రులు, సేనానులు ఉన్నారు చోళా గుండె దడ హెచ్చింది కంఠం పూడుకుపోయింది. కాళ్ళు వణికాయి గురుదేవ, భీమదేవులు గంభీరంగా ఏదో మాటాడుకుంటూ సమీపించారు. అదే ముఖం- అవే కన్నులు, అదే నడక, అవే విశాల బాహువులు కానీ ఇప్పుడా ముఖంలో రౌద్రం ఉన్నది కన్నులు నిశ్చలంగా వున్నాయి నడకలో స్థిరత్వం ఉన్నది ఆనాటి రాత్రి కన్పించిన భీమదేవులేనా వీరు! కాదు ఎవరో తెలియని వీరయోధులు! ఉగ్రమూర్తులు! కాళ్ళు కదులుతూ అడుగులు వేస్తున్నా నర్తకి హృదయం మౌనంగా విలపిస్తున్నది సర్వజ్ఞ, భీమదేవులు మందిరంలో ప్రవేశించారు. చోళా ఆశలన్నీ కూలిపోయాయి. ఒక్కక్షణం పాటు భీమదేవుని ఏకాగ్రదృష్టులు ఆమె మీద నిలిచాయి ఆమె గుండె ఆగినంత పని అయింది తెలియని వస్తువుని ఒక్కక్షణం చూచి తొలగిపోయినట్లు భీమదేవుడు చూచి గుర్తించినట్లు కన్పించిందే కాని పరిచయం లేనట్లే తొలగిపోయాడు. చోళా మంచులా కరిగి నీరైపోయింది

భీమదేవుడు తోటి రాజులతో దేవదర్శనం చేసుకున్నాడు. సాష్టాంగ నమస్కారం చేశాడు. చరణామృతం సేవించాడు గంధం తీసుకున్నాడు గంటలు మ్రోగించాడు. అటు ఆ నర్తకి కంఠంలోంచి విలాపస్వరం మహా వీచికలై, హృదయ విదారకంగా వ్యాపిస్తూ ఎక్కడో ఒక రాజహంస చనిపోతూ ఆఖరుసారిగా తన సంగీత జ్వాలలు వ్యాపింప జేస్తున్నట్లు, అన్ని దిశలనూ ఆవరించింది

అందరూ గర్భద్వారం దాటి వచ్చారు సర్వజ్ఞులు చేయెత్తి అందరినీ శాంతింప చేశారు నృత్య సంగీతాలు మాత్రమే జరుగుతున్నాయి భీమదేవుడు కను బొమ్మలు చిట్లించి ''నృత్యం ఆపు'' అని అటు చూడకుండానే గర్జించారు ఆ పాట, ఆ తాళం హఠాత్తుగా మరణించిన వాని కంఠస్వరంలా అక్కడే ఆగిపోయాయి

గురుదేవులు సమావేశమైనవారిని గంభీరంగా, శాంత స్వరంతో సంభోదిస్తూ ప్రారంభించాడు. ''పరమేశ్వరుడు చావుబ్రతుకుల సమస్య తెచ్చి పెట్టాడు పదిరోజుల్లో మ్లేచ్ఛుడిక్కడికి వస్తాడు అందుకని నేటి నుంచే ఈ పరమ ధామాన్ని భీమదేవునికి సర్వాధికారాలూ వప్పగిస్తున్నాను. పరమేశ్వర సేవాపరాయణుడైన ఈ మహారథుడు చెప్పిందే మీకిక వేదవాక్కు పరమేశ్వరు డితనికే ఆ అనుగ్రహాన్ని ప్రసాదించాడు ''

అందరూ ధ్యానపూర్వకంగా విన్నారు ఉత్సవప్రియులు భీతితో గడగడలాడారు అందరూ ఆసన్నమైన ఆ మహా విపత్తును కొద్దికొద్దిగా గ్రహించారు.

భీమదేవుని కంఠంలోంచి అధికారంతో కూడిన ప్రౌఢధ్వని వినిపించింది. ''నేను నిమిత్తమాత్రుణ్ణే. పరమేశ్వరుని ఆజ్ఞాపాలకుణ్ణే త్రిపురాసురునికంటే భయంకరుడైన విధ్వంసకుడు ఎదురుగా నిల్చున్నాడు అయినా పరమేశ్వరుని ఆజ్ఞ ఉంటే వాణ్ణి కూడా రూపుమాపగలం'' అని కొంతసేపు ఆగాడు ఆయన చూపులు అందరివైపూ ఒకసారి పరుగెత్తాయి. అలా చోళామీదికి కూడా ప్రసరించాయి. కానీ, అందులో పరిచయజ్ఞానం కన్పించలేదు భీమదేవుడు తిరిగి ప్రారంభించాడు ''ఖంభాత్ నుంచి రెండు రోజుల పూర్వం కొన్ని నావలు వచ్చాయి. రేపు ఇంకా వస్తాయి సమస్త పురజనులూ, ప్రభాసాన్ని విడిచి వెళ్ళిపోవాలి. మీ మీ ధనం తీసుకుపోవచ్చు. కానీ, ధాన్యం ఇక్కడే ఉంచాలి నాసైన్యం అన్ని ఇండ్లనూ ఆక్రమించుకుంటుంది విమలా!'' అని అధికార ముద్రతో చేతిని అభినయ పూర్వకంగా లేపి, ''వెంటనే గ్రామాన్ని పూర్తిగా ఖాళీ చేయించు మరి గురుదేవా! ఇక ఈ సంగీతాన్ని కట్టిపెట్టించండి! పరమేశ్వరుడు అమీరును నాశనం చేసిన తరువాత ఈ విధి తిరిగి ప్రారంభం కావచ్చు '' అని ఆజ్ఞాపించి భయంకరమైన నేత్రాలతో అందరి గుండెల్లో భీతిని వ్యాపింపజేస్తూ, గురుదేవునితోనూ, తన సహచరులతోనూ వెళ్ళిపోయినాడు

## 4

ప్రజల్లో కల్లోలం వ్యాపించింది. చోళా స్మృతి తప్పినట్లు గట్టిగా కండ్లు అదుము కొని తన ఇంటివైపు పరుగెత్తింది భయంతో కుమిలిపోతూన్న ప్రజలు చోళా స్థితిని గమనించలేదు

ఇంటికి చేరుకొని వస్త్రాభరణాలు తీయకుండానే మంచంమీద పడి బిగ్గరగా ఏడ్వ నారంభించింది యుద్ధ తత్పరుడైన తన పరమశివుడు వేంచేశాడు. కానీ తనను గుర్తించ కుండానే తిరిగిపోయినాడు మోక్షద్వారాలు తెరచుకున్నాయి కానీ చూపులైనా లోపలికి ఇంకా పోనేలేదు తలుపులు మూసుకున్నాయి.

తన నృత్య, సంగీతాలు ఎవరూ గమనించనే లేదని చోళా భావించిందోగాని అది పొరపాటు పదిహేడు దినాల ఉపవాస శ్రమతో ఉన్నా, శివమూర్తిని చేతిలో ఉంచుకున్నా శివరాశి దృష్టి చోళామీది నుంచి కదలలేదు. పైకి శిశువులా గురువు చెప్పిన ఆజ్ఞను ఆచరిస్తున్నాడు లేకపోతే పట్టశిష్యత్వం ఊడిపోతుంది కానీ అతని హృదయంలో చిచ్చు రేగుతున్నది గురువు అతణ్ణి అవమానించి అతని అధికారాన్ని లాక్కున్నాడు. త్రిపుర సుందరి పూజ నాపడం క్షమింపరాని అపరాధం. ఇదంతా తన దాసీపుత్రిని సంతోషింప చేయడానికే ఆయన చేశాడు అతని దృష్టిలో సర్వజ్ఞులు గురుస్థానం నుంచి దిగజారారు ఇక ఆయనకు గురువుగా ఉండే హక్కు లేదు శివరాశి మదిలో ఇవే భావాలు కొరుక్కొని తింటున్నాయి

ఉపవాసపు రోజులు ఎక్కువౌతున్నకొద్దీ, అతని మనస్సు తేటపడుతూ వచ్చినా, గురువుపట్ల మాత్రం విపరీత భావాలు వృద్ధి అవుతూనే వచ్చాయి. ఆ రోజు చోళాను త్రిపురసుందరీదేవి ఆవహించింది అయినా గురుదేవుడు ఆమెను పూజించనివ్వక, పాపం ఒడిగట్టుకున్నాడు అసలు దీనికై ఆయనే ప్రాయశ్చిత్తం చేసుకోవాలి ఆ పాపం పండినందువల్లే త్రిపురసుందరి కోపించి గురుదేవుణ్ణి నాశనం చేయడానికి అమీరును పంపింది

ఉపవాసపు రోజులు అధికమై, అతని మనస్సు తేటపడుతున్నకొద్దీ త్రిపురసుందరీ దేవి శక్తిని చూపే కొన్ని ఘట్టాలు జరుగ నారంభించాయి. అమీరు తప్పక జీవించి ఉంటాడు గురుదేవుణ్ణి దిగలాగుతాడు చివరకు సర్వజ్ఞ పదవి తనకే లభిస్తుంది సజీవ మూర్తి అయిన జగజ్జనని అన్నీ సహించగలదు కానీ అవమానాన్ని సహించలేదు

మహాశక్తిని స్మరించినప్పుడల్లా అతనికి చోళాయే గుర్తుకు వస్తోంది చోళాను యేరూపంలో ఆనాటి రాత్రి అర్చించాడో అదే రూపు అతనిలో మెలుగుతున్నది జాగ్రత్స్వప్నా వస్థల్లో అదే ముఖం అతనికి కన్పిస్తున్నది ఎన్నో తడవలు కలలో సగంలో

ఆగిపోయిన ఆ పూజావిధిని పూర్తిచేశాడు కానీ ఇంతలో మెలకువ వచ్చి తపించేవాడు అమీరు దండయాత్ర వార్తలు ఎక్కువౌతున్నకొద్దీ అతనిలో ఆశలు బలపడుతూ వచ్చాయి అలాంటి భూకంపం ఏదో జరిగితేనే మహాశక్తికి విజయం లభిస్తుందని అతని ఊహ

ఇంతలో భీమదేవుడు వచ్చాడు మందిరం వరకు వచ్చేలోగా సర్వజ్ఞ, భీమదేవుల సంభాషణ శివరాశికి కొంత వినిపించింది అందరూ ఖంభాత్ వెళ్లాలి సర్వజ్ఞులు రానిచో తానే వీరందరినీ తీసుకొని వెళ్ళవలసివస్తుంది అక్కడ లకులేశ సాంప్రదాయ ధ్వజాన్ని ఎగురవేస్తాడు చోళా తన తోటే ఉంటుంది ఇక గురువు ఉండడు భీమదేవుడు, చోళా లిద్దరూ ఒకనాటి రాత్రి ఎక్కడో కలుసుకున్నారని కూడా అతను విన్నాడు అయినా భీమదేవుడు ఖంభాత్ రాడుకదా!

భీమదేవుడు అలిప్తంగా చోళాను చూడడం గమనించిన తరువాత శివరాశి తెప్పరిల్లుకున్నాడు ఇన్ని రోజుల ఉపవాసంతో రేగిన దాహాన్ని ఆనాడు చోళా నృత్యాభినయాన్నీ, రూపాన్నీ చూచి అతను చల్లార్చుకున్నాడు భీమదేవుడు మధ్యలో నృత్యాన్ని ఆపమన్నపుడు అతని కోపం కట్టలు తెగి పొంగింది గురుదేవుని అనుమతితో ఇదంతా జరగడం చూచి అతని శరీరం జలదరించింది ఈ గురువు ఎంత అధోగతి పాలైనాడు

గురుదేవ, భీమదేవులు మందిరంలోనుంచి వెళ్ళినపుడు అతను కూడా వెంట వెళ్ళాడు మెట్లు దిగిన తర్వాత సర్వజ్ఞుడు శివరాశిని చూచి ''శివరాశి! వెళ్ళి నీవుకూడా పారాయణం చేసి శివమూర్తిని విసర్జించు ఈ కొత్త ఆపద్ధర్మంలో అన్ని ధర్మాలూ మారిపోవాలి తరువాత నా దగ్గరకు రా'' అన్నాడు

శివరాశి నమస్కరించి పార్థివ విసర్జనకు వెళ్ళాడు. మూర్తి విసర్జన చేసి ఉపవాసం విరమించే ముందు మహామాయ జ్ఞాపకం వచ్చింది ఏ దేవి కొరకై తానీప్రాయశ్చిత్తం చేయవలసి వచ్చిందో, ఆమెను దర్శించుకోనిదే ఉపవాస విరమణ చేయడం యోగ్యం కాదని అనుకున్నాడు. చోళాపై తనకున్న కాముక భావమే అలా చూడడానికి ప్రేరేపిస్తున్నదని అతను భావించనైనా లేదు ఇంకొక్క మెట్టు ఎక్కితే సర్వజ్ఞ అర్హత పొందేవాడు పదునెనిమిది రోజుల ఉపవాసంతో నిర్మలమైన మనస్సు ప్రేరేపించగా ఆమహాశక్త్యుపాసకుడు- తత్వవేత్త- తపస్వి యైన శివరాశి సనాతనంగా వస్తున్న పూజా విధిని నిర్వహించడానికి బయలుదేరాడు

అలా అతడు నెమ్మదిగా గంగ ఇంటికి వెళ్ళాడు

తలుపు తెరిచే ఉన్నది అతడు లోపలికి ప్రవేశించాడు చోళా ఏడ్చి ఏడ్చి బోర్లా పడుకొని నిద్రపోయింది శివరాశి ఆమె శరీరాన్ని అలా చాలాసేపు చూస్తూ నిల్చున్నాడు

అమ్మనారు ఆవేశించిన ఈ సుందరినే తాను పూజించవలసింది గురుదేవుడు లేనపుడు తానాపని చేయాలి అమీరు వస్తున్నాడు కనుక ఆ ఘడియకూడా సమీపిస్తూనే వున్నది అపుడు తన హృదయ భారం కొంత తగ్గించుకోవాలి అంతే, అతను మోకరిల్లాడు లోలోపల ఉద్వేగాన్ని అణచుకొని మహామాయ చరణకమలాలపై శిరస్సు ఉంచాడు ఆ స్పర్శతో చోళా ఉలిక్కిపడి మేల్కొన్నది మంచందగ్గరే ఉపవాస శ్రమతో వికృతాకారుడై భీకరమైన చూపులతో నిలుచున్న శివరాసిని చూచింది ''అమ్మయ్యో!'' అని వెర్రికేక పెట్టి ఒక్క ఉదుటున మంచంమీద నుంచి అవతలికి ఉరికి శివరాశి తనను మింగడానికి వస్తున్నాడన్నంత భయంతో పరుగెత్తింది

శివరాశి లేచాడు అవమానం పొందిన త్రిపురసుందరి తన పూజను స్వీకరిస్తుందా? అలా వ్యాకులతతో తన నివాసానికి వెళ్ళాడు సిద్ధేశ్వర, హరదత్తులకు రమ్మని కబురంపి ఉపవాసాన్ని విరమించాడు

హరదత్తుడు వెంటనే వచ్చాడు దేవీపూజ ఆగినందువల్ల అతనికి ప్రాణాంతకమైన అఘాతం తగిలింది నేటికి యాభై ఏండ్ల నుండి-సర్వజ్ఞుడు గురు పదవికి రాకముందు నుంచే - అతడూ త్రిపురసుందరికి భక్తుడు. స్వయంగా ఎన్నో ఉత్సవాలు చూచాడు తాను చేయించాడు. ఆనాటి ఉత్సవం భంగమైంది. మందిరం పూజారహితమైంది, పూజాధికారం అతని చేతుల్లోంచి జారిపోయింది పృధ్వి పాతాళానికి కుదించుకుపోయిందని అతని నమ్మిక అతడు మాట్లాడడంకూడా మానివేశాడు అర్ధచైతన్యావస్థలో ఆ మందిరం చుట్టూ అతడు తిరుగుతూ ఉండేవాడు అప్పుడు మందిరంలో ఏదో ఒక మూల కొందరు వామమార్గీయులను ప్రోగుచేసి కొన్ని పూజలు పూర్తి చేస్తుండేవాడు.

''మనమీద మహాకష్టం వచ్చిపడింది హరదత్తా!''

''ఊc'' అన్నాడు హరదత్తుడు పరధ్యానంగా.

''నీకేం తెలుసు? మహాదేవి పూజ సగంలో ఆగిపోయింది కనుకనే దేముడిలా అనుగ్రహించాడు తెలుసా?''

హరదత్తుని కన్నులు తేరుకున్నాయి ''నిజమే '' అన్నాడు

''పూజ పూర్తిగా జరగాలి చేసిన పాపానికి ప్రాయశ్చిత్తం చేసుకోవాలి! అప్పటికి కానీ ఈ కష్టాలనుంచి గట్టెక్కలేము'' అన్నాడు శివరాశి.

''మహామాయ ఆగ్రహం నుంచి ఎవ్వరూ తప్పించుకోలేరు'' అన్నాడు హరదత్తుడు

''మహామాయ పూజను మనం చేసి తీరాలి రేపు మనం అందరం ఖంభాతం వెళ్ళాలి అక్కడ పూజలు పూర్తిగా నెరవేరుద్దాం ''

''నే నిక్కడే ఉంటాను ''

''మన వెంట చోళా కూడా వస్తుంది తెలుసా?''

''రాశిగారూ! మహామాయకు లోపం చేస్తే ఏమి జరుగుతుందో ఎవరికీ తెలియదు కానీ ఆమె పూజలను భంగపరచినవాళ్ళు జీవించి ఉండడం మట్టుకు కల్ల'' అన్నాడు ఉక్రోషంతో హరదత్తుడు

''ఛీ ఛీ. నీ విక్కడే ఉండు నేను వెళ్ళివస్తా''నంటూ సర్వజ్ఞుని శిష్యుడైన రాశి తన ఆపదను తొలగించుకోడానికి ఒక చక్కని యోచనను ప్రతిపాదించి నెమ్మదిగా సర్వజ్ఞుని దగ్గరకు వెళ్ళాడు

5

చోళా పరుగెత్తుతూ మందిరంలో బిల్వపత్రాలను ఏరుతూ బాగుచేస్తున్న గంగ దగ్గరకు వెళ్ళింది ''అమ్మా అమ్మా .. ఆయన నన్ను తరుముతున్నాడే''

''ఎవరు భీమదేవులా?''

''ఏఁవిటమ్మా ఆ మాటలు? రాశిగారే ''

''ఎంత పిచ్చిదానివే భీమదేవుని కంటపడి . ''

''అమ్మా! నన్నా విషయం అడగకు '' చోళా కన్నుల్లోంచి అశ్రువులు వరదలై ప్రవ హించాయి ''నేను హతభాగ్యను నా నొసట సుఖపడే గీత లేదు'' అంటూ ఆమె ఏడ్చింది గంగ నెమ్మదిగా ఓదార్చింది

''అమ్మా! మనం రేపు ఖంభాతం వెళ్ళాలటకదూ?''

''సర్వజ్ఞుల యిష్టం ''

''పోయి అడిగివస్తే మంచిదికదే?''

''ఎందుకు? ఇక్కడినుంచి వెళ్ళిపోవాలని ఉందా?'' అన్నధి గంగ.

''నా పరమశివుడు నాకు కాకుండా పోయినాడు ఆయన నిక నృత్యంతో రంజింప చెయ్యలేను ఇక బ్రతికినా చచ్చినా ఒకటే'' అంటూ తిరిగి వెక్కుతూ విలపించటం మొదలుపెట్టింది

''చాలు చాలు పద. పోయి తెలుసుకుందాం'' అంటూ చోళాను తీసుకొని గురుదేవుని నివాసంవైపు నడిచింది గంగ గురుదేవులు అపుడు ఏకాంతంలో రహస్యాలోచన చేస్తున్నారని విని ప్రాంగణంలోనే గోడ కానుకొని కూర్చున్నది చోళా కూడా

సరసనే కూర్చున్నది ఇద్దరిలో ఎవరికీ లోపలి దృశ్యం కన్పించదు కానీ మాటలు మాత్రం వినిపిస్తున్నాయి

''భీమా! అమీరే కాదు వాడి తాత వచ్చినా సరే, పరమేశ్వరుని మూర్తి ఇక్కడి నుంచి కదల్చడానికి వీల్లేదు ''

''కానీ గురుదేవా! దురదృష్టంవల్ల ఏదైనా విపరీతం జరిగితే?'' అన్నాడు రత్నాదిత్యుడు.

''ఎంతవరకీ మూర్తిలో తేజం విరాజిల్లుతుంటుందో అంతవరకు త్రిపురాసురుడే ఏమీ చేయలేకపోయినాడే - మరి ఈ అమీరొక లెక్కా?''

''వాడు ఇలాంటి మూర్తులను ఎన్నో పగలగొట్టాడట. వాడు విగ్రహాల పాలిట యముడంటారు గురుదేవా!'' అన్నాడు విమల మంత్రి

''మీ హృదయంలో శ్రద్ధ తొలగిపోయింది అందుకే దేవమూర్తులు భంగమవుతున్నట్లు మీ హృదయాల్లో కన్పిస్తున్నది నాలో శ్రద్ధ తొలగిపోలేదు క్షీణించనూలేదు నా పరమేశ్వరుడు అసాధ్యుడు, అనంతుడు ఆ మహానుభావుణ్ణి కదలించడానికి ఎన్ని గుండెలుండాలి?''

''మీ రలా అనకండి గురుదేవా! మా శ్రద్ధా క్షీణించలేదు'' అన్నాడు భీమదేవుడు

''మీకు అమీరంటే జంకు ఉన్నది. నా కేమాత్రమూ లేదు నా పరమేశ్వరుని ఆజ్ఞ లేనిదే గడ్డిపోచ కూడా కదలదు మరి వీడొక లెక్కా?''

''కానీ గురుదేవా!'' రత్నాదిత్యుడన్నాడు, ''మేము లౌకికులం జయాపజయాల రెంటినీ ఆలోచించాలి మేము ''

''జయాపజయాలను గురించి మూఢులు ఆలోచిస్తారు దాన్ని అసలు నిర్ణయించేది పరమేశ్వరుడు నీవేమి చేస్తావయ్యా?''

''గురుదేవా! మేమూ నిశ్చయించుకునే ఉన్నాం. బొందిలో ప్రాణం ఉండగా పరమేశ్వరుని ధ్వజం క్రిందికి దిగదు మరి మేము గతిస్తే '' రత్నాదిత్యుడు అన్నాడు

''ఎవరు ఎవర్ని కాపాడగలరు రత్నాదిత్యా? నీ మాటలు వ్యర్థం నా పరమేశ్వరుడు అక్కడి నుంచి కదలడు సలక్షణాలతో శోభిల్లే లక్షల కొలది నీలాటి వీరయోధులు ప్రాణాలు అర్పించడానికి సిద్ధంగా వున్నప్పుడు పరాజయపు ప్రసక్తి దేనికి? పోరాడండి పోరాడి విజయాన్ని సాధించండి పరమేశ్వరుడు మీకు సహకరిస్తాడు ''

''నాకు విషయం అర్థమైంది నా హృదయంలో కూడా అదే ధ్వని వినిపిస్తోంది మన పరమేశ్వరుడు త్రిశూలధారియే నిల్చున్న తరువాత విజయం మనకే లభిస్తుంది కానీ యుద్ధ సమయంలో శివమూర్తిని మరో చోటికి తీసుకొని పోవచ్చు కదా .'' అన్నాడు భీమదేవుడు

''తీసుకు పోకూడదు నాయనా! వీల్లేదు సృష్ట్యాదిలో ఈలింగం ఇక్కడ అవత రించింది ఇక ప్రళయకాలంలో కూడా ఇక్కడే వుంటుంది ''

''అయితే మీరు ఖంభాతం వెళ్ళండి మీమీద పాశుపత మతం ఆధారపడి ఉన్నది ''

''వత్సా!'' గురుదేవులు నెమ్మదిగా దృఢంగా అన్నారు. ''నీవు నన్నెపుడు అర్థం చేసుకుంటావు? నాకీ గురుపదవి మీదా, ఈ లకులేశమత సర్వాధిపత్యం మీదా మమత్వం లేదు నేను పరమశివుని దాసానుదాసుణ్ణి ఆయన ఉన్నచోటే నేనూను. ఆయనను విడిచి జీవించడమనే విషయాన్ని కూడా ఆలోచించలేను నాయనా.''

''కానీ ఇది తపస్వుల పనా స్వామీ! ఈ పని మేము చేయాలి.''

''తపస్వుల పని కాని దేమిటయ్యా? తపస్వి లేనిచోట పుణ్యం లేదు. పుణ్యం లేని చోట విజయం లేదు.''

''కానీ మీరు ఉంటే ''

''ఇదిగో ఈ విషయాన్ని ఇక విడిచిపెట్టండి సామంతుడు కూడా ఇలాగే మొండి పట్టుదల చూపాడు నేనెపుడో ఈ నిశ్చయానికి వచ్చాను సోమనాథుడెక్కడుంటే అక్కడే నేనూ ఉంటా - మ్లేచ్ఛుడు చేయదలచుకున్నది చేయనీ దేవునికీ, మ్లేచ్ఛునికీ మధ్య నిల్చోగల యోధుడే లేనినాడు నే నొక్కణ్ణే నిలుచుంటా. ఎలాంటి పరాక్రమం ప్రదర్శించే వ్రాత నా నొసట వ్రాసి ఉందో?''

సర్వజ్ఞులు మధురంగా అన్న నిశ్చల వాక్కులు విని గంగ కన్నుల నీరు తుడుచు కున్నది భీమదేవుడు మొదలగు వారు కూడా ఈ వృద్ధుని నిశ్చయాన్ని చూచి ఆశ్చర్య చకితులైనారు

కొంతసేపైన తరువాత ''నా యీ శిష్యులందరినీ ఖంభాతం తీసుకొని వెళ్లండి పాశుపత మతానికి స్తంభాలలాంటి వాళ్ళు వీరందరూ వీరి విద్యాతపస్సులు రక్షింప బడటం అవసరం శివరాశీ! నీవూ గగనరాశీ కలసి వీరందరినీ తీసుకొని వెళ్ళండి'' అన్నాడు సర్వజ్ఞుడు

''మీ ఆజ్ఞ'' అన్నాడు శివరాశి రెండో శిష్యుడైన గగనరాశి అత్యంత వినయంతో మౌనంగానే ఆనతిని శిరసావహించాడు

''వణిజులను ఈ రాత్రే పంపుతున్నాను. ప్రొద్దున బ్రాహ్మణులను పంపుతా''నన్నాడు విమల మంత్రి

''సరే వారితో నాకే పనీ లేదు '' అన్నాడు సర్వజ్ఞుడు

''గురుదేవా!'' శివరాశి చాలా నిగ్రహంతో నిర్మోహపు స్వరంతో ప్రారంభించాడు ''గంగనూ మిగతా దేవదాసీలను కూడా తీసుకొని వెళ్ళాలి ''

''నిజమే వాళ్ళిక్కడ వుండి ఏమిచేస్తారు పాపం సిద్ధంకమ్మని గంగతో చెప్పండి'' అన్నాడు సర్వజ్ఞుడు

''గంగ ఇక్కడినుంచి ఒక్క అంగుళం కూడా కదలదు ఆఁ'' నడుముమీద చేయి పెట్టుకొని క్రోధమూర్తి యైన చండీదేవిలా గంగ గర్జించింది ''పరమేశ్వరుని చరణ సన్నిధిలో మీ నివాసమైతే నా నివాసం మీ పాదసన్నిధిలో ''

సర్వజ్ఞులు నవ్వారు ''గంగా! ఇది ఆడవాళ్ల పనికాదు నీవు పోక తప్పదు ''

''నా విషయం నాకు తెలుసు మీ అందరికీ వ్రతాలుండవచ్చు కానీ మాకు మాత్రం ఉండకూడదా?''

''మ్లేచ్ఛుని దండయాత్ర భయం పురుషులకంటే స్త్రీల విషయంలో ఎక్కువ ఉంది. ఇందుకే కదా వేలకొలది స్త్రీలు అగ్ని కాహుతి అయింది'' అన్నాడు రత్నాదిత్యుడు

''నా ప్రాణాలు పూజ్యపాదుల దాపున ఉన్నాయి ఆ పాదసేవా ప్రాప్తికి నాకు నిప్పు అక్కరలేదు.''

''సరే విమలా! ఈమెను ఇక్కడే ఉండనివ్వండి నీ వెనుక ఎవరు? చోళాయేనా? దీన్ని పంపించండి ''

''అవును తప్పక పంపాలి నవయువతులు ఇక్కడ ఉండకూడదు '' అన్నాడు శివరాశి

''చోళా! వెళ్తావా?'' అని అడిగింది గంగ

చోళా రూపం విచిత్రంగా ఉన్నది. పెదిమలు బిగించి కాంతులు విరజిమ్మే చూపులతో సర్వజ్ఞుణ్ణీ, భీమదేవుణ్ణీ, శివరాశిని చూస్తున్నది.

''చోళా! వెడుతున్నావుకదూ?'' నవ్వుతూ అడిగాడు సర్వజ్ఞుడు చోళా కన్నుల్లో మహా దైన్యం ఆవరించింది

''మీరందరూ కలసి . '' అశ్రువులతో, దుఃఖంతో, వెలికిరాని మాటలతో చోళా అన్నది ''మీరందరూ కలసి నా పరమశివుణ్ణి అపహరించారు. నా నృత్యాన్ని ఆపుచేశారు ఇక నేను జీవించడం దేనికి? చంపండి. చంపండి నన్ను'' అంటూ ముందుకు నడిచింది. ఆమె కాళ్ళు ఊగిసలాడాయి. కన్నులను చేతులతో మూసుకొని విరుచుకొని నేల మీద పడి మూర్ఛపోయింది అప్పుడు భీమదేవుని శక్తి తేటబారింది ఆ రాత్రి . ఆ వెన్నెల ఆ ముఖం ఆ శరీరం! అతని మనస్సు పొంగి పోయింది ఒక్క గంతులో చోళాను చేతుల్లోకి తీసుకున్నాడు ఒక్క క్షణం వరకు అందరూ యుద్ధ విషయాల్ని మరచిపోయారు

భీమదేవుడు నెమ్మదిగా చోళాను గంగ ఒడిలో పడుకోబెట్టాడు సర్వజ్ఞుని పెదవుల్లో చిరునవ్వు వెల్లివిరిసింది

''భక్తి శ్రద్ధ యున్నచోట ప్రాణాలమీద తీపి ఉండదు శ్రద్ధ ఉన్న వాళ్లు ఉండదలచు కుంటే ఉండిపోవచ్చు భక్తులను భగవంతునికి దూరం చేయడం మహాపాపం'' అన్నా రాయన

''సరే '' అంటూ భీమదేవుడన్నాడు నిస్పృహతో ''నేను ఏది చేయదలచు కున్నా దానికి వ్యతిరేకంగా ఏదో ఒక సిద్ధాంతం కన్పడనే కన్పడుతుంది ఇంతకూ గురుదేవా! నా నిశ్చయాన్ని అనుసరించి ఏ పనైనా చేయనిస్తారా?''

''సరే సరే ఇక నేను మాట్లాడను- సరేనా?'' అంటూ కిలకిల నవ్వుతూ సర్వజ్ఞుడు- ''సరే నా అధికారం అంతా నీ హస్తగతమయ్యాక నేనేమి చేయగలుగుతా''నన్నారు

## 6

కానీ ఈ పని భీమదేవుడనుకున్నంత తేలిక కాదు మెహతా ఏదో విధంగా ఎనిమిది నావలను పంపాడు రేపు పదకొండు నావలు వస్తాయని వార్త వచ్చింది. భండోచ్ రేవు నుంచి కూడా కొన్ని నావలు రావచ్చునని కూడా ఒక ఆశ ఉన్నది చిన్న నావలో యాభై మందికి, పెద్ద నావలో రెండువందల మందికి ప్రయాణానికి వీలున్నది. కనుక ఈ కొలది నావలలో పది, పదిహేను వేల మందిని పంపడం చాలా కష్టమైన విషయం

కానీ భీమదేవునికి ఓటమి అంటూ లేదు. ఎప్పుడు ఎవరిని ఎలా పంపాలో తానే నిర్ణయించాడు సాయంకాలానికి నావలు సిద్ధమైనాయి మొదటి గుంపు ఇళ్ళూవాకిళ్లూ వదిలి నావల దగ్గరికి వెళ్లారు రేవులో కన్నీటితో వీడ్కోలిచ్చుకుంటున్నారు! వెళ్ళేవారు దైవనామం జపిస్తూ, వణుకుతూ పడవల్లో ప్రవేశించారు. కొందరు స్తోత్రపారము లారంభించారు అమీరును ఆడిపోసుకున్నారు భార్యా పిల్లలను పంపుతున్న వాళ్ళ దుఃఖానికి అంతులేదు. ఈ పనంతా విమల మంత్రి పూర్తి చేశాడు.

అంతకంటే కఠినమైనది- వచ్చే సైనికులకు నివాసా లేర్పరచడం. భీమదేవ, శివ రాశులు మందిర వ్యవస్థాపకుడైన దీపకుణ్ణి తీసుకొని ఈ పనిలో లీనమైనారు. ముప్పైవేల అతిథులకు నివాసా లేర్పరచడం సామాన్యమా? ఒక సందులో ఉండే వాళ్ళందరూ ప్రక్క సందులో ఒకటి రెండు ఇండ్లలో సర్దుకున్నారు ఆ ఖాళీవీధిని సైనికులు ఆక్రమించారు. ధర్మశాలల్లో సైనిక శిబిరాలు ఏర్పడ్డాయి అవసరాన్నిబట్టి చిన్న చిన్న మందిరాలలో,

సభాభవనాలలో కూడా సైనికులు ప్రవేశించారు అనహిలవాడ నుంచి తెచ్చిన ధాన్యాన్ని దీపకుడికి అప్పగించి ఎక్కడ ఎలా పంచాలో నిర్ణయించారు అలా ఎవరికీ కష్టం కలుగకుండా నివాసాదులను ఏర్పాటు చేశారు

భీమదేవుడు తరువాత మరోపనిలో ప్రవేశించాడు రత్నాదిత్యుడు, త్రిలోచన పాలుడే కాక తాను కూడా ప్రభాసదుర్గం, అగడ్త సరిగా లేవని భావించాడు ముగ్గురూ కలిసి దాన్ని సరిగా పునర్మించడానికి పూనుకున్నారు ప్రతి ఘడియా చాలా విలువైనదే అమీరు ఎప్పుడు వచ్చి పడతాడో; అందుకని పౌరులనూ, సైనికులనూ ఈ పనికై నియమించారు మరి ఈ పని అహోరాత్రాలు జరుగడానికి కరదీపికల ఏర్పాటు కూడా చేశారు

కొద్ది కాలంలోనే ప్రభాస నగరమంతా చీమలబారుల్లా సైన్యాలతో నిండిపోయింది అందరినీ ఉత్సాహపరుస్తున్నాడు భీమదేవుడు ప్రతి చిన్న పనినీ స్వయంగా పరిశీలిస్తుండేవాడు ఎప్పుడూ ఏదో ఒక ఆజ్ఞ వెలువడుతుండేది కన్నుల్లో నిప్పులు కురిపిస్తూ, అధికారయుతంగా ఆజ్ఞాపిస్తూండేవాడు పని చేయడానికి వెనుకంజ వేసేవారికి అతని పరాక్రమం కూడా తెలిసిపోయేది ఒక దుష్టనాయకుడు అగడ్త త్రవ్వనని మొండికెత్తాడు ఒక్క విసురుతో అతని తల వేరైంది పట్టణానికి సరైన నాథుడు వచ్చాడని ప్రజల్లో నమ్మకం ఏర్పడ్డది

అన్ని పనులూ చూచుకొని భీమదేవుడు తిరిగి వచ్చేటప్పటికి అర్ధరాత్రి అయింది పనులన్నీ వేగంగా నడుస్తున్నాయి తెల్లవారేసరికి చాలా వరకు పనులైపోతాయనే సంతోషం అతని హృదయాన్ని సంతృప్తి పరుస్తున్నది అలా చివరకు సోమనాథ మందిరం ముందు తనకై ఏర్పరచిన నివాసాన్ని చేరుకున్నాడు వీరాచావడా అక్కడ అతని కొరకు ఎదురు చూస్తున్నాడు స్నానానికై నీళ్ళు, భోజనం సిద్ధం చేశాడు

వీరాచావడా మహారాజుకు అనుచరుడు - మిత్రుడు - తల్లి - సర్వమూనూ భీమదేవుని బాల్యంలో తన వీపుమీద ఎక్కించుకొని ఆడించాడు పెద్దవాడైన తరువాత కత్తిసాము, విలువిద్య నేర్పాడు. భీమదేవుడు యువరాజైనప్పటినుంచీ అతని అనుచరుడుగా వుంటున్నాడు తాను రుచి చూచే మహారాజుకు వడ్డిస్తుండేవాడు మహారాజు నిద్రించిన తరువాత పిచ్చుకత్తిని పట్టుకొని ద్వారం వద్ద నిద్రించేవాడు. చావడా కాళ్ళు పట్టనిదే భీమదేవుడికి నిద్ర పట్టదు మహారాజు వచ్చి పలుకరించనిదే అతనికి నిద్ర పట్టదు.

మహారాజు వచ్చిన పిమ్మట స్నానం చేయించి భోజనం వడ్డించాడు తరువాత 'బాబూ! ఇక నిద్రపోండి. రెండు మూడు ఘడియలు విశ్రాంతి తీసుకోకపోతే ఆరోగ్యం బాగుండదు' అన్నాడు

'అబల రక్షణ క్షత్రియులుకాక మరెవరు చేస్తారు?' అన్నాడు భీమదేవుడు

చోళా చూపులు ఉపాలంభనాన్ని విసిరాయి 'అవును, మీరు క్షత్రియులు కనుకనే నన్ను ఉద్ధరించారు కదూ' అని అడుగుతూన్నట్లు ఆ చూపులు భీమదేవుని పైకి ప్రసరించాయి

భీమదేవుని హృదయ తంత్రులు సంగీతాన్ని ఆలాపించాయి కానీ అది ప్రణయసల్లాపాలకు సమయం కాదు కనుక వెంటనే లేచి సరే ఇంకా చాలా పని ఉంది . వస్తానన్నాడు.

వెనువెంటనే భీమదేవుడు దిగ్భ్రాంతుడై నిల్చున్నాడు. ఎదురుగా ఊర్వశి సౌందర్యాన్ని తిరస్కరించే లావణ్యమూర్తిని చూస్తూ కాదని ముందుకు నడవడానికి మనస్కరించలేదు.

'రేపటి నుంచి ప్రభాసంలో స్త్రీలు ఉండడానికి వీలులేదు కనుక మీరిద్దరూ, గురుదేవులూ నేను ఉండేచోట ఉండడానికి రావాలి మీరే మా పనులన్నీ చేసిపెట్టాలి '

గంగ ఆనందానికి మేరలేదు 'మీ దయ. ' అని మాత్రమే అనగలిగింది

చోళాకు దశదిశలూ లేచి తనచుట్టూ నర్తిస్తున్నట్లు అనిపించింది భీమదేవుని కర్తవ్య పరాయణత్వం మరో క్రొత్త సూచన కూడా చేసింది.

'రేపటి నుంచి ఈ వీధిలో నా సైనికులు నివసిస్తారు '

మూడోసారి చోళా తన కన్నులతో ఉపాలంభనను కనబరచింది

'ఈ సూచన నివ్వడానికి ఎందుకు ఇంత తొందర?'

## 7

అర్ధరాత్రి అయేసరికి శివరాశి బాగా అలసిపోయాడు నాడే ఉపవాస దీక్షను విసర్జించడము, నాడే ఆ పనంతా అతని మీద వచ్చిపడడము! అన్నిటికంటే రేపు వెళ్లాలా వద్దా అనే ప్రశ్న అతని హృదయాన్ని మథించి వేస్తున్నది ఉపవాసం వల్ల మనస్సంతా తేటపడ్డది దీర్ఘంగా యోచించి ఈ చిక్కును పరిష్కరించడానికి ప్రయత్నిస్తున్నాడు.

మధ్యాహ్నం వరకు ఒక విధంగా పరమేశ్వరుడు, గురుదేవుడు ఉన్నచోట ఉండాలా? లేక గురుదేవులు లేనపుడు పాశుపత మత విజయానికి త్రిపురసుందరీదేవి రూపమైన చోళాదేవి సాన్నిధ్యానికి చేరుకోవాలా? అనేది నిర్ణయించుకొనేందుకు ఊపిరి సలుపలేదు కానీ ఇపుడు చోళాకూడా ఇక్కడే ఉంటాననంటున్నది. అసలు గురుదేవుడే

పాపం చేశాడు పైగా, అనుచితంగా అతనికి ప్రాయశ్చిత్తం అంటకట్టాడు విధి నియమాలను ఉల్లంఘించాడు అందుచేత గురుభక్తి కొంత తగ్గిపోయింది ఒకవేళ అమీరే జయించి ప్రభాసాన్ని ఆక్రమిస్తే పాశుపత మతోద్ధరణ భారం అతనిపైనే పడుతుంది అందువల్ల ఈమార్గమే మేలనిపించింది గురుదేవుడు మొండితనం చూపి ఇక్కడే ఉండాలనీ, అమీరు అందరినీ నాశనం చేయాలనీ, అప్పుడు అతడు ఖంభాతంలో ఉంటే సర్వజ్ఞ పదవి లభిస్తుందనే చెడు తలంపులకు అతడు తావిస్తున్నాడా? ఒక తపస్వివలెనే సమస్యను పరిష్కరించడానికి చూచాడు తాను ఇక్కడే వుంటే తనకూ, గురుదేవునికీ ఇద్దరికీ ఏమైనా అయితే పాశుపత మతమే మాయమవుతుంది మరి తాను వెళ్ళి చోళా ఇక్కడే ఉంటే సగంలో ఆగిపోయిన త్రిపురసుందరీ పూజ నెరవేరదు దైవానుగ్రహం మితిమీరుతోంది అలా సంకల్ప వికల్పాదులతో ప్రాంగణంలోకి ప్రవేశించాడు పవిత్రమైన ఆ దివ్యధామంలో భక్తులుండేచోట సైనికుల నివాసాలేర్పాటుచేయటం చూచి అతని మనస్సు చివుక్కుమన్నది తన తపశ్చర్య పూర్తి అయితే, మహామాయ పూజా విధులు సలక్షణంగా నెరవేరితే అమీరు నిలువునా భస్మమైపోడా? మరి దీన్ని నెరవేర్చడం ఎలా?

అతడలా ఒక వైపు నుంచి వస్తుంటే మరోవైపు నుంచి భీమదేవుడు వీరాచావడాతో తన శిబిరానికి వెళ్తూ కన్పించాడు భీమదేవుడు మంచి బలిష్ఠుడు, చతురుడు కూడాను. అతణ్ణి గద్దె నెక్కించడానికి తానుకూడా కొంత సహకరించాడు అమీరు పరాజితుడై, భీమదేవుడు ఘుర్జర సార్వభౌముడై రాజపీఠాన్ని అలంకరించిననాడు తాను సర్వజ్ఞ పీఠాన్ని అలంకరించడం ఎంతో శోభదాయకంగా ఉంటుంది ఇంతలో అతని ఆలోచనలకు అంతరాయం కలిగింది అతని చెవికి భీమదేవుని మాటలు వినిపించాయి

'వీరా! చోళా అద్భుత సౌందర్యమూర్తి సుమా! రేపు నీవు చూస్తావుగా అప్పుడుగానీ నీ కర్థం కాదు.'

చోళా! అద్భుత సుందరి ఈ క్షుద్ర కీటకానికి చోళాలో త్రిపురసుందరీదేవి అంశ ఉన్నదని తెలియదు కదా! ఆమెను పూర్తిగా పూజించనందువల్లనే ఈ కష్టాలు విరుచుకుపడ్డాయని తెలియదు ఈ మూర్ఖుడికి భీమదేవుడు పలికిన మాటలు అతనికి రుచించలేదు. ఆమె రేపు వీరాచావడాను కలుసుకుంటుందా? . ఎక్కడ? ఎలా?.. మధ్యాహ్నం భీమదేవుడు ఆమెను గుర్తించలేదే! ఇంతలో ఇదా! చోళా, భీమదేవులు మునుపు కలుసుకున్నారని తాను విన్నమాట నిజమా లేక గాలి కబురా?

వెంటనే అతని దృష్టిలో భీమదేవుడు పతనం చెందాడు భీమదేవుడిలాంటి వె(రివేషాలతో చోళాలో ఉన్న (త్రిపురసుందరీదేవి అంశను అవమానపరుస్తున్నాడు!

భీమదేవుడు తన నివాసంలోకి వెళ్ళిపోయాడు అతడు అక్కడే ఒక నిమిషంపాటు స్తబ్దుడై నిలుచున్నాడు అతనికి ఒక దివ్యమార్గం స్ఫురించింది చోళాను ఆవేశించిన మహా శక్తిని రంజింపచేయనంతవరకూ ఈ ఆపదలు తొలగిపోవు తొలగిపోవు ఈ ఆపదలను తొలగింపగలగడమే తన తపోబలానికి పరీక్ష అతడు దృఢంగా నిశ్చయించుకున్నాడు ''నేను (ప్రభాసంలోనే ఇక్కడే .. ఉండి తీరాలి ''

పదమూడవ ప్రకరణం

# ఉమాశంకరులు

## 1

పుష్యశుద్ధ పూర్ణిమ గురువారం ఆరు రోజుల నుంచి చోళా జీవితం ఒక మహోల్లాస మధురనృత్య కావ్యరూపాన్ని ధరించింది ప్రతి క్షణం రుద్రరూపుడైన భీమదేవుల నామాన్ని స్మరించడం మనస్సులో ధ్యానించడం ఆయనను సేవించడం ఆయనకై ప్రతి బాటలో తన దృక్సుమాలను వెదజల్లడం ఒకటేమిటి-ఆ మూర్తే తన శ్వాసోచ్ఛ్వాసలుగా రూపొందడం

సోమనాధ పరమేశ్వరుడు త్రిపురాసురునితో పోరాడడానికి బయలుదేరితే, తాను పార్వతియై బాసటగా నిల్చున్నది! అసలు ఈ భావమే ఆమె హృదయంలో గిలిగింతలు పెడుతున్నది ఎంత ఆనందం ఎన్నడూ కనీ వినీ ఎరుగని మహదానంద మహోల్లాసం ఎన్నడూ ఊహించి యుండని మహానంద అమృతాసేచనం

ప్రాంగణంలో ఒక వసారా, మొదటి అంతుస్థులో మూడు గదులూ ఉన్నాయి అందు ఒక గదిలో భీమదేవుడు, మధ్య గదిలో సర్వజ్ఞుడూ, మూడవ గదిలో చోళా, మరిద్దరు సేవకురాండ్రూ ఉన్నారు గదులపైన పెద్ద డాబా ఉన్నది పురుషులు పగలల్లా బైటనే ఉంటుండేవారు కనుక చోళా గురుదేవుల గదిలోంచి పరుగెత్తుతూ, ఆడుతూ-పాడుతూ భీమదేవుని గదిలో ప్రవేశించేది క్షణం గంగతో నవ్వుతూ మాట్లాడేది క్షణం పీరాచావడా దగ్గర కూర్చొని భీమదేవుని బాల్య గాధలను వింటుండేది భీమదేవుడు పగలల్లా చేసిన పనుల వివరాలు వింటే ఆమెకు సంతోషంగా ఉంటుండేది అప్పుడప్పుడు మందిర శిఖరంపై పెద్ద బురుజు నెక్కి క్రొత్తగా నిర్మింపబడిన కోటనూ, లోతుగా, వెడల్పుగా బాగుచేసిన అగడ్తనూ, కోటగోడలపై బారులు తీర్చి నిలుచున్న విలుకాండ్రనూ, ఆయుధపాణులై అటూ ఇటూ తిరుగుతున్న వీరయోధుల సమూహాలను చూచి గర్వానందాలతో నర్తిస్తుండేది రెండుమూడు సార్లు నగరంలోనూ, కోటపైనా సేనాపతులతో కలసి తిరుగుతున్న మహారాజును కూడా చూచింది

సమున్నతుడై, కవచాన్ని ధరించి, తేజాన్ని వెదజల్లుతూ అనుచరులను ఆజ్ఞాపిస్తూ భీమదేవుడు అందరి ఆదరాభిమానాలనూ చూరగొంటున్నప్పుడు చోళా

హృదయం వివశమై ఆకాశంలో విహరించేది రోజూ పగటిపూట ఒకసారి పరమేశ్వరుని సన్నిధిలో నృత్యం చేసి వస్తుండేది ఇప్పుడక్కడ జనం గుమిగూడడం లేదు బిల్వపత్రాలు సమర్పించడానికి ఎప్పుడోగాని ఎవరూ రారు చాలామట్టుకు- ఆమె నిజదైవమైన సోమనాధ పరమేశ్వరుడూ- ఇద్దరే అక్కడ ఉంటుంటారు కనుక ఆమె నిరాటంకంగా తనకు తోచిన మాటలతో, ఇచ్చవచ్చినట్లు పాడుతూ తనివితీర ఆడుతుండేది

ఈ ఆనందానికి అంతరాయం ఇహ ఒక్కటే అడుగు బైటపెడితే చాలు శివరాశి కనుపించేవాడు రాశి కాకపోతే హరిదత్తుడో మరొకడో పైగా దూరంగా నిల్చుని సన్మాన సూచకంగా నమస్కారాలు కూడా చేస్తుంటారు ఆమె వెంటనే అక్కడి నుంచి పారిపోయేది

భీమదేవుడు క్రమేపీ విరామం లేకుండా పనిలో ఉండనారంభించాడు కష్టంతో తీరిక చేసుకొని అర్ధరాత్రి బసకు రావడం , స్నానం . భోజనం. అప్పుడప్పుడు ఆమె వడ్డించేది ఏదో నాలుగు మాటలు మాట్లాడేది తరువాత గురుదేవుడో, రత్నాదిత్యుడో, పరమారుడో, చాళుక్యుడో ప్రవేశించేవారు మేడమీద ఒక మూలకు కూర్చొనో లేక ఇటూ అటూ తిరుగుతూనో సంభాషణ ప్రారంభమయ్యేది అప్పుడు చోళా క్రీనీడలో నిలబడి భీమదేవుణ్ణే చూస్తూ ఉండేది భీమదేవుడు వెళ్ళి తన గదిలో నిద్రించిన తరువాత ఆమె కూడా తల్లి పక్కన పడుకునేది

పౌష్యశుద్ధ చతుర్దశినాడు రాత్రి మహారాజు చాలా ఆలస్యంగా వచ్చి స్నానం-భోజనం ముగించుకొని మేడపైకి వెళ్లాడు చోళా ఎప్పటిలా క్రీనీడలో నిలుచుని ఉన్నది ఆరోజు మరెవ్వరూ వచ్చేట్టు కన్పించలేదు ఆయన ఒక్కడే అటూ ఇటూ తిరుగుతున్నాడు తల వంచుకొని, పెద్ద పెద్ద అంగలతో నడుస్తూ ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు వెళ్ళి మాట్లాడాలనిపించింది చోళాకు కానీ ధైర్యం చాలదు

భీమదేవుడాగి తన గదివైపు నడిచాడు చోళా నిగ్రహించుకోలేక ఏమేమో గొణిగింది భీమదేవుని చేయి ఖడ్గం వైపుకు పరుగెత్తింది.

''ఎవరది?''

''నేనే'' అంటూ చోళా వణుకుతూ ఈవలికి వచ్చింది

''నీవా చోళా! ఇప్పుడు ..ఎందుకు?''

భీమదేవుని కన్నులు మిలమిల మెరుస్తున్నాయి వెన్నెలలు మధురమైన ఉన్మాదాన్ని వర్షిస్తున్నవి చోళా హృదయం పగిలి వ్రక్కలవుతున్నది

''మహారాజా!'' ఆమె కంఠం వణికింది ''ఇక నిద్రపొండి మళ్ళీ వేకువనే లేవాలిగా ''

''పడుకున్నా, మేలుకున్నా నాకు ఒకటే చోళా'' భీమదేవుని కంఠంలోంచి అలసటా ఖేదమూ పెల్లుబికాయి

చోళా నలువైపులా చూచి దగ్గరకి వచ్చింది ''స్వామీ నేను ఒక దాసీని అంతే అయినా మీ భారాన్ని తగ్గిచలేనా ''

భీమదేవుని హృదయం ఉప్పొంగింది వెన్నెల వెలుగులో మొగ్గలా సగం తెరచిన పెదవుల్లో, ఆశతో మెరుస్తున్న చూపుల్లో మోహ మాధుర్యం కన్పించింది ఈ అచ్చర కన్నెనే తానొకసారి తన బాహువుల్లో పొదువుకున్నాడు ఆ దృశ్యం గుర్తుకు వచ్చింది అతని మనస్సు కొంచెం తేరుకున్నది ప్రతి రక్తనాళమూ ఆనంద సంగీతంతో కంపించింది

'చోళా!' భీమదేవుని మాటల్లో కోరికలు పలుకుతున్నాయి 'నిన్ను చూస్తేనే భారం అంతా తొలగినట్లనిపిస్తుంది నీ మాటలు నిజమై, నేనే జయిస్తే నా భారాన్ని శాశ్వతంగా నీవే తగ్గించాలి '

మాటల్లోని అర్థంకంటే భీమదేవుని భావ విన్యాసం చోళాను వివశురాలుగా చేసింది 'అప్పుడు నన్ను మరచేపోతారు మహారాజా!'

'నిన్ను మరచిపోతానా?' అంటూ భీమదేవుడు కండలుతిరిగిన చేతిని చోళావైపు చాచాడు అతని శరీరమంతా ఉద్వేగం విద్యుత్తులా ప్రవహించింది. 'ఎప్పుడూ ఎప్పుడూ మరచిపోను' అంటూ భీమదేవుడు ఆమెను కౌగలించుకొని ముద్దు పెట్టుకున్నాడు ఆ ఇరువురూ కొద్ది క్షణాలు ప్రపంచాన్నే మరచిపోయారు వారు వేరైనప్పుడు తమ చుట్టూ సృష్టి అద్భుత సౌందర్యంతో శోభిల్లుతున్నట్లు వారికి కన్పించింది ఇద్దరూ ఉద్వేగంతో కంపించిపోయారు చాలాసేపు ఎవరూ పెదవి కదిలించలేదు చోళా సాక్షాత్తు చంద్రకిరణాలను రంగరించి చేసిన మహా మధుమూర్తిలా వెలిగిపోతున్నది

భీమదేవుని ముఖ కవళికలలో అకస్మాత్తుగా వచ్చిన మార్పు గమనించి ''చాలా గంభీరంగా ఉన్నారు ఏదైనా క్రొత్త ఆపద వచ్చిందా స్వామీ?'' అని చోళా అడిగింది

''ఇవ్వాళే వార్త వచ్చింది చోళా! ఆ అమీరు ప్రతి గ్రామాన్నీ తగలపెడుతూ, దోచుకుంటూ, పిల్లలనకా, పెద్దలనకా, స్త్రీలనకా, విప్రులనకా సంహారకాండ చేస్తూ వస్తున్నాడట నా గుజరాత భూమి మహా స్మశానమై పోతున్నది చోళా! నా భూమిని రక్షించడానికి నేను ఏమీ చేయలేకపోతున్నాను ''

''వాడు ఎపుడు వస్తాడు?''

''రేపు కాకపోతే ఎల్లుండి ''

''మంచిదే ఈ పీడ త్వరగా విరగడవ్వాలి''

''మరి మన పరమేశ్వరుడు లేడూ?'' అని అన్నాడు భీమదేవుడు. కానీ అతని ముఖంలో దైన్యరేఖలు అలముకున్నాయి

'ఇక విశ్రమించండి మహారాజా!'

'సరే'నంటూ భీమదేవుడు అక్కడినుంచి వెళ్ళిపోయాడు వెళ్తూ వెళ్తూ తిరిగి చోళాను చూచాడు వెనక్కు రావాలనిపించినా కాళ్ళాడక నెమ్మదిగా తన నివాసానికి వెళ్ళాడు. చోళా చంద్రకిరణాలవలె వచ్చినట్లే మాయమైంది చాటున పొంచిచూస్తున్న వీరాచావడా లోలోపల నవ్వుకున్నాడు

## 2

భీమదేవుడు విశ్రమించడానికి వెళ్ళాడేగాని సరిగా నిద్రపట్టలేదు అలుపు మూలాన రెప్పలు మూతలు పడుతున్నా మదిలో రకరకాల భావాలు సుడులు తిరుగుతున్నాయి కోటగోడలు ఆకాశానికి లేస్తున్నట్లూ, విశాల కాయులైన రాక్షసులు గోబ్రాహ్మణ వధ చేస్తూన్నట్లూ, తాను స్వయంగా బంధితుడై, మహాబాధతో మూల్గుతూ పడివున్నట్లూ అతనికి కన్పించింది అన్నివైపులా జ్వాలలు రేగుతున్నాయి ఎటు చూచినా సర్వనాశనమే అయినా కదలలేక పోతున్నాడు చంద్రకిరణాలతో చేసిన ఒక బాలిక ఎదురుగా నిలుచుని ఎత్తిపొడుపుగా చూపులను విసురుతున్నది అంతు లేకుండా అశ్వికదళాలు పరుగెడుతున్నాయి విద్యున్మాలల వలె శర పరంపరలు ధనుర్ముక్తములై దూసుకుపోతున్నాయి కానీ అతడు మాత్రం అక్కడే అక్కడే పడి ఉన్నాడు మళ్ళీ ఆ చిన్నారి కిరణబాల ఎత్తిపొడుపు చూపులు విసురుతున్నది కలతచెంది ఉలిక్కిపడి లేచాడు మనస్సును కుదుటపరచుకొని, ఒత్తిగిలి పడుకున్నాడు

తిరిగి స్వప్నం ఆ బాలిక నృత్యం చేస్తున్నది ఆయన స్వయంగా పరుగెడుతున్నాడు గురుదేవులు మృదంగం వాయిస్తున్నారు నృత్యం చేస్తూ చేస్తూ ఆ బాలిక పరుగెత్తింది ఆయన ఆమె వెనుకనే పరుగెత్తాడు ఎదురుగా ఒక కాపాలికుడు కన్పించాడు ఇంతలో తిమిరాచ్ఛన్న నిశీథిలో చంద్రుడుదయించాడు వెన్నెల చిలికింది. కాపాలికుడు నీటిలో పడిపోయాడు ఆయన ఆ అమృతబాలను తన చేతుల్లోకి తీసుకున్నాడు ఎదురుగా గురుదేవులు మృదంగం వాయిస్తున్నారు తట కిట ధోం

ఆయన కనురెప్పలు విచ్చుకున్నాయి సేనను మేల్కొల్పడానికి భేరీ మ్రోగుతున్నది చటుక్కున కూర్చుని చేయి చాచారు ప్రతిరోజూ ఆయన లేవగానే

చావడా ఎదురుగా వస్త్ర, కవచాదులను పట్టుకొని నిల్చోడం పరిపాటి అలా అలవాటు చొప్పున ఆ రోజు కూడా చేయి చాచాడు కానీ చేతికి ఏమీ తగలలేదు 'చావడా' అని పిలిచాడు ఎవరో చాలా పొట్టిమనిషి చేతులు పైకెత్తి వస్త్రాలపైన పెట్టడం జరిగింది భీమదేవుని కగమ్య గోచరంగా ఉన్నదంతా ఆయన చేతులు క్రిందికి దించారు చావడా ఎక్కడికి వెళ్ళాడు? ఇది కలకాదు కదా! చీకట్లో చేతులు చాచి వస్త్రాలను తీసుకున్నాడు దానితోపాటే వస్త్రాల నందిచ్చిన ఆ చేతులను పట్టుకున్నాడు. నిజంగా స్వప్నమే ఇది తామరతూడులా చేయి సన్నగా, మహా మృదువుగా ఉన్నది వెండితో చేసిన చిరుగజ్జెల మృదు స్వరంలా ఒక మధురహాసం గది అంతటా అలముకున్నది కోరికలు పెనువాకలై ప్రవహించాయి చేతులు పట్టుకొని ఆ వ్యక్తిని పైకి తీసుకున్నాడు చోళా మహారాజు వక్షస్థలం మీద వాలిపోయింది 'స్వామీ! . నా శంభో! ' అనే ధ్వని అతి కోమలంగా ఆమె నోట వెలువడుతున్నది. మూల నిల్చొని చూస్తున్న వీరా ఎంత ప్రయత్నించినా నవ్వు ఆపుకోలేక పోయినాడు . హాఃహాఃహాః .

అన్ని వైపులా నిస్తబ్దత్వ మేర్పడింది

## 3

భేరీ మ్రోగింది భీమదేవుడు నూతనోత్సాహంతో తన కక్ష్యాంతరంలోంచి దూకుతూ ప్రాంగణంలోనికి వచ్చాడు ఆనాడు ఆయన కన్నులు మునుపెన్నడూ ఎరుగనంతగా మెరుస్తున్నాయి చేతులలో అపారంగా బలం పొంగులు వారుతున్నది అప్పటికే కొంత ఆలస్యం అయింది కోటమీద గురుదేవుడు, రత్నాదిత్యుడు, పరమార్, చాళుక్య, కమాలఖాణీలు, మంత్రులూ, సేనానులూ నిలుచున్నారు ఎగురుతూ భీమదేవుడు కోటపైకి వెళ్ళాడు. చీకటిలో ఆకాశపు టంచులవైపు ఎదురుగా అరుణ జ్వాలలు కన్పిస్తున్నాయి. సింధూరంలాంటి పొగ ఆకాశాన్ని ఆవరిస్తున్నది అమీరు పదచిహ్నాలను చూచేసరికి భీమదేవుని హృదయం ఉప్పొంగింది. 'అడుగో . అడుగో .అడుగో ..' మహోల్లాసంతో భీమదేవుడు ''రత్నాదిత్యా! నడు సేనలను ఆయత్తం చేద్దామిక'' అని గర్జించాడు

తూరుపు వైపు కోలాహలం వ్యాపించింది ''అదేమిటి? భీమా!'' అని గురుదేవుడు ప్రశ్నించాడు అడవుల్లోంచి జంటలు జంటలుగా నల్లని మచ్చల్లాంటి వేవో - చీమలబారుల్లా ప్రభాసంవైపు పరుగెత్తుకొని వస్తున్నాయి ఆ మచ్చలు అధికమైనాయి వంద . రెండువందలు ఇంకా కొందరు గుఱ్ఱాలమీద వస్తున్నారు కొందరు

రథాలమీద పురోగమిస్తున్నారు అలా సమీపించారు ప్రభాత వాయువులు వారి రోదన ధ్వనులను తీసుకొని వస్తున్నాయి

''దేల్వాడా ప్రజల్లా ఉన్నది పరుగెత్తుకొని వస్తున్నా''రన్నాడు రత్నాదిత్యుడు ఆకాశంలోంచి నీటిబిందువులు రాలినట్లు అడవుల్లోంచి జనం బైటపడుతున్నారు

''నీ వేమి సంకల్పించినా మంచికే '' అన్నాడు గురుదేవుడు

''స్త్రీలూ, పిల్లలూకూడా ఉన్నట్లున్నది '' అన్నాడు విమలుడు

''అరే . అరే పాపం పడిపోతున్నారు'' గురుదేవుని గొంతు దుఃఖంతో నిండింది ''శివ . శివ శివ ''

నలువైపులా వెలుతురు వ్యాపిస్తున్నది స్త్రీ పురుషులు మహా దీనంగా ఆర్తనాదాలతో సమీపిస్తున్నారు కొందరు పరుగిడుతూ దారిలో జారి పడిపోతున్నారు

''దేల్వాడా పడిపోయింది'' అని పెదవులు కొరుక్కుంటూ భీమదేవుడన్నాడు అతని స్వరం గంభీర రూపాన్ని ధరించింది చూపులు వస్తూన్న జనంవైపు, ఆకాశపు పొలిమేరల వైపు తిరుగుతున్నవి

''విమలా! సముద్రం వైపు ద్వారాన్ని తెరిపించు త్వరగా ఉన్న నావలన్నింటినీ అగడ్తలోకి పంపు బ్రతికి ఒడ్డుదాకా వచ్చిన వాళ్ళందరినీ రప్పించు ''

''మహారాజా! వాళ్ళందరినీ లోపలికి తెచ్చి ఏమిటి చేయడం? రెండు నెల్లకు సరిపోయేంత ధాన్యం కూడా మన దగ్గర లేదే '' అన్నాడు వృద్ధమూర్తి కమాలఖాణీ

''లఖాణీ! వాడు రెండు నెల్లదాకా ఉంటే నేలకరచి చస్తాడనుకో ఇప్పుడు మన దగ్గర ఎన్ని నావలున్నాయి విమలా?''

''మూడున్నాయి మహారాజా!''

''స్త్రీలనూ, బాలురనూ వాటిలో కూర్చోబెట్టి సాగనంపు.''

''చిత్తం ''

''రత్నాదిత్యా! విలుకాండ్రను బురుజుల మీదికి ఎక్కించు యుద్ధానికి సిద్ధంకండి ''

రత్నాదిత్యుడు నడుమున వ్రేలాడుతున్న ఒక శంఖును ఎత్తి ఊదాడు నలువైపులా శంఖధ్వనులు మారుమ్రోగాయి భేరీలు గంభీరంగా గర్జించడ మారంభించాయి. రణదుందుభులు సంగ్రామ స్వాగతాలు పలుకుతున్నాయి. సూర్యోదయానికి ముందే ప్రభాస దుర్గం మహా యుద్ధానికి సన్నద్ధమై నిలుచున్నది సూర్యోదయం అయ్యేసరికి కోటగోడల మీద ఏడువేల మంది విలుకాండ్రు దనుర్బాణాలతో సిద్ధంగా రక్త నేత్రాలతో నిలుచున్నారు అక్కడక్కడ ఒంటెలనుకూడా బురుజులమీదికి ఎక్కించారు వాటి మీద పతాకాలూ, దుందుభులూ ఉంచారు ప్రతి వ్యక్తి చేతిలో ఒక చిహ్నం ఉన్నది

సేనాపతులు చక్కని ఉత్తమాశ్వాల నెక్కి కోటగోడపై మహోన్నతమైన బురుజుల మీద నిల్చుని క్షితిజం వైపు వాడి చూపుల్తో పరిశీలిస్తున్నారు

గంగ చోళాలిద్దరూ మందిర శిఖరం మీదికి ఎక్కి నిల్చున్నారు నలువైపులా సైనికులతో, శస్త్రాస్త్రాలతో, ఉన్నత పతాకాలతో శోభాయమానంగా వెలిగిపోతున్న కోటను చూస్తుంటే చోళా హృదయం గర్వంతో గంతులేస్తున్నది. ''చూడవే అమ్మా! కోట ఎంత చక్కగా ఉందో! ఎనిమిది రోజులలో మహారాజుగారు ఎంత మాయ చేశారే!''

అన్నిటికంటే ఎత్తైన శిఖరం మీద ఇతర రాజులతో నిల్చున్న గురుదేవుడుకూడా భీమదేవుణ్ణి ఇదేవిధంగా పొగుడుతున్నాడు దుర్భేద్యమై, సైన్యశక్తితో సజీవమై, స్వాభిమానంతో తల ఎత్తుకొని నిల్చున్న పునీత ప్రభాస దుర్గం ఉదయమాన సూర్యకిరణాలకు ధగధగ మెరిసిపోతున్నది ఆ వింత కాంతుల మధ్య ఆకాశంలో త్రిభువన పరమేశ్వరుడైన సోమనాధుని కాషాయ వర్ణాంకిత ధ్వజం జగత్కల్యాణ భావములే రూపుకొన్నట్లుగా రెపరెపలాడుతూ ఉవ్వెత్తున ఎగురుతున్నది.

ఒకసారి దీర్ఘశ్వాస తీసుకొని, స్వీయశక్తిని గురించి ఆలోచించుకుంటూ భీమదేవ మహారాజు ఒరలోంచి రివ్వున ఖడ్గాన్ని దూసి ఆకాశంలో ఎత్తి 'జై సోమనాథ్' అని ప్రళయ గంభీరంగా గర్జించాడు. ముప్పదివేల సైన్యసాగరం కూడా 'జైసోమనాథ్' అని ఘూర్ణిల్లింది వెంటనే భీమదేవుడు కనులు తెరచి 'రత్నా.. రత్నా. చూడు- అటుచూడు' అంటూ రత్నాదిత్యుని చేతిని తనవైపు లాక్కున్నాడు. సముద్రపు ఒడ్డునే అశ్వికదళం ఒకటి కోటవైపు వస్తున్నది.

'ఇదిగో... ఇటు చూడండి. ఇటు చూడండి' అంటూ పరమార్ అందరి దృష్టుల్నీ మరోవైపు మరల్చాడు. ఆ వైపునా ఒక దళం వస్తున్నది

'మన సముద్ర మార్గాన్ని బంధించాలని వీళ్ళ ప్రయత్నం.'

ఒకవైపునుంచి ఒడ్డుమీదనే సైన్యం ఒక యంత్రం నడచినట్లు పురోగమిస్తున్నది. అగడ్త కటువైపు శ్మశానం ఉన్నది. అక్కడే కాపాలికులుంటారు వాళ్ళను ఖంభాతానికైనా వెళ్ళండి, లేదా లోపలికి రండి అని గురుదేవులు ఎంతో బలవంతం చేశారు. కానీ, తమ వికృతాచార నియమాలలో ఉన్మత్తులై అపహసించి తృణీకరించారు. ఏ యుద్ధం వచ్చినా ఎవ్వరూ వాళ్ళ జోలికి పోలేదు. ఎవరికీ అంత సాహసం లేకపోయేది. కానీ, అమీరు అశ్వదళానికి ఇహపరాల లెక్కేలేదు. అలా అశ్వదళం పురోగమించి ఊచకోత కోసినట్లు కాపాలికుల తలలను తెగనరికారు. గురుదేవులకీ సాంప్రదాయం అంటే మొదటినుంచీ అసహ్యంగానే ఉండేది. 'నీ వేమి సంకల్పించినా మేలుకే...పరమశివా!' అన్నాడు ఒక

దీర్ఘనిశ్వాసం విడుస్తూ గురుదేవుడు ఇంతలో భీమదేవుని చూపులు దేల్వాడా వైపుకు పరుగెత్తాయి దిగ్భ్రాంతిచెంది అటే చూస్తూ నిల్చుండిపోయాడు ఆ వైపున ఒక అశ్విక సేన ధనుర్బాణాలతో ముందుకు వస్తున్నది

'రత్నా! పరమార్! మీరు సముద్ర మార్గాన్ని కనిపెట్టండి నేను ఇటు ఉంటా.'

రత్నాదిత్యుడు, పరమారుడు వెంటనే తమతమ స్థానాలకు వెళ్లారు ఇక ఇటు చూస్తే జరజర ప్రాకుతూ అడవి బాటనుంచి బ్రహ్మాండమైన సైన్యం చీమల బారుల్లా వస్తూనే ఉన్నది అశ్వదళం మహోద్రేకంతో పరుగెత్తుకొని వస్తున్నది ఒక్కొళ్ళా . ఇద్దరా వేల సంఖ్యలో అభేద్య వ్యూహంతో, భయంకరమైన చర్మపు ఉడుపులతో, ధగధగ మెరుస్తున్న శిరస్త్రాణాలతో, మహాభీకరమైన దీర్ఘ ధనుస్సులతో బాణాలు ఎక్కుపెడుతూ ఉప్పొంగి వస్తున్నారు వాళ్ళ వెంటనే పెట్టనికోటలా, ప్రాణంతో నిల్చున్న మహా దుర్గంలా, గజదళం కూడా శతానేకంగా పురోగమించింది తరువాత యంత్రాలు వచ్చాయి అలాంటి యంత్రాలను భీమదేవుడు తన జన్మలో చూచి ఎరుగడు కనీసం కలలోనైనా ఊహించి వుండడు

'మహారాజా!' విమలుని గొంతులోంచి చాలా నెమ్మదిగా మాటలు వెలువడుతున్నాయి 'సామంతుడు అన్న మాట నిజమే ఇది సైన్యమా? ఒక దేశానికి దేశమే పొంగి వస్తున్నట్లుంది '

'అయినా పరమేశ్వరుడు మన వైపు ఉన్నాడయ్యా'

'నాయనా భీమా!' అంటూ భీమదేవుని భుజంమీద ప్రేమతో చేయుంచి 'దేవతలకు కూడా దుర్లభమైన యుద్ధాన్ని పరమేశ్వరుడు నీకు ప్రసాదించాడు సుమా!' అన్నాడు

'అలాగే దేవతలు కూడా కనీవినీ ఎరుగనటువంటి మహా యుద్ధాన్ని ప్రదర్శిస్తా మీరు చూస్తుండండి గురుదేవా!'

అమీరు సైన్యం అడవి దాటి ప్రభాస దుర్గం చుట్టూ మహా ప్రళయంలా ఆవరించింది. ఆ తరువాత ఆకాశాన్ని భేదిస్తూ 'అల్లాహో అక్బర్' అనే నినాదం ప్రచండమై నలువైపులా వ్యాపించింది

'మీ రిక్కడే ఉండండి గురుదేవా! నేను వెళ్తాను' అని భీమదేవుడు కమాలఖాణీ విమల మంత్రులతో శిఖరం దిగి ముఖద్వారపు బురుజు పైకి పరుగెత్తాడు అగడ్త కటువైపు అశ్వసేన కొంత దూరం వరకు వచ్చి నిలుచున్నది సైన్యవ్యూహం అద్భుతమై, అపూర్వమై కనుపిస్తున్నది మూడువైపులా సైనికదళాలు చిత్రప్రతిమల్లా నిలుచున్నాయి.

అందరూ బాణాలు ఎక్కుపెట్టే వున్నారు కానీ, ఒక్కడూ బాణం వదలలేదు సముద్రపు దిక్కు తప్పితే, మిగతా మూడువైపులా ప్రభాస దుర్గం ముట్టడింపబడింది

'అల్లాహో అక్బర్' అని తిరిగి గర్జనల ధ్వని వినిపించింది

'జయ్ సోమనాథ్' అని భీమదేవుడూ, అతని సేనలూ ఉద్ఘోషించాయి

అమీరు సేనల ముట్టడి మధ్య రాజపుత్రవీరులతో ప్రభాస దుర్గం నల్లని మహా నాగ ఫణాగ్రాన చిరునవ్వులతో చిందులు త్రొక్కిన శ్రీకృష్ణునిలా విరాజిల్లుతున్నది

భీమదేవ మహారాజు ఛత్రచామరాలతో పెద్ద బురుజు మీద అందరికంటే ముందు నిల్చొని ఇదంతా చూస్తున్నారు ఇంతలో అమీరు సైన్యం మధ్య చిన్న చదరపు స్థలంలో ఒక పెద్ద పచ్చ జెండాను పైకి ఎగురవేశాడు గజపంక్తుల వెనుక శిబిరాలు స్థాపించడానికి ఇటూ అటూ పరుగెడుతున్నారు ఆ ఏనుగుల మధ్యనుంచి అయిదు వందల అశ్వదళ మొకటి ముందుకు వచ్చింది ఎంత అద్భుతంగా ఉన్న దా వ్యూహరచన! మూడువైపులా విలుకాండ్ర పంక్తులు, వాటి మధ్య విచ్చుకత్తులతో ఆశ్వికులు, అలా సైన్య పంక్తుల రక్షణలో మధ్యగా దాదాపు పదిహేనుగురు అశ్వికులు ముందుకు నడిచారు వీరందరి ముందు పెద్దదైన పచ్చని తలపాగాతో ఒక భీకరాకారుడైన అశ్వికుడు నల్లని ఉత్తమాశ్వాన్ని ఎక్కి ముందుకు వస్తున్నాడు సామంతుని వర్ణన ఎంత యదార్ధం వాడే గజనీ సుల్తానుడు అమీరు మహమూద్

మహారాజు పండ్లు పటపట కొరికాడు తన విల్లు తీసుకొని భూమికానించి బాణాన్ని సంధించాడు గుజరాత్ మొత్తంలో సాటిలేని ఆ మేటి విలుకాని చేతులు తపిస్తున్నాయి

అమీరు ప్రభాస దుర్గాన్ని పరిశీలించడానికి అలా ముందుకు రాగానే 'అల్లాహో అక్బర్' అని అతని సేనలు గర్జించాయి

'జయ సోమనాథ్' అని రాజపుత్రులు ప్రతిధ్వనించారు భీమదేవ మహారాజు మీసాలు దువ్వుతూ నిలుచున్నాడు

అలా చాలాసేపు అమీరు ఏకాగ్రతతో దుర్గాన్ని చూస్తూ నిలుచుని గురి తప్పని ఇద్దరు విలుకాండ్రను రప్పించి బాణం వదలమని ఆజ్ఞాపించాడు ఒకని బాణం అగడ్తలో పడిపోయింది మరొకనిది అంతవరకు కూడా రాలేకపోయింది రాజపుత్ర సైన్యం ప్రళయసదృశంగా విజయాట్టహాసం చేసింది. సాలార్‌మసూద్ అశ్వాన్ని దుమికిస్తూ తొందరపాటుతో ముందుకు వచ్చాడు బాణం ఎక్కుపెట్టాడు భీమదేవుని బాణం కూడా సిద్ధంగానే ఉన్నది లిప్తకాలంలో అపూర్వమైన బాహుబలంతో బాణాలు విసిరారు రెండు బాణాలు రివ్వున ప్రక్కగా తప్పించుకొని దూసుకుపోయాయి మసూద్ బాణం కోటగోడకు తగిలి క్రింద పడిపోయింది భీమదేవుని బాణం

వాయువేగంతో మసూద్ కాలిని భేదిస్తూ గుర్రపు పొట్టలో చొచ్చుకుపోయింది గుర్రం సుళ్ళు తిరిగింది వెంటనే మసూదు గుర్రంతో సహా మట్టిలో దొరలాడ నారంభించాడు రాజపుత్ర సైన్యం విజయోల్లాసంతో హర్షధ్వని చేసింది 'జయ సోమనాథ్' అనే నినాదంతో ఆకాశం దద్దరిల్లిపోయింది మహారాజును చూచి చాలా మంది అలాగే బాణాలు విడిచారు కానీ ఒక్కటీ అంత దూరం వరకూ పోలేదు

మసూద్ కట్టు కట్టుకొని నవ్వుతూ అమీరుతో పాటు తిరిగి వెళ్ళి పోయాడు అమీరుకు ఆరోజే యుద్ధం ఆరంభించాలని లేదు అతని సైన్యం అంతా అలా క్షణం ప్రతిమల్లా నిల్చుని ఆజ్ఞ లభించడంతోటే వాహనాలు దిగి డేరాలు పాతి భోజనపు ఏర్పాట్లలో లీనమైనారు ప్రభాసంలో విజయదుందుభులు విరామం లేకుండా మ్రోగుతూనే ఉన్నాయి మొదట భీమదేవుడే దెబ్బతీశాడు ఈ శుభ శకునంవల్ల అందరూ ఎంతో ఆనందించారు మధ్యాహ్నం వరకు చూస్తే అమీరు రెండు మూడు నెలల ఆక్రమణకై సంసిద్ధమవుతున్నట్లు కనుపించింది నలువైపులనుంచీ మట్టి తెప్పించి, మొదటి పంక్తిలోని అశ్వదళం ముందు విలుకాండ్ర రక్షణకై కుప్పలు పోయించాడు పగలల్లా ఈ తతంగం నడుస్తూనే ఉన్నది రాజపుత్ర సైనికులు కోట బురుజులమీద నిల్చుని వెక్కిరిస్తూనే గడిపారు

## 4

హరదత్తుడు పిచ్చెక్కినట్లు వీధుల్లో తిరుగుతున్నాడు త్రిపురసుందరీదేవి మందిరం మూతపడింది దేవీదర్శనం లభించడంలేదు పూజాధికారం కూడా లాక్కున్నారు మదిరామాంసాల ప్రసాదం కూడా ఆగిపోయింది మదిరాగంధంతో నృత్యం చేసే స్త్రీ పురుషుల అంగవిన్యాస సౌందర్య మహోత్సవం కూడా ఆగిపోయింది అతను పూజ చేసే చోట గురుదేవులే వెళ్ళి ఏదోవిధంగా పూజ ముగించి వస్తుండేవారు మందిరం ఏమిటి! అదొక కారాగారమై స్మశానంలా శూన్యమైపోయింది అతని జీవనకార్యమే నిలిచి పోయిందన్నమాట! అందుచేత రెండవరోజల్లా పండ్లుకొరుకుతూ ఇనుప కమ్చీని కదిలిస్తూ వీధులవెంటపడి తిరిగాడు.

అదీగాక ఇన్ని మందిరాలను సైనికులు వశపరచుకోడం చూస్తే అతని కన్నుల్లో రక్తం ఎగజిమ్మేది ఆ పుణ్యధామంలో అంత అవినీతిని అతను ఆనాడే చూచాడు అందుకే అమీరు వచ్చాడని భావించాడు అతనికున్న జ్ఞానమే అంతంత అవినీతికి పాల్పడ్డ గురువును దిగలాగేందుకే దైవానుగ్రహం వల్ల అమీరు వచ్చాడని అతని భావం ఎవరు గెలిచినా ఎవరోడినా అతనికి చింతలేదు మందిరద్వారాలు తెరచుకుంటే చాలు

అలా ఆలోచిస్తూ తిరుగుతుంటే అతనిలా ప్రసాదంలేక విసిగి, యాత్రీకులు కనబడక దిగులుపడి తిరుగుతున్న బైరాగులు ఎందరో కన్పించారు అవమాన దుఃఖంతో బాధపడుతున్న ఆ బైరాగులందరూ కూడబలుక్కున్నారు ఆ పూజలేవీ? ఏవీ ఆ ప్రసాదాలు? అఖండంగా అనుభవించిన ఆ నిద్ర ఏదీ? దీనికంతకూ ఈ గురువే కారణం గురువులో పాపాలు ఉండవచ్చు ఇది మాత్రం మహాపాపం ఘోరమైన పాపం

గురుదేవులు తమ గదిలో కూర్చున్నారు ఎదురుగా హరదత్తుడూ, మరికొందరు బైరాగులు కొంత దూరాన చేతులు కట్టుకొని నిల్చున్నారు వారి ముఖాల్లో, ధ్వనిలో దుర్మార్గం స్పష్టంగా కన్పిస్తున్నది

''మహామాయ మందిరం తెరవనంత వరకూ ఈ బాధ తొలగడం కల్ల అనాది నుంచి నేటి వరకు ఎన్నడూ ఇలా మూయబడలేదు గురుదేవా!'' అని కమ్చీని గట్టిగా పట్టుకొని హరదత్తుడన్నాడు అతని కన్నులు వికృతంగా పాశవంగా ఉన్నాయి

''నేను స్వయంగా పూజ చేస్తుంటే మూసివేయడమేమిటి?'' అన్నారు గురుదేవులు

''ఈ భక్తులకు దర్శన భాగ్యం లేకుండా గుడి ఎన్నడూ మూసివేయబడలేదు'' అన్నాడు హరిదత్తుడు

''మీరు చేసిన చేతల వల్లనే దర్శనాన్ని ఆపివేయవలసి వచ్చింది ''

''గురుదేవా!'' అంటూ బెదిరిస్తున్న ధ్వనితో హరదత్తుడు గత యాభై యేండ్ల నుంచీ నా దారిని ఎవరూ అడ్డగించలేదు నేడు మీరు చేశారు అదుగో అమీరు వచ్చాడు పూజావిధులీవిధంగా ఆగితే మహామాయ సహించదు '' అన్నాడు

''లకులేశ భగవత్పాదుల దయవల్ల నాకు కూడా పూజావిధులు తెలుసు ఒక్క పూజావిధి ఆగలేదు'' అని దృఢంగా అన్నాడు సర్వజ్ఞుడు

''మరైతే అమీరు ఎందుకు వచ్చాడు?''

''దైవపూజ జరగవలసిన చోట అమానుషాలు ఆరంభమైనవి గనుక ''

''అంటే మందిరాన్నిక తెరిపించరన్నమాట?'' అని అడిగాడు ఒక బైరాగి

''అవును? నా చేతల వల్లనే ఈ బాధ తటస్థిస్తే, దానికై నన్నొక్కణ్ణే శిక్షించమని పరమేశ్వరుని నేను ప్రార్థిస్తా''

''కానీ ఆ బాధను మేము అనుభవిస్తున్నాము'' అన్నాడు సర్వజ్ఞుడు చూపుతున్న శాంతికి విసిగి హరదత్తుడు. అతణ్ణి చూస్తే ఏదో ఘోరం చేసేట్లు కన్పిస్తున్నది

''అయితే దీనికి నేను కారణం కాదన్నమాట'' అన్నాడు మహాదృఢంగా గురుదేవులు. ''నేను ఎన్నో సంవత్సరాల నుంచి పాశుపత సాంప్రదాయానికి గురువుగా

ఉంటూ వచ్చాను నేటి వరకూ నేను నా ధర్మం నుంచి భ్రష్టుణ్ణి కాలేదు ఈ పరీక్షాసమయంలో కూడా కాను భీమదేవుడు అమీరును తరిమి కొట్టేంతవరకూ మందిరం మూసే ఉంటుంది ''

''అయితే ఇక మేం వెళ్తాం'' అన్నాడు హరదత్తుడు అతని కోపం శ్రుతిమించింది ఇక తాను అక్కడ ఉంటే లాభం లేదనుకున్నాడు

''వెళ్ళవచ్చు'' అన్నాడు సర్వజ్ఞుడు బైరాగులంతా కోపంతో ఆయన వైపు కొరకొరా చూస్తూ వెళ్ళిపోయారు

'భీమదేవుడు వీళ్ళందరినీ ఖంభాతం పంపుతానన్నప్పుడు నేను ఊఁ అంటే బాగుండేది ఇప్పుడు పరమేశ్వరు డేది చేసినా సరే' అని లోలోపల అనుకుంటూ ధ్యానం చేసుకోడానికి వెళ్ళాడు గురుదేవుడు

## 5

హరదత్తాదులు గురుదేవుల నివాసం నుంచి ప్రాంగణంలో శివరాశి పంచాగ్ని మధ్యంలో తపస్సు చేస్తున్న చోటికి వెళ్లారు తన తపస్సు ఉండవలసినంత తీవ్రంగా లేనందువల్లనే అమీరు వచ్చాడని శివరాశి ఊహ అందుకే లోటును త్వరగా పూర్తి చేసుకోవడానికి ఈ పద్ధతినారంభించాడు అలా కూర్చుని సర్వకళ్యాణప్రదుడైన శంకరుణ్ణీ, సర్వశక్తి స్వరూపిణియైన పార్వతినీ ధ్యానిస్తున్నాడు

అతని ధ్యానం అయిపోయేంతవరకూ ప్రశంసాముగ్ధులై హరదత్తాదులు ఆయనను చూస్తూ కూర్చున్నారు వారి బుద్ధికి సర్వజ్ఞ గురుదేవుల సౌమ్యస్వభావం, విశాల దృక్పథం, నిష్కల్మష ప్రవృత్తీ అర్థం కాలేదు కానీ, శివరాశిలో సామాన్య సన్యాసుల లక్షణాలు కొల్లలుగా కనిపించాయి అవన్నీ తమలోని లక్షణాలుగానే వారికి కనిపించేవి. తపమూ, ఆచారాలూ, లకులేశ సాంప్రదాయములోని ప్రతి చిన్న విషయమూ శివరాశికి మహా ఇష్టం మిగతా బైరాగుల కష్టసుఖాలు, కోరికలు అతను అర్థం చేసుకోగలడు అందుకని అతని పంచన చేరడానికి వారందరికీ జంకూ గొంకూ కన్పించకపొయ్యేది సర్వజ్ఞులు హిమాచ్ఛాదితమైన ఒక మహా దుర్గమమగు అత్యున్నత శిఖరంలా ఉండేవారు శివరాశి చక్కని వృక్ష పంక్తులతో శోభాయమానంగా కన్పించే చిన్న పర్వతాగ్రంలా వారికి కన్పించేవాడు

శివరాశి ధ్యానం నుంచి లేచి పంచాగ్ని వేదిక దిగి హరదత్తాదులను సత్కరించాడు.

''రాజగారూ! దేవీమందిరం తెరవకపోతే మేం ప్రాణాలను అర్పిస్తాం గురుదేవుల దౌర్జన్యాన్ని మేము సహించలేము'' అన్నాడు క్రోధంతో హరదత్తుడు

''హరదత్తా! గురు ఆజ్ఞను మనం ఎప్పుడూ శిరసావహించవలసిందే'' అన్నాడు రాశి

''అయితే మహామాయ దర్శనం లేకుండా తపించి చావాలన్నమాట''

''హరదత్తా! నీ చూపు మందగించింది ఏనాడు మందిరం మూత బడిందో ఆనాటినుంచీ దేవి మందిరాన్ని విడిచిపెట్టి కోట అంతటా సజీవంగా తిరుగుతూ నా ఆధ్యాత్మిక దృష్టికి కన్పిస్తున్నది భక్తి, దృష్టి ఉన్నవాళ్లకే మహామాయ మానవ శరీరంలో కన్పిస్తుంది ''

''ఎవరిలో? చోళాలోనా?'' అన్నాడు నెమ్మదిగా హరదత్తుడు

''మహామాయను నాలుగు గోడల మధ్య బంధించగల శక్తి ఎవ్వరికీ లేదు'' అని వంకరగా సమాధానం ఇచ్చాడు శివరాశి

''అయితే అమీరు ఎందుకు వచ్చాడు?''

''దీన్ని గ్రహించడానికే నే నీ తపస్సు ఇన్నాళ్ళుగా చేస్తున్నాను నాకా విషయిం అర్థమైంది ''

''ఏమిటీ?''

''అది నిగూఢమైన విషయం దాన్నికై తరుణోపాయాన్ని గురించి ఆలోచిస్తున్నాను ''

మాకు కూడా చెప్తే మేమూ ఏదో ఉపాయం చెప్తాంకదా?

''సమయం వచ్చినపుడు చెప్తాను ''

''కాదు స్వామీ! ఇప్పుడే చెప్పండి లేకపోతే మేము దేవీమందిరం ముందు ప్రాణాలు విడుస్తాం'' అన్నాడు హరదత్తుడు

''నాలో అంత నిష్ఠ లేదనేనా? నీవు దేవీభక్తుడివీ, నేను కాదనా?''

''మీరు గురుభక్తిలో మునిగి పోతున్నారు ''

''ఆ గురుభక్తి ఉన్నది గనుకనే మహామాయపై ఎక్కువ భక్తి ఉన్నది ''

''అంటే ఇంకా ఆమెను దేవి ఆవేశించే ఉన్నదనా మీ ఊహ?''

''అవును అనుమానం ఉంటే అర్ధరాత్రి ఏకాంతంగా మహాశివుని నృత్యం ద్వారా రంజిస్తున్నప్పుడు స్వయంగా చూచిరా ''

''ఇంకా నృత్యం చేస్తున్నదా?''

''అవును. దేవి నాపడం భీమదేవునికి సాధ్యమా?''

''స్పష్టంగా చెప్పండి రాశిగారూ! మేము మీ వెనుక నడుస్తున్నాం ఈపుణ్యధామాన్ని భ్రష్టంకాకుండా ఎలా రక్షించడం? అమీరును వెనక్కి తరిమి కొట్టడం ఎలా? ఇప్పుడు చెప్పినదాని కంటే ఎంతో ఎక్కువ తెలుసు మీకు'' అన్నాడు వినయంతో ఒక బైరాగి

''అందుకే నా మీద నమ్మకం ఉంచమని అంటున్నా.''

''అయితే మీరు హరదత్తునికి చెప్పండి చాలు మాకు సంతృప్తి కలుగుతుంది మాకు తెలియనిదీ, చెప్పకూడనిదీ ఏదైనా ఉపాయం ఉంటే ఆయనకు చెప్పండి స్వామీ!'' అంటూ చేతులు జోడించాడు ఒక బైరాగి

''సరే హరదత్తునితో చెప్తా మీరంతా నిశ్చింతగా ఉండండి అంతా మహామాయ చూచుకుంటుంది'' అన్నాడు శివరాశి మిగతా బైరాగులు హరదత్తుణ్ణి అక్కడే వదిలిపెట్టి వెళ్ళిపోయారు

''ఏమిటా ఉపాయం స్వామీ?'' హరదత్తుడడిగాడు

''ఆనాడు సగంలో ఆగిపోయిన పూజను పూర్తి చేయాలి'' అని నెమ్మదిగా శివరాశి హరదత్తుని చెవిలో చెప్పాడు ఆ యిద్దరి కన్నుల్లోనూ ఒక మహా భయంకరమైన తేజం మెరిసింది

## 6

భీమదేవుడు మహాసంతోషంగా ఉన్నాడు మొదటి దెబ్బ తనదే ఆ గురి తప్పని విలువిద్యే అతని గొప్పతనం శత్రువులు ఎంత అలజడి చెందారు! అమీరు అలా చుట్టుముట్టి కూర్చుంటే నెలలకొలదీ ఏడిపించడానికి తగిన సాధన సామగ్రులున్నాయి ఎదిరిస్తే దాన్ని విఫలమొనరించడానికి కూడా అనేక సాధనాలు ఉన్నాయి ఇలా ఆలోచిస్తూ నలువైపులా పరిశీలిస్తూ తిరుగుతున్నాడు ఆయన వెనుక వీరా చావడా ఒక్కడే ఉన్నాడు

అలా సముద్ర ద్వారం వైపుకు వెళ్తే అక్కడ కమాలఖాణీ ఒంటి కన్నుతో సముద్రం వైపు తదేకంగా చూస్తూ కనుపించాడు ఆయన ముఖంలో గంభీర రేఖలు అలముకున్నాయి

''ఏమిటి లఖాణీ ఏమిటి చూస్తున్నావు?''

''అటు చూచారా?''

''ఏమిటీ? ఆ నల్లగా కన్పించే మచ్చలేనా?'' అన్నాడు భీమదేవుడు క్షితిజంవైపు చూస్తూ

''అవును-నావలు''

''నాకలా అనిపించడంలేదే ''

''నేను 'కచ్ఛ' నివాసిని స్వామీ! పసితనం నుంచీ సముద్రంలో తిరిగిన వాణ్ణి మన నావ ఒక్కటి వాళ్ళ చేతుల్లోకి పోయినా సముద్ర మార్గం బంధింపబడినట్లే'' అంటూ తీక్షణంగా క్షితిజంవైపు చూస్తూ, ''ఎనిమిది ఉన్నాయి'' అన్నాడు కమాలఖాణీ

''సముద్ర మార్గం బంధింపబడ కూడదు ఏమిటీ చేయడం?''

''ఒకటే ఉపాయం'' అంటూ లఖాణీ రెప్పలార్చుతూ, ''ఎదురు పోయి ఆపివేయాలి'' అన్నాడు

''దానివల్ల లాభం! అయితే, అవసరమైతే నావలతో పోరాడగల యోధుల్ని కూడా కొందరిని పంపాలి ''

లఖాణీ కిలకిల నవ్వాడు ''అర్ధయోజనం వరకూ మునుగుతూ ఈదాలి స్వామీ మీకు తెలియదు '' అతని కంఠంలో చక్కని ఈత నేర్పరికి ఉండవలసిన స్వాభిమానం తొణికింది

''ఎలా?''

''నా దగ్గర గ్రీసు నుంచి చైనా వరకు వీర విహారం చేసి వచ్చిన యోధులు కొంద రున్నారు వారిని సిద్ధం చేస్తాను ''

''వాళ్ళు సముద్రంలో ఉండి పోరాడగలరా?''

''నావల్లో ఉండి పోరాడడం పుట్టుకతో అలవడ్డ విద్య మాకు ''

''మరి వీరికి నాయకుడో? నా దగ్గర ఇద్దరు ముగ్గురు ఖంభాత సైనికులు ఉన్నారు కాని, త్రాణలేని మనుష్యులు?''

కమాలఖాణీ ఒంటి కంటిని ఆర్పాడు

''నా కుమారుడుంటే పనికి వచ్చేవాడు అయినా ఫరవాలేదు మొన్నటి దీపావళికి డెబ్బైరెండో ఏడు ప్రవేశించింది అంతే, అప్పుడే ముసలివాణ్ణి కాలేదుగా?'' అంటూ చక్కని పాలలాంటి పళ్ళు కనుపించేలా నవ్వుతూ ''కన్నుమూసి తెరచేలోగా అర్ధయోజనం ఈదగలను'' అన్నాడు

''ధన్యుడివయ్యా లఖాణీ! ధన్యుడివి ''

''ఇక నా మనుష్యుల్ని ఎన్నుకుంటాను. చీకటి పడ[illegible] మా విలుకాండ్రను ఇక్కడ చేర్పించండి. అమీరు బాణాలు మా [illegible]గాని [illegible]లతో నీటిలో దిగితే కష్టం. వాళ్ళ నాపవలసిన బాధ్యత మీది ''

''నీవు నిర్భయముగా ఉండు లఖాణీ! నేను సిద్ధం[illegible]

ఎక్కువ అలజడి లేకుండా భీమదేవుడు సముద్ర ద్వారం దగ్గర రెండు వేలమంది దక్షులైన విలుకాండ్రను చేర్పించాడు సూర్యాస్తమయమైంది చీకటి నలువైపులా వ్యాపించింది అమీరు సేనలో వేలకొలది కరదీపికలు వెలిగాయి కోటపైన దీపికలు ఆలస్యంగా వెలగాలని భీమదేవుని ఆజ్ఞ- చీకటి పడగానే మూడు వందలమంది ఈతగాండ్రను తీసుకొని సముద్ర తీరానికి కమాలఖాణీ చేరుకున్నాడు భీమదేవుడూ, విమల మంత్రి కూడా వచ్చారు మహారాజు కమాలఖాణీని కౌగలించుకున్నాడు విమలుడు చిన్న తలుపు కొద్దిగా తెరిచాడు

వీర లఖాణీ విల్లునూ, అమ్ములపొదినీ ఉత్తరీయంతో నడుమున బిగించాడు బొడ్లో పిడిబాకు దోపి, ధట్టీ బిగించి సోమనాథుని స్మరిస్తూ చిన్న తలుపులోంచి నీళ్ళలోకి జారాడు చడీచప్పుడూ లేదు ఒక్క నీటిబుడగ కూడా పైకి లేవలేదు కొద్దిసేపు చెవులు రిక్కించి విన్నా సవ్వడి వినిపించలేదు రెండో కచ్ఛ వీరుడు కూడా అలాగే నీళ్ళలోకి జారి అదృశ్యమైనాడు అలా మూడు వందలమందీ నీటిలో జారి అనంతసాగరంలో లీనమైనారు ఆవలి తీరాన వేయి కండ్లతో కనిపెడుతూన్న అమీరు రక్షక భటులకు కించిత్తైనా ఈ విషయం తెలియలేదు అంత చాకచక్యంగా నడిచింది పనంతా

అర్ధరాత్రి దాటింది కడపటి కచ్ఛవీరుడు కూడా నీళ్ళలోకి జారాడు మహారాజు ఆజ్ఞ అయింది కోట గోడపై ప్రతిచోటా కాగడాలు వెలిగాయి కమాలఖాణీ నెత్తిన పెట్టుకొన్న భారం సామాన్యమైనది కాదు చీకటిలో అర్ధయోజనం ఈది వెళ్ళి నావలతో ఎదిరించడం అంటే ఆటలు కాదు ఇదీ కాక ఈ నావలు ఖంభాతంవో, వ్యాపారులవో లేక శత్రువులవో కూడా తెలియదు భీమదేవుడు ఆతురపాటుతో చాలాసేపు సముద్రం వైపు చూస్తూ నిలుచున్నాడు కాలం గడుస్తున్నది ఎన్నోమార్లు నిరాశ చేసుకున్నాడు రాత్రి గడిచిపోతున్నది లఖాణీ జాడ ఎక్కడా కనుపించలేదు చివరకు బాధతో తన నివాసానికి వెళ్ళడానికి నిశ్చయించుకున్నాడు ఇంతలో దూరాన సముద్రంలో - క్షితిజం దాపున - అనేక దీపికలు మహోజ్జ్వలంగా వెలిగాయి. పైకీ క్రిందికీ కదిలాయి మహారాజు ఆనందంతో ఎగిరి గంతు వేశారు ''భేష్ లఖాణీ! భేష్ ''

ఈ కాగడాల వల్ల అమీరు రక్షకభట దళాలు కలవరపడ్డాయి దుందుభులు మ్రోగాయి. గుఱ్ఱాలు సకిలించాయి కోటపై పాటణ ధనుర్ధారులు బాణాలు సంధించి ఆజ్ఞలకై ఎదురు చూస్తున్నారు కానీ, చివరకు కాగడాలు ఆరిపోయాయి కొద్దిసేపటికి అమీరు రక్షక దళాలు కూడా శాంతించాయి. భీమదేవుడుల్లాస హృదయంతో తన నివాసానికి వెళ్ళాడు.

## 7

తెల్లవారిన తరువాత పంచాగ్ని తపం చాలించి శివరాశి స్నానం చేశాడు పరమేశ్వరుని దర్శనం చేసుకొని, బిల్వపత్రాలు సమర్పించి తన నివాసానికి వచ్చేసరికి సిద్ధేశుడు భోజనం సిద్ధపరచాడు నేటి తపస్సుతో అతని మనస్సులోని అనేక వికారాలు తొలగిపోయాయి చోళా రూపంలో త్రిపురసుందరి తానై కోట అంతటా తిరుగుతున్నదని అతనికి గట్టి నమ్మకం ఏర్పడింది తాను ఆమెను పూజించనిదే అమీరు ఓడడు ఈ బాధలు తొలగవు అనికూడా స్పష్టంగా అతనికి స్ఫురించింది ఈ పూజాదులు అయిన పిమ్మట మహామాయ చోళాలోంచి దిగిపోతుంది ఇక పురాణాచారాన్ననుసరించి అతడు ఆచార్యుడై ఆ పూజను చేయించాడు గనుక చోళాపై అతనికే అధికారం ఏర్పడుతుంది అది తప్పనిసరి అనీ, అపరిహార్యమనీ అతనికి తోచింది కామక్రోధ మోహాదులను తాను జయించాడు ఇక ఇందులో తప్పేమిటి? తన జీవితమే త్యాగపూర్ణము త్రిపురసుందరీ పూజకు ఎంత త్యాగాన్ని చేయడానికైనా సిద్ధమే అలా సిద్ధపడడమే తన కర్తవ్యం

అతడు నెమ్మదిగా పరమేశ్వరుని మందిరంలోకి వెళ్ళి ఒక స్తంభం చాటున నక్కి కూర్చున్నాడు శివమూర్తి కెదురుగా ఒక నేతిదీపం వెలుగుతున్నది కొద్దిసేపటికి చోళా బెదురుతూ వచ్చింది సాష్టాంగంగా నమస్కరించింది కొద్దిసేపు నృత్యం చేసింది శివరాశి ఆమె అవయవ సౌందర్యాన్ని ఊహించుకున్నాడు చోళా సౌందర్యం చోళాది కాదు మహా మాయదా సౌందర్యం! సగంలో ఆగిన పూజాస్మృతి - మరపురాని ఆ అనుభూతి అతనికి జ్ఞాపకం వచ్చాయి శరీరం జలదరించింది అతడు హృదయంలో ఆలోచించాడు 'నిజమే ఆ పూజ నెరవేరాల్సిందే'నని దృఢంగా నిశ్చయించుకున్నాడు నృత్యం పూర్తి అయింది భావుక శబ్దాలతో చోళా పరమశివుని పూజించింది అపుడే పూజించాలని శివరాశి అనుకున్నాడు కానీ ఆచారోక్తంగా జరగడం కష్టం కనుక ఎలాగో నిగ్రహించుకున్నాడు

చోళా తన నివాసం వైపు నడచింది శివరాశి వెనుకనే నెమ్మదిగా నడిచాడు. అతని మనసు ఎల్లపుడూ 'ఎప్పుడు, ఎలా సగంలో ఆగిన పూజను పూర్తిచేయడమా' అనే ఘోషిస్తుండేది చీకటిలో కూడా మహామాయ పాదమంజీర ధ్వని అతని చెవులకు తృప్తి చేకూరుస్తున్నది

చోళా దుందుడుకుగా పరుగెడుతూ మేడపైకి వెళ్ళింది. కాళ్ళలో రెక్కలు మొలచినట్లున్నదా పరుగెత్తడం. నిజమే మహామాయ కాళ్ళకు రెక్కలు లేనిచో మరెవరికి

ఉంటాయి? చోళా భీమదేవుని గదివైపు తిరిగింది శివరాశి ఆశ్చర్యంతో చీకటి నీడలో నెమ్మదిగా గోడ నానుకొని వెంబడించాడు కారణం లేనిదే మహామాయ అలా వెళ్ళదు చోళా గది ప్రక్కగా మిద్దెపైకి ఎక్కి ఆ వైపు మిద్దె మీదికి వెళ్ళింది రాశి కూడా వెనుకనే వెళ్లాడు అక్కడ చీకటిలో ఒక వ్యక్తి నిలుచున్నాడు భీమదేవుడే! భీమదేవుడు కాక అంతటి బలిష్టమైన పురుషు డింకెవరు? రాశి చూరు క్రింద నిలుచొని చూచాడు

''స్వామీ! ఎక్కడ ఉన్నారు?'' అన్నది ఉత్సాహంతో నెమ్మదిగా చోళా

''ఇదిగో! నీ కోసం ఎదురు చూస్తున్నా'' భీమదేవుని స్వరం వినిపించింది

రెండు నల్లని నీడలు కలిసిపోయాయి ఒకటైనాయి ఏదో అస్పష్టమైన ధ్వని ఆ నిశ్శబ్ద నిశీథ వాతావరణాన్ని భేదిస్తూ శివరాశి చెవులకు వినిపించింది అతని శరీరం గగుర్పొడిచింది, క్రోధాగ్ని భగ్గున మండింది హృదయంలో వేయి కీలలతో అగ్నిపర్వతం బ్రద్దలైంది అతని కండ్ల ముందే ఎవ్వడూ, ఎన్నడూ చేయని, చేయ సాహసించని మహాపాపం జరుగుతున్నది భీమదేవుని పెదవులు మహామాయ, జగజ్జనని, త్రిపురసుందరీ రూపమైన చోళా పెదవులను స్పృశించడమా?

ఈ దుష్ట చాళుక్య ప్రభువుపై కోపవహ్నిని కురిపించమని దేవదేవుణ్ణి ప్రార్థిస్తూ శివరాశి కోపంతో నిలువునా దహించుకొనిపోతూ తన నివాసానికి వెళ్ళాడు ఇక ఇక ఈ అధమునికి- పాపికి ఒక్క క్షణం జీవించి యుండడానికి కూడా అధికారం లేదు లేదు

పదునాలుగవ ప్రకరణం

# పుష్యబహుళ పాడ్యమి

## 1

అలవాటు చొప్పున శివరాశి కాళ్ళు గురుదేవుని నివాసం వైపుకు నడిచాయి ఎంత భయంకరమైన విషయం! దశదిశలూ ఒక్క పెట్టున శపిస్తున్నాయి సోమనాధుని దివ్యధామంలో ఇలాంటి పాపకర్మ జరుగనిచ్చే శక్తి ఏ శాస్త్రానికీ లేదు ఈ పాపం పరిహరింపబడాలి ప్రాణాంతకమైన గతి పట్టినా దీనికి ప్రాయశ్చిత్తం జరిగి తీరాలి

మహామాయ యొక్క పవిత్రతను అభంగంగా, అవిచ్ఛిన్నంగా ఉంచి తీరాలి గురుదేవుని నివాసం వైపుకు నడుస్తున్న శివరాశి కాళ్లు ఆగిపోయాయి గురుదేవుని దగ్గరకు వెళ్ళడం దేనికి? ఎప్పటిలా నవ్వుతాడు అంతేగా! చోళా ఒక సామాన్య నర్తకి అని అంటాడు అతని స్థూలదృష్టికి త్రిపురసుందరి కూడా కనుపించదు ఆయనే త్రిపురసుందరి పూజా విధులను ఆపించి యవనిక వేయించాడు ఆయన ఏనాడో ఆ గురు పదవినుంచి భ్రష్టుడైనాడు నర్తకి యైన గంగను గృహిణిగా, ఆమె కుమార్తె యైన చోళాను తన కుమార్తెగా భావించి ఎప్పటినుంచో గృహస్థుగా జీవిస్తున్నాడు తానే తపోబలం పట్ల తనకున్న విశ్వాసం వల్ల భక్తితో ఆయనకు గౌరవాన్ని ఇస్తూ వచ్చాడు పరమేశ్వరుణ్ణీ, శాస్త్రాలనూ, తపస్సునూ కూడా లెక్క చేయకుండా అలాంటి వ్యక్తిని గురువుగా మన్నిస్తూ వచ్చాడు నిజమాలోచిస్తే ఈ గురువు దుర్బలుడు, వర్లి పిరికి ముదుసలి నిజమైన తపస్సు అంటూ అసలు చేసింది తానే ఈ వృద్ధుడు తన గురు పదవిని నిలబెట్టుకోడానికి భీమదేవుణ్ణి గద్దె నెక్కించాడు నేటికీ ఆ పదవిని నిలబెట్టుకోడానికే భీమదేవుని యిష్ట ప్రకారం నడవనిస్తున్నాడు అలాంటి వ్యక్తిని పూజించడం- అతని ఆజ్ఞలను పాటించడం - పాశుమత సాంప్రదాయానికి ద్రోహం చేయటమే ఇక ఈ గురుశిష్య సంబంధం చాలు గురువు ప్రసాదించిన రుద్రాక్ష మాలికను బాల్యం నుంచీ కంఠంలో ఉన్నదాన్ని - శివరాశి క్రోధావేశంతో వణుకుతూన్న చేతుల్తో పట్టి, గట్టిగా లాగి, త్రెంపి దూరంగా విసిరి వేశాడు. ఇక తనకు గురువు ఆ లకులేశ దేవులే. తాను ఆ మహానుభావునకే ఉత్తరాధికారి ఇక తన తపోబలంతో పాశుపత మత సంరక్షణకై పాటుపడడమే ఏకైక కర్తవ్యం

## 2

అక్కడి నుంచి శివరాశి వెనుతిరిగాడు ఒక నిశ్చయానికి వచ్చినందున మీది గొంగలితో శరీరాన్ని గట్టిగా కప్పుకొని కోటపై ఇటూ అటూ తిరగడం ప్రారంభించాడు దగ్గర కూర్చున్న సైనికులు- అమీరు సైన్యాన్ని చూచి ఆవంతైనా చలించనివాళ్ళు కూడా- దూరంగా తిరుగుతున్న శివరాశిని చూచి గజగజలాడిపోయారు భయానకమైన జటలతో స్థిర నేత్రాలతో సాక్షాత్తూ రుద్రుడే పరిస్థితులను పర్యవేక్షించడానికి తిరుగుతున్నట్లు వాళ్ళకు అన్పించింది చాలామంది తమ ముఖాలను మోకాళ్ళ మధ్య దూర్చుకు కూర్చున్నారు కొందరు సాష్టాంగపడ్డారు కొందరు 'నమఃశివాయ' అంటూ సత్కరించారు ఆ ఉన్నత నీలమూర్తి మహా భయంకరంగా చింతనిప్పుల్లా వెలిగిపోతూన్న చూపులను భ్రుకుటి క్రింద దాచుకుంటూ అదృశ్యమైపోయింది

భరూచి వాసి దద్దా ఒక అనుచరునితో కోట పరిస్థితిని చూడడానికి బయలుదేరాడు ఏర్పాట్లు చూడవలసిన బాధ్యత అపుడు అతనిదే అందుకని అతడు దీక్షతో ఆ పనిని నిర్వహిస్తున్నాడు అతని వయస్సు దాదాపు ముప్పై అయిదు మూలరాజదేవుడు దక్షిణ సేనాని యైన బాణుణ్ణి ఓడించి భృగుకచ్ఛాన్ని పాదాక్రాంతం చేసుకొన్న తరువాత ఒక పూర్వ చాణుక్య వంశీయుణ్ణి రాజుగా చేశాడు కానీ, అనహిలవాడ నుంచి పంపించిన దండనాయకులే రాజ్య వ్యవహారాన్ని నడిపిస్తుండేవారు. చాముండ మహారాజు కాలంలో ఈ దద్దా తండ్రి ఎదురు తిరగడానికి ప్రయత్నించాడు కానీ అనహిలవాడ సేనలు క్షణంలో అతణ్ణి అరికాల రాచి ఈ దద్దాను రాజ్యానికి ఉత్తరాధికారిగా నియమించడం సంభవించింది. దద్దా సుఖోపభోగాలనుభవిస్తూ అనహిలవాడ దండనాయకుల అడుగులకు మడుగు లొత్తుతూ తాను రాజైనదే పదివేలని అల్ప సంతోషంతో బ్రతుకుతున్నాడు అమీరు ఆక్రమణ వార్త రాగానే భరూచ సేనలతో రావలసిందిగా ఇతనికి ఆదేశం వచ్చింది అందుకే మహాసౌధాలనూ, అత్యంత సౌందర్యరాసులనూ వదిలిపెట్టి ఈ పుష్యమాసపు శీతల నిశీధులలో ఆయుధపాణులైన సైన్యాల మధ్య దుర్గ సంరక్షణ బాధ్యతను నిర్వహించవలసిన దుర్గతి పట్టిం దతనికి వీలు చిక్కితే మరునిముషం అక్కడి నుంచి పలాయనం చిత్తగించేవాడు కానీ, భీమదేవుడు అతన్ని గుప్పిట పట్టుకొని కూర్చున్నాడు. అతని వత్తడివల్ల పారిపోవడానికి వీల్లేదు ఉండడానికి ఇష్టమూ లేదు ఏ దుర్ముహూర్తంలో తన తాతగారిని మూలరాజదేవుడు సింహాసనం ఎక్కించాడో కదా!

దూరాన శివరాశి వస్తూండడం చూచాడు దద్దా అతనికి వణుకు పుట్టింది అతనికీ శంకరుడే జ్ఞాపకం వచ్చాడు వెనక్కు తిరిగి పారిపోదామనిపించింది కానీ కొందరు సైనికులు అతనికీ, మరికొందరు ఆ భీకరమూర్తికీ నమస్కరిస్తున్నారు పారిపోతే పరువు మంటగలుస్తుందనే భీతితో అక్కడే నిల్చున్నాడు

శివరాశి సమీపించేసరికి దద్దా అతణ్ణి గుర్తించాడు మూడు సంవత్సరాల పూర్వపు సంగతి శివరాసి రేవా పర్యటన చేయడానికి వచ్చినపుడు ఆ తపస్వి పాద తలానికి దద్దా మోకరిల్లాడు దానికిగాను అతనికి మహాఫలితం లభించింది శివరాశి ఆశీస్సులవల్ల అతనికి ఐదుగురు పుత్రికలూ ఒక పుత్రుడూ జన్మించారు దద్దా భక్తితో సాష్టాంగంగా నమస్కరించాడు శివరాశి 'నమఃశివాయ' అని ఆశీర్వదించాడు ఒంటరిగా కోటను గాలించే కంటే ఈ తపస్వితో పాటు కోటలో తిరుగడం మేలని భావించాడు దద్దా

''రాశిగార్లూ! ఈ బాధ ఎప్పుడు తొలగుతుంది?''

శివరాశి ప్రత్యుత్తరం ఇవ్వలేదు కొద్దిసేపు ఇద్దరూ నడిచారు

''గురుదేవా! దీనికి పరిణామం ఎలా ఉంటుందో చెప్పండి స్వామీ!''

శివరాశి దద్దా వైపు చూపు మరల్చాడు ఆ చూపులోని భీకరాకృతిని చూచి దద్దా నిలువునా గజగజలాడాడు

''ఫరిణామమా!''

''అవును స్వామీ! మీరు త్రికాలవేత్తలు చెప్పండి స్వామీ!''

శివరాశి పైకి దృష్టి సారించి క్షితిజం వైపు చూస్తూ ''మహామాయను అపవిత్రం చేసిన వాళ్ళు కుక్కచావు చస్తారు'' అన్నాడు

దద్దా ఆనందంతో ఎగిరిపడ్డాడు ''అమీరేగా!''

శివరాశి నిల్చుని దద్దా వైపు తీక్షణంగా చూచాడు అతడు భయంతో రెండు చేతులూ జోడించాడు

''కాదు - భీమదేవుడు''

అశనిపాతం జరిగినట్లయింది దద్దాకు అతని కండ్లు తిరగడం మొదలుపెట్టాయి

''పరమేశ్వరుని అర్ధాంగియే అలా శపించింది '' అంటూ పెద్ద పెద్ద అంగలతో శివరాశి వెళ్ళిపోయాడు

దద్దాకు కాళ్ళాడలేదు అలా పిచ్చివానిలా చీకటిలో అంతర్ధానమైపోయిన ఆ భీకరాకృతిని చూస్తూ నిలుచున్నాడు

## 3

ఇహ ఎక్కువ ఆలోచించడానికి దద్దాకు అవకాశం లేకపోయింది

అరుణోదయంతో పాటు అమీరు సేనలో ఒక్కసారిగా అలజడి రేగింది ఆశ్వికులు కరదీపికలు పట్టి సేవకులతో ఇటూ అటూ పరుగెడుతున్నారు దద్దా వణుకుతూ శంఖాన్ని పూరించాడు వెంటనే ద్వార రక్షకులు రణ దుందుభులు మ్రోగించారు భీమదేవుడు ఎగిరి పడ్డాడు కమలనాళంలా ప్రక్కనే ఉన్న కోమలమైన చేతులను స్పర్శించకనే కవచాన్ని ధరించాడు. శంఖాన్ని పూరించాడు కోటవైపు పరుగెత్తాడు రత్నాదిత్యుడు కూడా సంసిద్ధుడై కోటపైకి వచ్చి తన రణ శంఖాన్ని పూరించాడు పరమారుడూ, విమలుడు కూడా వచ్చారు అందరూ వేగంగా భీమదేవ మహారాజు నిలుచున్న పెద్ద బురుజుమీద గుమిగూడారు

అమీరు సైన్యం అద్భుతంగా నడుస్తున్నది తెలియని భాషలో పెద్ద గొంతుతో ఆజ్ఞల మీద ఆజ్ఞలు వెలువడుతున్నాయి ఆయుధాల ధ్వని విన్పిస్తున్నది గుర్రాలు సకిలిస్తున్నాయి దూరాన డేరాలు వేయించిన అడవి దగ్గర కరదీపికలు వెలిగాయి అక్కడి నుంచి గుర్రాలు బయలుదేరాయి తరువాత ఒక మహాయంత్రంతో వర్తులంగా చక్రం గిర్రున తిరిగినట్లు సైన్యం అర్థంకాని ఒక మహావ్యూహంగా ఏర్పడ నారంభించింది

భీమదేవుడు కూడా సంసిద్ధుడైనాడు ఒక విలుకాండ్ర పంక్తి మోకాళ్ళ మీద కూర్చున్నది వారి వెనుక శరీరాన్ని అంతా కవచంతో కప్పుకొని మరొక పంక్తి నిలుచున్నది వారి వెనుక కవచాయుధ పాణులై శిరస్త్రాణాలతో రాజపుత్రుల పంక్తులున్నాయి

గురుదేవుడు కూడా పైకి వచ్చాడు భీమదేవుడు ఆయనకు సాష్టాంగంగా నమస్కరించాడు గురుదేవుడు ఆశీర్వదించి అందరి నొసటా అరుణ తిలకాన్ని అలంకరించాడు కుంకుమాక్షతలు చల్లాడు 'జయ్ సోమనాథ్' అనే నినాదం దశదిశలా మారుమ్రోగింది

చీకటి తెరలు తొలగిపోయిన తరువాత భీమదేవుడు నలువైపులా చూచాడు అమీరు సేన యొక్క స్వరూపమే మారిపోయింది మూడువైపుల నుంచీ చదరంగా ఉన్న పొడుగాటి కవచాలను పైన కప్పుకొని సైనికులు తాబేళ్ళవలె క్రమ్ముకొని ఉన్నారు వారి కండ్లూ, పదునైన చేతికత్తులూ మాత్రమే బైటికి కన్పిస్తున్నాయి ప్రతి సైనికుని వద్దా అగడ్త దాటడానికొక తెప్ప ఉన్నది

వెనుకగా అయిదారు పంక్తుల్లో ధనుర్ధారులైన ఆశ్వికులు బారులు తీరి నిలుచున్నారు వారి రొమ్ములకు అడవి జంతువుల చర్మంతో చేసిన కవచాలు ఉన్నాయి

నెత్తిన జంతువుల కొమ్ముతో చేసిన శిరస్త్రాణాలు ఉన్నాయి గడ్డాలు వక్షస్థలి నాక్రమించుకొని గాలికి కదులుతున్నాయి సైనికు లందరూ ధనుస్సులు ఎక్కుపెట్టి నిల్చున్నారు 'ఊఁ' అంటే పదివేల బాణాలు పైనబడడానికి సిద్ధంగా ఉన్నాయి వాటి ప్రక్కనే గజదళం అక్కడక్కడా నిల్చుని ఒక సజీవ దుర్గాన్ని నిర్మించింది ప్రతి ఏనుగు మీదా ముగ్గురు విలుకాండ్రు ఉన్నారు ప్రతివ్యక్తి దగ్గరా కోటకెగబాకడానికి పొడుగాటి నిచ్చెన ఒకటి ఉన్నది

అద్భుతమైన దృశ్యం అపూర్వమైన నిర్మాణం దుర్భేద్యమైన వ్యూహం భీమదేవ, రత్నాదిత్యులు ఆ సైన్య విన్యాసాలను నిలుచుని చూస్తున్నారు

''మహారాజా! ఇక మనం గెలవడం అంటే పరమేశ్వరుని కృపాభిక్షే కానీ వేరుకాదు '' అన్నాడు నెమ్మదిగా రత్నాదిత్యుడు

''పరమేశ్వరుని కృపా, క్షత్రియ సాహసం కూడా'' అన్నాడు భీమదేవుడు సగర్వంగా ''మనకు ఓటమిలేదు మనది ధర్మయుద్ధమయ్యా!''

''ధర్మం ఉన్నచోట విజయం తథ్యం'' అని నవ్వుతూ గురుదేవుడు కోట దిగి వెళ్ళిపోయాడు

దూరాన ఒక విచిత్ర ధ్వనితో ఒక యుద్ధ వాద్యం వినిపించింది తరువాత అక్కడక్కడా కొమ్ము వాద్యాలు మ్రోగాయి మ్లేచ్ఛసైన్యం మధ్యగా దారి ఏర్పడ్డది ఆ దారినుంచి అమీరు ముందుకు నడిచాడు యుద్ధభేరీలతో యాభై గుఱ్ఱాలు ఇరువైపులా నడిచాయి వాటి మధ్య ముప్పై నలభై ధనుర్ధారులైన అశ్వికులు నడిచారు వారిలో అందరికీ ముందు నల్లని పెద్ద గుఱ్ఱాన్ని ఎక్కి పచ్చని తలపాగాతో ఎఱ్ఱబారిన పొడుగు పాటి గడ్డంతో ప్రచండ శరీరంతో అమీరు వచ్చాడు అతని ప్రక్కనే బంగారుతో చేసిన షష్ఠి చంద్రాకృతిగల చిహ్నాలతో అశ్వికులు గుఱ్ఱాలను కదనుత్రొక్కిస్తూ నడుస్తున్నారు

నలువైపులా వ్యాపించిన ఈ అసురశక్తిని చూడగానే భీమదేవుని ప్రతి రక్తనాళమూ క్రోధాగ్ని జ్వాలలను వెళ్ళగ్రక్కింది తలపై ఇనుప గదతో కొడుతున్నట్లు తోచింది భీమదేవుడు ఎగిరి ఒక్క గంతులో చావడా పట్టుకొని నిల్చున్న ఉత్తమాశ్వం మీద ఎక్కి రికాబుల్లో కాళ్ళుంచి నిల్చుని అన్నివైపులా సన్నద్ధులైయున్న సైన్యాలను పరికించారు

''మహాయోధులారా! నా గౌరవం, అనహిలవాడ గౌరవమేకాదు- సాక్షాత్తు సోమనాథుని గౌరవం రక్షించే భారం మీ చేతుల్లో ఉంది అదుగో! స్వర్లోకపు సువర్ణ ద్వారాలు తెరచుకొని ఆహ్వానిస్తున్నాయి ఒక్కొక్క వీరుడు వేలకొలది కంఠాలను తెగనరకాలి వెనుకంజ వేసినవాడు క్షత్రియ జన్మను అవమానపరచినట్లే సుమా! జాగ్రత్త! సిద్ధంకండి!''

రత్నాదిత్యుడు కూడా హర్షాతిరేకంతో ఎగిరి తన గుఱ్ఱాన్ని ఎక్కి, కత్తిని పైకెత్తి 'భీమదేవమహారాజుకీ జయ్' అని దిక్కులు పిక్కటిల్ల జయధ్వానం చేశాడు

సైన్యంలో ఈ ధ్వని ప్రతిధ్వనించింది భీమదేవుడు కొంచెం ఆగి, చిరునవ్వుతో తిరిగి కత్తిని పైకెత్తి ఝుళిపిస్తూ ప్రళయభీకరంగా 'జయ్ సోమనాథ్' అని గర్జించాడు ఆ గర్జన వేలకొలది కంఠ కుహరాలలో మారుమ్రోగి అమీరు సైన్యానికి ఎక్కడో భయంకర మేఘమాలికలు ఒక్కటై గర్జిస్తున్నట్లు వినిపించాయి

అమీరు గడ్డం నివురుకుంటూ కోటను చూస్తూ నిలుచున్నాడు తన జైత్రయాత్రలో ఇలాంటి దుర్గాలను ఎన్నింటినో చూచాడు కానీ, ఈ ధామం అన్నింటిలోనూ శ్రేష్టమైనది ఇక్కడికి రావడానికి భయంకరమైన అజ్ఞాత మరుభూమిని దాటవలసి వచ్చింది అపూర్వ సాహసాన్ని దారిలో ప్రదర్శించాల్సి వచ్చింది ప్రస్తుతం తన ప్రచండ సైన్యం సిద్ధంగా ఉన్నది. ఎదురుగా భయంకర ప్రతిజ్ఞతో చిన్నారి రాజపుత్ర సైన్యం నిలుచున్నది ఒక క్షణంపాటు అతని హృదయంలో దయాభావం ఉదయించింది వేలకొలది రాజపుత్ర సైన్యాలు నాశనమయ్యాయి ఇదీ నశిస్తుంది అల్లా, పైగంబరుల దయ ఇదంతా దేనికి? అంతే ఆ మరుక్షణమే ఆ భావాన్ని అతనిలోని అసుర ప్రవృత్తి దిగమ్రింగింది

చరిత్ర పుటలో అద్వితీయుడైన జగద్విజేత అని అతడు కీర్తిని సంపాదించాలి ఈ కీర్తి మందిరానికి సోమనాథ మందిర నాశనం సువర్ణకలశ ప్రతిష్ఠాపన లాంటిది ఆ కలశ ప్రతిష్ఠాపనకు ఈ సైన్యం విఘ్నమేర్పరుస్తున్నది ఇలాంటి కాఫిరుల సేనలు తమ చావు తామే కోరి తెచ్చుకొని అతని కీర్తిని మరింత మెరిపించడానికే జన్మించాయి అతని కన్నులు తళతళ మెరిశాయి వెంటనే గంభీరధ్వనితో 'అల్లాహో అక్బర్' అని గర్జించాడు ప్రక్కనున్న దుందుభులు అతని ఆదేశాన్ని మహాధ్వనులతో మారు పలికించాయి నలువైపులా 'అల్లాహో అక్బర్' అనే ధ్వని వ్యాపించింది ప్రతి దళంలోనూ దుందుభులు మ్రోగాయి సైన్యమంతా ఆకలిగొన్న ఒక మహా భయంకరమైన కొండచిలువలా శాంతంగా, నిశ్చయంతో ప్రభాస దుర్గాన్ని కబళించడానికి ముందుకు నడిచింది

**4**

మధ్య ద్వారానికి పైగా బురుజు మీద నిల్చుని భీమదేవుడు ఆ వస్తూన్న మానవ కూర్మాల సమూహాన్ని చూస్తున్నాడు 'అశ్వికులు సమీపిస్తే బాణాలతో చెండాడండి తాబేళ్ళ మీద వృథాగా ప్రయోగించవద్దు' అంటూ గుఱ్ఱం దిగాడు

'విమలా-విమలా!' అని పిలిచి 'వీరా! పరుగెత్తి విమలుణ్ణి వెదుకు బండరాళ్ళతో మనుష్యులను కోటపైకి తీసుకురమ్మని చెప్పు ఆ తాబేటి సైనికులు నీళ్ళలో దిగగానే వాళ్లను నీటిలో ముంచివేయాలి' అని అరిచాడు

చావడా భీమదేవుని గుఱ్ఱాన్ని ఎక్కి విమలుణ్ణి వెదకడానికి వెళ్లాడు మహారాజు తన వింటిని అందుకున్నాడు

'నేను బాణం వదలగానే ఒక్కసారి అంతా వదలండి తాబేటి సైనికులపై కాదు, రౌతులపైనా కాదు, గుఱ్ఱాలమీద '

తాబేటి సేనలు నేలమీద పాకుతూ పురోగమించాయి వెనుక అశ్వదళాలు వాటి వెనుక గజసేన నడిచింది బాణం రాగలిగేంత దూరం వరకూ రాగానే ఒక్కసారిగా బాణాలు వదిలారు గుఱ్ఱాలను మడిమ తాపులతో ముందుకు నడిపించారు తాబేటి సైనికులు లేచి నిల్చుని పరుగెత్తనారంభించారు ఈ మూడు క్రియలూ ఒకేసారి జరిగాయి

భీమదేవుడు కూడా బాణం వదిలాడు వెంటనే వేలకొలది బాణాలు విండ్లనుంచి వెలువడ్డాయి వందలకొలది గుఱ్ఱాలు దెబ్బతిన్నాయి కొన్ని అక్కడే పడిపోయాయి మరికొన్ని పంక్తుల బైటపడి చచ్చాయి కోట మీది విలుకాండ్లలో కూడా అనేకులు దెబ్బతిని పడిపోయారు మిగతా వాళ్ళు తమ వాహనాలను పదిల పరచుకొని అమీరు అశ్వాలను చెండాడడానికి ప్రయత్నం సాగించారు

మ్లేచ్ఛుని అశ్వదళం చెదిరిపోయింది వెంటనే గజసైన్యం నిలిచింది కోటమీది సైనికులకు, ఏనుగులపై బాణాలు వేయడమా వద్దా అనే అనుమానం కలిగింది తాబేటి సైనికులు గజాశ్వదళాల రక్షణ లేకుండానే అగడ్తవైపు నడిచారు

ఈ వార్తవిని అమీరు పరుగెత్తుకుంటూ వచ్చి త్వరితమైన ఆజ్ఞలతో మరో అశ్వదళాన్ని తాబేటి సేనకు సహాయం చేయడానికి నియోగించాడు

రెండు వైపులా శరపరంపరగా కురిశాయి భీమదేవుడు, అతని సైనికులూ విడిచిన ఒక్కబాణమూ వృధా కాలేదు ఏ గుఱ్ఱపుపొట్టో, ఏ సైనికుని అరక్షిత శరీరభాగమో, ఏసైనికుని వీపో కన్పించనే కన్పించేది చూస్తూ చూస్తూనే గుజరాత్ వీరుల బాణాలు వారిని చెండాడేవి మహారాజు ఇటూ అటూ వెదికి ఎవరో ఒక సేనని చూచి ఒకే బాణంతో నేల పడగొడుతుండేవాడు దూరాన ఉన్న ఏనుగులు కూడా ఆయన బాణాలను తప్పించుకోలేకపోయాయి అలా తాబేటి సైనికులు మరీ ముందుకు వచ్చినప్పుడు చూస్తే ఈ దళానికి వెనుక నిచ్చెనలతో వస్తున్న గజసేనకు చాలా దూరం ఏర్పడ్డది

ఒక మ్లేచ్ఛసేనాని ఇది చూచి రాబోయే సంకట పరిస్థితిని గుర్తించాడేమో వేల సంఖ్యలో అశ్వికులకు నిచ్చెనల నిచ్చి ముందుకు నడిపించాడు ఒకటి రెండు ఏనుగులు కూడా ముందుకు వచ్చాయి బాణవర్షం కురుస్తున్నా, అనుభవజ్ఞులైన యోధులు పురోగమిస్తూనే ఉన్నారు కొన్ని నిచ్చెనలు తాబేటి సైనికులకు ఇచ్చారు

'తాబేటి సైనికుల మీద బాణాలు వేయవద్దు జాగ్రత్త! వ్యర్థమైపోతాయి అశ్వికులనే చంపండి' అని భీమదేవుడు తిరిగి ఆజ్ఞాపించాడు

అమీరు అశ్వసేన కూడా చాలా సమీపానికి వచ్చి బాణాలు వదలడం మొదలుపెట్టింది ఎందరో రాజపుత్రులు నేలకొరిగారు భీమదేవ మహారాజు ఆంతరంగిక సైనికులు పొడుగుపాటి ధనుస్సులతో ఇటూ అటూ తిరుగుతూ వీరవిహారం చేస్తున్నారు

వీరందరిలోనూ భీమదేవుని చేతులు అలసిపోవడం అంటూ లేకుండా పరంపరగా బాణాలను వదులుతున్నాయి ఆ గురికి చెదరడం అంటూ తెలియదు తాబేటి సైనికులు ఒక చేత్తో నిచ్చెన, మరో చేత కొయ్య పట్టుకొని నీటిలోకి దూకారు

'విమలా, విమలా!'

'వచ్చాను స్వామీ!'

'రాళ్ళు తెచ్చావా?'

'తెచ్చాను '

'తాబేటి సైనికులపై బాణాలు వేయకండి వృధా అవుతాయి దారి దారి ' అంటూ భీమదేవుడరిచాడు చావడా చేతికి విల్లునిచ్చి, ప్రక్కనున్న సైనికుని చేతులందున్న రాయి తీసుకొని గురిచూచి నీళ్ళలోకి విసిరికొట్టాడు ఆ రాయి అనుకున్న చోటికి నేరుగా పోయి తాబేటి సైనికుని కవచం మీద ఒక ప్రక్కన తగిలింది వెంటనే అతడు బిగ్గరగా అరుస్తూ నీళ్లలో మునిగి అణగారిపోయినాడు ఇది చూచి మిగతా సైనికులు రాళ్ళతో తాబేటి సైనికుల్ని ముంచ నారంభించారు

ఈ తుముల యుద్ధం చాలాసేపు నడిచింది కొత్త కొత్త తాబేటి సైనికులు వచ్చి అగడ్తలో అణిగిపోనారంభించారు ఎన్నోసార్లు రాళ్ళ గురి తప్పించుకొని అగడ్త దాటి ఒకళ్ళిద్దరు కోటగోడను సమీపించగలిగేవాళ్ళే కానీ, ఇంతలో రాజపుత్ర బాణాలు వారి గుండెలను రెండుగా చీల్చివేసేవి అశ్వికులు కోటపైకి బాణవర్షం కురిపిస్తూ చాలా ముందుకు వచ్చేవాళ్ళు జారిపడో, లేక పైనుంచి వస్తూన్న రాళ్ళ వర్షానికి ఆగలేకనో వెనుకకు పరుగెత్తేవాళ్ళు పైన కోట గోడమీద కూడా చాలామంది బాణాలకు గురి

అయినారు వారిలో కొందరు గాయపడ్డా ఇంకా ఇంకా బాణాలు వదులుతూనే ఉన్నారు మరికొందరు చస్తూ చస్తూ రాయి విసిరి ఒక్కణ్ణైనా చంపందే పడిపోక పొయ్యేవాళ్ళు

భీమదేవుడొక ఘడియ గుఱ్ఱంమీద అటుయిటు తిరుగుతూ, సైనికులను ఆదేశిస్తూ, రాళ్ళు విసురుతూ, బాణాలు వదులుతూ, 'జై సోమనాథ్' అనే నినాదంతో సైనికుల హృదయాలలో ఉత్సాహ తరంగాలను వెల్లార్చుతూ తిరుగుతున్నాడు ఎక్కడ అతని అరుణ శిరోవేష్టం అంచులు పైకెగురుతూండేవో అక్కడ సైనికులు నూతనప్రాణంతో యుద్ధం చేస్తుండేవారు శత్రుబాణాలు ఆ అరుణ శిరోవేష్టం చుట్టూ తిరిగి, స్పర్శించనైనా శక్తిలేక నేలకు పడిపోయేవి నఖశిఖ పర్యంతం ఆయన బంగారు కవచాన్ని ధరించాడు నడుమున కాషాయవర్ణపు ధట్టీ బిగించి వుంది దానిలో రత్నఖచిత ఖడ్గం వ్రేలాడుతున్నది ఆరుగురు మనుష్యులు ఎప్పుడూ నిండుగా వున్న అమ్ములపొదులతో ఆయన వెనుక ఉంటూ అలుపెరుగని అతని చేతులకు బాణాలను అందిస్తుండే వాళ్ళు అతని చేతిలో మహాలక్షణాలు ఉన్నాయి అందుకే బాణం వదిలితే ఏదో తల తెగిపడ్డదన్నమాటే

అటు మందిర శిఖరం మీద గంగ, చోళా లిద్దరూ భయంతో ఒకరి నొకరు అంటిపెట్టుకొని భీమదేవుని తలపాగా కుచ్చువైపే ఏకగ్రీవంగా చూస్తూ కూర్చున్నారు 'అదుగో చచ్చె చచ్చె ' 'అరె అరె ' 'అమ్మో అదిగో ఇంకేముంది' అని అప్పుడప్పుడు ఇద్దరి నోళ్ళలోంచి వెలువడుతుండేది తలపాగా చూపు కందనపుడు చోళా గంగను గట్టిగా కౌగలించుకొని కండ్లు మూసుకొనేది తలపాగా పైకి కన్పించడంతోటే ఆమె హృదయం కూడా ఎగిరి గంతులేసేది భీమదేవుడు బాణాన్ని సంధించి వదులుతున్నప్పుడల్లా ఆమె పాదాలు నర్తించేవి ఆమె ప్రాణాలూ, చూపులూ తలపాగాను ఆశ్రయించుకొని ఉన్నాయి ఆ తలపాగా పడిపోవడంతోటే అవీ పడిపోవడానికి సిద్ధంగా ఉన్నాయి ఇంతలో గురుదేవుడు వెనుక నుండి వచ్చాడు ఆయన కూడా కొద్ది సేపటి నుంచి భీమదేవుని శౌర్య పటిమను చూస్తున్నారు

''గురుదేవా!'' అంటూ నమస్కరించి, ''మహారాజు శ్రీరుద్రావతారులే కదూ?'' అడిగింది చోళా

గురుదేవుడు నవ్వుతూ- ''అవునమ్మా! అవును. అనుమానం దేనికి?'' అని త్రిపురసుందరిని పూజించడానికి వెళ్ళిపోయాడు.

5

పూజ నిమిత్తం గురుదేవుడు వెళ్ళినప్పుడు ఆయన హృదయంలో కొంత శాంతి ఏర్పడింది భీమదేవుని శౌర్యాన్ని గురించి చాలా విషయాలు వినడమేకాని నేడే ప్రత్యక్షంగా ఆయన చూచింది ఇంత గొప్ప వీరుడని ఆయన ఊహించనైనాలేదు తరువాత ఆయన రెండు సేనల బలాలను పోల్చాడు అమీరు సేన ఊహించినదాని కంటే అనేక రెట్లు ఎక్కువగా ఉంది భీమదేవుని బలంకూడా అనుకున్నదానికంటే ఎన్నో రెట్లు మించి ఉన్నది ఇదంతా పరమేశ్వరుని అనుగ్రహమేనని ఆయన భావించాడు

త్రిపురసుందరి మందిరాన్ని చేరుకోగానే ఆయనకు ఆశ్చర్యమైంది ఎవరో బయట తాళం పగులగొట్టి తలుపులు తెరిచారు హరదత్తుని పనే ఇది అనుకుంటూ ఆయన లోపలికి ప్రవేశించాడు గర్భద్వారాన్ని కూడా తెరిచారు ఎవరో కావాలనే ఆయనను తిరస్కరించారు

గర్భద్వారాన్ని సమీపించగానే అక్కడ దేవీపూజ చేసి, మాంస మద్యాలను నైవేద్యం పెట్టి, ధ్యానించడానికి కూర్చున్న శివరాశి కన్పించాడు సర్వజ్ఞుడు అక్కడే స్తంభించి నిలుచున్నాడు తన ఆదేశాన్ని ఇలా- అందులో ప్రధాన శిష్యుడే- తిరస్కరించడమా? ఆయన కలలోనైనా దీనిని ఊహించి ఎరుగడు అలా ద్వారంలో ఒక క్షణం నిల్చున్నాడు శివరాశి ఉన్మత్తుడు కాలేదు కదా!

కొద్ది క్షణాలు ఆయన ఏమీ మాట్లాడలేదు తరువాత కాస్సేపటికి శివరాశి కన్నులు తెరచి మహాభయంకరంగా, దుర్మార్గాన్ని వెలిగ్రక్కే చూపులతో గురుదేవుణ్ణి చూచాడు గురుదేవుడు వాడిపోయిన ముఖంతో శాంతంగా చిరునవ్వులు వెలయిస్తూ చూస్తున్నాడు జీవితాంతంవరకు గురువు ఆదేశాన్ని పాలిస్తానని స్వయంగా స్వీకరించిన ధర్మాన్నే త్యజించినవాణ్ణి ఏమంటే ఏమి లాభం? ఇది పశు లక్షణమైనా కావాలి లేక రోగ చిహ్నమైనా అయుండాలి దీనికి మందు దయచూపడం- లేదా - సేవ చేయడం ఇలా భావిస్తూ ఆయన అలా మౌనంగా నిలుచున్నారు

శివరాశి ఇంకా క్రౌర్యంగా గురువును చూచాడు

'మీరేమి చెప్పదలచుకున్నారో చెప్పండి' అన్నాడు శివరాశి

'చెప్పడానికి ఏమీ లేదు.'

నేనే తాళాలు పగలగొట్టాను త్రిపురసుందరిని పూజించాను

'మంచిదే ఈరోజు నాకు శ్రమ తగ్గింది ' అన్నాడు శాంతంగా గురుదేవుడు ప్రదర్శిస్తున్న ఈ శాంతభావంతో శివరాశి విసిగి క్రుద్ధుడైనాడు 'నిన్నటి నుంచి మీ గురుత్వాన్ని నేను వదిలిపెట్టాను '

'నీలాంటి శిష్యునికి నేను గురువుగా ఉండ తగనని ఎప్పుడో గ్రహించా '

'ఈ రోజు నుంచి' అంటూ మండిపడుతూ లేచి, 'పాశుపత మతాచార్య పదవిని నేను తీసుకున్నాను' అన్నాడు శివరాశి

'గురు పదవి తీసుకుంటే వచ్చేది కాదు పారంపర్యంగా ప్రసాదిస్తే లభించేది '

వెనుకనుంచి సిద్ధేశుడు హరదత్తాది మిగతా బైరాగులను తీసుకొని వచ్చాడు అందరూ వీరి వెనుక నిల్చుని సంభాషణ వింటున్నారు వాళ్ళు కనిపించగానే శివరాశికి ఇంకా ఉత్సాహమధికమయింది

'మీరు నాకు గురువులు కాదు నాకు మీరీ పదవి నివ్వనక్కరలేదు, మీ రెప్పుడో పతితులయినారు పాశుపత మత సిద్ధాంతాలను మంట గలిపారు మహామాయ పూజలను భంగపరచారు '

'ఇంకా '

'మీరే మహామాయ మందిరాన్ని మూయించారు ఆమె పూజను సగంలో ఆపారు మీ గొప్పకొరకు దేవి ఆవేశించిన వ్యక్తిని భీమదేవునికి సమర్పించారు '

'ఇంకా '

'మీ ఆదేశం వల్లనే ఆ దుష్టుడు మహాశక్తి అవతారాన్ని భ్రష్టమొనర్చి ఈ పుణ్యధామాన్ని ఘోర నరకంలో పడత్రోసాడు ఓరి ముసలీ! ఇక నీకు ఒక్క క్షణం బ్రతికేందుకైనా అధికారం లేదు '

గురుదేవుడు ఊరుకుంటే చాలు శివరాశి ఉత్సాహం ఎక్కువయ్యేది అతని ముఖం శపించబోయే దుర్వాసుని ముఖంలా జేవురించింది

'నాయినా! నీవు మాట్లాడే మాటలు వింటుంటే ఒక్కక్షణం బ్రతికే అధికారం కూడా లేదని నాకూ అనిపిస్తూనే ఉన్నది కానీ నేను జీవించి ఉన్నంత వరకు ముప్పైమూడు కోట్ల దేవతలు కలిసినా ఈ పదవిని తీసుకోలేరు '

'ఓరీ ముసలీ! నీ గురు పదవిని ఎప్పుడో నీవు పోగొట్టుకున్నావురా!'

'నాకూ నీలా తపోగర్వం, జ్ఞానగర్వం వస్తే అప్పుడే పదవిని కోల్పోతా '

'నీవు పోగొట్టుకున్నావు పోగొట్టుకున్నావు ఇక నేను ఈ పదవికి ఉత్తరాధికారిని పోరా! పో నీ రాజ్యకాలం గతించింది పో '

'మూర్ఖుడా! నేనీ పదవి కోల్పోయినా దీని ఉత్తరాధికారి గగనరాశి ఖంభాతంలో ఉన్నాడు అతను వెళ్ళేటప్పుడు నలుగురు రాజులను కూర్చోబెట్టి, వారి సమక్షంలో అతనికి ఆచార్య పదవికై పట్టాభిషేకం చేశాను లకులేశ దేవుల పాదుకలు, బాణాలు ఇచ్చాను '

వృద్ధుడు శివరాశిని ఏడ్పించాడు పాపం శివరాశి దిగ్భ్రాంతుడై క్షణంపాటు నోరు మెదపలేక పోయినాడు

'శివరాశీ! పాశుపత మతాచార్య పదవి సమస్త ప్రపంచానికీ గురుపదవిగా విరాజిల్లేది తపస్సు, జ్ఞానం, భగవద్భక్తి ఉన్నవారికే అది ప్రాప్తిస్తుంది మూఢాభిమానంవల్ల కామేచ్ఛను ఈశ్వరేచ్ఛగా భావించినందువల్ల లభించదు '

'ఓరీ వృద్ధుడా! నీ పదవి నాకక్కరలేదు నీ భీమదేవునిపై మహామాయ మూడవకన్ను తెరిచింది నీ చావు నెత్తిన నిలుచున్నదిరా '

'నేను మరణించినా గగనరాశి నీలాంటి వారి నుండి పాశుపత మతాన్ని ఉద్ధరించగలడు ' అంటూ నెమ్మదిగా మందిరం బైటికి నడిచాడు సర్వజ్ఞుడు

ఆయన బైటికి వెళ్తున్నప్పుడు హరదత్తుడు ఆయనపై ఉమ్మివేశాడు సర్వజ్ఞుడు నవ్వుతూ వెనక్కుతిరిగి 'నన్ను రెచ్చగొట్టాలని చూస్తున్నావా పిచ్చివాడా! నీలాంటి పసిపిల్లలను నేను - మీ గురువు నైన నేను నడిపించకపోతే మరెవ్వరు నడిపించేది?' అంటూ దయార్ద్రదృష్టితో వారందరినీ చూస్తూ, భిన్న హృదయంతో వెళ్ళిపోయాడు

## 6

జునాగఢ ద్వారం దగ్గర పరిస్థితి చాలా విషమించింది ఆబూ నరపతి, యువకుడగు పరమారుడు భీమదేవుని ఆదేశం చొప్పున మొదట ద్వార సంరక్షణ చేస్తూ అశ్వికులను నురుమాడాడు కానీ ఇటువైపు నిపుణులైన కవచధారులగు సైనికులు లేనందువల్ల శత్రుసైనికులు వీరిని చాలా వరకు పడగొట్టారు పైగా రాళ్ళను ఉపయోగించే భీమదేవుని ఉపాయం ఇక్కడ అనుసరింపబడలేదు ఫలితంగా శత్రువులు సునాయాసంగా ముందుకు వచ్చేశారు తాబేటి సైనికులు అనుకున్న సమయానికి నీటిలో ఈదనారంభించారు వెనుకనున్న అశ్వికులు కోటపై నున్న సైనికులతో యుద్ధం చేస్తూ వాళ్ళను నిరోధించి ఉంచారు గజదళం వేళకు ముందుకు నడిచి తాబేటి సేనకు నిచ్చెనలు అందిచ్చింది. కోటమీద మోకాళ్ళపై కూర్చున్న సైనికులు ఈ తాబేటి సైనికులను వధించడానికి ప్రయత్నించారు. కానీ దృఢమైన లోహ కవచాలకు తగిలి అనేక బాణాలు వృధా అయ్యాయి

పరమారుడు సైనికులను ఉత్సాహపరచడంలో కానీ, సాహసాన్నీ, శౌర్యాన్నీ ప్రదర్శించడంలోకానీ కొంచమైనా వెనుకంజ వేయలేదు. అతని సైనికులు కూడా విసుగు

లేకుండా కష్టపడ్డారు ఎందరో ఈ భగవత్కార్యం కొరకు తమ నిండు ప్రాణాలను బలి చేశారు ఇంత చేసినా తాబేటి సైనికులు అగడ్త దాటి కోటగోడకు నిచ్చెనలు వేయ నారంభించారు అశ్వికులు నీటిలో దిగి వీరికి సహాయం చేయడానికి ప్రయత్నించారు ఏనుగులు ఆ ఒడ్డున వచ్చి స్థిరంగా నిలుచున్నాయి వాటి పైన ఉన్న విలుకాండ్రు కోటపై నున్న సైనికులను చిందరవందరగా చేసి నొప్పించడం మొదలుపెట్టారు అదృష్టవశాత్తు అమీరు సేనలు కోట మధ్య ద్వారాన్ని ఎదిరించాయి అందుకని అమీరు అతని సేనాపతులు అక్కడే తమ దృష్టిని కేంద్రీకరించారు కనుక జునాగఢ ద్వారం వైపు లభించిన సౌకర్యాన్ని వాళ్ళు వినియోగించుకోలేకపోయారు

''పరుగెత్తు నాయకా'' అని పరమారుడు ఒక విశ్వాసపాత్రుడైన సేనానితో చెప్పాడు ''పరుగెత్తి మహారాజుకు, రత్నాదిత్యునికి చెప్పు సైన్యాన్ని పంపమని, లేకపోతే మధ్యాహ్నానికి ఈ ద్వారాన్ని శత్రువులు ఆక్రమిస్తారని చెప్పు పో!''

''సరే స్వామీ!'' అంటూ ఆ సేనాని ఈ వార్తను తెలపడానికి గుర్రాన్ని ఉరికించాడు

భీమదేవునికి ఈ వార్త తెలిసినప్పుడు ఉభయపక్షాలూ మధ్య ద్వారం దగ్గర పేరుకు మాత్రమే యుద్ధం చేస్తున్నాయి ఆక్రమణ తీవ్రత కొంత తగ్గింది ప్రభాస సేనల వీరతాండవం కూడా కొంత తగ్గింది

కొత్త అశ్వికులను పంపడం ఆగింది కొత్త తాబేటి సేనలు వస్తూ ఆగిపోయాయి. దాదాపు మూడు వందల మంది అగడ్తలో చికాకు పరుస్తున్నారు పైనుంచి ప్రభాస సైనికులు రాళ్ళు విసిరి వారి ప్రాణాలను కబళిస్తున్నారు అంతవరకూ కోటకు ఒక్కడు కూడా నిచ్చెన వేయలేక పోయినాడు

''విమలా! నీ విక్కడ జాగ్రత్తగా ఉండు జునాగఢ ద్వారం వేపు వెళ్తున్నా నేను అక్కడ పరమారుని స్థితి విషమంగా ఉంది ఇటువంటి ధనుర్ధారులైన సైనికులు సగం మంది నాతో రావాలి ఇది శత్రువులకు తెలియకూడదు '' అంటూ శత్రువులను మోసం చేయడానికి విమలుని తలపై తన తలపాగా పెట్టి అతని శిరస్త్రాణాన్ని తాను ధరించి పరమారునికి సహాయపడేందుకు పరుగెత్తాడు భీమదేవుడు

రత్నాదిత్యుడు కూడా ద్వారకా ద్వారం దగ్గర మహా వ్యవస్థను నెలకొల్పాడు. అతని జాగ్రత్తకు సౌరాష్ట్ర సైనికుల గురితప్పని విలువిద్య తోడై శత్రు సైన్యాన్ని కదలనివ్వలేదు అందుకని పరమారుని సందేశం రావడంతోటే మూడువందల మంది విలుకాండ్రను తీసుకొని జునాగఢ ద్వారానికి పరుగెత్తారు

అక్కడి పరిస్థితి విషమించింది ఈదుతూ అయిదువందల మంది అశ్వికులు ఒక వ్యూహాన్ని పన్నారు వారందరూ కలిసి ఒక జీవితనౌకనే నిర్మించారు తాబేటి సైనికులు వారిపై ఎక్కి గోడలకు నిచ్చెనలు వేయడానికి ప్రయత్నిస్తున్నారు అగడ్త అవలిగట్టు నుంచి ఏనుగులపై నున్న సైనికులు విడిచే బాణాలను తప్పించుకుంటూ, తిరిగి ప్రతిక్రియ చేయడం కోట పైనున్న సైనికులకు అసంభవమైపోయింది పైనుంచి ఎన్ని బాణాలు వర్షిస్తున్నా అనుభవజ్ఞులైన తాబేటి సైనికులూ, అశ్వికులూ కలిసి తెప్పలతో ఒక వంతెన లాంటిది నిర్మించారు చూస్తూ చూస్తూనే అగడ్తపైన వంతెన ఏర్పడింది కొత్త సైనికులు వచ్చి అగడ్త దాటి తాళ్ళతో ఈ వంతెనను తలుపుకున్న ఇనుప సలాకులకు కట్టి గట్టిపరచారు నిచ్చెనలు వేశారు కవచాలు తీసి సైనికులు పైకెగబ్రాకటం ప్రారంభించారు శత్రుసేనల్లో ఉత్సాహం ఇనుమడించింది కోటపైన నియకాంద్రు కుప్పలుగా కూలి పోతున్నారు

పరమారుడు కూడా మహోద్భుత శౌర్యాన్ని ప్రదర్శించాడు ఆ వంతెనను ముంచడానికి చాలా ప్రయత్నించాడు స్వయంగా ఎందరినో సంహరించాడు కానీ క్రమేపీ క్షీణిస్తూన్న అతని సైన్యం అక్కడ సరిపోలేదు ప్రతి నిముషానికీ 'భీమదేవులు ఏరీ?' అని అడుగుతుండేవాడు తన మిత్రుడూ, తన ఆదర్శమూ అయిన భీమదేవ మహారాజు వచ్చేంత వరకూ ద్వారాన్ని కాపాడగలిగితే చాలునని మాత్రమే అతని ఏకైక వాంఛ ద్వారం పైన నిల్చుని ఎందరినో తాబేటి సైనికులనూ, రౌతులనూ చంపాడు కానీ ఒకడు చస్తే నలుగురు పుట్టుకొని వస్తున్నారు చివర కతడు పెద్ద గదను తీసుకొని బురుజు మీదికి ఎక్కాడు అతని కవచం అపరాహ్ణ సూర్యుని కాంతికి ధగధగమని మెరుస్తున్నది అతని మీద బాణాల వర్షం కురుస్తున్నా బురుజు చివర నిల్చుని పైకెగబ్రాకుతూన్న సైనికులను గదతో నుగ్గు నుగ్గుగా చావమోదడం ఆరంభించాడు

పరమారుని ప్రతాపం అతని సైనికుల్లో కొత్త ప్రాణాన్ని నింపింది కొందరు సైనికులు ద్వారమ్మీద నిల్చొని అతనికి సాయపడుతున్నారు గజదళ సైనికులు కూడా ఇటే బాణాల వర్షం కురిపిస్తున్నారు దుర్గంలో మిగతా భాగాల కంటే ఎక్కువ భయంకర యుద్ధం జరిగింది ఇక్కడే ఇంతలో ఘోరమైన ప్రమాదం ఏర్పడింది నూర్గురు తాబేటి సైనికులు మెట్లనెక్కి పైకి వస్తున్నారు ద్వారం మీద ఇరవై ఐదుగురు కవచధారులైన సైనికుల మధ్య పరమారుడు ఊగిపోతున్నాడు ఎదురుగా శత్రువుల బాణాలు రివ్వున వస్తున్నాయి క్రింద ఒక తాబేటి సైనికుడు చస్తే, పై నుంచి ఎవరో ఒకరు గాయపడి అగడ్తలో పడుతూనే ఉండేవాడు ''భీమదేవ మహారాజా! వేంచేయండి, త్వరగా వచ్చి ఆదుకోండి ''

పరమారునికి ఏమీ తోచలేదు రాక్షసునిలాంటి ఒక కాకేషియన్ వీరుడు కవచంతో తనను కాపాడుకుంటూ మెట్లు ఎక్కాడు ఇక ఒక్క క్షణం ఆలస్యం అంతే ఆ వీరుడు కోట బురుజు వరకూ రానే వచ్చాడు ఒక్క గంతులో అతను పైకి చేరాడు క్రింద మరో వంతెన తయారవుతున్నది మరికొన్ని నిచ్చెనలు వేస్తున్నారు చాలా ప్రమాదమైన పరిస్థితి పరమారుడు ''జైసోమనాథ్'' అని గర్జిస్తూ కోటపైన కాళ్లు పెట్టిన వీరుణ్ణి క్రిందికి త్రోసెయ్యాలని ప్రయత్నిస్తున్నాడు కానీ వెనుకనుంచి పైకి నిచ్చెన మెట్లు ఎక్కుతున్న ముగ్గురు తాబేటి సైనికులు అతణ్ణి రక్షిస్తున్నారు

ఇంతలో బాణం రివ్వున వచ్చి పరమారుని మెడలో గుచ్చుకున్నది వెంటనే అతని కొక భావం స్ఫురించింది పరమారుడు తనను మృత్యుముఖానికి అర్పించాడు అతడు ప్రచండకాయుడైన శత్రుసైనికుణ్ణి గట్టిగా రెండు చేతుల్తో అదిమిపట్టుకొని ''జైసోమనాథ్'' అని ఆఖరుసారి విజయ నినాదంతో గర్జించి అగడ్తలో పడడానికి ప్రయత్నించాడు ఊహించని విధంగా పైబడ్డ ఈ బరువువల్ల ఆ సైనికుని కాళ్ళు చలించాయి ఒక నిమిషంసేపు వారిద్దరూ గాలిలో అలా ఊగులాడారు తరువాత పడిపోయారు పడిపోయేటప్పుడు పరమారుడు ఒక కాలిని నిచ్చెన మెట్టుకు తగిలించాడు ఒక నిముషంలో ఒండొరుల కౌగిలిలో పరమారుడూ, యవన సైనికుడూ, మెట్ల మీదుగా ఎగబ్రాకుతున్న మిగతా సైనికులూ ఒక్కసారిగా అగడ్తలో పడి మునిగిపోయారు వంతెన కదలిపోయింది తాబేటి సైనికులు నీటిలో పడిపోయారు కవచహీనమైన వారి శరీరాలను పైనుంచి రాజపుత్రులు వదిలే బాణాలు చెండాడనారంభించాయి పరమారుడు తన ప్రాణాలు అర్పించి జునాగఢ ద్వారాన్ని కాపాడాడు

## 7

పరమారుడు పడిపోగానే సైనికుల్లో హాహాకారాలు వ్యాపించాయి ఆ క్షణమే భీమదేవుడు సైనికులతో వచ్చాడు పరమారుడు పడిపోవడం వంతెన కదలడం, క్రింద నీటిలో తాబేటి సైనికులు రౌతులూ, కొయ్యలూ కదలిపోవడం చూచాడు పరమారుడు అతని శిష్యుడు భీమదేవునికి అతనిపై పుత్రునికంటే ఎక్కువ వాత్సల్యం, మిత్రునిపై కంటే ఎక్కువ నమ్మకం తన యిష్టంవల్లనే వృద్ధమాతాపితరులను, నవ పరిణీత యైన భార్యనూ వదిలిపెట్టి యుద్ధంలో పాల్గొనడానికి వచ్చాడు ''భీమదేవా

భీమదేవా '' అని తపిస్తూ తన కొరకు, తన అనహిలవాడ కొరకు, పరమేశ్వరుని కొరకు మృత్యువునోట పడిపోయాడు మహారాజు అంతా మరచిపోయాడు ప్రేమపాత్రుడైన పరమారుని మధుర స్నేహమొక్కటే జ్ఞాపకం ఉన్నది ఆయన క్రిందికి చూచాడు క్రింద పరమారుడు గాయాలతోటే ఒంటరిగా కొదమసింగంలా పోరాడుతున్నాడు. ''త్రిలోచనా! ధైర్యంగా ఉండు '' అని భీమదేవుడు గర్జించి ఒక గంతులో ఎగిరి త్రిలోచనపాల్, పరమారుడు వందమంది నెదిరించి పోరాడుతున్న చోట దూకాడు ఈ సాహసం చూచి అందరూ గజగజలాడిపోయారు కానీ అనహిలవాడ సైనికులు తమ ప్రభు రక్షణ కొరకు మృత్యువుతో చెరలాటలాడగలరు అలా ఒకరి తరువాత ఒకరుగా ఇరవై ఐదుగురు యోధులు భీమదేవుని తరువాత అగడ్తలో దూకారు మిగతా వాళ్ళంతా ఒడ్డున ఉన్న ఏనుగులను, విలుకాండ్రను తెగనరకడంలో లీనమైనారు క్రింద అగడ్తలో భీకరమైన యుద్ధం జరిగింది భీమదేవుడు దూకుతూనే పరమారునిపై దెబ్బతీసిన సైనికుణ్ణి రెండు తుండులుగా నరికాడు వెంటనే రౌతు లేకుండా ప్రక్కనే వున్న ఒక గుఱ్ఱాన్ని ఎక్కాడు

''త్రిలోచనా! ఎక్కు గుఱ్ఱాన్ని ''

''ఎక్కుతున్నా మహారాజా!'' అంటూ పరమారుడు చీకట్లు క్రమ్ముకుంటూన్న చూపులతో చేతులు చాచి గుఱ్ఱాన్ని వెదకనారంభించాడు మ్లేచ్ఛ సైనికులు భయభీతులైపోయినారు నిమిషానికొకడు పైనుంచి దూకి ఎవడినో ఒకణ్ణి యమపురికి సాగనంపుతూనే ఉన్నారు నీటిలో కూడా యుద్ధం బాహాబాహీ మొదలైంది కత్తులూ, కరార్లు మెరుస్తున్నాయి కానీ ప్రభాస సైనికులు ఇరవై ఏడుగురు, అమీరు సైనికులు ఎన్నిరెట్లో అధికంగా ఉన్నారు

భీమదేవుడు ప్రదర్శించిన సాహస పరాక్రమాలు చూడగానే రత్నాదిత్యునికి కూడా రక్తం ఉడికి మహోత్సాహం శరీరమంతటా వ్యాపించింది ఆయన చాలా చతురుడు యుద్ధంలో అనూహ్యమైన ఆక్రమణే అనూహ్యమైన విజయాన్ని ప్రసాదిస్తుందని అతనికి తెలుసు అతడు అద్భుతమైన చాతుర్యాన్ని ప్రదర్శించాడు తన సైనికులను మాత్రమే తీసుకొని కోటదిగి క్రిందికి వెళ్ళి నిముషంలో ద్వారాలు తెరిచాడు. ఆయన ఏమి చేస్తున్నాడో ఎవరికీ తెలియదు బాణాలతో భయంకరమైన మారణ యజ్ఞం జరుగుతున్నందున ధనుర్ధారులైన సైనికులు ఇటు చూడలేకపోయినారు అలా దిగి రత్నాదిత్యుడు, అతని సైనికులూ కలిసి వంతెన త్రాళ్లను కోసి, వాటి మీదికి వచ్చిన సైనికులను చంపి నీట ముంచారు. పిమ్మట భీమదేవుణ్ణి ఆదుకోడానికి అగడ్తలోకి దూకారు

''జై సోమనాథ్'' అని రత్నాదిత్యుడు గర్జించాడు.

''జై సోమనాథ్'' అని మహారాజు ప్రతినినదించాడు

''జై సోమనాథ్'' అని పరమారుడు తన సర్వశక్తినీ క్రోడీకరించుకొని ఆఖరుసారి విజయనాదం చేశాడు

ఒక పావు ఘడియపాటు మానవ తరంగాలు అగడ్తలో ఎగిరెగిరి పడ్డాయి ఆయుధాలు విద్యుత్తులా మెరిసాయి వీరగర్జనలు ఘూర్ణిల్లాయి పైన మేఘాల వలె బాణాలు ఆక్రమించాయి ఈలోగా రత్నాదిత్యుడు తన అనుచరుల సాయంతో భీమదేవ మహారాజునూ, త్రిలోచన పరమారుణ్ణీ, బ్రతికి ఉన్న డెబ్బైమంది రాజపుత్ర యోధులనూ ద్వారం దగ్గరకు తెచ్చాడు

జునాగఢ ద్వారాలు ఎలా తెరచుకున్నాయో అలాగే మూసుకున్నాయి పైన దద్దా నాయకత్వాన ప్రభాస యోధులు శత్రుసేనలను బాణాలతో భేదించి నేలకు పడకొడుతున్నారు విలుకాండ్రను తరిమికొడుతున్నారు రక్తంతో తడిసి ముద్దైన పరమారుణ్ణి ఒక మూల పడుకోబెట్టి భీమదేవుడు మంచినీళ్ళు త్రాగించాడు ఆ మహావీరుడు కన్నులు తెరచి భీమదేవునిపై ప్రేమతో చూపులు నిలిపాడు ''మహారాజా! మహారాజా! '' పూడుకపోతూ నీరసిస్తున్న ధ్వనితో ప్రేమతో కరిగిపోతూ పిలిచాడు

''పరమార్! పరమార్!'' అంటూ త్రిలోచనుని గుండెమీద వ్రాలిపోయి, ''నీవు అమరకీర్తిని సాధించావయ్యా'' అని ప్రేమతో అన్నాడు భీమదేవుడు

''మహారాజా! జై సోమనాథ్'' పరమారుని స్వరం క్షీణించింది నెమ్మదిగా ''ఇ క మ హా రా జ '' అంటూండగానే మెడ ఒక ప్రక్కకు ఒరిగిపోయింది

భీమదేవుడు అతని రొమ్ముమీద వాలి విలపించాడు వెనుకనుంచి సర్వజ్ఞ గురుదేవులు వచ్చి అతని వీపును చేత్తో నిమురుతూ ''భీమా! కర్తవ్య వేదికపై బలి అయి కైలాసాన్ని చూరగొన్న వీరమూర్తి ఇతడు మన కర్తవ్యం మన బలిని కోరుతున్నది లేనాయనా నీ గాయాలకు కట్టు కడతాను'' అంటూ భీమదేవుని చేతికి తగిలిన గాయానికి సర్వజ్ఞుడు కట్టుకట్టాడు

''మీరన్నది నిజమే గురుదేవా!'' అంటూ భీమదేవుడు లేచి మిత్రుని భౌతికదేహాన్ని సర్వజ్ఞునికి అప్పగించి కోటపైకి పరుగెత్తాడు

పదునైదవ ప్రకరణం

# ఆనాటి రేయి

## 1

భీమదేవుడు చావడాతో బయలుదేరి అన్నివైపులా పర్యవేక్షిస్తున్నాడు ముఖద్వారం దగ్గర శత్రువులు వెనక్కు తగ్గుతున్నారు గజదళానికి చెందిన విలుకాండ్రు కూడా వెనుకంజ వేయనారంభించారు అశ్వికులు ఇంకా బాణాలు వదులుతూనే ఉన్నారు కానీ రాజపుత్ర యోధులు వారికి తగినట్లు సమాధానం చెబుతున్నారు

భీమదేవుడా రంగాన్ని స్వయంగా బలిష్ఠ మొనరించి విమల మంత్రికి అప్పగించి ద్వారకా ద్వారం దగ్గరకు వెళ్ళారు ఇక్కడే అగడ్తా, సముద్రమూ కలుస్తాయి ఈ రంగాన్ని సంరక్షించుకోడం చాలా సులభం యుద్ధం చాలా నిదానంగా జరుగుతున్నది రత్నాదిత్యుడు నిల్చుని ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు మహారాజు వచ్చి ఆయనను కౌగలించుకున్నాడు

''రత్నాదిత్యా! మీరు ధన్యులు ఈరోజు నాకు ప్రాణదానం చేశారు'' అన్నాడు

''అదేపాటిది స్వామీ! మీ ప్రాణరక్షణ చేసి నా కర్తవ్యాన్ని పూర్తి చేసుకున్నాను అంతేకదా''

''మీరు ద్వారాలు తెరువడం మహా సాహసకృత్యం మరెవ్వరైనా ఐతే గజగజ లాడిపోయేవారు ''

''అంత పైనుంచి అగడ్తలోకి దూకే సాహసం నాకు మాత్రం లేదు'' అని రత్నాదిత్యుడు అన్నాడు తిరిగి వారిద్దరూ ప్రేమతో కౌగిలించుకున్నారు

''రత్నా! వీళ్ళు ఇక్కడ ఇలా ఎందుకు తారట్లాడుతున్నారు?'' అని ప్రశ్నించాడు భీమదేవుడు

''నేనూ అదే ఆలోచిస్తున్నాను ఏదో కుట్ర పన్నుతున్నట్లున్నది '' అంటూ మీసాలు మెలితిప్పుతూ, ''చీకటి పడిన తరువాత ఇక్కడ గట్టిగా కాపలా పెట్టాలి'' అన్నాడు రత్నాదిత్యుడు

''సరే నేనిప్పుడు సైనికుల్ని పంపిస్తాను''

''మహారాజా! మీరు ప్రొద్దుటినుంచి బాగా అలసిపోయినారు నా కంత శ్రమ కలుగలేదు ఇప్పుడన్నివైపులా శాంతంగానే ఉన్నది మీరు కొద్దిగా అలసట తీర్చుకుంటే మంచిది మళ్ళీ రాత్రికి పరిస్థితి ఎలా వుంటుందో?''

భీమదేవుడు కోట దిగాడు అక్కడ ఎందరో బైరాగులు మృత సైనికులను ఒకచోట చేరుస్తున్నారు గురుదేవుడు అటూ యిటూ తిరుగుతూ క్షతగాత్రులకు పరిచర్యలు చేయిస్తున్నారు రాజాధిరాజులు సైతం ఏ మహాపురుషుని పాదధూళిని శిరస్సున ధరించడం మహా ప్రసాదంగా భావిస్తుంటారో ఆ గురుదేవుడు ఒక సాధారణ వైద్యునివలె రోగుల సేవలో లీనమై ఉన్నారు దీపా కొరారీ భోజన సదుపాయాలు చేస్తున్నాడు ఈ వ్యవస్థనంతా చూస్తూ, అక్కడక్కడ సైనికులను ప్రోత్సాహ వాక్యాలతో పలకరిస్తూ, మధ్య ఎదురైన వారి నమస్కారాలను ప్రేమతో స్వీకరిస్తూ భీమదేవుడు తన నివాసం వైపు నడిచాడు

ప్రాంగణంలో మందిరం ముందు హరదత్తుడు ఎదురైనాడు అతడు భీమదేవుని ఎదురుగా నిల్చుని తన ఇనుప కంచీని మహారాజు తలపై ఉంచి ''ఓరీ! మహామాయను భ్రష్టమొనర్చిన పాతకుడా! నీ తలమీద మృత్యువు తారాడుతున్నది'' అని ఆక్రోశించాడు భీమదేవుడు మొదట ఒరలోంచి కత్తి లాగాడు కానీ, నిరాయుధుడైన బైరాగిని చూచి నవ్వుతూ వెళ్ళిపోయాడు హరదత్తుడు తన దారిన తాను వెళ్ళిపోయాడు

భీమదేవుడు తన డేరాకు చేరుకున్న సమయాన ఆయన కాళ్ళలో ఉత్సాహం విద్యుత్తులా ప్రవహిస్తున్నది లోపలికి వచ్చి ఆశాన్విత దృష్టులతో నలువైపులా చూచాడు వీరా గ్రహించాడు ''మహారాజా! ఆమె ఒట్టి పిచ్చిపిల్ల ఆ శిఖరం లేదూ ? దాని మీద తల్లితోపాటు కూర్చుని రోజల్లా మిమ్మల్నే చూస్తూ ఉంటుంది ''

''ప్రపంచమంతా అలా పిచ్చివాళ్ళయితే ఎంత మేలు వీరా! నా వైపు చూస్తున్నపుడు నేనూ ఆమెను చూచాను ''

''ఇపుడు మీరు తప్ప మరో ధ్యాసే లేదు'' అని పరిహసించాడు వీరా

''కొద్దిగా నిదానించు నీకూ మరో ధ్యాస ఉండదు ''

మహారాజు కవచం తీసి స్నానం చేశాడు భోజనం చేసి నిద్రించాడు అప్పుడప్పుడే కునుకు పడుతున్నది ఇంతలో లేడిపిల్లలా ఎవరో పరుగెత్తుతున్న ధ్వని వినిపించింది ఆయన కన్నులు తెరచి చూచాడు

అరుణ చరణాలు పరుగెడుతున్నాయి గాలిలో రెపరెపలాడుతున్న దుకూలాలలో ఒక చిన్నారి సుకుమార శరీరం నర్తిస్తున్నది చెదిరిన ముంగురులతో కప్పబడి అలుపుతో

రొప్పుతున్న స్వరంతో ''అమ్మా! అమ్మా! ఈరోజు మహారాజు అద్భుత ప్రతాపాన్ని ప్రదర్శించారే!'' అని ఉచ్చరించింది

భీమదేవుడు నవ్వుతూ, నెమ్మదిగా ''ఇంకా చూడవలసింది ముందున్నది'' అని అన్నాడు

మహారాజును చూచి చోళా సిగ్గుపడిపోయింది దుకూలాలను సవరించుకుంటూ, నేలను చూస్తూ సిగ్గుతో వెళ్ళిపోయింది అలసి ఉన్న భీమదేవుడు ప్రక్కకు ఒరిగి నిద్రపోయినాడు కానీ పరుగెడుతున్న పదపల్లవాలు, రొప్పుతున్న ముఖము మధుర వదనంతో చూపిన లజ్జాసన్మానము, కలలో అతనికి అనవరతమూ కన్పిస్తూనే ఉన్నాయి

## 2

భీమదేవుడు సరిగా ఒక ఘడియ్యైనా నిద్రించలే దింకా ఇంతలో ఒక పెద్ద కలకలం అతణ్ణి మేలుకొలిపింది సంభ్రమంతో లేచి, ఆయుధాన్నందుకొని మిద్దె పైకి వచ్చాడు సాయంకాలం కావచ్చింది సైనికులు గుంపులు గుంపులుగా ఆడుతూ, పాడుతూ కేకలేస్తూ, 'జై సోమనాథ్' అని మహోల్లాసంతో నినాదాలిస్తూ ఆయన శిబిరంవైపు వస్తున్నారు అందరికీ ముందు గురుదేవుడు, రత్నాదిత్యుడు, దద్దా కరదీపికల వెలుతురులో నడుస్తున్నారు విమలుడు అందరికంటే వేగంగా పొగడ్తలను జుర్రుకోడానికి పరుగెత్తుకొని వస్తున్నాడు భీమదేవుడు మిద్దెమీద నిల్చుని అది చూచాడు ఆనందాతిరేకంతో అభినందనలు కురిపిస్తూ వస్తున్న ఆ జనసమూహాన్నీ, గురుదేవుని తిలకించాడు గది మిద్దె మీద నిల్చుని వంగి వంగి చూస్తున్న గంగా, చోళాల పైకి కూడా ఆయన చూపులు పరుగెత్తాయి

''ఏమిటి విశేషం విమలా?'' అని ప్రశ్నించాడు

''మ్లేచ్ఛ సైన్యం వెనక్కు తగ్గింది ''

''ఆఁ నిజంగానా! నిజంగానా? ఎదిరించడం విరమించుకున్నారా?''

''ఎదిరించడమేమిటి? మూడు వైపులా సైన్యము అర్ధ యోజనం వెనుకకు తగ్గింది తమకు విజయం లభించింది మహారాజా!''

హడావుడిగా ఆయుధాలు ధరించి భీమదేవుడు ఆగాడు సైన్యాలన్నీ ''భీమదేవ మహారాజుకీ జై'' అని విజయ నాదాలతో ఆయనను అభినందించారు

భీమదేవుడు గురుదేవునికి సాష్టాంగంగా నమస్కరించాడు ''గురుదేవా! మీ ఆశీస్సులే మాకు మహాబలం'' ''లే నాయనా!'' అని మహారాజును గురుదేవుడు కౌగలించుకున్నాడు

''చిరంజీవివై వర్ధిల్లు నాయనా! పరమేశ్వరుడే నేడు మన మీద దయ దలచాడు నేను ఆయనకు దాసుణ్ణి అంతమాత్రమే కాని నీవు నేడు ప్రదర్శించిన ప్రతాపం కలకాలం దేదీప్యమానమై ప్రకాశిస్తుంది నీ జన్మ తరించింది'' అన్నాడు గురుదేవుడు. తరువాత రత్నాదిత్యుడు, విమలుడు, దద్దా, సేనాపతులూ మహారాజును కౌగిలించుకున్నారు నలువైపులా 'జై సోమనాథ్', 'జై భీమదేవ మహారాజుకు' అనే నినాదాలు ఆకాశాన్ని ఆవరిస్తున్నాయి సైనికులు భేరీలు, మృదంగాలు, దుందుభులు ఉత్సాహంతో మ్రోగిస్తున్నారు కొందరు హర్షాతిరేకంతో పులకితులై నృత్యం చేయనారంభించారు

''భీమా! సంధ్యాహారతులిచ్చే సమయం అయింది సర్వకీర్తి ప్రదాత యైన శ్రీసోమనాథుని చరణ కమలాలకు మన కృతజ్ఞతలు సమర్పించుకుందాం'' తరువాత అందరూ ఆడుతూ, పాడుతూ మందిరానికి వెళ్లారు ఆలయమున్న ప్రాకారమంతటా సైన్యం ఆవరించింది గురుదేవుడు హారతులిచ్చి, ధ్యానం చేశాడు అలిసి ఉన్నా, సైనికులందరూ హర్షోల్లాసంతో ధ్యానించారు గురుదేవుడు హారతులను నంది విగ్రహం దగ్గర ఉంచాడు ఆశీర్వచన పాఠం చదివాడు అందరూ శాంతంగా వింటూ నిల్చున్నారు

''వీరులారా! పరమేశ్వరుని సంరక్షించడానికి కటిబద్ధులై ఉన్న మీ అందరికీ నా ఆశీస్సులు మీరందరూ శతవసంతాలు వర్ధిల్లండి అధర్మాన్ని రూపుమాపి ఇహంలో అనంతకీర్తినీ, పరంలో కైలాసాన్నీ చూరగొనండి మహారాజా! మీ రాజ్యం అమరమై వర్ధిల్లుగాక మీరు మ్లేచ్ఛులను ఓడించి సంపాదించిన కీర్తి సూర్యచంద్రులు ప్రకాశిస్తున్నంతవరకూ వీర లోకానికి ఆదర్శమై వెలుగొందుగాక రాజాధిరాజు, పరమభట్టారక శ్రీ భీమదేవ మహారాజా! శతాయువులై వర్ధిల్లండి''

చీకటిలో ఉన్న స్తంభం నీడలోంచి ఒక జటాధారి యైన ఉన్నత భయంకరమూర్తి ముందుకు నడిచాడు గురుదేవుడు నిల్చున్న చోటికి కొంత దూరాన రుద్రమూర్తిలా నిల్చొని ఇనుప కంచీని గురుదేవుని వైపు నిర్దేశించి పెద్ద గొంతుకతో అందరికీ వినిపించే విధంగా ఇలా అరిచాడు

''ఓరీ ధర్మద్రోహి! ఈ నీ దురభిమాన సౌధం ఇక సర్వనాశనమై నేల కూలుతుంది మహామాయను భ్రష్టమొనరించిన తుచ్ఛుడా! భీమదేవా! నీవూ, ధర్మకళంక మొనరించిన నీ గురుదేవుడూ, ఇద్దరూ నాశనమవుతారు నీవు అవినీతికి

పాల్పడిన ఈ స్థలంలో గద్దలు కొలువు తీరుస్తాయి శ్వాసరోదనం శాశ్వతమై నిలుస్తుంది '' ఈ మాటలు వినిపించగానే వేలకొలది కత్తులు ఆ వ్యక్తిని ఖండ ఖండాలుగా నరకడానికి పైకి లేచాయి భీమదేవుడు ఒరలోంచి కత్తిని దూశాడు రత్నాదిత్యుడు పిడిబాకు బొడ్లో నుంచి లాగాడు దద్దా గజగజ వణుకుతూ రెండు కండ్లనూ గట్టిగా మూసుకొని కూలబడిపోయాడు అన్ని వైపులా కోలాహలం వ్యాపించింది

గురుదేవులు సంభ్రమంతో ముందుకు వచ్చి భవ్యమైన అద్భుత ముద్రతో రత్నాదిత్యుణ్ణి, భీమదేవుణ్ణి కూర్చోబెట్టారు ''శాంతించండి! నాయనా శాంతించండి'' అని ఆరంభించారు కరదీపిక కాంతులలో తెల్లని గడ్డంతో, విభూతి రేఖలతో కాంతులు కురిపిస్తున్న ఆ మహానుభావుని ప్రభావం నలువైపులా వ్యాపించింది ''నిశ్శబ్దం నిశ్శబ్దం '' అనే శబ్దాలు కూడా పరిపూర్ణ శాంతిలో లీనమైనాయి

''వీరులారా! తపస్సువల్లా, యుద్ధ యత్నాల భారంవల్ల నా శిష్యుడైన శివరాశి మనస్సు కొంత చలించింది. ఇతని మాటలను పట్టించుకోకండి మీవంటి వీరులకు ఓర్మి అలంకారం ''

అలా అంటూ వారు శివరాశిని సమీపించారు ఆ యిద్దరిలో ఒకరు భయంకరాకారంతో మహోగ్ర జటాజూటాలతో ఉగ్రస్వరూపం దాల్చినవారు, మరొకరు విస్తరించి, చిరుగాలికి మిలమిల మెరుస్తూ ఎగురుతూన్న గడ్డంతో విరాజిల్లే దయాసాగరులు, నిష్కళంక హృదయులైన - శంకరులు ఒకరు అస్వస్థులై, విచలితులైన కఠోరులు- రెండవవారు శాంత చిత్తులు- స్వస్థమూర్తులు-దయాస్వరూపులు క్షణంపాటు గురుశిష్యులు ఒకరినొకరు చూచుకున్నారు తర్వాత గురుదేవుని మాటల్లోంచి ప్రేమవారాసియైన మాతృవాత్సల్యం వెలువడింది ''శివరాశీ! నిగ్రహం కోల్పోయినవాడు అధోగతి పాలవుతాడు నడు, నేడు నీ మనస్సు సరిగాలేదు నీవు మరీ రోగిష్టివైనావు ''

శివరాశి పండ్లు కొరికి, పెదవులను కొరుక్కుంటూ ఏదో మాట్లాడటానికి ప్రయత్నించాడు

''నడు నాయనా నడు,'' ప్రేమతో గురుదేవుడన్నాడు. శివరాశి హృదయంలో ప్రచండమైన అగ్నిజ్వాలలు లేచాయి కంఠం రాపిడి పడింది మస్తిష్కంలో నిప్పురవ్వలు ఎగురుతున్నాయి కన్నులు తిరుగుతున్నాయి చిరపరచితుడైన ఆ వృద్ధుని నమిలి మింగుదామని ఉన్నది కానీ చేతులాడటంలేదు

''నడు నాయనా నడు '' సర్పరాజాన్ని మంత్రబద్ధమొనరించి ఆడించినట్లే గురుదేవుడన్నాడు.

''నడు నాయనా నడు'' అనే మాటల్లో వర్ణనాతీతమైన అధికార ధ్వని ఉన్నది ఎదురు తిరగాలని శివరాశి తిరిగి ప్రయత్నించాడు కానీ ఇన్ని సంవత్సరాల అలవాటూ, ఆ మాటల్లోని ప్రేమా, ఆ సౌమ్యతా అతణ్ణి లోబరచుకున్నాయి అతడు తన చుట్టూ కోపంతో కొరాకొరా చూస్తూ ఆయుధపాణులై నిలుచున్న భయంకర సైనికుల్ని, గురుదేవుని నిర్భయదృక్కులను చూచాడు ఈ యోజన అనవసరంగా చేయలేదని అతడు భావించాడు

''నడు,'' అంటూ గురుదేవుడు శివరాశి భుజంమీద చేయి వేశాడు లోలోపల ఏదో దుర్మార్గం చేయాలని అనుకుంటూనే శివరాశి పెంపుడు జంతువులా గురుదేవుని వెంట నడిచాడు

ఇద్దరూ అదృశ్యమయ్యే వరకు రత్నాదిత్యుని గర్జన ''భీమదేవ మహారాజుకు జై'' అనే నినాదంతో దిక్కులను పిక్కటిల్లజేస్తూనే ఉన్నది తరువాత స్వప్నలోకంలోంచి మేలుకొన్న వ్యక్తుల్లా సైనికులు మాటాడుకోనారంభించారు ప్రకటనలు జరిగిన తరువాత శంఖ మృదంగ ధ్వనులతో అంతా వీడ్కోళ్ళు అందుకున్నారు

వెళ్ళిపోతూన్న వ్యక్తులను సంబోధిస్తూ, ''వీరులారా! సంతోషంతో నిద్రపోకండి మహాయుద్ధంలో కైలాసాన్ని చూరగొన్న మన వీరయోధులకు దహన సంస్కారాలు చేయాలి తరువాత భోజనాలు ముగించుకొని ఎవరి స్థలంలో వారు ఉండాలి శత్రువులు ఏ కుట్రలు పన్నుతున్నారో ఎవరికి తెలుసు?'' అని భీమదేవుడు అన్నాడు.

అందరూ ద్వారకా ద్వారం దగ్గరకు వెళ్ళి తమ వీర సోదరులకు దహన సంస్కారాలు చేశారు మూడువేల రెండువందల మంది వీరస్వర్గం పొందారు ఒక్కొక్క గుజరాత్ వీరుడూ ఏడెనిమిది మందిని చంపనిదే చావలేదు పదిహేనువేల మంది గాయపడ్డారు

ఆ రాత్రి భీమదేవుడూ, రత్నాదిత్యుడూ కోట అంతా చుట్టి వచ్చారు క్రిందా, పైనా జరిగిన ఏర్పాట్ల నన్నిటినీ స్వయంగా పరిశీలించారు తరువాత రాబోయే రేపటికై జరుగుతూన్న తీవ్ర ప్రయత్నాలను చూస్తూ తమ తమ శిబిరాలకు వెళ్ళారు

వెళ్తూ, వెళ్తూ ''మహారాజా! నేను కొద్దిగా విశ్రమించి తిరిగి వస్తాను ఈ అమీరు వెనుకకు తగ్గాడంటే నా కేదో కుట్రగా తోస్తుంది '' అన్నాడు రత్నాదిత్యుడు

''సరే అవసరమైతే నన్ను కూడా లేపు'' అన్నాడు భీమదేవుడు

**3**

భీమదేవ మహారాజు తన నివాసంలో అడుగు పెట్టేసరికి అతని హృదయం ఆనంద తరంగితమైనది ఆరోజు ఆయన అద్భుతమైన శౌర్యాన్ని ప్రదర్శించాడు దావానలంలాంటి ఆ అమీరును వెనుకకు తరిమి వేశాడు. సేనలను సత్కరించి శాశ్వతకీర్తిని సంపాదించాడు కుంతీ పుత్రుడైన భీముని స్తుతించినట్లే చాళుక్య భీముని కీర్తిని కూడా స్తుతిస్తారు పరమేశ్వరుడు ప్రసాదించిన భుజశక్తి ఫలించింది తద్వారా స్వర్గంలో కూడా శాశ్వత స్థానం సంపాదించి పెట్టుకొన్నాడు.

కొండల నుండి ప్రవహించే నిర్ఝరణిలాంటి ఆ నర్తకి, ఉల్లాస కల్లోలాలతో ఆనందాన్ని వెదజల్లుతూ, అతనిని కలుసుకోవాలనే ఆదుర్దాతో మరింత శోభను వర్షిస్తూ పరుగెడుతున్నది కాబోలు! అతని మనస్సును ఆనందం చేతులు చాచి ఆవరించింది ఆ మనస్సులో చోళాను గురించిన ఆలోచనలు సుళ్ళు తిరుగుతున్నాయి గురుదేవుని కూతురని అందరూ ఆమెనంటారు తానేమో పార్వతి నంటుంది ఆమె విచిత్రమైన బాలిక. నేల మీద కాళ్ళు నిలవనే నిలవవు జీవితంలో ప్రతి నిమిషానికీ కొత్త తొడుగులు తొడుగుతున్న సంపూర్ణ సౌందర్యంతో ఎప్పుడూ నృత్యం చేస్తూనే ఉంటుంది. చంద్రకిరణాలే నిర్మల నిర్ఝరిణిలా ప్రవహిస్తున్నట్లు జీవితానుభవాల రాళ్ళ గుట్టలోంచి ఆమె నృత్యంచేస్తూ పురోగమిస్తున్నది ఆమె నవ్వులో, కన్నీటిలో, భయంలో విచారమంటూ కన్పించదు సారళ్యమే అవతారమెత్తి జీవించడానికి, భోగించడానికీ తపిస్తున్నదేమో!

భీమదేవునికి ఇద్దరు భార్యలు ఇద్దరూ సౌందర్యవతులే. చక్కని గుణాలు కలిగినవారే నేర్పరులే వారివల్ల భీమదేవునికి జీవితం భారమనిపించలేదు ఒకమారైనా వారి మాటల నాతడు కాదనలేదు వారి వల్లనే అతని జీవితం సుఖసమృద్ధమై వెలుగుతున్నది కానీ చోళా సాంగత్యం సుఖసమృద్ధులిచ్చేది కాదు ఆమెతో కుటుంబ వ్యవహారాలనూ, రాజకీయాలనూ చర్చించలేడు అలాంటి విషయాలు ఆమెతో ప్రసంగించడం అతనికీ రుచించదు వాసనలు గుబాళించే పూలతో చిరిగిన గుర్రపు జీనును అతికించడానికి ప్రయత్నించడం ఎంత మూర్ఖమో ఇదీ అంతే తొలివెన్నెలనూ, పూల వాసననూ, మున్నేటి అలల నృత్యలీలనూ కలిపి చేసిన దివ్యమూర్తి చోళా. ఆమెతో ఈ ప్రపంచం నుంచి దూరంగా ఏ అగాధ సముద్ర గర్భంలోనో, హిమాచ్ఛాదిత గిరిశిఖరాల పైననో విశాలమైన ఆకాశపు రాచబాటల్లోనూ విహరించవచ్చు ఈ లౌకిక బంధనాలను త్రెంచుకొని చోళా ప్రాణాలు అద్భుతమైన స్వేచ్ఛతో విహరిస్తుంటాయి

ఆలోచనలలో మునుగుతూ, తేలుతూ ఆయన శిబిరానికి వచ్చాడు శస్త్రాలను తీశాడు భోజనం ముగించుకొని మిద్దె మీదికి వెళ్ళాడు బహుళ పాడ్యమినాటి చంద్రుడప్పుడే ఆకాశంలో అవతరించాడు చుట్టూ వినిపిస్తున్న కల్లోలం శాంతిస్తున్నది రక్తరంజితమై తెగ వెలిగే ఆ పగలును ఈ నూతన శాంతి మరపించేట్లుగా ఉన్నది మహారాజు ఆదుర్దాగా మిద్దె మీద ఇటూ అటూ తిరుగుతూ ఏ కొద్ది చప్పుడైనా చోళా పదధ్వనేమోనని చెవులు రిక్కించి వింటున్నాడు

కానీ చోళా పదధ్వని ఎలా వినిపిస్తుంది? ఆమె అక్కడే కప్పు క్రింద క్రీనీడలో ఒదిగి కూర్చొని మహారాజు ఆదుర్దాను చిలిపి నవ్వులు వెలయించే తీయని చూపులతో చూస్తున్నది

పగలల్లా ఆమె ప్రాణాలు తపిస్తుంటాయి మందిర శిఖరమే ఆమెకు కైలాసం భీమదేవుని నీలి తలపాగయే నీలి రంగు జటాజూటం దానిపైన తెల్లని తురాయే చంద్రమశ్శకలం ఆమె దృష్టికి అమీరును ఓడించడానికి పాటణ బీమదేవుడు రావడం కాదు, త్రిపురాసురుణ్ణే సంహరించడానికి సాక్షాత్తూ పినాకపాణియే వేంచేశాడు బ్రహ్మ సర్వజ్ఞుడై అవతరించి ఆయనకు సారధి యైనాడు విష్ణువు ఆయన బాణాలు వేదాలు అతని ఉత్తమాశ్వాలు ధృవాది జ్యోతిర్గణం ఆయనకు భూషణాలుగా అవతరించింది

సర్వదేవమయుడైన శివుడు విరోధులను కంపింపచేస్తూ వీర విహారం చేస్తున్నాడు ఆకాశంలో అప్సరసలతో కూడి మహర్షులాతణ్ణే కీర్తించడం కనిపించిందామెకు

ఆమె అందరినీ గుర్తించ గలదు వీరాచావడయే నందీశ్వరుడు విమల మెహతా విఘ్నేశ్వరుడైన గణపతి, రత్నాదిత్యుడు దేవరాజైన మహేంద్రుడి చుట్టూ ప్రమధగణాలు జయ జయ ధ్వనులు చేస్తున్నాయి ఇక కైలాసగిరిపై - హిమకన్య యైన పార్వతి తానే పతికై ఎదురు చూస్తూ ఇప్పుడే వస్తారు, తనను వెంట తీసుకొని వెళ్తారు త్రిపుర విజయం చేస్తారు అనుకుంటూ ఎదురు చూస్తున్నది

ఎదురుగా త్రిపుర నగరం వ్యాపించి ఉన్నది ఆమె త్రిపురాసురుణ్ణే కూడా చూచింది. పచ్చని పాగతో ఎఱ్ఱని గడ్డంతో మహా భయంకరుడైన తన శంకరుడు పాశుపతాన్ని సంధించడం కూడా చూచింది వేలకొలది దైత్యులు హతులైనారు ముఖద్వారం ముందున్న అగడ్త ప్రళయ కాలంలో రుద్రునిచే భస్మీపటలం కానింపబడ్డ ముల్లోకాలుగా ఆమెకు కన్పించింది.

విజయుడై శివుడామెకై ఎదురు చూస్తున్నాడు

మహారాజు మహా ఆదుర్దాగా ఉన్నాడు చోళా ఇంకా రాలే దెందుకు? అరికాళ్ళు

నేలకు కొట్టాడు తరువాత చెవులు నిక్కించి వింటూ నిల్చున్నాడు. ఆదుర్దాగా ఎదురు చూస్తున్న భీమదేవుణ్ణి చూస్తుంటే మహానందంగా ఉన్నా, చోళా నిగ్రహించుకోలేక నవ్వింది. భీముడా నవ్వును విన్నాడు అతడు కప్పు కింద దూరి చోళాను కాలు పట్టుకొని బైటికి లాగి పూలకప్పులా చేతుల్లోకి తీసుకొన్నాడు చోళా నవ్వుతూ అతణ్ణి మరింత ఉద్వేగపరుస్తున్నది అలా అతడామెను గాఢంగా హృదయానికి హత్తుకున్నాడు

'అమ్మో అమ్మో ప్రాణాలు పోతున్నాయి '

'ప్రాణాలు పోతున్నాయేం? ఎంతసేపట్నుంచి ఇక్కడ నిల్చున్నానో తెలుసా?'

'అవును నన్ను చూడడానికి తీరిక ఉంటేగా? మీకు స్వాగతమివ్వడానికి ఎంతసేపట్నుంచో ఇక్కడ కూర్చున్నాను '

'నిన్ను వెదుకుతూ వెదుకుతూ నా కండ్లు మూతలుపడ్డాయి '

'అయితే నిల్చోండి శివస్వరూపులూ! మిమ్మల్ని పూజించడానికి చందనాక్షతలను తెచ్చాను. నేడు మీరు త్రిపుర విజయం కావించారు. కనుక పూజించనిదే వదలను' అంటూ అతని చేతుల్లోంచి క్రిందికి దిగింది

'ఆ విజయం ఒక్కరి మీద కాదు చోళా! ఇద్దరి మీద' అంటూ భీమదేవుడు తన మెడలో వ్రేలాడుతున్న పొడుగుపాటి హారాన్ని చోళా మెడలో వేశాడు.

'స్వామీ! - స్వామీ! - ఎప్పుడూ ఇలాగే ఉంటారు కదూ - ఎప్పుడూ. ' అంటూ 'పార్వతీ పరమేశ్వరులు' అని ఉచ్చరించి చోళా అతని చేతుల్లో ఒదిగిపోయింది. భీమదేవుని శరీరంలో నెత్తురు మహా వేగంగా పరుగెడుతున్నది ఆమెనలా బాహువులలోకి ఎత్తుకొని తన గదిలో ప్రవేశించాడు

విచ్చుకత్తిని పట్టుకొని ద్వారం ప్రక్కగా కూర్చున్న చావడా తన ముసలి మీసాలలోంచి ఒక కన్ను మూస్తూ చిరునవ్వు చిలకరించాడు.

## 4

రత్నాదిత్యునికి కలిగిన అనుమానానికి ఆధారం లేకపోలేదు. అటు మహారాజు కోటదిగి వెళ్ళగానే అతని చెవులకు ఏదో ధ్వని వినిపించింది. సముద్రపు టొడ్డున ఏదో కొడుతున్నట్లు, నీళ్ళలో పడవేస్తున్నట్లు వినిపించింది. కానీ చూపు కేమీ అందడం లేదు. తరువాత ఒక నావను నీటిలోకి లాగినట్లు, మనిషి ఈదుతున్నట్లు వినిపించింది.

వెన్నెల ఉన్నా కంటి కేమీ కనిపించడంలేదు. అయినా బురుజులకు నాయకులుగా ఉన్న సేనాపతులందరినీ చడీ చప్పుడూ లేకుండా పిలిచాడు. నిముషంలో వేలకొలది

విలుకాండ్రను ఆయత్తపరచాడు. దూరంగా వెన్నెల సుసక వెలుతురులో కొంతమంది మనుష్యుల అలజడి కనిపించింది.

సముద్రము, అగడ్త కలిసేచోట ఏర్పడిన డెల్టామీద కొంత దూరాన ఒక మామిడి తోట ఉన్నది. ఆ తోట నీడలో మనుష్యులు గుమికూడుతున్నట్లు కనిపించింది అంతటి రాత్రివేళ కోటమీద దండయాత్ర చేయడం అసంభవమే అదీగాక అమీరు సేన అగడ్తకు చాలాదూరాన ఉన్నది కనుక ఈ అలజడికి మరోకారణం ఉన్నట్లు అనిపించింది.

చాలా దూరాన సముద్రంలో కమాలఖాణీ నావ లున్నాయి అందులోంచి ఒకటి చాలా నెమ్మదిగా కోటవైపు వస్తున్నది. ఈ నావను పట్టుకొనేందుకు మ్లేచ్ఛ సైనికులు చేసే ప్రయత్నమే ఈ అలజడికి కారణం కావచ్చు. మ్లేచ్ఛ సైన్యం చేసే అలజడి కాకపోవచ్చు కూడా.

ఆ వచ్చే నావను దివిటీలు వెలిగించి, స్పష్టమైన సంకేతం చేసి రావద్దని చెప్పడం ప్రమాదకరం అలా చేస్తే అంతవరకు శత్రువుల దృష్టి అటుపోకపోయినా, తప్పక అపుడు పోతుంది శత్రువు చూడ్డంలేదనే నమ్మకంతో ఆ వస్తున్న నావనలా రానీయడమూ ప్రమాదమే

రత్నాదిత్యుడు ధైర్యం చేసి ప్రమాద స్థలానికి వెళ్ళేందుకు సిద్ధపడ్డాడు. అతని సేనలో బేరావల్ నుండి వచ్చిన 'ఖారా', 'నీరా' లనే గజ ఈతగాండ్లు ఉన్నారు త్రాళ్ళు తెప్పించి ముందుగా దివిటీలార్పించి, ఆ త్రాళ్ళతో వారిద్దరినీ నీటిలోకి దించాడు వారిద్దరి ద్వారా పగలు జరిగిన సంగతులూ, నావ రావడానికున్న ప్రమాదమూ చెప్పి పంపాడు.

ఖారా, నీరా లిద్దరూ ఒక అయిదు వందల గజాలు ఈదగానే మామిడి తోటలోని అలజడికి కారణం రత్నాదిత్యుడు గ్రహించాడు. సైనికులు ఒడ్డునే నెమ్మదిగా నావలను తీసుకొని వస్తున్నారు.

రత్నాదిత్యుడు భయపడ్డాడు. తలుపులు తెరచి సైనికులను పంపుదా మనుకుంటే వారు పడవల దాకా పోకముందే నశిస్తారని తెలుసు. శత్రువుల నావలు చేరిన తరువాత ఆ నావ వస్తే ప్రమాదం తప్పదు. తద్వారా ప్రభాస నగరానికి కూడా హాని వాటిల్లవచ్చు.

కనుక శత్రు సైనికులు నావలకు లంగరువేసి వెళ్ళేవరకూ ఆగడం మేలని రత్నాదిత్యుడు నిశ్చయించుకున్నాడు. నావలను జతచేర్చి ఒక పెద్ద వంతెనను నిర్మించారు శత్రువులు. అగడ్తకు దగ్గర సముద్రపు టొడ్డున కొంత దూరాన వాటిని కట్టివేశారు. అక్కడికి బాణాలు విసిరినా వెళ్ళవు.

యుద్ధారంభం కాగానే ఆ వంతెనను అగడ్తలోనికి తెస్తే కోట గోడల కెగబ్రాకడం సులభమని శత్రువుల భావం ఈ నావలను ముంచివేయాలి కానీ ఎలా ముంచాలో రత్నాదిత్యుడు నిర్ణయించుకోలేకపోయినాడు

ఆ వంటిరిగా వస్తున్న నావ దూరాన ఆగిపోయింది అందులోంచి మనుష్యులు దిగారు రత్నాదిత్యునికి కొంత తృప్తి కలిగింది 'ఖారా-నీరా'లు వస్తున్నట్లున్నారు నావ కూడా శత్రువుల నుంచి తప్పించుకున్నది

శత్రువులు తమ నావల వంతెనలను ఒడ్డున కట్టివేస్తున్నప్పుడు దూరంగా నీటిలో ఏదో ధ్వని వినిపించింది రత్నాదిత్యుడు ఎంత తీక్ష్ణంగా చూచినా ఏమీ కనిపించలేదు తరువాత ధ్వని ఆగిపోయింది శత్రు సైనికులు వెళ్ళిపోయిన తరువాత ఏమి జరుగనున్నదో చూద్దామని నిశ్చయించుకుని రత్నాదిత్యుడు ఒక యాభైమంది ఈత నేర్పరులను రప్పించి ఆ వంతెనను ముంచడానికి పంపేందుకు ఏర్పాట్లు ప్రారంభించాడు

త్రాళ్ళు అగడ్తలోకి విసిరారు సైనికులు దిగడానికి ముందుకు వచ్చారు ఇంతలో దూరాన వున్న ఆ వంతెన శేషనాగు నిద్ర మేల్కొని జరజర ముందుకు సాగినట్లు కదిలింది నావలు విడిపోవనారంభించాయి తరువాత ప్రవాహంతోపాటు ఎవరో పిలుచుకొని పోతున్నట్లు నావలన్నీ కొట్టుకుపోతున్నాయి

రత్నాదిత్యుడు కండ్లు నులుముకున్నాడు తాను నిద్రపోవడం లేదు కదా!

నావలు అలా చాలా దూరం కొట్టుకొని పోయిన తరువాత మామిడి తోటలో కోలాహలం చెలరేగింది! పరమేశ్వరుని అనుగ్రహంలేని పక్షంలో ఇలాంటి చమత్కారం జరగడం సాధ్యమా? రత్నాదిత్యుడు తనలో తాను నవ్వుకున్నాడు

ఇంతలో ముగ్గురు వ్యక్తులు ఈదుకుంటూ వచ్చి ద్వారం దగ్గర మెట్లను ఎక్కారు

''బాబూ'' అని ఖారా నీటికోడిలా అరిచాడు పైన నిల్చున్న ఈతగాండ్లు ఈఅరుపును పోల్చుకున్నారు తాళ్ళు నీటిలోకి వదిలారు ఆ తాళ్ళను పట్టుకొని ఇద్దరికి బదులుగా ముగ్గురు వ్యక్తులు పైకి ఎగబ్రాకుతూ వచ్చారు

''ఇత నెవరు?'' అని మూడవ వ్యక్తిని చూస్తూ అడిగాడు రత్నాదిత్యుడు

''పోల్చలేదా! నేను సామంత చౌహానును రత్నాదిత్యప్రభూ!''

రత్నాదిత్యుడు ఆ ముఖాన్ని, ఆ మీసాలను పోల్చుకున్నాడు అతణ్ణి కౌగలించుకొని ''ఎవరూ! సామంతరాజా! ఆ వంతెనను నాశనం చేసిన శూరులు తమరా వీరాగ్రణీ'' అని అన్నాడు

''వేరే ఉపాయం లేదు ఈదుకుంటూ వస్తుంటే ఈ వంతెన కన్పించింది నాకు వారి కుట్ర అర్థమైంది మేము ముగ్గురం కలిసి వాటిని నాశనం చేశాం'' అన్నాడు సిగ్గుపడుతూ సామంతుడు

''సామంత ప్రభూ! మీరు ప్రభాసాన్ని కాపాడారు ఇంతసేపూ ఈ వంతెనను నాశనం చేయడమెలాగని ఆలోచిస్తున్నాను నేను '' మీరు ధన్యపురుషులు వీరా!

''మీరయ్యా ధన్యజీవులు ఈనాటి యుద్ధ వార్త అంతా విన్నాను భీమదేవులు ఎక్కడ?''

''రోజల్లా పాపం చాలా శ్రమపడ్డారు ఇప్పుడు వారిని పలుకరించడం బాగుండదు విశ్రమిస్తున్నారాయన మరి మీరెక్కడినుంచి వస్తున్నారు?''

''మీరందరూ అనహిలవాడ నుంచి వెళ్ళిపోయిన తరువాత నేనూ, ఆర్య నందిదత్తులూ, మీరిచ్చిన మూడువందల సైనికులూ అందరమూ ఆ చుట్టూ ఉన్న అడవుల్లో దాక్కున్నాం అమీరు వచ్చి శూన్య దుర్గాన్ని, శూన్య నగరాన్నీ చూచి ఆశ్చర్యచకితు డైనాడు తరువాత అతని సేనలో ఘోఘాబాబు భూతాన్ని గురించి కల్పిత కధలను ప్రచారం చేశాము అమీరు అక్కడ ఉండలేక నేరుగా ఇక్కడికి వచ్చాడు ''

''మరి అనహిలవాడ సంగతో?''

''అతడు అక్కడి నుంచి వెళ్ళిపోతున్నప్పుడు మన మహారాజుగారి సోదరుడు పదభ్రష్టుడైన దుర్లభసేనుడు వచ్చి అమీరును శరణు వేడాడు '' అమీరు అతనికి గద్దెను వప్పగించి అయిదువందల మంది సైనికుల నిచ్చి తాను తిరిగి వచ్చేవరకు దుర్గాన్ని కాపాడుతుండమని చెప్పాడు

''ఆ మరి మీ విషయం?''

''ఇక పని చాలా సులభం అవలేదూ? తెల్లవారినప్పటినుంచి దుర్లభసేనుడు ఆనందంతో తన రాచరికం ప్రారంభించాడు మధ్యాహ్నానికల్లా వృద్ధమూర్తి నందిదత్తుడు ఎక్కడ్నుంచో ఘోఘా భూతానికి భయపడి దుర్లభసేనుని శరణుజొచ్చాడు రెండోరోజు పరిసర గ్రామీణులు ఘోఘాబాబు భూతానికి భయపడి అనహిలవాడలో తలదాచుకోడానికి దుర్గంలో చొరపడ్డారు ఈ భూత గాధ విని దుర్లభసేనుని సైనికులు గజగజలాడి పోయారు దుర్లభసేనుడు కోట తలుపులు మూయించి లోపల కూర్చున్నాడు ''

రత్నాదిత్యుడు ఆపుకోలేని నవ్వుతో ''తరువాత'' అని అనలేక అన్నాడు

మూడోరోజు రాత్రి నందిదత్తునికి భూతం వస్తున్నట్లు గోచరించింది యోధులంతా భయంతో ఇండ్లలో చొరబడ్డారు నందిదత్తుడు కోట తలుపు నానుకొని ఉన్న చాముండేశ్వరాలయంలో భూతోచ్చాటనకు యజ్ఞం ప్రారంభించారు పరిసర గ్రామీణులందరూ అక్కడ గుమికూడారు

''తరువాత భూతదేవా?''

''తరువాత అర్ధరాత్రి కోట తలుపులను ఎవరో కొట్టారు భయంతో అందరూ కుదించుకుని పోతున్నారు. ఘోఘాబాబు భూతం ఒంటరిగా లోపలికి ప్రవేశిస్తా నంటున్నది వీల్లేదనే గుండె లెవరికున్నాయి? దుర్గపాలురు ద్వారాలు తెరిచారు భూతం లోపలికి రాగానే నందిదత్తుడు పూజించాడు గ్రామీణులు శస్త్రధారులైన సైనికు లయ్యారు అందరూ చేరి రాజదుర్గాన్ని ఆక్రమించారు అనహిలవాడ మీద ఘోఘాబాబు భూతరాజ్యం నెలకొల్ప సంకల్పించుకున్నారని భూతం చాటింపు వేయించింది చచ్చినవాళ్ళు తప్ప సజీవులు వుండడానికి వీల్లేదట కొద్దిగా వ్యతిరేకం చూపిన మ్లేచ్ఛులను తుడిచిపెట్టారు ఎదిరించిన రాజపుత్రులను మృత్యుతీర్థంలో ముంచారు శరణుజొచ్చిన వాళ్ళను తమలో చేర్చుకున్నారు ''

''మరి దుర్లభసేనుడు?''

''వాడు ఘోఘాబాబు పాదాలమీద పడి రాజ్యతృష్ణను విడిచి పెడతానని శపథం తీసుకొన్నాడు తరువాత అతణ్ణి ఒకరిద్దరు సేవకుల నిచ్చి అడవుల్లోకి తరిమాము ''

''భేష్ భేష్ చౌహాన్‌వీరా! తరువాత?''

''అలా మెహతాకు అనహిలవాడను అప్పగించాం భీమదేవుని పేర సైన్య నిర్మాణం ఆరంభమైనది. దామోదర్ మెహతా కూడా ఖంభాతం నుంచి సేనలతో వచ్చారు ఘోఘాబాబు సలహా ననుసరించి అడవుల్లో దాక్కున్న వాళ్ళందరూ తిరిగి వచ్చారు ఉజ్జయినీ నుంచి దామోదర్ మెహతా కోరిన సహాయం కూడా వస్తున్నదనే శుభవార్త కూడా ఇంతలో తెలిసింది అమీరు ఇక్కడికి రాకముందే వాయువేగంతో ప్రయాణిస్తూ ఉజ్జయినీ సేన వారి వెంట పడ్డది.''

''ఆ సేనకు సేనాపతి ఎవరు?''

''దామోదర్ మెహతాయే వద్దు వద్దంటూ అంగీకరించారు ''

''మీరెందుకు కాలేదు?''

''అమీరుతో నా తండ్రి, తాత పోరాడారు ఇంకా నా వంతు రాలేదు నేను ఖంభాతం వెళ్ళాను ''

''ఆ తరువాత ఆ ఘోఘాబాబు భూతం ఇక్కడికి వచ్చిందన్న మాట'' అని నవ్వాడు రత్నాదిత్యుడు

''శౌర్య సాహసా లున్నచోటల్లా ఘోఘాబాబు కన్పిస్తూనే ఉంటారు రత్నా'' అని విచార వదనంతో అని, ''మీకు కావలసిన సమస్త వస్తువులూ అవిగో? ఆ నావలో ఉన్నాయి అక్కడ కమలఖాణీ కలిశారు. ఆ నావలో వారున్నారు'' అంటూ సముద్రంవైపు చూపాడు సామంతుడు

''ఇక పద! ఎటు చూసినా పరమేశ్వరుని అనుగ్రహ బలం కనిపిస్తూనే ఉన్నది ఇక సౌరాష్ట్ర పరాక్రమం ప్రదర్శించాలి ''

''సరే నేను కూడా మహారాజును లేపి కలుసుకుంటాను తెల్లవారకముందే తిరిగి వెళ్ళిపోవాలి'' ఆ మహావీరులిద్దరూ కౌగలించుకొని వీడ్కోలందుకున్నారు తరువాత సామంతుడు ఒక సైనికునితో మహారాజు శిబిరానికి నడిచాడు

ప్రాంగణంలో అడుగుపెట్టగానే సామంతుని మనస్సులోని మధుర స్మృతులన్నీ ప్రాణంతో లేచి నిల్చున్నాయి అదుగో అదే స్తంభం దానిక్రింద కూర్చునే అతడు తన అశ్రుభారాన్ని తగ్గించుకున్నాడు కుండల, త్రిపురసుందరీ మందిరం . అక్కడ మహామాయకు హారతులిచ్చినప్పటి దృశ్యం ఆ హారతి ఇచ్చిన మహామాయ స్వరూపి నాతో తాను ఆ రాత్రి మాటాడుతూ బ్రతుకు భారాన్ని దించుకున్న మధుర దృశ్యం కూడా జ్ఞాపకం వచ్చింది ఆనాటి రాత్రి ఎంత ఉల్లాసంగా . నవ్వుల చిలకరింపులతో ప్రేమకడలి కలకలలతో గడిచింది!

పెను తుఫానులు ప్రళయతాండవం చేసే పెద్ద ఎడారిలో చిక్కుపడిన బాటసారిలా ఉన్నది సామంతుని జీవితం చోళా స్మృతి ఒక్కటే అతనికి ఆనందాన్నీ, విశ్రాంతినీ ఇచ్చే ఘట్టం మానవ మమకారం కొరకు తపిస్తున్న ఈ ఏకాకికి చోళాయే ఆశాకేంద్రం

చుట్టూ విలయతాండవం చేస్తున్న ప్రళయంలోంచి, హృదయాన్ని దహించి దుఃఖ స్మృతులను మరింత మాడ్చివేసే గత ఘట్టాల తుఫానులోంచి తెరిపి చేసుకొని కొంత విశ్రాంతి తీసుకొనే అవకాశం లభిస్తే చాలు సామంతుని హృదయం ఉల్లాసంతో ఆ సుందరి గాలిలో తేలిపోయే ఆ మధుర నర్తకి చుట్టూ తిరుగుతూంటుంది అతడు ఖంభాతం వెళ్ళినప్పుడు ప్రభాసం నుంచి నావల్లో దేవదాసీలందరూ వచ్చారని తెలిసింది ఒక్క క్షణం అతని హృదయం ఎగిరి గంతువేసింది. చోళా కూడా వచ్చిందేమో!

కానీ గగనరాశి గంగా, చోళా లిద్దరూ ప్రభాసంలో గురుదేవుని సన్నిధిలోనే ఉన్నారని తెలిపాడు గురుదేవుడే వారిని గురించి తెలుపుతారని అటు నడిచాడు. కానీ, ముందుగా మహారాజును కలుసుకొని ఆయనకు అన్ని సంగతులూ తెలపాలి అది తన కర్తవ్యం కనుక ముందు మహారాజు శిబిరం వైపు నడిచాడు

సైనికుడు శిబిరాన్ని చూపాడు శిబిరం ముందు వీరాచావడా విచ్చుకత్తితో పహరా ఇస్తున్నాడు

''ఎవరది?''

''నేనే సామంత చౌహాన్‌ను ఎవరు చావడా! మహారాజు లేచారా!''

''ఎవరు? మీరా ప్రభూ!'' వీరా చకితుడై నెమ్మదిగా అడిగాడు

''అవును నేను ఖంభాతం నుంచి పడవలో వచ్చి, ఈదుకుంటూ మహారాజును కలిసిపోదామని వచ్చాను. వెంటనే తిరిగి పోవాలి'' అంటూ సామంతుడు మెట్లు నెక్కాడు

వీరాచావడా కత్తి అడ్డంగా ఉంచి ''వీల్లేదు బాబుగారూ!'' అన్నాడు

సామంతుని ముఖం జేవురించింది ''ఏం? నేను చెప్పింది అర్ధంకాలేదా? త్వరగా మాట్లాడాలి ''

''అయితే నిల్చోండి బాబూ నేను లేపుతాను ''

''నేను లేపుతాలే?''

''వద్దు, వారు ఒంటరిగా లేరు''

''మరెవరున్నారు ఇంకా ఇపుడు ఇలాంటి సమయంలో?'' వీరా నవ్వుతున్నాడు ఆ నవ్వు ఏదో వినోదాన్ని సూచిస్తున్నదని సామంతుడు గ్రహించాడు

''ఎవరున్నారింకా?''

''ఆమె ఆ చోళా నర్తకి ''

సామంతుని చెవులకీ వార్త సృష్టి అంతా విరిగి నెత్తిన పడ్డట్టు వినిపించింది నెమ్మదిగా గోడ నానుకొని అలా జారి క్రింద కూలబడిపోయాడు

''ఉండండి బాబూ! నేను ప్రభువులను మేల్కొల్పుతాను ''

''ఎంతసేపైంది నిద్రించి వీరా!'' సామంతుని కంఠంలోంచి ఈ నాలుగు మాటలూ ఆగి ఆగి, భయంతో వణుకుతూ చనిపోతున్న వ్యక్తి మాటాడినట్లు వెలువడ్డాయి

''నాలుగైదు ఘడియలైంది''

''అయితే నిద్రించనీ నిద్రించనీ '' అంటూ పొరలివస్తూన్న దుఃఖంతో అన్నాడు

## 5

శివరాశి గురుదేవునితో మౌనంగా తన నివాసానికి వెళ్ళాడు దీనికి కారణం అతనికి తప్ప మరెవ్వరికీ తెలియదు. తన ఎదురుగా సర్వజ్ఞులు నిలుచున్నప్పుడు అతనికి లకులేశులే వచ్చి నిల్చున్నట్లనిపించింది ఆయనే తనను ''వెళ్దాంరా నాయనా '' అని పిలిచినట్లనిపించింది

అతడిన్నాళ్ళు చేసిన తపస్సు ఫలించింది పాశుపత ప్రస్థాపకుడే తననీ పాపతీర్థం నుంచి బైటికి తీసుకొని వెడుతున్నాడు దివ్యతేజం మహాపుంజమై నవ్వుతూ, గెంతుతూ ముందు ముందు నడుస్తున్నట్లనిపించింది అతని మనస్సులో దైన్యం ఆవరించుకున్నది ఈ చీకటి కోణంలోంచి తన గురువు తన ఇష్ట దేవుడే ప్రకాశంలోనికి నడిపిస్తున్నాడు

అలా చాలాసేపు అతడు ఆ చీకట్లో కండ్లు తెరచుకొని చూస్తూ కూర్చున్నాడు ఇంతలో సిద్ధేశ్వరుడు వచ్చి అతని దృష్టి నాకర్షించడానికి మెల్లగా దిగాడు

''సిద్ధేశా భగవానుడు ఇప్పుడే వచ్చి వెళ్ళారు '' అన్నాడు వినమ్రమైన స్వరంతో శివరాశి

సిద్ధేశ్వరుడు చకితుడైనాడు మళ్ళీ సర్వజ్ఞుణ్ణి ఈ మనిషి భగవాను డంటున్నాడే!

''లకులేశ భగవానుడు ఆజ్ఞాపించాడయ్యా!''

''లకులేశ భగవానులా!''

''అవును శంకరావతారులైన ఆ మహానుభావుడు ఇప్పుడే వచ్చి సాక్షాత్కరించారు 'నాయనా! ఈ స్థానం అంతా ఘోరాతి ఘోరమైన దురాచారాలతో నిండిపోయింది' అని అన్నా'' రన్నాడు శివరాశి స్వాభిమానంతో

''అది నాకూ తెలుసు ''

''ఇంకా నన్ను సంబోధించి 'ధర్మాన్నీ, ఆచారాలనూ ద్వేషించే ఈ పాపులందరూ నీచమైన చావు చస్తారు ఈ పాపమందిరాలు దగ్ధమై భస్మమవుతాయి నీవీ స్థానం వదలి ఈ పాపుల నీడ కూడా సోకనిచోట మరొన్ని నెలకొల్పు పాశుపత మత ప్రభావాన్ని అక్కడి నుంచి ప్రచారం చెయ్యి నేను మునుపు చేసినట్లు సోమనాథ భక్తినీ త్రిపుర సుందరీ మహోపాసననూ ప్రపంచంలో వ్యాపింపచెయ్యి' అని కూడా చెప్పారు ''

''గురుదేవా!'' సర్వజ్ఞుని గురుత్వాన్ని శివరాశి వదిలిపెట్టినప్పటినుంచి శివరాశికే గురు పదవిని అంటకట్టాడు సిద్ధేశుడు ''మీరు గురుదేవునికి కాదు కాదు ఆ గంగ సర్వజ్ఞునికి చెప్పి ఖంభాతం వెళ్ళటానికి ఏర్పాటు చేయించండి సముద్రంలో కమాలఖాణీ నావలు కూడా ఉన్నాయి అసలీ అమీరు సైన్యాన్ని చూచినప్పుడే ఇక ఇక్కడ ఉండడంలో అర్థం లేదనుకున్నాను నేను'' అన్నాడు

శివరాశిదెబ్బతిన్న బెబ్బులిలా సిద్ధేశుణ్ణి చూచాడు

''ఆ పాపి సహాయంతో పారిపోవడం కంటే ఇక్కడే ఆత్మశక్తి నుపాసిస్తూ ఉండడం మంచిది ''

''మరి వెళ్ళిపోవడం ఎలా?''

''ప్రాణాల కోసం నేను పారిపోవడం లేదు పరమేశ్వరాజ్ఞ యిది త్రిపురసుందరి నాకు దారి చూపుతున్నది ఆమె చూపిన దారి వెంట నేను వెళ్తాను అప్పుడే పాశుపత మతం ఉద్ధరింపబడుతుంది ''

అలా అంటూన్నప్పుడు అతనికి బైట దీపకాంతిలో త్రిపురసుందరి దారి చూపుతున్నట్లు కన్పించింది తనను పిలుస్తున్నట్లనిపించింది

''సిద్ధేశా! అదిగో మన కాజ్ఞ లభించింది మహామాయ దారి చూపుతున్నది బయల్దేరు ఈ పాపస్థలాన్ని విడిచి వెళ్ళాలి నడు ''

''వెళ్ళడం ఎలా స్వామీ!'' అని సిద్ధేశుడు తన గురువుగారి మాటలకు విసిగిపోయి అడిగాడు

శివరాశి వ్యాకులపాటుతో నలువైపులా చూచాడు కలలోంచి తేరుకున్నట్లు కొంతసేపటికి తేరుకున్నాడు

''పో పోయి దద్దా చాళుక్యుణ్ణి పిలుచుకొనిరా!''

''ఆయన జునాగఢ ద్వారానికి పహరా యిస్తున్నారు ''

'వెళ్ళు వెళ్ళి నే నాజ్ఞాపిస్తున్నానని చెప్పు వెంటనే వచ్చి కలసుకొమ్మని చెప్పు.'

సిద్ధేశుడు వెళ్ళిపోయిన తరువాత కొంతసేపటికి హరదత్తుడు మరొక బైరాగితో వచ్చాడు

'నమశ్శివాయ గురుదేవా!'

'శివాయనమః ఏమిటి నాయనా !' అన్నాడు శివరాశి

'ఇక బయలుదేరండి గురుదేవా! మహామాయ పూజకై ఏర్పాట్లన్నీ చేశాం ఇక మీ రాక ఒక్కటే మిగులు మీరు వస్తే చోళాను ఎత్తుకొని వస్తాం '

'చోళానా! మహామాయనా!'

'అవును గురూ!'

'మూర్ఖులారా! పూజించినంత మాత్రాన ఏమవుతుందయ్యా!' అంటూ పండ్లు పటపట కొరికి 'మన మీ పాపభూమి నుంచి వెళ్ళిపోవాలి వెళ్ళి అక్కడ మహామాయను ప్రతిష్ఠించాలి అది లకులేశ భగవానుని ఆజ్ఞ '

'అయినా ఎక్కడికి వెళ్తారు?'

'ఎక్కడికైనా సరే ఈరోజే ఇప్పుడే ఈ పాపులందరికీ దూరంగా వెళ్ళిపోవాలి మీలో వచ్చే సాహసం ఉన్నదా? రేపీపాటికి ఈ భూమి అంతా కాలి బూడిద అవుతుంది తెలుసా?' అన్నాడు శివరాశి

'అయితే వెళ్ళడం ఎలా?'

'మహామాయే దారి చూపుతుంది రాగలవా?'

'తప్పకుండా '

'సరే వెళ్ళి చోళాను తీసుకురండి కానీ ఎవ్వరికీ తెలియకూడదు ఒక్క ఘడియలో ప్రభాసాన్ని విడిచిపెట్టాలి '

సాక్షాత్తు శంకరస్వరూపులుగా తమ దృష్టికి కన్పిస్తున్న ఈ గురువు ఆజ్ఞలను పాలించడానికి హరదత్తాదులు వెళ్ళిపోయారు

## 6

సామంతుడు నెత్తిన చేతులు పెట్టుకొని ఏడవడానికి కూడా శక్తిలేక అలా కూర్చున్నాడు

అతని జీవితంలో కనుచూపు మేర వరకు నిరామయమైన అవసాన దశలో పల్కరించే దిక్కులేని ఎడారే కన్పిస్తోంది అతడు ఒంటరిగా కేవలం ఒంటరిగా .. కుటుంబం ఇల్లు అదృష్టం ఆశయ కాంక్షలు లేకుండా బ్రతికుండి కూడా చచ్చినట్లు పడివున్నాడు అతను మహా వికృతంగా నవ్వాడు చివరకు పరమేశ్వరుడు తనకై ఏమీ మిగల్చలేదు కదా!

'చౌహాన్‌ప్రభూ! మహారాజులు పిలుస్తున్నారు వేంచేయండి' అని పిలిచాడు పైనుంచే వీరాచావడా

సామంతుడు ప్రాణం బిగపట్టుకొని లేచి నిల్చున్నాడు చేతితో నుదురు తుడుచుకొని పైకి వెళ్లాడు భీమదేవుడు ఎదురుగా రెండు చేతులూ చాచి నిలుచున్నాడు

'సామంతా! సోదరా! ఎక్కడ్నుంచి వీరా?'

సామంతుడు భీమదేవుని కౌగిలిలో శీతల శవంలా నిలుచున్నాడు

'ఎవరూ? చౌహాన్ వీరుడా?' లోపలనుండి వినిపించింది. తరువాత చోళా లోపలి నుంచి వచ్చి ప్రేమతో సోదరుణ్ణి చూచి సోదరి దిష్టి తీసినట్లే మెటికలు విరిచింది

అతడు గజగజ వణుకుతూ చోళా స్పర్శను సహిస్తున్నాడు ఒకసారి కన్నెత్తి వీరశ్రేష్ఠుడైన భీమదేవుణ్ణి చూచాడు మహారాణి కాదగిన చోళా మూర్తిని చూచాడు వారిద్దరి కనుకొలకుల్లో ఒరిగి పెల్లుబుకుతున్న పరస్పరానురాగాన్ని గ్రహించాడు. వస్తూన్న ఎక్కిళ్ళను ఆపుకొని తలవంచి రెండు చేతులూ నుదుట చేర్చి నమస్కరించాడు

'చోళా! మహారాజా! మీ కలయిక ఆనందదాయకం '

అప్పుడప్పుడు అతడు చైతన్యావస్థలోనో అర్ధచేతనావస్థలోనో ఊహాతరంగాలలో తేలుతూ ఘోఘూరాణా మనుమడు రాజ్యవైభవాన్ని చేపట్టడానికి యోగ్యుడైనాడనీ, చోళా అతని అర్ధాంగియై రాజ్యాన్ని మరింత తేజరిల్లచేస్తుందనీ కలలు కనేవాడు ఇప్పుడు తలవంచి వారిరువురికీ నమస్కరిస్తూ అలా కలల్లో తేలిపోవడం ఎంత తప్పిదం అని అనుకున్నాడు అతడా భావాన్ని మనస్సు నుండి దూరం చేశాడు

'నీకు కూడా చోళా తెలుసునని నాకు తెలియదు సుమా' అన్నాడు మహారాజు

'మహారాజా! నేను ఒంటరిగా ప్రపంచంలో దిక్కులేని పక్షిలా తిరుగుతున్నాను ఈ చోళా నాకు సోదరియై ఆ లోటు తీర్చింది ఆమె సదా మంగళమూర్తియై వెలుగొందాలి చెల్లీ! ఇక నేను ఒక నిముషం మహారాజుతో సంభాషించాలి మరు ఘడియలో తిరిగి వెళ్ళిపోవాలి నీవు కాస్త లోపలికి వెళ్ళు '

చోళా వెళ్ళిపోయింది సామంతుడు భీమదేవుణ్ణి మేడమీద ఒక మూలకు తీసుకొని వెళ్ళాడు

'మహారాజా! అవకాశం అట్టేలేదు పని చాలా ఉంది నేనన్ని విషయాలూ రత్నాదిత్యునికి తెలిపాను అడిగి తెలుసుకోండి అనహిలవాడలో తిరిగి తమ రాజ్యం నెలకొంది దామోదర్ సైన్యంతో అమీరును వెనుక నుంచి ఎదిరిస్తున్నాడు మార్వాడ్, ఉజ్జయినీ సైన్యాలు కూడా రెండు మూడు రోజుల్లో వచ్చి కలుసుకుంటాయి నేను ఖంభాతం నుంచి నావల్లో ఆహార, వస్త్రాలు తెచ్చాను '

'ఏమిటీ? భేష్ సామంతా సెభాష్!'

'ఇక నేను త్వరగా వెళ్తాను రేపు మళ్ళీ వస్తాను '

'సామంతా! నీవు మానవమాత్రుడివి కావు దేవతవు '

'మనుష్యుణ్ణా కాను నిజమే కాను లేకపోతే ఇంత దుఃఖంతో కుమిలి ఏనాడో చచ్చిపోవలసింది '

'అలా అనకు సామంతా! నీవు నా కుడిభుజంలాంటి వాడివి '

'ఇక స్వవిషయం కూడా ఒకటి ఉంది ' సామంతుని కంఠంలో మహా కర్కశధ్వని వినిపించింది

'ఏమిటీ?' అంటూ భీమదేవుడు ఆశ్చర్యచకితుడై వెనక్కు ఒక్క అడుగు వేశాడు సామంతుని ముఖం జేవురించి మహోద్రేకంతో ఉగ్రరూపాన్ని ధరించింది అతని చేతిలో పిడిబాకు మెరుస్తున్నది

'చోళా మీది మోజు క్షణికమా లేక అలసట తీర్చుకోడానికి ఒరాత్రి గడిపే మజిలీ మాత్రమేనా? లేక ' ఈ ప్రశ్న వెనుక దాగివున్న నిశ్చయం, పట్టుదల మహా సాహసియైన భీమదేవుణ్ణి కూడా నిలువునా వణికించాయి

'ఎవరన్నావు.'

'ఆమె పుట్టుకతో దేవదాసి అవసరం గడచిన పిమ్మట చాళుక్య నరేశుని ప్రాసాదంలో ఎలా ఉండగలదిక?'

భీమదేవుడు గ్రహించి కిలకిల నవ్వాడు 'సామంతా! గాభరాపడకు చోళాయే నాజీవన సర్వస్వము ఆమెను మరిచిపోగలనటయ్యా!'

'ఆమె గురుదేవుని పుత్రిక నాకు సాక్షాత్తు సోదరి ఈ రేయి గడచిన పిమ్మట ఆమె గుజరాత్‌కు పట్టపుదేవి కాలేనిచో ఇప్పుడే నిర్ణయించుకుందాం' అంటూ సామంతుడు పిడికత్తిని భీమదేవుని విశాల వక్షంమీద అనించాడు సామంతుడు నిశ్చలంగా, భయంకరుడై, క్రోధమూర్తియై నిలుచున్నాడు

భీమదేవునికి నవ్వు ఆగలేదు 'చౌహాన్ వీరా! చోళాకు ఇలాంటి సోదరుడు ఉన్నాడని నాకు తెలియదు సుమా! భయపడకు ఆమెను చూచినప్పుడే నా అర్ధాంగిగా స్వీకరించాను గౌరవింపదగిన స్త్రీ, పత్నిగా గూడా సన్మానింపబడుతుంది'

సామంతుడు పిడిబాకును వరలో పదిలపరచి 'క్షమించండి మహారాజా! క్షమించండి అనవసరంగా మిమ్ములననుమానించాను' అన్నాడు

'అలా అనకు సామంతా! నా భార్యకు సోదరుడివైనావు యుద్ధం పూర్తయ్యాక నీవే కన్యాదానం చేయాలి'

సామంతుని ముఖంలో తిరిగి గంభీరత కనిపించింది 'మహారాజా! నే డామె మీకు భార్య రేపు ఏమికానున్నదో?'

భీమదేవునిలో కూడా ఆలోచన రేకెత్తింది 'నీ మాట నిజం! వెళ్ళి రత్నాదిత్య, విమల, దద్దా చాళుక్య ప్రభువులను గురుదేవుల దగ్గరకు తీసుకొనిరా వెళ్ళు అనిర్ధారిత ముహూర్తాన్ని మించిన మంచి ముహూర్తం మరొకటి లేదు చోళా!రా! గురుదేవుల దగ్గరకు వెళ్దాం గురుదేవుల సాన్నిధ్యంలోనే మనం వివాహం జరుపుకుందాం'

వెంటనే భీమదేవుని వివాహం జరిగింది గురుదేవులు ఆశీస్సులిచ్చారు గంగ హర్షాతిరేకంతో ఉన్మాదిని అయింది సామంతుడు లేచాడు 'గురుదేవా! భీమదేవా! తెల్లవార వస్తున్నది ఇక నేను వెళ్తాను'

చోళా భీమదేవులిద్దరూ అతణ్ణి గురుదేవుని నివాస ప్రాంగణం వరకు సాగనంపారు

'అన్నా!' చోళా కండ్లలోంచి అశ్రువులు ధారలై పారాయి 'అన్నా! త్వరగా వస్తావుకదూ'

'బ్రతికి ఉంటే బ్రతికిఉంటే రాఖీ కట్టించుకోడానికి వస్తానమ్మా! తప్పకుండా వస్తా'నంటూ కన్నీటిని తుడుచుకుంటూ, దుఃఖాన్ని ఆపుకొని, 'జ్ఞాపకం

ఉంచుకుంటావా చెల్లీ!' అని వెక్కుతూ తలవంచుకొని ద్వారకా ద్వారం వైపు వెనుకకు చూడకుండా పరుగెత్తాడు సామంతుడు

## 7

సిద్ధేశ్వరుడు వచ్చే వేళకు శివరాశి మహా బాధ పడుతున్నాడు

'ఏమైంది?'

'దద్దా కన్పించలేదు అందరూ గురుదేవుల నివాసానికి వెళ్ళారు '

'అయితే బైట నిల్చో కన్పిస్తే పిలుచుకురా' అన్నాడు శివరాశి సిద్ధేశ్వరుడు బైటికి వెళ్ళి నిలుచున్నాడు

కొంతసేపటికి హరదత్తుడు తన అనుచరునితో వచ్చాడు అతని ముఖంలో ఏదో వర్ణింపనలవికాని వ్యాకులపాటు కన్పిస్తున్నది

'గురుదేవా! గురుదేవా! అంతా వ్యర్థమైంది స్వామీ!'

'ఏమిటీ?'

'సర్వజ్ఞులు చోళాను భీమదేవునికిచ్చి వివాహం చేశారు '

'ఏఁనిటీ?!' అని శివరాశి పిచ్చివాడిలా బిగ్గరగా గావుకేక పెట్టాడు

'ఇప్పుడే వివాహం జరిగింది నేను మిద్దెమీద నుంచి చూచాను '

ఇది వినగానే శివరాశి ముఖం వివర్ణమైంది గుడ్లు బ్రద్దలై బైటికి వస్తవేమో నన్నంతగా కండ్లు తెరచి చూడ నారంభించాడు రెండు చేతులతో జుట్టు పీక్కున్నాడు అతని శరీరంలో ప్రతి రక్తకణంలో సెగలు రగుల్కొంటున్నాయి అంతవరకూ గురుదేవునిలా నటిస్తున్న నటన మాయమైంది

తపస్సు పట్ల అతని శ్రద్ధ నాశనమైంది చోళా తన ప్రియసుందరి త్రిపురసుందరి భీమదేవునికి భార్య అయింది హాలాహలాన్ని మంచుతో రంగరించి మూసలో పోసిన మూర్తిగా తయారైనాడు శివరాశి

'గురుదేవా! ఇక ఏమి చేయాలో చెప్పండి వెళ్ళడమా? మానడమా?'

'ఈ పాపాత్ములు భస్మమై నశించేదాకా కదలడానికి వీల్లేదు మీరు వెళ్ళిపోండి పని ఉంటే పిలిపిస్తాను ' రాశి కండ్లలోని కోపాగ్నిని చూచి బైరాగులిద్దరూ వెళ్ళిపోయారు

కొంతసేపటికి దద్దా, సిద్ధేశ్వరులు వచ్చారు వచ్చి శివరాశి ఆకారాన్ని చూచి స్తంభించిపోయారు

'దద్దా! నా ఒక్క ఆదేశాన్ని నీవు తప్పక పాటించాలి.'

'ఏమిటి స్వామీ?'

'ఎలాగైనా సరే, సిద్ధేశ్వరుణ్ణి కోట బైటికి పంపే ఉపాయం ఆలోచించు '

'నేనా!' శివరాశి హృదయంలో జరుగుతున్న విప్లవాన్ని గ్రహించలేక సిద్ధేశుడు అన్నాడు

'అవును నీ కొరకే,' అని శివరాశి గర్జించాడు సిద్ధేశ్వరుడు గాభరాపడి మౌనంగా ఉండిపోయాడు

'కానీ స్వామీ! నే నెలా ఏర్పాటు చేయడం? మహారాజుకు తెలిస్తే నన్ను చిత్రవధ చేస్తారు '

'దద్దా! నా ఆశీస్సువల్ల నీకు కుమారుడు జన్మించాడు ఒక్క శాపంతో వాణ్ణి సంహరించగలను సిద్ధేశ్వరుణ్ణి బైటికి పంపుతావా లేదా?'

'సరే సరే కొద్ది సేపైన తరువాత ద్వారకా ద్వారం దగ్గరకు పంపండి నేను అంతా సిద్ధపరుస్తాను '

సామంతుడు వెళ్ళబోతున్నాడని అంతకుముందే రత్నాదిత్యుడు దద్దాకు చెప్పాడు కనుక అతనికి ఉపాయం తట్టింది వెంటనే అతడా ఉగ్రమూర్తి దగ్గర నుంచి వెళ్ళిపోయాడు

సిద్ధేశ్వరునికి శివరాశి చెప్పవలసినదంతా చెప్పాడు అది విని అతడు గజగజ వణికిపోయాడు చివరికి అతడు కూడా ప్రభాసంలో ఏర్పడుతున్న మృత్యువేది నుంచి తప్పించుకొని పారిపోదామనే ఆశను ఆపుకోలేక పోయినాడు

కొద్దిసేపటికి సిద్ధేశ్వరుడు ద్వారకా ద్వారం దగ్గరకు వెళ్ళేసరికి, అప్పటికే ఖారా - నీరాలు సామంతుణ్ణి సముద్రంలోకి దింపారు దద్దా, మరిద్దరు నావికులు తప్ప అక్కడ మరెవ్వరూ లేరు

'ఖారా! మహారాజు ఇతణ్ణి కూడా దింపమన్నారు ఇతడు కూడా చౌహాన్‌తోటే వెళ్తాడు' అన్నాడు దద్దా

మీ చిత్తం అని ఖారా సిద్ధేశ్వరుణ్ణి కూడా సముద్రంలోకి దించాడు

పదునారవ ప్రకరణం

# రెండవరోజు

## 1

సూర్యోదయమైంది రాజపుత్ర సైన్యం సన్నాహమై కోటగోడలమీద నిల్చున్నది ఇంకా అమీరు సైన్యం ఎదిరించలేదు ద్వారకా, జునాగఢ ద్వారాల దగ్గర శత్రుసైన్యం కొద్దిగా ఉంది అటువైపు అట్టే భయంలేదు సైన్యం అంతా ముఖద్వారం ముందే గుమికూడింది ఆక్రమణ ఎలా జరుగుతుందో చెప్పడం సాధ్యం కావడంలేదు

సైన్యా లన్నిటినీ ముఖద్వారం దగ్గర సమకూర్చమని మహారాజు ఆజ్ఞాపించాడు

అమీరు యమధర్మరాజులా తన శిబిరంలోంచి బయలుదేరి అన్ని చోట్లా తిరిగి వచ్చాడు తరువాత ఆజ్ఞాపించాడు భేరీలు మ్రోగాయి కొమ్ములు ఊదారు రెండు అశ్వదళాల మధ్యన స్థలం వదిలి అగడ్తవైపు నడిచాయి

ఆజ్ఞ కాగానే వందలకొలది సైనికులు ఆరు పెద్దపలకల వంతెనను మోసుకుంటూ మధ్యద్వారం వైపు అగడ్త దగ్గరకు పరుగెత్తారు వారి వెంబడి ఎందరో వచ్చారు వారి కిరువైపులా అశ్వదళాలు కాపలా కాస్తున్నాయి అగడ్తమీద వంతెన నిర్మించడాని కాప్రయత్నమంతా

భీమదేవుడు మధ్య ద్వారం దగ్గర విలుకాండ్ర నందరినీ సమీకరించాడు ఒక పంక్తి అశ్వదళాన్ని చెండాడుతున్నది రెండో పంక్తి పలకలు మోసే వాళ్ళనూ, వడ్రంగులనూ నురుమాడుతున్నది ఆకాశంలో 'అల్లాహోఅక్బర్' 'జయ్‌సోమనాథ్' అనే నినాదాలు మారుమ్రోగుతున్నాయి

శత్రువుచేస్తున్న ఈ ఆక్రమణ సామాన్యమైనది కాదు ఒకడు చస్తే లిప్తకాలంలో మరొకడు అక్కడికి వస్తున్నాడు ఒక గుల్మం పడిపోతే మరొకటి ఆ స్థానాన్ని ఆక్రమిస్తున్నది పైనుంచి రాజపుత్రుల శరపరంపర వర్షిస్తున్నది క్రింద గుట్టలుగా పడిపోతున్న మృత సైనికుల శవాలమీద నడుస్తూ సైనికులు పురోగమిస్తున్నారు

మధ్యద్వారాన్ని భేదించడానికి జరుగుతున్న ఈ ప్రయత్నాన్ని ఆపడానికి రత్నాదిత్య, భీమదేవులొక క్రొత్త ఉపాయాన్ని ఆలోచించారు ఏనుగులచేత పెద్దపెద్ద కొండరాళ్ళను తెప్పించి ద్వారానికి లోపల పేర్పించారు వంతెన నిర్మించడానికి ప్రయత్నించే వ్యక్తులను రాళ్ళు విసిరి పడగొడుతున్నారు

ఇరుపక్షాల బాణాలతో ఆకాశంలో ఒక కప్పు ఏర్పడినట్లయింది క్రింద అమీరు సేన వంతెన కట్టడానికీ, భీమదేవుని సేన దాన్ని విరగగొట్టడానికీ ప్రయత్నిస్తున్నారు

పైనుంచి రాజపుత్ర వీరులు బాణహతులై క్రింద పడుతున్నారు క్రింద అమీరు సైన్యం రాళ్ళక్రింద పడి నలిగి చస్తున్నారు

అమీరు కూడా మనుష్యుల విషయంలో ఆనాడు లోభం వదిలిపెట్టాడు చీమలబారుల్లా సైనికులు ముందుకు సాగుతున్నారు అగడ్తలో, బైట శవాల గుట్టలు పెరిగిపోతున్నాయి

సూర్యుడు నడినెత్తికి వచ్చేసరికి వంతెన కడుతున్న చోట తుముల యుద్ధం ఆరంభమయింది చివరకు ఎలాగైతేనేమి అమీరు సైనికులు వంతెన కట్టారు దానిని కోట తలుపుల ఇనుప గొలుసులకు కట్టి బిగించారు

కోట లోపల కూడా రాళ్లు పేర్చి తలుపులు కదిలినా తెరచుకోకుండా ప్రయత్నించారు రాజపుత్రులు ఇండ్లను పడగొట్టి, చతుశ్శాలను విరగగొట్టి, మందిరాలలోంచి రాళ్ళను తెచ్చి కోటమీద రాసులు పోశారు

రెండు పక్షాలూ మహా ప్రయత్నాలు చేస్తున్నాయి

దూరాన అమీరు పచ్చతలపాగా, అర్ధచంద్రుని పతాకా కన్పించింది మళ్ళీ మాయమైనాయి

ఒకటి తరువాత ఒకటిగా ఆరు మదపుటేనుగులు తొండాలతో పెద్ద పెద్ద దూలాలను పట్టుకొని పరుగెత్తుకుంటూ ఘీంకరిస్తూ వచ్చి తలుపులను ఆ దూలాలతో కొట్టాయి తలుపులు గజగజ వణికాయి ఆ కుదుపుకు పై బురుజులు కూడా కంపించిపోయాయి ·

కానీ బండరాళ్లతో కదలకుండా కాపాడబడుతూన్న తలుపులు చలించలేదు రాజపుత్రులు 'జైసోమనాథ్' అని హర్షధ్వని చేశారు

కానీ ఈ పద్ధతిని చూచి భీమదేవుడు దిగులుచెందాడు ఈ తలుపులు అంత గట్టి దెబ్బలను ఎంతవరకు సహించగలవు? పల్చని ఇనుపకవచాలతో అభేద్యమై ఎదిరిస్తున్న ఈ మదపుటేనుగులను చెండాడటం ఎలా?

భీమదేవ, రత్నాదిత్యులు ఒక ఘడియ ఆలోచించారు ఇక మృత్యు ముఖం నుంచి విజయాన్ని సాధించి బైటపడడమే తప్ప మరో మార్గం లేదు

ఒక వందమంది మహాత్యాగులు ప్రాణాలనర్పించడానికి ముందుకు దుమికారు రత్నాదిత్యుడు కూడా హుంకరించి ముందుకు వచ్చాడు కానీ, గురుదేవులు అతణ్ణి

ఆపారు భీమదేవుణ్ణి ఆపడం మరీ గగనమైంది ఇంకా యుద్ధానికి ఇది రెండోరోజే అప్పుడే జీవితాలను ఆపదలపాలు చేయడం శ్రేయస్కరం కాదు

శత్రువుల మదపుటేనుగ ఒకటి గాయపడ్డది దానిని తక్షణమే మార్చారు ఆరు ఏనుగులకు బదులు ఎనిమిది వచ్చాయి అవి క్రమేపీ ఇంకా ఎక్కువైనాయి వంతెన కూడా కదిలిపోతున్నది అవి తొండములతో పెద్ద పెద్ద దూలాలను తెచ్చి కొడుతున్నాయి వాటిపై ప్రయోగించిన బాణాలన్నీ వాటి ఇనుప కవచాలను భేదించలేక నీటిబిందువుల్లా జారి క్రింద పడుతున్నాయి

తలుపుల లోపలి భాగంలో సాధ్యమైనన్ని కొండరాళ్ళను పేర్చి రక్షిస్తున్నారు రెండు ఏనుగులు ఆ రాళ్ళ నానుకొని నిల్చున్నాయి ద్వారాల గొలుసులు కదిలాయి కానీ తలుపులు విరగలేదు అమీరు ఏనుగులు తిరిగి వెనుకకు వెళ్ళాయి

ఈ వంతెన మీద రెండువైపుల నుంచి బాణవర్షం కురుస్తూనే ఉన్నది ధనుర్ధారులైన ధీరయోధులెందరో హాహాకారాలు చేస్తూ పడిపోతున్నారు

రత్నాదిత్యునికి గాయాలు తగిలాయి విమల మంత్రికి కూడా గాయాలు తగిలాయి ఒక మహారాజు మాత్రమే ఇంద్రకవచాన్ని ధరించినట్లుగా నలువైపులా వీరతాండవం చేస్తున్నాడు

ద్వారకా ద్వారం దగ్గర కొంతమంది సైనికులు మాత్రమే కాపలా కాస్తున్నారు జునాగఢ ద్వారానికి ఎదురుగా అగడ్త ఒడ్డున తాబేటి సైనికులు, ఆశ్వికులు పొంచుకొని కూర్చున్నారు అక్కడ దద్దాచాళుక్యుడు కొంత సేనతో కాపలా కాస్తున్నాడు

మూడోసారి తిరిగి రెండు ఏనుగులను మార్చారు ఎనిమిది ఏనుగులు పలకలు తీసికొని ముందుకు వచ్చాయి ముందు నడుస్తున్న ఏనుగు వంతెన మీదుగా కొంత మేరకు వచ్చింది

పైనుంచి 'జై సోమనాథ్' అనే మహా నినాదం వినిపించింది ఆ నినాదంతోపాటే పైనుంచి కొయ్యమొద్దుల వర్షం ఆరంభమైంది ప్రతి మొద్దుకూ నూనెతో, గంధకంతో తడిపిన గుడ్డలు నిప్పుతో భగభగ మృత్యుజ్వాలలను ఎగదోస్తున్నాయి

ఎటు చూసినా గంధకమే మొదటి ఏనుగు గంధకపు వాసన వలన, మండుతున్న మొద్దుల వలనా హడలిపోయి బెదిరింది వెనుక వస్తున్న ఏనుగు ముందు కాళ్ళు ఎత్తి దీనిమీదికి ఎక్కింది దాని వేగాన్ని ఆపుకోలేక మొదటి ఏనుగు ముందుకు జారి-ఆగి మళ్ళీజారి - కాళ్ళు నిలవక - తూలి క్రింద పడిపోయింది

ఈ హడావుడి సమయాన్ని పురస్కరించుకొని యాభైమంది మహావీరులు ఒక చేతిలో దివ్విటీ, మరోచేత ఆకురాళ్ళను తీసికొని క్రింది వంతెన మీదికి కుప్పించి దుమికారు

వంతెన మీద నిల్చున్న ఏనుగులు ఎగిరి దుముకులు పెడుతూ దిక్కులు పిక్కటిల్లేట్లు ఘీంకరిస్తున్నాయి మధ్యనున్న నాలుగేనుగులు ఏమీ తెలియక భయపడి అక్కడే నిల్చుని నివ్వెరపడి చూస్తున్నాయి నేలమీద వున్న మిగతా మూడు ఏనుగులూ తోకలెత్తుకొని పారిపోయాయి

అశ్వికులకు కూడా ఏమీ తెలియడంలేదు అలాగే ముందుకు నడిచారు మరికొందరు వంతెనను రక్షిద్దామని వచ్చారు కోటపైన 'జై సోమనాధ్' అనే నినాదం మారు మ్రోగుతున్నది

ఎంత హడావుడి జరుగుతున్నదో కోలాహలం కూడా అంతగానే వున్నది ఇరుపక్షాల నుండీ ఎడతెగకుండా బాణాలు వర్షిస్తున్నాయి ఎవరికీ ఏమీ తోచలేదు హడావుడి సమయంలోనే ఇరవైమంది వీరసైనికులు ఆకు రాళ్ళతో కోటకు కట్టిన వంతెన గొలుసుల్ని కోస్తున్నారు మిగతావారు వంతెనకు నిప్పంటిస్తున్నారు కొంతసేపటికిగానీ అమీరు సైనికులు గొలుసులను కోస్తున్న రాజపుత్రులను చూడలేదు చూడగానే బాణవర్షం ప్రారంభమైంది కానీ వంతెనను సమీపించిన శత్రువులను గుజరాత్ వీరులు చీల్చిచెండాతున్నారు

చాలాసేపు ఈ మహాయుద్ధం జరుగుతూనే ఉన్నది భీమదేవుడు ఎందరినో బలిగొన్నాడు గాయపడిన రత్నాదిత్యుని గురి చెదరటంలేదు విమల మంత్రి విడిచిన ప్రతి బాణం ఒక్కొక్క ప్రాణిని బలిగొని తీరింది

అమీరు సైనికులు వంతెన మీదికి వచ్చారు ఇది చూచి పైనుంచి మరో యాభైమంది రాజపుత్ర వీర సైనికులు క్రిందికి 'జై సోమనాధ్' అని మహా భయంకర గర్జనతో దుమికి, క్రింద పోరాడుతూ మిగిలిన సైనికులకు బాసటగా నిల్చున్నారు

బాహా బాహీ యుద్ధం . చనిపోతూ చేస్తూన్న హాహాకారాలు మహా భయానకంగా వినవస్తున్నాయి శవాలు నిరంతరంగా అగడ్తలో పడిపోతున్నాయి

ఒక్కక్షణంపాటు ఇరు సేనల భవిష్యత్తు ఇదమిద్ధమని చెప్పడం కష్టమైంది కొంతసేపటికి వంతెన గొలుసులు తెగాయి. వంతెనకు అంటుకొని రగులుతున్న నిప్పు మధ్యదాకా వచ్చింది గొలుసులు రాలిపోతున్నాయి వంతెన ఇటూ అటూ ఊగి చెదిరి మహాద్వారానికి ఆనుకుని ఉన్న భాగం అంతా నీళ్ళలో పడిపోయింది

కోట పైనుంచి భీమదేవుడు 'జై సోమనాధ్' అని సింహగర్జన చేశాడు వేల కంఠాలలోంచి ఈ నినాదం మహా భయంకరంగా ప్రతిధ్వనించింది

## 2

శివరాశి అంతవరకూ గణపతి మందిరంలోనే కూర్చున్నాడు అతని దృష్టి శంకరుని మీదా లేదు గణపతి మీదా లేదు ఎదురుగా గోడ దగ్గర పడివున్న ఒక రాయిమీద ఉన్నది అతడు ఆ సురానందంతో మత్తిల్లిన కన్నుల ఎదుట ప్రభాస వినాశ దృశ్యం తాండవిస్తున్నది

అతడు సిద్ధేశ్వరుడు సముద్రంలో దూకడం గమనించాడు ముందు ముందు ఏదో ఒకరోజు తనకు ఉత్తరాధికారి కాబోతున్న విశ్వాసపాత్రుడైన శిష్యుడు ఈదుతుండగా చూచాడు ఆ వెన్నెల్లో సముద్ర తరంగాలను తన బలిష్ట బాహువులతో చీల్చుకుంటూ అమీరు సేనానులలో ఒకతనితో మాట్లాడుతుండగా చూచాడు ఆ సేనాని అతణ్ణి అమీరు దగ్గరకు తీసుకొని వెళ్తుండగా చూచాడు

పాశుపత మతం పక్షాన సంధికై రాయబారి హోదాతో సిద్ధేశుడు స్వాభిమానియై అమీరు ఎదుట నిల్చోడం శివరాసికి కనిపించింది అమీరు క్రిందికి వంగి ఈ మహాతేజశ్శాలి యైన తపస్వికి ప్రతినిధియై వెళ్ళిన ఆ రాయబారి పాదాలను కడుగుతున్నాడు తరువాత సిద్ధేశ్వరుడు అమీరు నుండి ఒక వాగ్దానం తీసుకున్నాడు అమీరు భీతుడై వాగ్దానం ఇచ్చాడు సిద్ధేశ్వరుడు అమీరుకు సంకటేశ్వర మహాదేవుని కోనేరును చూపాడు

శివరాశి కిలకిలా నవ్వాడు

ఆ పశువు భీమదేవుడు వాడి గురువు క్షుద్రబుద్ధియైన సర్వజ్ఞుడు ఇద్దరూ గత వారం ఆ కోనేరును పూడ్పించారు ఎవ్వరూ అందులోంచి రాకుండా ఉండేందుకు ఏ నిమిషాన తనను సర్వజ్ఞుడు పట్టశిష్యుడుగా ఎన్నుకున్నాడో నాడే తన కీ రహస్యం చెప్పాడు పాపం ఆ విషయం మరచిపోయాడు ఈ దారి తనకూ గంగుడికీ (సర్వజ్ఞుడు) మాత్రమే తెలుసు గంగుడు దాన్ని పూడ్పించాడు. తాను దాన్ని తెరిపించాడు అలాగే గంగ, సర్వజ్ఞుడు పాశుపత మతాన్ని ముంచారు తాను ఉద్ధరించాడు హోఁహోఁహోఁ

శివరాశి తన నవ్వుకు తానే భయపడ్డాడు 'ఇక ఆ బిలంలోంచి అమీరు కాలభైరవునివలె వినాశకమూర్తియై ప్రభాసంలో ప్రవేశించనున్నాడు '

తన శక్తికి తానే ఉప్పొంగి పోయాడు శివరాశి ఆ పాగురుబోతు గురువు చోళాను పరిణయమాడిన ఆ మూర్ఖుడు, వాడి సేన అందరి ప్రాణం తన గుప్పెట్లో ఉన్నది చిటుక వేసినంతలో మట్టిని నలిపినట్లు నలిపి ఈ ప్రాణులందరినీ నుసినుసి చేయబోతున్నాడు

సమయం గడుస్తున్నకొద్దీ అతడు చలించిపోతున్నాడు సిద్ధేశ్వరుడు సముద్రంలో మునిగిపోలేదు కదా! విద్రోహియై ఈ విషయమంతా సర్వజ్ఞునికి చెప్పలేదుకదా!

అలా జరక్కపోయినా అతని కోపం ఉపశమించదు అమీరు రాకపోతే తానా మార్గాన అమీరు దగ్గరకు వెళ్తాడు అవసరమైతే పూడ్చిన బావిలోంచి మట్టిని తానే త్రవ్వి పోస్తాడు ముల్లోకాలనూ భస్మం చేయగల రుద్రునిలాంటి శక్తిశాలి తాను మూడోకన్ను తెరవబోతున్నాడు ప్రభాసం దగ్ధం కాబోతున్నది ఇక చోళాను తీసుకొనిపోయిన భీముని బూది కూడా కనిపించదు తనను వదిలి మూర్ఖంగా కత్తి త్రిప్పుతూ బ్రతికే ఆ భీమదేవుణ్ణే వరించిన చోళా కూడా నాశనమై బూడిద అవుతుంది ఆ బూడిదను తాను తప్పక వెదికి వెదికి తెస్తాడు

ఇలా శివరాశి ఆలోచిస్తున్నాడు బైటినుంచి 'జై సోమనాథ్' అనే విజయనాదం వినిపించినప్పుడల్లా అతనిలో రగుల్కొంటున్న క్రోధాగ్ని అతని శరీరాన్ని దహిస్తున్నది

మధ్యాహ్నం దాటింది- సూర్యుడు అస్తమించబోతున్నాడు- ఇంకా వాళ్ళు

అతను కూర్చున్నచోట భూమి కదిలినట్లు ధ్వనించింది బోలు ధ్వని కాబోలు

అతడు పరుగెత్తుకుంటూ ఆ రాయిని సమీపించాడు కమ్చీతో చుట్టూ ఉన్న మట్టిని త్రవ్వాడు రాయిని పైకెత్తడానికి ప్రయత్నించాడు రాక్షసునివలె హర్షాతిరేకంతో భీభత్సమైన నవ్వుతో ఎగిరి గంతులేశాడు

ఇక---ఇక---ఆ సర్వజ్ఞుడు-- ఆ భీముడు-- ఆ చోళా నాశనమై---చచ్చి--- దగ్ధమై బూడిదైపోతారు

క్రింద నుంచి ఎవరో రాతిని కొడుతున్నారు ఒకటి, రెండు మూడు నాలుగు, అయిదు- అదుగో రాయి తిరిగింది

శివరాశి పశువులా వికటాట్టహాసం చేశాడు సాగరంలోంచి సిద్ధేశ్వరుని తల- జగద్గురుని రాయబారిలా కాక - బురదతో నిండి గాయాలతో -- రక్తంతో- తడిసి ముద్దయి, సాలిగూండ్ల బూజుతో మట్టితో మహా వికృతమై-- పైకి లేచింది

అలసిపోయి శవంలా అతడు పైకి వచ్చాడు అతని నడుముకు ఒక గొలుసు బిగించి వెనుక వస్తున్న ఒక సైనికుడు పట్టుకున్నాడు

శివరాశి శిష్యుణ్ణి కౌగలించుకోడానికి ముందుకు నడిచాడు సిద్ధేశ్వరుడు అసహ్యంతో ప్రక్కకు తొలిగాడు 'ఓరీ పాతకీ! దుర్మార్గుడా! నా చేత ఇదేమిటిరా మహాపాపం చేయించావు?' అని పండ్లు పటపట కొరుకుతూ అలుపుతో, ఆకలితో, దెబ్బలతో సగం చచ్చి, స్పృహతప్పి పడిపోయాడు పడిపోతూ తలతో భూమిని తాకాడు శివరాశికి మహాదుఃఖం పొంగుకొని వచ్చింది 'ఈ తన శిష్యుడు ఇలా అయిపోయినాడేం?'

పన్నెండుగురు సైనికులు పైకి వచ్చారు అందులో ఒక్కడే మ్లేచ్ఛుడు మిగతా పదకొండుగురు హిందువులే ఈ పనికై ఈ కాఫిర్లనే సరియైన వాళ్లుగా భావించాడు అమీరు

'నీవేనా శివరాశివి?' అని అడిగాడు ఒకడు

శివరాశి అవమానితుడై అటు చూచాడు రెండోవాడు శివరాశి భుజాలను పట్టుకొని ఊపుతూ, 'నడు- త్వరగా జునాగఢ ద్వారాన్ని చూపు' అన్నాడు

శివరాశి ముందు నడిచాడు - 'నాశనంకండి - ప్రభాసం - భీమదేవుడు - చోళా - సర్వజ్ఞుడు - యావత్తూ భస్మమైపోవాలి '

3

శిఖరం మీద నుంచి గురుదేవులు, గంగ, చోళా ముగ్గురూ ఆ దేవాసుర సంగ్రమాన్ని చూస్తున్నారు

నాడు చోళా ఆనందానికి అంతులేదు ఆమె పార్వతి - శంభుపత్ని అనహిలవాడకు మహారాణి ఆమె ప్రియదైవం కోటమీద పరాక్రమాన్ని ప్రదర్శిస్తున్నాడు సాయంకాలానికి అతడు విజయుడై తిరిగి వచ్చినప్పుడు తాను కుంకుమాక్షతలతో అతనికి స్వాగతం చెబుతుంది

గురుదేవుడు శివకవచం పఠిస్తూ శంభుని స్మరిస్తూ రక్షించమని ప్రార్థిస్తున్నాడు గంగకు అంతా సంతోషమే ప్రక్కనే గురుదేవులు- ఇదుగో చోళా-వివాహం కూడ అయిపోయింది ఇక ఆమెకు మిగిలిన కోరిక లేదు

వంతెన విరిగింది విరగ్గానే రాజపుత్రులు చేసిన విజయ నాదంతో తమ నినాదాన్ని కూడా ఆ ముగ్గురూ మేళవించారు ముఖ్యద్వారం దగ్గర కోటమీద విజయోన్మాదంతో సైనికులు ఎగురుతున్నారు క్రింద వంతెన విరిగింది అమీరు సైన్యం హతాశయై నిరాశపడింది ఇదీ నిజమైన విజయం-

ఇంతలో గురుదేవుని దృష్టి జునాగఢ ద్వారంవైపు మళ్ళింది

అయ్యో! ఆ పాడువెధవ ఏంచేస్తున్నాడు! అంటూ ఆయన క్రిందికి పరుగెత్తాడు అక్కడ శివరాశీ, దద్దాసోలంకీలూ ఏదో వాదించుకుంటున్నారు

వెంటనే ఏదో జరిగింది ఏమి జరిగిందో ఎవ్వరికీ తెలియదు ప్రొద్దుటి నుంచీ నిశ్చలంగా జునాగఢ ద్వారం ముందు పడివున్న అమీరు సైన్యం వెంటనే ఒక్కసారిగా లేచి నిల్చున్నది

భేరీలు నినదించాయి ఎక్కడా ప్రొద్దుటినుంచీ కనబడని అమీరు పరుగెత్తుకుంటూ వచ్చాడు

దద్దాచాళుక్యుడు శివరాశితో వాదిస్తూ మిగతా వారికి హెచ్చరిక చేయడంలో జాగు చేశాడు అమీరు సైన్యంతో ఎదిరించడం భీమదేవుడు చూచాడు వెంటనే గుఱ్ఱాన్ని పరుగెత్తిస్తూ జునాగఢ ద్వారం దగ్గరికి చేరాడు రత్నాదిత్యుడు శంఖధ్వని చేశాడు విమలుడు రణభేరి మ్రోగించాడు నలువైపులనుంచీ విలుకాండ్రు పరుగెత్తుకుంటూ అక్కడికి చేరారు

చోళా గాభరా పడింది 'అమ్మా! అమ్మా! అదేవిటే? అదేవిటి?'

గంగ కెవ్వుమంటూ చోళాను కౌగలించుకున్నది గురుదేవులు పరమ గౌరవాన్వితులు వయసుకు తగినట్లు అటువైపుకు పరుగెత్తారు

'అమ్మా! అదేవిటి చూడు జునాగఢ ద్వారం క్రింద ధ్వని అవుతోంది'

'అరే! ఆ తాబేటి సైనికులు నీళ్ళలోకి దూకేశారు మహారాజింకా అక్కడికి చేరుకోనేలేదు'

తాబేటి సైనికులు నీటిలో ఉన్నారు తీరంనుంచి సైనికులు బాణాలు వదులుతున్నారు దద్దాతో వున్న కొద్దిమంది సైనికులు మహాప్రయత్నం చేస్తూ రాలిపోతున్నారు

చివరకు దద్దా శివరాశిని ప్రక్కకునెట్టి కోట అంతటికీ హెచ్చరికగా కొమ్ము నూదాడు

భీమదేవుడు, రత్నాదిత్యుడు, విమలుడు సేనలతో హుటాహుటిగా అక్కడికి చేరారు దద్దా పిచ్చివాడివలె జుట్టు పీక్కుంటున్నాడు అతనిలో విల్లు ఎక్కుపెట్టే శక్తి కూడా నశించింది

'అమ్మా! మహారాజు అందుకున్నారు సమయానికి అందుకున్నారు' అంటూ చోళా సంతోషంతో చప్పట్లు కొట్టింది

పైనుంచి భీముని సైనికులు బాణాలు వదులుతున్నారు ఎదురుగా అయిదువేల మంది ఆశ్వికులు నీటిలోకి దూకారు వారి వెనుక అమీరు నల్లని గుఱ్ఱాన్ని ఎక్కి అటూ, ఇటూ తిరుగుతున్నాడు

నలువైపులనుంచీ మ్లేచ్ఛ సైన్యం జునాగఢ ద్వారం దగ్గరకు చేరుతున్నది

రాజపుత్ర సైన్యం కూడా చేరుకున్నది

భీమదేవుడు మహోగ్రుడై దద్దా మెడను ఒడిసిపట్టి 'కుటిలుడా! వంచకుడా' అంటూ ఎత్తి అగడ్తలోకి విసిరికొట్టాడు

రత్నాదిత్యుడు వ్యూహాన్ని రచించాడు విమలుడు కొండరాళ్ళను తెప్పిస్తున్నాడు ఇరువైపులా నినాదాలు ఆకాశాన్ని బ్రద్దలు చేస్తున్నాయి

'అయ్యో! అయ్యో! అమ్మా! అమ్మా!' చోళా ఆర్తనాదం చేసింది

కోటమీది సైనికులకు తెలియదు. కోటక్రింది సైనికులకూ తెలియదు ఎలా తెరుచుకున్నవో? జునాగఢ ద్వారాలు ఒక పరోక్షశక్తి తెరిచినట్లు తెరుచుకున్నాయి

రాజపుత్ర సేనలో హాహాకారాలు వ్యాపించాయి తాబేటి సైనికులు శస్త్రసజ్జితులై ప్రభాసంలో జొరబడ్డారు

అమీరు మిగతా అశ్వికులతో అగడ్తలోకి దూకాడు

'మహారాజా! లోపలి కోటను రక్షించుకోండి త్వరగా త్వరగా దిగిరండి '

'విమలా! నీవు పరుగెత్తు వీరులారా! లోపలి కోటను రక్షించండి ' అని ఆజ్ఞాపించి లోపలికి చొరబడుతున్న సైనికుల్ని ఆపడానికి స్వయంగా భీమదేవుడు పరుగెత్త నారంభించాడు అన్నివైపులా 'లోపలికోట లోపలికోట' అనే అరుపులే

రత్నాదిత్యుడు మహాభయంకరంగా 'జై సోమనాథ్' అని నినాదం చేసి కోటమీది నుంచి క్రిందికి దూకాడు అతనితో అనేక వీరులు దూకారు అంతా కలిసి పంక్తి జొరబడుతూన్న అమీరు సైనికులను ఆపడానికి ప్రయత్నిస్తున్నారు

ద్వారం దగ్గర కత్తులతో, బాణాలతో, గదలతో బాహాబాహీ యుద్ధం ఆరంభమైంది రాజపుత్ర వీరులు అపూర్వమైన, మహా పరాక్రమాన్ని ప్రదర్శిస్తున్నారు

రత్నాదిత్యుడు ఉన్మాదిలా వీరతాండవం చేస్తున్నాడు

అలాచేసి అశ్వికులను వెనక్కు చాలా వెనక్కు తరిమాడు కానీ అమీరు మధ్య ఆశియా నుంచి ప్రత్యేకంగా శిక్షణనిచ్చి తెచ్చిన అశ్వికులతో లోపలికి జొరబడుతున్నాడు

యవన సైన్యం అంతా లోపలికి వచ్చేందుకు మహావత్తిడి పెడుతున్నది ఆ వేగాన్ని ఆపడం సాధ్యంకావడంలేదు

రత్నాదిత్యుడు ప్రాణాలమీద మోహం విడిచి ప్రచండ పరాక్రమం ప్రదర్శిస్తున్నాడు భీమదేవుడు మహోగ్రుడై పోరాడుతున్నాడు ఇద్దరూ నేలమీదే ఉన్నారు సైనికులకు కూడా వాహనాలు లేవు శత్రువులందరూ అశ్వికులే

చోళా తల్లిఒడిలో మూర్ఛపోయింది గంగ నిలువునా వణికిపోతున్నది క్రింద జరుగుతూన్న మహా మారణంలో గురుదేవుల మూర్తి ఆమెకు కన్పించలేదు శంకరుని ధ్యానించడం తప్ప ఆమెకు మరొకటి తోచలేదు

భీమదేవుడు పోరాడేందుకు దుమికినప్పుడు లోపలి కోటను రక్షించమని విమలుణ్ణి ఆజ్ఞాపించాడు అప్పుడు 'సముద్ర మార్గంలో వెళ్ళడానికి ప్రయత్నాలు చేయనా మహారాజా!' అని అడిగాడు విమలుడు

'విమలా! చావనైనా చస్తాను కానీ వెనుకడుగు వేయను' అని మహాభయంకరంగా ఆక్రోశించాడు భీమదేవుడు

'కానీ అనహిలవాడ--'

'పో! పోయి నీవు పరమేశ్వరుని సంరక్షించు '

విమలుడు ఆజ్ఞలను ఔదలదాల్చాడు సాధ్యమైనంత సైన్యంతో లోపలి కోటలో ప్రవేశించి ద్వారాలు మూయించాడు భీమదేవుడు ఆ కోట బురుజుమీద నుంచి అమీరుతో తలపడడానికి సిద్ధమైనాడు

రత్నాదిత్యుని పరాక్రమానికి అంతులేదు కుడిచేయి తెగి పడింది నెత్తురు చిమ్ముతోంది రక్తసిక్తమై తెగిపడిన తన కుడిచేతి పట్టునుంచి కత్తిని వదలించి ఎడమచేత్తో కత్తి పట్టుకున్నాడు ఒక సైనికుని సహాయంతో గుఱ్ఱాన్ని ఎక్కి శత్రు శిరస్సులను కుప్పలుగా తెగ నరుకుతున్నాడు

మ్లేచ్ఛసేనలలో హాహాకారాలు వ్యాపించాయి కానీ అతని కుడిచేతి నుంచి రక్తం వరదలై పారలుతున్నది కన్నులముందు చీకటి వ్యాపిస్తున్నది ఏమీ కన్పించడంలేదు ఏమీ తోచడంలేదు అయినా కత్తి త్రిప్పుతూనే ఉన్నాడు శత్రు శిరస్సులు తెగి పడుతూనే ఉన్నాయి ఇంతలో ఒక బాణం వచ్చి అతనికి తగిలింది దాని వేగాన్ని తట్టుకోలేక రత్నాదిత్య మహాప్రభువు ఉత్తమాశ్వంనుంచి క్రిందికి జారాడు - పడిపోయాడు మరి లేవలేకుండా--

ఆకాశంలోంచి అప్సరసలు పుష్పవర్షం కురిపించారు

## 4

సర్వజ్ఞుడు వేగంగా శివరాశిని పట్టుకోడానికి పరుగెత్తాడు అతడేదో అఘాయిత్యం చేస్తున్నట్లనిపించిందాయనకు రాత్రి ఉన్మాదిలా వాగాడు ప్రొద్దున ఒంటరిగా గణపతి మందిరంలో కూర్చున్నాడు ప్రస్తుతం దద్దా కేదో చెబుతున్నాడు ఇందులో రహస్యం ఏదో ఉన్నది

జునాగఢ ద్వారాలు తెరుచుకోడం ఆయన చూచాడు తలుపులు తెరచుకోడంతోటే ఇక అంతం సమీపించిందనుకున్నాడు మందిర శిఖరాన్ని చూచి

అరమోడ్పు కన్నులతో 'పరమశివా! ఏమిటిది? ఏం తలపెట్టావు స్వామీ?' అని లోలోపల గొణుక్కున్నాడు

అక్కడనుంచి వెంటనే వెనుదిరిగాడు గంగా, చోళాలను మ్లేచ్ఛుల బారి నుండి రక్షించడం చాలా అవసరం తనకు గతి పరమేశ్వరుని పాదపీఠియే సైనికుల కోలాహలం లేని సందుల్లోంచి ఆయన లోపలి కోటలోనికి ప్రవేశించాడు

పరమేశ్వరుడు ఏమి తలపెట్టాడో అని ఆయన వ్యర్థంగా తెలుసుకునేందుకు ప్రయత్నిస్తున్నాడు ఆయన హృదయంలో మహాదైన్యం ఆవరించింది

నేటికి నలుబదేండ్లుగా ఆయన ప్రభాస నగరాన్ని తీర్చిదిద్దాడు ధర్మ సిద్ధాంతాలను ప్రచారించాడు సమస్త భారతంలో పరమేశ్వరుని కీర్తికి స్వర్ణజ్యోతులు వెలిగింప చేశాడు అదంతా ఒక్క ఘడియలో వ్యర్థమైపోయింది పరమేశ్వరుని పట్ల ఆయన శ్రద్ధ కొంత చలించింది

కానీ, చిరకాలం తపస్సుద్వారా సాధించిన శివ సమర్పణ భావం ఆయన నాదుకోడానికి పరుగెత్తింది బోలానాథుడు తన హృదయేశ్వరుడు - ఏది తలపెట్టినా మంచికే త్రిపురసుందరీ పూజ అనే సాకుతో భీభత్స కృత్యాలను అలవరచే స్థలాన్ని, భైరవుని అర్చన పేరిట మహా అత్యాచారాలు జరిగే స్థలాన్ని, తనలాంటి వ్యక్తి యేమీ చేయలేని గతి పట్టిన స్థలాన్ని, శివరాశి లాంటి వాణ్ణి గురువుగా అంగీకరించిన మూర్ఖుల నిలయాన్ని - అలాంటి మహాపాపాలకు నిలయమైన ప్రదేశాన్ని పరమేశ్వరుడు పుణ్యతీర్థమని అమరమొనరించినట్లయితే సార్థక్యం ఏమైనా ఉంటుందా?

పరమేశ్వరుని సంకల్పం వెనుక దాగి వున్న రహస్యాన్ని ఆయన గ్రహించాడు ప్రభాసం అలాంటి నీచ పద్ధతులవల్లనే నాశనమవుతోంది అంతకంటే అలాంటి విధులను నెరవేర్చిన పాతకులు సర్వనాశనమవుతారు తిరిగి భగవద్భక్తి నవీన రూపంలో విశుద్ధ స్వరూపంతో విజయాన్ని సాధిస్తుంది ఇన్ని అత్యాచారాలు జరుగుతూండగా తను చూస్తూ కూడా ఆపే శక్తి లేక ఊరుకున్నాడు కనుకనే పరమేశ్వరుడు తనను కూడా రమ్మని సెలవిచ్చాడు ఇక ఘడియో లేక రెండు ఘడియలో-

'కానీ, పరమేశ్వరా! తమరు కూడా ఈ మ్లేచ్ఛహస్తాలలో ధ్వంసమవుతారా?' సర్వజ్ఞుని మనస్సు మహా దీనంగా విలపించింది 'నీ మూడవ కంటి చిచ్చుతో త్రిపురాసురుణ్ణి సహితం నాశనం చేశావే! ఏదయ్యా? ఆ కన్ను మూసుకున్నావేమి స్వామీ? నా ప్రభో!-' ఆయన పొంగుకొని వస్తున్న దుఃఖాన్ని ఆపుకోలేకపోయినాడు 'మాకా మాత్రం దయ కూడా ప్రసాదించకూడదా! అంత పతితులమైనామా తండ్రీ ?'

లోపల కోట దగ్గరకు సర్వజ్ఞుడు వచ్చేసరికి అప్పటికే ద్వారాలు బంధింపబడ్డాయి ఇక ఆఖరి నిముషంలో తన ప్రభువును-తండ్రిని-దర్శించుకునే అదృష్టం కూడా నొసట వ్రాసి లేదా! అక్కడే ఉన్న ఒక యింటి అరుగుమీద కూలబడ్డాడు సగం తెరచి ఉన్న ఆ యింటి తలుపు చాటునుంచి ఒక పరిచయకంఠం వినిపించింది

'నీళ్ళు- నీళ్ళు-'

సర్వజ్ఞులు లోపలికి వెళ్ళారు దీపాకొరారి అవసాన దశలో పడి ఉన్నాడు

'నాయనా కొరారీ!'

'ఎవరూ? గురుదేవులా! స్వామీ ధన్యుణ్ణి- ధన్యుణ్ణి మీ చరణ సన్నిధిని చనిపోయే అదృష్టం - అబ్బా-నీళ్ళు-'

'ఉండు ఇప్పుడే తెస్తా'నంటూ నీళ్ళు తెచ్చి సర్వజ్ఞుడు అతని గొంతులో పోసి 'నీవు ఎలా గాయపడ్డావు నాయనా?' అని అడిగాడు

'వంతెన మీద యుద్ధం జరుగుతున్నపుడు నే నిక్కడ క్రింద రాళ్ళు పోగుచేస్తున్నాను అక్కడి నుంచి భోజనాదులు సిద్ధమైనాయో లేదో తెలుసుకుందామని ఇక్కడికి వచ్చాను వస్తుంటే గణపతి మందిరంలోనుంచి శివరాశి కొంతమంది మ్లేచ్ఛులతో వస్తూ కన్పించాడు నేను ఎవరువారని ప్రశ్నిస్తే ఒక మ్లేచ్ఛుడు హఠాత్తుగా బాకుతో పొడిచి ఇక్కడ పడేశాడు అప్పటి నుంచి చావురాదు బాధ '

'కొరారీ! మనమీద పరమేశ్వరుడు ఆగ్రహించాడు '

'మహారాజుగారో?'

'తెలియదు యుద్ధం చేస్తున్నారో కైలాసాన్ని చూరగొన్నారో అంతా పరమేశ్వరుని దయ '

'గురుదేవా! ఏమిటిదంతా ?'

'మనం పరమేశ్వరుని ఆధీనులం కొరారీ! ప్రళయం ఆసన్నమైంది '

'గురుదేవా!' కొరారీకి ఎగశ్వాస ఆరంభమైంది

'నాయనా నమఃశివాయ అను నమఃశివాయ, నమఃశివాయ, నమఃశివాయ '

కొరారి ప్రాణాలు గురుదేవుని చేతుల్లో అనంతంలో లీనమైనాయి

గుడ్డతో ఆ భౌతికకాయాన్ని కప్పి సర్వజ్ఞుడు బయలుదేరాడు మ్లేచ్ఛులు ఎలా లోపలికి చొరబడ్డారో ఆయనకు తెలిసింది దాంతో లోపలి కోటకు పోయే మరో గుప్త మార్గం జ్ఞాపకం వచ్చింది

లోపల కోట ద్వారానికి దగ్గరగా ఉన్న మారుతి మందిరంలోంచి ఒక సొరంగం

ఉన్నది ఆ మందిరంలో లోపల ఒక గోడకు ఒక కిటికీ ఉన్నది శివరాశి మ్లేచ్ఛులను లోపలికి తెచ్చినట్లు తానెందుకు లోపలికి పోరాదు?

ఆయన వేగంగా లోపలికి జొరబడ్డాడు

చతుశ్శాల దగ్గర బ్రహ్మాండమైన మారణహోమం జరుగుతున్నది నలువైపులా అమీరు ఆశ్వికులూ, గుజరాత వీరులూ గర్జిస్తున్నారు ఆర్తనాదం చేస్తున్నారు

మారుతి మందిరం మీద విలుకాండ్రు రాళ్ళను పేర్చి, విగ్రహాలను చేర్చి ఒక చిన్న కోటగా చేసుకున్నారు దాని లోపల నిల్చొని బాణవర్షం కురిపిస్తున్నారు శత్రువులను హతమారుస్తున్నారు వీరి నేర్పరితనం వల్ల అమీరు సేనలింకా లోపలి కోట ద్వారాన్ని సమీపించలేకపోయాయి

ఇంతలో రెండోవైపు శత్రువుల ఆక్రమణ జరిగింది అమీరు సైనికులు అందరూ అటు పరుగెత్తారు సర్వజ్ఞుడు అదే అదనులో మార్గం దాటి మారుతి మందిరాన్ని సమీపించాడు

'గురుదేవా! గురుదేవా! లోపలికి వస్తారా?' పైనుంచి ధ్వని వినిపించింది

'ఎవరూ? వీరాచావడా?'

వెంటనే తలుపులు తెరుచుకున్నాయి సర్వజ్ఞుడు లోపలికి వెళ్ళగానే వీరచావడా బోరున ఏడుస్తూ ఆయన కాళ్ళమీద పడ్డాడు- 'గురుదేవా! గురుదేవా! మహారాజు మహారాజు కైలాసం చూరగొన్నారు '

'ఏవిట్రా! ఏమైందీ?'

'సింహంలా పోరాడి-వందలకొలది శిరస్సులను త్రెంచి వీరవిహారం చేశారు కానీ చివరకు ' అంటూ వీరా మరీ ఏడవడం ఆరంభించాడు

'పరమేశ్వరుని దయ' అంటూ పొంగివచ్చిన వెక్కిళ్ళను ఆపుకున్నాడు సర్వజ్ఞుడు 'మహారాజు శవం ఏదీ?'

'వెంటనే, మేం ఏడుగురం ఉన్నాం మహారాజుగారు పడిపోయారని వింటే సైనికులు పరుగెత్తుతారని తెచ్చి ఇక్కడ భద్రపరచాం మేం ఏడుగురం చస్తేకానీ ఈ మందిరం పడిపోదు అప్పుడీశవం ఎవరిదనే దిగులు ఎవరికీ ఉండదు ' అని వజ్రశోకంతో అన్నాడు వీరా

'వీరా! మహారాజు శరీరం మనది కాదు చోళాదది దానిని నేను లోపలికి తీసుకొని వెళ్తా-'

'ఎలా స్వామీ!'

'ఇక్కడే ఇక్కడ ఒక రెండు మూరలు త్రవ్వు లోపలికి పోయే సొరంగం కన్పిస్తుంది '

'అయితే సరే ఉండండి ' అంటూ వెళ్ళి తన అనుచరులతో జాగ్రత్త అని చెప్పి వచ్చాడు తరువాత అతడూ, గురుదేవుడూ కలిసి త్వరత్వరగా త్రవ్వనారంభించారు కొద్దిసేపటికి సొరంగం కన్పించింది

'వీరా! నీవిక్కడ ఉండగలవా?'

'ఆ( ఆ( మహారాజు గతించాక ఉండి ఎందుకు? ఊడి ఎందుకు ? వీరస్వర్గమంది కనీసం అక్కడైనా ' అంటూ వీరా మహా దీనంగా ఏడుస్తూ భీమదేవుని పాదాలకు మ్రొక్కి ముద్దిడుకొని, విలపిస్తూ లేచి అశ్రువులు తుడుచుకుంటూ మందిరం మీదికి ఉన్మాదిలా పరుగెత్తాడు

సొరంగం సర్వజ్ఞునికి తెలిసిందే ఆయన లోపలికి దిగాడు భీమదేవుని శరీరాన్ని ఎత్తుకొని ముందుకు నడిచాడు

ఊగిసలాడుతూ, ఎదురు దెబ్బలు తింటూ, పడుతూ - లేస్తూ భీమదేవుని ప్రచండ దేహాన్ని మోసికొని గణపతి మందిరంలోకి వచ్చాడు సొరంగం తెరిచే ఉన్నది

మందిరంలో కూర్చుని కొంచెం ఆయాసం తీర్చుకున్నాడు తరువాత మహారాజును చూచాడు శరీరం నిండా గాయాలే అయినా నాడి చాలా మందంగా కొట్టుకుంటోంది గురుదేవుడు తన వస్త్రాలను చించి గాయాలకు కట్టుకట్టాడు మళ్ళీ శరీరాన్ని మోసుకొని బయటికి వచ్చాడు

ఆయన కోటవైపు చూచాడు సైనికులు ప్రాణాలతో చెలగాటం ఆడుతూ పోరాడుతున్నారు ఏమి శౌర్యం? ఏమి భక్తి! ఏమి స్వాభిమానం! గురుదేవుని హృదయం స్వాభిమానంతో ఉప్పొంగి పోయింది

వెంటనే ఆయన చెవులకు మహావికృతహాసం వినిపించింది ఎదురుగా ఒక అరుగు మీద శివరాశి కూర్చున్నాడు

'నేను చెప్పానా! చెప్పానా! మీరంతా కుక్కచావు చస్తారని చెప్పలా!' అని తిరిగి వికృతంగా నవ్వాడు శివరాశి

'శివరాశీ! ఇక్కడ పుట్టి పెరిగావు ఇక్కడ దీక్ష పొందావు ఇక్కడే వేదాలు పఠించావు ఇక్కడ దైవపూజ చేశావు అలాంటి చోటికి - మ్లేచ్ఛులను తెచ్చి -- నీ మిత్రులనూ -- నీ గురువునూ - నీ దేవుణ్ణే నాశనం చేశావు నీవు ఎక్కడ వుంటే ఆ స్థలాన్ని -- పరమేశ్వరుడు సర్వదగ్ధం చేస్తాడని నాకు తెలుసు' అంటూ భీమదేవుణ్ణి తీసుకొని గురుదేవుడు లోపలి కోటలో ప్రవేశించాడు

5

లోపలి కోటలో కాలు పెట్టగానే సర్వజ్ఞునిలో నవచైతన్యం ప్రవహించింది ఈ తన మందిర సభామండపంలో ఉన్నంతవరకూ తాను దీనుడు కాడు పదదళితుడు కాడు ఇక్కడే - ఆయన నలభై సంవత్సరాలు హృదయాలనూ -- మనస్సులనూ ఏకచ్ఛత్రంగా పరిపాలించాడు ఇక్కడే కూర్చుని మహాచక్రవర్తుల ఆర్ఘ్యాలను స్వీకరించాడు ఇక్కడ కూర్చునే సమస్త భారతవర్షంలో విద్యా, సంస్కారాలను శాసించాడు ఇక్కడే ఆయన లకులేశ భగవానుల ఉత్తరాధికారియైనాడు ప్రపంచానికి ముక్తి కూర్చేందుకు మహామంత్రం జపించే వ్యక్తి తాను

సర్వజ్ఞుడు తిరిగి ఎప్పటివలె మహా గౌరవంతో భాసించనారంభించాడు

గంగ, చోళాతో పాటు వణుకుతూ, భయపడుతూ వచ్చింది చోళా భీమదేవుణ్ణి చూచింది అప్పుడే తన చావుకు ఉపాయం ఆలోచించుకున్నది ఏడుస్తూ గుండెలు బాదుకుంటూ భీమదేవుని మీద పడిపోయింది చోళా గురుదేవుడు ఒక నిట్టూర్పు విడిచి-- ఎప్పటిలా - ప్రశాంతచిత్తంతో, గౌరవంతో-- నిల్చున్నాడు

'చోళా! మనం అనుకున్నది ఒకటి విధిలిఖితం మరొకటి అయింది లే తల్లీ! విచారించి లాభంలేదు ఈ కోటకూడా ఇక పడిపోతున్నది మ్లేచ్ఛులు లోపలికి వస్తారు నీవు చోళావు కావు అనహిలవాడ ప్రభువుకు మహారాణివి మ్లేచ్ఛులు నీ శరీరం తాకకముందే అగ్నిప్రవేశం చేయడం నీ ధర్మం '

చోళా పిచ్చిదానివలె చూస్తున్నది మహారాజు మరణించాడు తన జీవనజ్యోతి ఆరిపోయింది

'మహారాజు ఎప్పుడు గతించారు?'

'ఇంకా కొనఊపిరి ఉన్నది ముందు నీ ఏర్పాట్లు చేసి ఆయన బ్రతికేది లేనిదీ చూస్తా గంగా! చోళాను త్వరగా సిద్ధపరచు నేను కట్టెలు పేరుస్తా దీనికి పరలోకంలోనే సుఖం వ్రాసి ఉన్నది మరి మ్లేచ్ఛుల చేతుల్లో నీవు కూడా పడడం మంచిది కాదు ఇక త్వరపడు '

'నా చావుకు అగ్ని అవసరంలేదు సర్వజ్ఞదేవా! చింతించకండి '

భయపడి అక్కడే పడివున్న ఒక సాధువును పిలిచి సర్వజ్ఞుడు కట్టెలు తెప్పించి తన చేతులతో చితిని పేర్చాడు గంగ చోళా శరీరానికి గంధం పూసింది

చోళా కన్నీరు ఎండిపోయింది ఒక యంత్రంలా ఆమె గురుదేవుని ఆజ్ఞలను పాలిస్తున్నది పరమేశ్వరుని దగ్గరకు వెళ్ళి పాదాలు స్పర్శించి భీమదేవుని దగ్గరకు వచ్చింది

ముఖంపై రక్తంతో పిడచలు కట్టివున్న వెంట్రుకలను ప్రక్క-కు నెట్టి అరచేతితో ముఖాన్ని తుడిచి చాలాసేపు ఆయన ముఖంవైపే చూస్తూ కూర్చున్నది

ఆమె శవప్రాయంగా అయిపోయింది ముఖం వివర్ణమైంది గుడ్లు స్థిరమై గాజు పెంకులవలె కన్పిస్తున్నాయి

ఆమె భీమదేవుని పాదధూళి శిరస్సున ధరించింది గంగ పాదాలకు నమస్కరించింది గురుదేవులకు ప్రణమిల్లింది గురుదేవుడు మహాశాంతంగా గంభీరంగా విరాజిల్లుతున్నాడు ---నెమ్మదిగా చితికి నిప్పంటించడానికి కట్టెలు వెలిగించాడు

ఇంతలో విమల మంత్రి రొప్పుతూ పరుగెత్తుకొని వచ్చాడు అతనికి కూడా ఒకటి రెండు గాయాలు తగిలాయి

'గురుదేవా! ఆగండి --- వెంటనే ఇక్కడ్నుంచి పారిపోవాలి లోపలి కోటకూడా ఇక ఒక్క ఘడియలో పతనమవుతుంది తర్వాత మందిరకోట పడిపోవడం ఎంతసేపు?'

'మందిరకోట త్వరగానే పతనమవుతుంది నిజమే చోళాను అగ్ని ప్రవేశం చేయించనీ, తరువాత అమీరును కలుసుకునేందుకు నేనూ సిద్ధమే '

'అయ్యో! అదేవిఁటి? మహారాజులు గతించారా!'

'ఇంకా లేదు మరి ఒకటి రెండు ఘడియల్లో '

విమలుడు గట్టిగా పెదవి కరచుకొన్నాడు ఏడ్చేందుకు కూడా అది సమయం కాదు

'కానీ గురుదేవా! మీరైనా వెళ్ళిపోండి '

'నా ప్రభువు ఎక్కడ వుంటే అక్కడే నేను మొదటే చెప్పానుగా విమలా!'

విమలుడు నిట్టూరుస్తూ మహారాజు పాదాలమీద వాలి నమస్కరించాడు

ఇంతలో సామంతుడు హఠాత్తుగా పరుగెత్తుకుంటూ వచ్చాడు

'సామంతా! నాయనా! నీవా! ఇప్పుడిక్కడ '

'అవును ప్రభాసం పడిపోయిందని తెలిసింది అందుకనే వచ్చాను బయలుదేరండి! సముద్రంవైపు ద్వారం తెరచి వున్నది నావలు సిద్ధంగా మీ కోసం ఎదురు చూస్తున్నాయి '

'నాయనా! నీ శౌర్యానికి అంతులేదయ్యా! చోళా! పరమేశ్వరునికి నీవు అగ్నిలో ప్రవేశించడం ఇష్టంలేదు సామంతా! మహారాజును కూడా తీసుకొని వెళ్ళు బ్రతికి బైటపడితే ఈయనే తిరిగి ప్రభాసాన్ని నిర్మిస్తాడు '

'త్వరగా---త్వరగా---విమలా! నీ వెక్కడికి?'

'లోపలికోట కాపాడడం నా విధి సామంతా! '

'కాదు కాదు నాతోరా భీమదేవులు జీవిస్తారు జీవించక పోయినా చనిపోయారని ఎవరికీ తెలియకూడదు వీరి పేరిట అమీరును సర్వనాశనం చేయవలసిన కర్తవ్యం మిగిలే ఉన్నది నీవు లేకపోతే గుజరాతం ధైర్యం కోల్పోతుంది రా త్వరగా '

'విమలా! సామంతుడన్నది నిజం నీవూ, భీమదేవుడూ ఇద్దరూ జీవించి ఉంటే గుజరాతం తన భస్మంలోంచి తిరిగి లేచి నిల్వగలుగుతుంది అమీరును సర్వనాశనం చేయగలుగుతుంది '

'కానీ-'

'కానీలేదు గీనీలేదు ఇది నా ఆదేశం పో త్వరగా పో '

'మరి మీరో గురుదేవా?'

'అనవసరంగా సమయాన్ని కోల్పోకండి నే నిక్కడే పరమేశ్వరుని సన్నిధిలో ఉంటా '

మహావేగంగా సామంత, విమలులు మహారాజును ఎత్తుకొని చోళాతో సహా వెనుకటి ద్వారంలోంచి వెళ్ళిపోయినారు

'సర్వజ్ఞ ప్రభూ! అందరి ఏర్పాట్లు చేశారు ఇక నాకేమి చెబుతారు స్వామీ?'

ఏమిటి?

గంగ శిరస్సు వంచింది మీరే నాకు ప్రాణం--గురువు--దైవం-- ఇన్నాళ్ళూ మీచరణాల ప్రాపుననే జీవించాను ఇక మరణించినా అక్కడే

ఇంతలో పిడుగుపడ్డంత ధ్వని వినిపించింది వెంటనే 'అల్లాహో అక్బర్' అనే నినాదం కూడా దశదిశల నాక్రమించింది

'ఇక కొన్ని నిముషాలు మాత్రమే మిగిలాయి నా విన్నపం ఒకటి ఉంది మీరింతవరకు ఎవరినీ మీచేతులతో హింసించలేదు కానీ నేను చావలేని పక్షంలో మీచేతులతో నాకు మోక్ష మిప్పించండి గురుదేవా!' అంటూ గురుదేవుని చరణరజాన్ని గంగ తన శిరస్సున ధరించింది

సర్వజ్ఞుని హృదయం తరంగితమైంది నేలమీద పడివున్న గంగ ముఖంలో జీవితం అంతా ఏకనిష్ఠతో చేసిన భక్తి సాధనను ఆయన గుర్తించాడు తరువాత క్రిందికి వంగి ఆమె తలను ఆప్యాయంతో నిమిరి 'గంగా! నీకు కైలాసం లభిస్తుంది' అని దీవించాడు

మందిరకోట బయట అల్లరి చెలరేగింది సింహద్వారంలోకి శత్రువులు జొరబడుతున్నారు 'అల్లాహో అక్బర్' అనే ధ్వని మరింత సమీపాన వినవస్తోంది

గంగ తలలోంచి బంగారు దువ్వెన తీసింది దాని పండ్ల పదునును చేతివ్రేళ్ళతో పరీక్షించింది తరువాత వేగంగా మెడలో పొడుచుకున్నది ఒక్క ఆర్తనాదం - ఒక్కధ్వని - గంగ నేలకొరిగింది

చనిపోతూ కూడా ఆమె తన స్వామికి హింసాదోషం సంక్రమింపచేయలేదు

## 6

ప్రభాస నగరమంతటా ఒక ప్రహరం వరకు హత్యాకాండ జరుగుతూనే ఉంది ఒకళ్ళిద్దరు ఏ అదృష్టంవల్ల నయినా బ్రతికి బైటపడ్డారేమో నలుమూలలా నగరంలో చాలాసేపటి నుంచి దోపిడి ప్రారంభమైంది దహనకాండ కూడా మొదలైంది కానీ అమీరు ఆజ్ఞ లేనిదే ఒక్కడూ మందిర కోటలో ప్రవేశించలేదు

సాయంకాలమయిన తరువాత గజనీమహమ్మదు మందిరంలో మొట్ట మొదట అడుగు పెట్టాడు మిగిలిన రాజపుత్రులందరినీ హత్య చేయించాడు

లోకోట ముఖద్వారాన్ని విరగగొట్టమని ఆజ్ఞాపించాడు అదంత కష్టమనిపించలేదు. లోపల ఒక గొళ్ళెం ఉన్నది అది వెంటనే విరిగి పోయింది

గుఱ్ఱం ఎక్కి లోపలికి అమీరు బయల్దేరగానే శివరాశి ఎదురుగా చేయెత్తి నిలుచున్నాడు

'అమీర్! నిదానించు. నేనే నిన్ను ఇక్కడికి తెచ్చాను ' అని ఎలుగెత్తి అన్నాడు వేలకొలది సైనికులను సర్వనాశనం చేసిన తరువాత తన కెదురు నిలచిన ఈ నిశ్శస్త్రుడైన సన్యాసిని చూచి ఆ జగజ్జేత నవ్వాడు

'తిలకా! వీడేఁవిటి అంటున్నాడు?'

శివరాశిని తిలకుడడిగి అమీరుకు అనువదించి చెప్పాడు

'జహాఁపనా! తానే మన మనుష్యులకు ఆ సారంగం చూపాడట మనమీతనికి ఈతని దైవాన్నీ, ఇతణ్ణీ రక్షిస్తామని అభయ మిచ్చామట మీకు కావలసినంత ధనం ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నాడట '

అమీరు పకపకా నవ్వాడు 'అరె కాఫిర్! మహమ్మదు విగ్రహాలను అమ్మడు, విగ్రహ భంజకుడాతడు' అంటూ తన కత్తితో శివరాశి తలపై గట్టిగా కొట్టాడు

తరువాత గుఱ్ఱాన్ని నడిపించి లోపలికి ప్రవేశించాడు అమీరు చుట్టూ వున్న సైనికులు కూడా నవ్వారు. శివరాశి స్మృతి తప్పి ఒక వైపుకు పడిపోయాడు

మందిర ప్రాంగణంలోకి ప్రవేశించి అమీరు స్తంభించిపోయాడు అక్కడ ఒక్క మనిషి కూడా లేడు. కానీ దీపికలన్నీ వెలుగుతున్నాయి మణిమయ సభావేదిలో ఆ కాంతులు అనేక రంగులతో ప్రకాశిస్తూ దేదీప్యమానమొనరిస్తున్నాయి

అమీరు అనేక మందిరాలు చూచాడు. ఎన్నిటినో నేలమట్టం చేశాడు కానీ అస్తమిత సూర్యకాంతులతో మహోతేజాన్ని ఒలికిస్తూ ధగధగ మెరుస్తున్న ఈ మహామందిరంలాంటి మణిమయ భవనాన్ని ఎక్కడా చూడలేదు

ఒక్క క్షణం గుఱ్ఱాన్ని ఆపి ఆ సుందర దృశ్యాన్ని చూచాడు తరువాత గుఱ్ఱంమీద నుంచి క్రిందికి దిగాడు

వేలకొలది రాజపుత్ర మహావీరుల ప్రాణదానంతో పరమ పునీతమై యుగాల నుంచి అమరమై వెలుగొందుతున్న ఆ భవ్యమందిరంలో - కేవలం ఒంటరిగా మహాదివ్యుడై సాక్షాదాదిశంకరుని లాంటి సర్వజ్ఞ గురుదేవుడు సోమనాథ పరమేశ్వరునికి హారతు లిస్తున్నాడు ప్రపంచమంతా మహా విలయంలో మునిగిపోయింది ఇక మిగిలిందల్లా తను . తన దేవాధి దేవుడు సోమనాథ పరమేశ్వరుడు

హారతులిచ్చి పళ్ళెరాన్ని క్రింద ఉంచి నడుమున చేతులాన్చి గర్భద్వారంలో అపూర్వ గౌరవంతో శోభిల్లుతూ గురుదేవుడు నిల్చున్నాడు

అమీరు పెదవులు కొరుక్కున్నాడు 'ప్రక్కకు తప్పుకో వృద్ధుడా!' చేతి సౌంజ్ఞలతో అమీరు భావాన్ని గురుదేవుడు గ్రహించాడు 'వీల్లేదు ' అని పరమ శాంతంగా అణుమాత్రమైనా చలించకుండా 'నా పరమేశ్వరుడూ నేనూ వినాశనంలో కూడా సనాతనులమై అనాద్యవంతులమై ఒకటిగా ఉన్నాం' అన్నాడు

ఆయన ముఖంలో చిరునవ్వులు వెలిగిపోతున్నాయి

అమీరుకు ఎక్కువ మాట్లాడటం నచ్చదు అతడు కుప్పించి ముందుకు దూకాడు చేతిలో కత్తి జిగేలుమన్నది

గురుదేవుని శిరస్సు క్రిందపడి పొరలింది

మరొక్కదూకులో అమీరు గర్భగుడిలో ప్రవేశించాడు ఒక దీర్ఘ శ్వాస విడిచి ప్రక్కనున్న సైనికుని చేతిలోంచి ఇనుప గద తీసుకొని గిరగిరా తిప్పి కొట్టాడు

సృష్ట్యారంభంలో నిర్మితమైన ఆ సోమనాథ శివమూర్తి మూడు ముక్కలై పడిపోయింది

## 7

బహుళ విదియ చంద్రుడు ఆకాశంలో వెలుగుతున్నాడు అర్ధరాత్రి శవాలతో నిండియున్న ప్రభాసంపైన గ్రద్దలు చేరుతున్నాయి అక్కడక్కడ కొనఊపిరి కూడా పోయి చనిపోతూన్నవారి ఆర్తనాదాలు వినిపిస్తున్నాయి అన్నివైపులా దుర్గంధం వ్యాపించింది

ప్రాంగణం ముందు పడిపోయిన పీనుగల మధ్యనుంచి ఒక జటాధారి లేచాడు అతడు ఎటు నడుస్తున్నదీ అతనికే తెలియదు. వాని కండ్లకేమీ కన్పించడంలేదు

ఆ పీనుగల మధ్య నుంచి నడుస్తూ సభామండపంలోంచి వెళ్ళి అతడు గర్భద్వారం ముందు నిల్చుని నమస్కరించాడు

అటునుండి లోపల శివమూర్తి ఉన్నచోటికి వెళ్ళాడు

చేతితో అన్నివైపులా వెదికాడు కానీ శివమూర్తి కనిపించలేదు

కండ్లు తెరచి కలయజూచాడు

కలలో ఉన్నట్లు చివరికి అతని చేతికి రాతిముక్కలు తగిలాయి

అంధునివలె అతడు లింగమూర్తి కొరకు వెదికాడు

వణుకుతూ లేచి గర్భద్వారం నుంచి బైటికి వచ్చాడు

అతని కాళ్లకు ఏదో తగిలింది దాన్ని చేతుల్లోకి తీసుకొని బైట వెన్నెల పడుతున్న చోటికి వచ్చాడు

దానిని పైకెత్తి చూచాడు ఆ కన్నులను గుర్తించాడు ఆ ముఖాన్ని, ఆ తెల్లని జటాజూటాలను గుర్తించాడు

'అయ్యో అయ్యో ఓహ్' అంటూ దాని నక్కడే వదలి రెండు కండ్లనూ గట్టిగా మూసుకున్నాడు

తరువాత కొద్దిసేపు ఆకాశంవైపు చూచాడు ఏదో జ్ఞాపకం వచ్చినట్లు తిరిగి కండ్లు మూసుకున్నాడు అతని కన్నులముందు పూర్వం కొన్ని వేలసార్లు చూచిన మణిమయ సభామండపం గురుదేవుని సౌమ్యకాంతితో తేజరిల్లుతూ కన్పించింది

తిరిగి కన్నులు తెరచి అన్నివైపులా చూచాడు అతని కంఠంలోంచి వెక్కిళ్ళు వెలువడ్డాయి

తన రెండు చేతులతో ఎదురుగా ఉన్న సీసపు స్తంభాన్ని పట్టుకున్నాడు తరువాత తన తలను దానికేసి కొట్టుకున్నాడు

వెంటనే నేలకొరిగాడు

గ్రద్దలు అతనిపైన ఎగరడం మొదలుపెట్టాయి

పదునేడవ ప్రకరణం

# చోళా నృత్యం

## 1

సామంతుడూ, విమలుడూ, కలిసి ఖారా, నీరాల సాయంతో మూర్ఛలో వున్న భీమదేవుణ్ణి, చోళానూ పడవలోకి చేర్చారు మహారాజుకు చాలా గాయాలు తగిలాయి కానీ, అనుభవజ్ఞులు అపాయం లేదని-అన్న మీదట అందరికీ దిగులు తగ్గింది

రావ్ కమాల ఖాణ్, సామంతుడూ, విమలుడూ కలసి మంతనాలు జరిపారు మహారాజు జీవించి ఉన్నారనీ, అమీరు సైన్యంతో యుద్ధం చేస్తూ ఉన్నారనీ ప్రచారం చేయనిదే గుజరాత్ సైన్య శక్తిని కాపాడలేమని నిర్ణయించుకున్నారు మహారాజు నిరంతరం పోరాడుతూనే ఉన్నారని విశ్వాసం చేకూర్చేందుకు ఆయనను కమా లఖాణీ కచ్ఛ ప్రాంతానికి తీసుకొని వెళ్ళాలని కూడా నిశ్చయించబడింది విమల సామంతులు ఖంభాతం వెళ్ళి చోళా నక్కడ దిగబెట్టాలి దామోదర్ మెహతాను కలుసుకొని అంతా కలసి అమీరును వెంబడించాలి

ప్రభాసం వదిలిపెట్టినప్పటినుంచీ చోళా స్మృతి లేని దానిఎలె ఉన్నది ఇది చేయమని ఎవరైనా అంటే చేస్తుంది భీమదేవుని దగ్గర కూర్చున్నా ఒక మట్టిబొమ్మలానే ఉంటుంది

అసలు ఆమెలో ప్రాణమే లేదేమోననిపించింది సోమనాధుని మాటలు ఎవరైనా చెప్పుతుంటే మాత్రం తదేకంగా వింటుంది మిగతా వార్తలు విననేవినదు ఇక మాట్లాడడమంటూ ఉంటే ఒక్క సామంతునితో మాత్రమే తనను ఖంభాతం వెళ్ళమన్నప్పుడు కూడా ఎందుకని ప్రశ్నించలేదు భీమదేవుణ్ణి కచ్ఛకోటకు ఎందుకు తీసుకొని వెళ్తున్నారని అడగలేదు ఆ జిజ్ఞాసే లేదు అసలు స్వత్వమే పూర్తిగా కోల్పోయినట్లయింది

**2**

కన్నీటికి కూడా కరువై, వట్టి వేడి నిట్టూర్పులతో బ్రతికే చోళానాను ఖంభాతంలో భీమదేవుని రాణిని ఉంచవలసిన లాంఛనాదులతో ఉంచారు కానీ ఆమెకు దేనిమీదా మమకారం లేదు. 'నా స్వామీ!', 'పరమేశ్వరా!' అని మాత్రం అప్పుడప్పుడు దీర్ఘంగా నిట్టూర్పులు విడుస్తుంది

గగనరాశి ఆమెను కలుసుకోడానికి వచ్చినప్పుడు ఒక క్షణంపాటు ఆమె కన్నుల్లో జ్యోతులు మెరిసాయి. సామంతుడు గగనరాశికి సర్వజ్ఞుని అంతిమ క్షణాలలోని విషయాలూ, అంతిమ వాక్యాలూ చెబుతుంటే ఆమెకు కన్నీరు కాలువలై ప్రవహించింది

అలా మాటలు మాని- ఏడవడం కూడా మాని-సముద్రం వైపు దూరంగా దృష్టి నిలిపి కూర్చుండేది

సామంతుడు, విమలుడు వెళ్ళేముందు అనుమతి తీసుకోడానికి ఆమెను సమీపించినప్పుడు నీరసంగా సమాధానం ఇచ్చింది రెండు మూడు రోజుల కొకసారి గగనరాశి వచ్చి పలుకరిస్తుండేవాడు. ఆమె పగటికలలు కంటున్నట్లు ఉండేది ఆ సంభాషణ

ఒకనాడు గగనరాశి వచ్చి ఖంభాతంలో పాశుపత మతాన్ని నెలకొల్పాలనీ, సోమనాధ మందిరం నిర్మించాలనే కోరిక ఉన్నదనీ చెప్పాడు అది వినగానే ఆమె కన్నుల్లో రక్తం ఎగజిమ్మింది మహాక్రోధంతో గగన రాశిని చూచింది

'గగనరాశీ! నా పరమశివుడు ఒక్కడే రెండు కాదు '

ఆమె కన్నుల్లో ఉగ్రభావాన్ని చూచి గగనరాశి చకితుడైనాడు అప్పటి నుంచి ఆ విషయాన్ని గురించి ప్రసంగించడమే మానుకున్నాడు

మరోమారు గగనరాశి దేవదాసీల ప్రసక్తి తెచ్చాడు

'రాశిగారూ! నేను నృత్యం చేస్తూన్నపుడు ధరించిన వస్త్రాల్లాంటివి, నగల్లాంటివి ఇక్కడ దొరుకుతాయా?'

'తప్పకుండా' అన్నాడు విస్మయంతో గగనరాశి

మరుసటిరోజే నఖశిఖ పర్యంతం కావలసిన వస్త్రభూషణాలు వచ్చాయి వాటిని ఆమె సంతోషంతో తీసుకున్నది. ఇన్నాళ్లకు రాణిని ఆనందోద్రేకంతో చూసి దాసదాసీలు కొంత దగ్గరకు చేరారు

తరువాత కొన్నాళ్లు ఆమె మాటాడడమే మానింది పగలల్లా సముద్రంవైపు చూచేది. దీపాలు పెట్టే వేళకు వస్త్రభూషణాలు తీసి దులిపి బైటపెట్టేది అలా

ప్రతిరాత్రీ అర్ధనిశీధి వరకూ చెంపలకు చేతులాన్చి నిరీక్షిస్తూ కూర్చునేది తరువాత ఒక వేడి నిట్టూర్పుతో వస్త్రభూషణాలను దాచిపెట్టేది

ఇదే ప్రతిదినం . దాసదాసీ జనం దీన్ని గురించి అనేక విధాల అనుకుంటూ ఉండేవారు

గగనరాశి, దాసదాసీలు ఎన్నో కొత్త వార్తలు తెచ్చి ఆమెను రంజింపచేయడానికి ప్రయత్నిస్తుండేవారు. అమీరు సైన్యంలో ఉత్సాహం నశించింది సైనికులు ఇండ్లకు వెళ్ళిపోవడానికి ఆతుర పడుతున్నారు అమీరేమో తిరిగి వచ్చి అనహిలవాడలో రాజ్యం నెలకొల్పాలని చూస్తున్నాడు కానీ అలా చేస్తే అతని సేనలు విప్లవం లేవదీస్తాయి అందుకని అతడు భయపడి ఈ దేశం నుంచి పారిపోవాలని తొందరపడుతున్నాడు

ఇంకా కొత్త కొత్త విషయాలు వ్యాపించాయి సోమనాధ పరమేశ్వరుడు సామంతునికి నిజంగా అసమానమైన శక్తిని ప్రసాదించాడు అతడు సమస్త భారతంలో తిరుగుతున్నాడు ఘోఘూరాణా యశోగాధ ప్రతి యింటా కీర్తింపబడుతోంది సామంతుడు వెళ్ళినచోటల్లా ప్రజలను ఉత్సాహపరుస్తున్నాడు అతనికి మహాదేవుడు అక్షయశక్తి నిచ్చాడు రాత్రిలేదు పగలు లేదు ఆకలిలేదు. దప్పికలేదు అమీరును తుడిచిపెట్టాలి అమీరును నాశనం చేయాలి ఈ జ్వాజ్వల్యభావంతో ఈ భావమే తానై నిలిచినట్లు తిరుగుతున్నాడు

మరికొన్ని వార్తలు రావడం మొదలైంది ఈ వార్తలతో తిరిగి సమస్త గుజరాత్‌లో ఆశాజ్యోతులు ప్రజ్వరిల్లాయి ఉత్సాహం పురికొన్నది ఉజ్జయిని నుంచి, మార్వాడ్ నుంచి సైన్యాలు వచ్చాయి సాంభర చౌహానుని సైన్యాలను సామంతుడే తెచ్చాడు తదితర రాజపుత్రులు సహాయానికై సిద్ధమైనారు అనహిలవాడ నుంచి నలకోట వరకు ఈ సమిష్టి సేనలు ఒక వల పన్నినట్లు వ్యూహం పన్ని కూర్చున్నాయి

కానీ, ఈ విషయాల్లో చోళాకు ఏమాత్రం మనస్సు లగ్నంకాదు [illegible]నంతవరకు రసహీనంగా చెవులు అప్పగించి ఓర్మితో వినేది తేజోవిహీనమైన చూపులతో చూచేది చెప్పడం అయిన తరువాత బరువుగా ఒక నిట్టూర్పు విడిచి సముద్రం వైపుకు దృష్టి మళ్ళించేది

రెండునెలలు గడిచాయి ఒకరోజు అన్నమే రుచించలేదు. తినగానే డోకు వచ్చింది పదిహేనురోజులైన తరువాత తాను గర్భవతి అయిందని తెలియడంతోటే కెవ్వుమని మూర్ఛపోయింది

స్మృతి వచ్చినప్పటినుంచీ కన్నుల్లోంచి కట్టలు తెగి అశ్రువులు ప్రవహించాయి తాను పార్వతీ కాదు . భీమదేవుడు శంకరుడూ కాడు . శంకరునితో తన వివాహం

జరుగలేదు తన స్వామిని పరమేశ్వరుణ్ణి మోసం చేసి తన చంచల మనస్సుకు బానిసయ్యై ఒక మానవుణ్ణి ఒక మానవమాత్రుణ్ణి పెండ్లి చేసుకున్నది ఇక తల్లి కానున్నది

తాను చేసిన ఈ అత్యాచారాన్ని తలచుకొని రాత్రింబవళ్ళూ కన్నీరు కార్చడం మొదలుపెట్టింది

ఏ నిశీధిని తాను ముక్తి కూర్చిన నిశీధిగా భావించిందో దానిని తలచుకున్నప్పుడల్లా మనస్సు ముక్కలయ్యేది ఆ బాధ ఆమెను ప్రతి లిప్తా దహించ నారంభించింది ఆమె పతితురాలైంది దేవప్రియ తాను కాని తానే స్వేచ్ఛతో మహా అధమురాలై పోయింది ఇప్పుడు ఇప్పుడు తాను అధమాధమురాలు తన శరీరంలో నేడు మానవస్పర్శ ఒక కళంకమై రూపుగొంటున్నది

ఆమె తన శయ్యను కిటికీ దగ్గర వేయించుకునేది సముద్రంవేపే చూస్తూ, కన్నీరు కారుస్తూ, ప్రతిరోజు రాత్రికి దాసీ చేత నృత్యవస్త్ర భూషణాలను తెప్పించి అర్ధరాత్రి వరకూ వాటిని చూస్తూ కూర్చునేది తరువాత వాటిని పంపించేది

అప్పటికల్లా మహోత్సాహకరమైన వార్తలు వెల్లువలై వస్తున్నాయి కానీ ఆమెలో ఆ వార్తలు వినాలనే కుతూహలం కూడా చచ్చిపోయింది

హిందూసేన వేగంగా పురోగమిస్తున్నది అమీరు ఈ దారిన వెళ్ళడానికి భయపడి కచ్ఛ మీదుగా పలాయనానికి తలపడ్డాడు అమీరు వచ్చాడు ప్రభాసాన్ని నేలమట్టం చేశాడు భగవానుని విగ్రహాన్ని పగలగొట్టాడు కానీ దీనివల్ల అతనికి లాభం కొంచెమైనా కలుగలేదు సాహసంగా దీపావళి చేసినందుకు అతనికి చిక్కిందల్లా బూడిద, దుర్గంధం మాత్రమే

అమీరు పారిపోయాడు హైందవ సేనావాహిని అతనిని వెంబడించింది దారిలో స్వయంగా భీమదేవుడు కమాలఖాణీ మొదలగు యోధులు అమీరును ముప్పుతిప్పలు పెడుతున్నారు

దీపావళి వచ్చింది వస్తూ అమితమైన ఆనంద వార్తను తెచ్చింది మహారాజు ప్రజల పరాక్రమంతో అమీరును కచ్ఛ ప్రాంతం నుంచి తరిమికొట్టాడు. ఇక ఆయన అనహిలవాడ రాబోతున్నాడు

గ్రామాలకు గ్రామాలు ఆనంద కల్లోలంతో ఖంభాతంకు తరలి వస్తున్నాయి ఎటు చూచినా దీపమాలికలే రాజదుర్గంలో భేరీ మృదంగాలు విజయోల్లాసంతో గర్జిస్తున్నాయి ''భీమదేవ మహారాజుకు జై'' అనే నినాదంతో రాజ దుర్గం ప్రతిధ్వనిస్తున్నది

గ్రామీణులు చోళారాణిని దర్శించుకుందామని వచ్చారు కానీ చోళాలో ఏమీ కదలిక కన్పించలేదు ఆమె శరీరంలోని కళంకం నానాటికీ వృద్ధి చెందుతున్నది దానితోపాటు ఆమె మనస్సు కూడా దిగజారిపోతున్నది అలాగే కన్నీరు కూడా అజస్త్రమై ప్రవహిస్తుండేది కన్నుల్లోని కాంతి నశించి సంధి గొట్టినట్లు కన్పించేది ఎందరు వైద్యులున్నా ఏమీ చెయ్యలేకపోయినారు

తరువాత గగనరాశి భీమదేవ మహారాజును ఆహ్వానించడానికి అనహిలవాడ వెళ్ళాడు అతడు వెళ్ళడంతో ఆమె జీవితంలో చివరి ఆశాకేంద్రం కూడా మాయమైనట్లైంది

ఆమె గౌరవం క్రమంగా అభివృద్ధి పొందుతున్నది విజయంతో మహోన్నతిని పొందిన భీమదేవ మహారాజు కామె ధర్మపత్ని ఆమె నివసిస్తున్న రాజదుర్గం ఒక క్రొత్త రూపాన్ని ధరించింది దాసదాసీ జనం హడావిడి ఎక్కువైంది సంగీత వాద్యాలతో ఆమెను రంజింప చేయడానికి ప్రయత్నాలు ఆరంభమైనాయి కానీ, ఆమె వీటన్నింటికీ అలిప్తంగానే ఉండేది ఆమెలో ఉత్సాహం లేదు, కన్నీరు ఇంకిపోలేదు

ఒకనాడు విమల మంత్రి ఆమెను చూచి వెళ్ళడానికి వచ్చాడు మహారాజే అతణ్ణి పంపాడు మహారాజు అనహిలవాడకు వేంచేశాడు భరత ఖండంలోని రాజమండలి అంతా ఆయన పరాక్రమానికి అంజలి ఘటించింది చిన్నచిన్న రాజ్యాలన్నీ ఆయనకు సామంత మండలులైనాయి అనేక సైన్యాలు ఆయన కీర్తిని పాడుకుంటున్నాయి అనహిలవాడ దుర్గం నూతనంగా నిర్మింపబడుతున్నది తిరిగి ప్రభాస నగరాన్ని నిర్మించి శ్రీసోమనాధుని ప్రతిష్టించవలెనని కూడా మహారాజు ఆదేశించాడు ఈ కార్య పూర్తి కొరకు గగన సర్వజ్ఞుడు - అందరిచేతా సర్వజ్ఞ పదవిని పొందిన మహానుభావుడు - ప్రభాసం వెడుతున్నాడు

చోళా కన్నులు విప్పారాయి తదేకంగా ఈ చివరి వార్త విన్నది ఆమె కన్నుల్లో హఠాత్తుగా చైతన్యం పొంగింది ఏదోవిధంగా లేచి నిల్చున్నది

'పరమేశ్వరుణ్ణి ప్రతిష్టించడానికి ఎంతకాలం పడుతుందింకా?'

''ఒక సంవత్సరం పడుతుంది''

'అయితే నేను చావను అంతవరకూ చావను నా స్వామీ! పరమేశ్వరా! నేను అంతవరకూ మరణించను నా మర్యాద నీ చేతుల్లో ఉంది స్వామీ!'

ఈమాత్రపు శరీరశ్రమ కూడా ఆమె ఓర్చుకోలేక పోయింది అలా అంటూ శయ్యమీద కూలి మూర్ఛపోయింది

**3**

రెండోరోజు నుంచి చోళా పట్టుదలతో భోజనం చేయడం మొదలుపెట్టింది ఆమె కన్నుల్లో తిరిగి నవజీవన కాంతులు మెరుస్తున్నాయి ఆమె మరణించకూడదిక కనుక భగీరథ ప్రయత్నం చేసి జీవిస్తున్నది

చాలా కష్టంమీద మళ్ళీ కిటికీ దగ్గర కూర్చుని సముద్రధ్యానం మొదలుపెట్టింది దాసీ ద్వారా వస్త్రభూషణాలను తెప్పించడం మాని తానే స్వయంగా తెచ్చుకుంటుండేది

చోళాకు తొమ్మిదవనెల వచ్చింది ఆమెను కలుసుకోడానికి మహారాజు స్వయంగా వస్తున్నాడని తెలిసింది భీమదేవుని పేరు సమస్త భారతంలో వ్యాపించింది గుజరాత్ ఆయన అంటే వెర్రి ఆనందం అనుభవిస్తోంది స్త్రీ పురుషులు ఆయన కీర్తినే పాడుకుంటున్నారు అమీరును తరిమికొట్టాడు. గుజరాత్‌ను మహా భూమిగా చేశాడు అనహిలవాడ, ప్రభాసనగరాలను పునర్నిర్మిస్తున్నాడు శౌర్యంలో కార్తికేయుణ్ణి మరిపించాడు ఆయన కీర్తి ముందు సూర్యుని తేజం వెలవెలబోయింది దేవ, ఋషిగణాలు ఆయన్ను అహోరాత్రులు స్తుతిస్తున్నాయి

అలాంటి ఆ మహావీరుడు చోళారాణిని కలుసుకోడానికి- మహారాణి యైన ఉదయమతితో వస్తున్నాడు ఇంటింటా తోరణాలు శోభిల్లుతున్నాయి వాడవాడలా జయధ్వానాలు వినిపిస్తున్నాయి రాజదుర్గం ఒక కొత్త రూపాన్ని ధరించింది నలువైపులా విజయులైన వీరుల సంరంభం కనిపిస్తోంది వస్తున్నాడు-వస్తున్నాడు-మ్లేచ్ఛవిజేత-గుజరాత వైభవ ప్రజేత- భీమదేవుడు వస్తున్నాడు

తెల్లవారితే భీమదేవుడు వస్తాడు ఆ రాత్రి అంతా చోళా చాలా ఉద్వేగంతో గడిపింది కలలో ఆమెకు తన ప్రభాసం కనిపించింది వృద్ధులు మహాత్ములు గురుదేవుడు హారతులిస్తూ కనుపించాడు దేవదాసీలపై ఆధిపత్యం నెరపుతూ గంగ కనిపించింది ఆ దివ్య ఏకాదశీ ముహూర్తాన తాను నృత్యం చేసిన దృశ్యం కూడా కనుపించింది

చోళా తిరిగి పరమేశ్వరునితో నేస్తం కలుపుకున్నది ఆమె పరమేశ్వరునికి ప్రేమార్త యైన బాలిక మందిరంలో కూర్చుని ఎన్ని ప్రేమగీతాలను తాను ఆలపించింది! ఎంత తపస్సు చేసింది! నందిదేవుణ్ణి తన వాణ్ణిగా చేసుకున్నది శంకరుణ్ణి వశపరచుకున్నది అలా పరమేశ్వరుని ఆలింగనంలో ఆ రాత్రి అంతా అనంతమైన ఆనందాన్ని అనుభవిస్తూ గడిపింది

తెల్లవారేసరికి ఆమె చకితయై లేచింది ఆమె నరాలలో వెనుకటి ఉత్సాహం వ్యాపిస్తున్నది విరహవేదనతో ప్రభాత ఢమరుక ధ్వనులను విన్నది కన్నుల్లో అద్భుత తేజం ఒలుకుతున్నది దాసీని పిలిచి దివ్యవస్త్రాలను ధరించడానికి కూర్చున్నది

మధ్యాహ్నం అయింది సామంత చక్ర చూడామణి, మహారాజాధి పరమభట్టారక శ్రీ భీమదేవ మహారాజు అయిదువందల యోధులతో నగరు ప్రవేశించాడు పరిసరాల నుంచి వచ్చిన పల్లెప్రజల సంతోషానికి అంతేలేదు రంగు రంగుల దుస్తులు ధరించి, రంగులు చల్లుకుంటూ బయలుదేరారు రాజదుర్గం మీద వరండాలో రత్నఘటిత సింహపీఠం మీద కూర్చుని భీమదేవుని రాకకై చూస్తున్నది చోళా దాసీలు వింజామరలు వీస్తున్నారు దాసీలే నచ్చచెప్పి ఆమెను అలంకరించారు పాలిపోయిన ముఖంతో, ఎండిపోయి బలహీనురాలైన చోళా సింహాసనం మీద వెర్రి చూపులతో కూర్చున్నది కానీ, ఆమె దృష్టి త్రిపుర సంహారానికై బయలుదేరిన రుద్రునికై వెదుకుతున్నది రుద్రుని కన్నుల్లోని యుద్ధోత్సాహం, ఆయన కంఠంలోంచి వెలువడుతున్న గర్జనలు, ఆయన జటాజూటంలో వెలుగొందుతున్న అర్ధచంద్రుని స్నిగ్ధరేఖ, శంఖ, భేరీ ధ్వనులతో అన్నీ ఆకాశంలో ఆమె కన్నులకు కనిపించాయి యుద్ధోత్సాహంతో బయలుదేరిన తన నాధుణ్ణి చూడాలని ఆమె హృదయం తపిస్తున్నది పాలిపోయిన బుగ్గల్లో కెంపులు మెరిసాయి గుండె వేగంగా కొట్టుకుంటున్నది

ప్రజల జయధ్వానాల మధ్య, కోలాహలపు సాగరాన్ని దాటి పరమ భట్టారకులు శ్రీ భీమదేవులు రాజదుర్గంలో ప్రవేశించారు మిలమిల మెరుస్తున్న తలపాగాలతో అశ్వికుల సమూహం కూడా లోపలికి వచ్చింది ఒంటెల మీద పతాకలూ, భేరీమృదంగాలూ వచ్చాయి దంతావళం మీద రత్నఘటిత సువర్ణ ఆసనం మీద ఠీవిగా కూర్చుని మహారాజు స్వయంగా ప్రవేశించారు ఆయన శరీరం జరీ పట్టువస్త్రాలతో ప్రకాశిస్తున్నది భుజాన మ్లేచ్ఛ సంహారమైన దీర్ఘ ధనుస్సు వ్రేలాడుతున్నది చెవులకు మణిమయ కుండలాలు వ్రేలాడుతున్నాయి శిరస్సున మాణిక్య కిరీటం శోభిల్లుతున్నది మణులూ, రత్నాలూ మధ్యాహ్న సూర్యుని కాంతులకు ధగధగ మెరుస్తూ కాంతులను వేయి పాయలుగా నలువైపులకూ ఎగజిమ్ముతూ కండ్లకు మిరుమిట్లు కల్పిస్తున్నాయి మన భీమదేవుడు మన మహారాజు మన కోదండపండితుడు మన సంరక్షకుడు పోషకుడు దైవము అనుకుంటూ ప్రజలు ఉప్పొంగిపోతున్నారు

తేజోరాశి మధ్య కూర్చున్న ఆ మహారాజును చూచింది చోళా ఇంద్రునివలె అతనిలో కన్పిస్తున్న నిత్యయవ్వనాన్ని చూచింది ఆ కన్నుల్లో మెరిసే విజయ గర్వాన్నీ,

ముఖంలో వికసించిన రాజోచిత హాస్యాన్నీ గాలికి రెపరెపలాడుతున్న చక్కని గడ్డాన్నీ చూచింది వెంటనే ఆమె నీరస దృష్టి ప్రక్కకు తిరిగింది ఆమె కండ్లు భయంతో విప్పారినాయి పెదిమలు చెప్పలేనంత భయంతో వణక నారంభించాయి

''అమ్మా! అమ్మా! మహారాజు ఎంత చక్కగా శోభిల్లుతున్నారో చూడండి!''

ప్రత్యుత్తరంగా చోళా తన ముఖాన్ని దిండుల్లోకి దాచుకున్నది వెక్కిళ్ళతో ఆమె శరీరమంతా గజగజలాడటం మొదలుపెట్టింది

**4**

అంబారీలోనుంచి దిగగానే వస్త్రాలు కూడా మార్చుకోకుండా తహతహ లాడుతూ భీమదేవుడు తన ప్రియురాలిని కలుసుకోడానికి వచ్చాడు దాసదాసీలు వంగి వంగి జోహారులర్పించారు

'చోళా! నా ప్రియా ' అని పిలుస్తూ చోళా కూర్చున్న చోటికి పరుగెత్తాడు

వాడి, కాంతి చెడి పడివున్న చోళా భయాకుల దృక్కులతో కండ్లు తెరచుకుని తన భర్తను చూస్తూ 'మహారాజా!' అని అన్నది

'అరెరె ఇదేమిటి ఇలా అయిపోయావు? నీవు జబ్బుగా ఉన్నట్లు కూడా నాకు తెలియదు చోళా! ఇంత అస్వస్థతగా ఉన్నప్పుడు అనహిలవాడకే తీసుకుపోయేవాణ్ణి కానీ ఇప్పుడు ప్రయాణం చేయలేవు చోళా గత సంవత్సరం ఎంత విచిత్రమైంది జ్ఞాపకముందా ప్రియా! మన పెండ్లినాడు ఎన్ని బాధలు చుట్టూ ఉండేవో! మరి ఈరోజో? అమీరును కూడా ఎంత పీడించామనుకున్నావు అదీకాక-చోళా! సపాదలక్ష, మార్వాడ్ స్థానిక రాజ్యాలు నాకు కప్పం చెల్లిస్తున్నాయి తెలుసా? ఇక రాచనగరులను అతి చక్కగా నిర్మిస్తా నీకోసం చాలా చక్కని సౌధం నిర్మించారు ప్రియా! నీవు వచ్చి చూస్తావుగా ఇంకా నగలు కూడా ఎన్నెన్ని దేశాలనుంచో తెప్పించాను '

భీమదేవుడు ప్రేమ విహ్వలుడై మాటాడుతూనే ఉన్నాడు కానీ, చోళా మట్టుకు గడ్డకట్టిన మంచువిగ్రహంలా నిస్తేజమైన చూపులతో భీమదేవుణ్ణి చూస్తూ కూర్చుంది అతడు తన కేదో ఘోరమైన బాధ కలుగజేస్తాడనే భావం స్ఫురిస్తోంది ఆ చూపుల్లో

'చోళా! పదిహేనురోజుల్లో మనకు చక్కని సంతానం కలుగుతుంది కుమారుడైతే అదృష్టమే అదే నా నొసట లేదింతవరకూ అప్పుడు వస్తాను నిన్ను తీసుకొని వెళ్ళడానికి వీలుపడితే విమలుడు వస్తాడు అతని హృదయంలో ఎంత స్నేహం

ఉన్నదనుకున్నావు చోళా! అప్పటికి బహుశః మాళవ భోజుని మీదికి నేను దాడి చేయాల్సి వస్తుందేమో వాడు మహా అల్లరి పెడుతున్నాడు ఒకసారి రుచి చూపితే '

ఇలా చెప్పుకుపోతూ ప్రేమ విహ్వలుడైన అమాయక భీమదేవుడు ఇలాంటి మాటలతో తన ప్రియురాలి గుండెను గాయపరుస్తాడని అనుకోలేదు

తరవాత ఆత్రంగా చోళాను సమీపించాడు చోళా ముఖాన్ని రెండు చేతుల్లోకి తీసుకొని ముద్దుపెట్టుకున్నాడు

చోళాకు ప్రపంచం కంపిస్తున్నట్లు అనిపించింది ఆ ముఖం ఆ వాసన లెగజిమ్ముతూ చక్కిలిగింతలు పెట్టే గడ్డపు స్పర్శ, ఆ కన్నుల్లోని భోగలాలసా అవన్నీ ఆమెకు పరాయివి పరిచయం లేనివి అప్రియమైనవి ఆమె రెండు కండ్లూ గట్టిగా మూసుకొని ఆ లాలింపును నిలువునా వణుకుతూ సహిస్తోంది ''పరమేశ్వరా! నన్నీవిధంగా వదిలి ఎక్కడున్నావు స్వామీ! ఎందుకు మరి చావు ప్రభూ! '' అని చోళా తన హృదయ వేదనను ప్రకటించింది

''చోళా! సామంత చౌహాన్ కూడా ఇప్పుడే వస్తాడు మహా విచిత్రపు మనిషి నాతోపాటు రాజసంగా రావయ్యా అంటే, కాదు రాత్రికి వస్తానన్నాడు దొంగలాగా కానీ, ఒక్క విషయం చెప్పనా చోళా! ఎవరి దగ్గరా అనకు సుమా అసలు అమీరు పారిపోయాడంటే నేను కాదు కారణం- ఆ సామంతుడు పాపం అహోరాత్రులూ ఎన్ని దేశాలు తిరిగాడో! రాజులందరికీ నచ్చజెప్పాడు కదా! దామోదర్ మెహతా నోరు కదిపితే సామంతుని కీర్తినే పాడుతుంటాడు అసలు సామంతుడు లేకపోతే అనహిలవాడలోనే ఏనాడో ముక్కలు ముక్కలుగా తెగిపోయి ఉందును మనం బ్రతికి ఉన్నామంటే అతడే కారణం చోళా! అతడు లేకపోతే ప్రభాసానికి ఎలా వచ్చేవాణ్ణి? కానీ, వట్టి మొండివాడు సోరఠ ప్రాంత దండనాయకుడివై ఉండవయ్యా అన్నాను అంతేకాదు ఒక చిన్న రాజ్యం కూడా ఇస్తానన్నాను ససేమిరా వద్దంటాడు 'నా కర్తవ్యం ముగిసింది నేను ఘోఘా దుర్గం వెళ్తానిక' అంటాడు ఇక అక్కడో. ఒక్క పురుగు లేదు నీ దగ్గరికి పంపుతా అతనికి కొంచెం నచ్చజెప్పు చోళా! మన దగ్గరే ఉంటే ఘూర్జర కీర్తిని సహస్ర కాంతులతో వ్యాపింపచేస్తాడు''

ఇక విసుగెత్తి ఉండబట్టలేక ఎంతోసేపట్నుంచో అడగాలనుకుంటూన్న ప్రశ్నను అడిగింది చోళా ''మహారాజా! ప్రభాసం ఎప్పటికి నిర్మింపబడుతుంది?''

''ఎనిమిది నెలల్లో పూర్తవుతుంది ''

''అయితే- ఇక్కడి పని అయిపోయిన తరువాత వే నక్కడికి వెళ్ళనా?''

''అదేమిటి- నీవు అనహిలవాడ రావాలి. అక్కడ మనం ఆనందంగా కాలక్షేపం చేయాలి ''

''నా ప్రాణాలు ప్రభాసంలో ఉన్నాయి వెళ్ళి నా ప్రభువుని పూజించాలి ''

''మరి నేను ఎంత చక్కని మందిరం కట్టించానో తెలుసా? కొత్త శివమూర్తిని ప్రతిష్ఠించే నాటికి మనం వెళ్దాం సరేనా?''

''కొత్త మూర్తి ఏమిటి? మన పరమేశ్వరు డేమైనాడు?''

''ఆ లింగాన్ని అమీరు పగలగొట్టి, గజనీకి తీసుకొని వెళ్ళాడు ''

చోళా కన్నులు స్థిరమైపోయాయి ఆకులపాటుతో, పిచ్చిదానివలె నలువైపులా చూడనారంభించింది కండ్లు తిరుగుతున్నాయి మహారాజుకు భయం కలిగింది దాసీలను పిలిచాడు దాసీలు వచ్చేసరికి చోళా మూర్ఛతో పడిపోయి ఉన్నది

రెండోరోజు సామంతుడు వచ్చాడు నల్ల కప్పువేసి ఎండిపోయి కర్కషమై గాయాల మీద గాయాలతో పస చెడి ఎప్పటికప్పుడు తానై పెంచుకున్న ఉన్మాదం వల్ల మహా భయంకరమూర్తిగా రూపొందాడు లోపలికి అడుగుపెట్టి ఆశ్చర్యంతో స్తంభించి దిగాలుపడి శుష్కించిపోయిన చోళాను చూచాడు

''నమస్కరిస్తున్నాను దేవీ'' అంటూ దూరాన సాష్టాంగపడ్డాడు

''నీవు కూడా సామంతా!'' అంటూ పొంగి వస్తూన్న దుఃఖాన్ని ఆపుకోలేక చోళా ఏడ్చింది

''ఏమిటి. ఏమిటి?''

''నీవు కూడా చోళాను మరచిపోయావా?''

సామంతుని ముఖంలో మృదురేఖలు మేలుకున్నాయి దగ్గరికి వచ్చి చేతులు జోడించి, ''మరచిపోతానా? ఎలా మరచిపోతాను దేవీ? మరి ప్రపంచమే మారిపోతే నే నేమిటి చేయడం?''

''నిజమే సామంతా. ముమ్మాటికీ నిజం. ప్రభాసం గతించింది గురుదేవులు గతించారు గంగ గతించింది పరమేశ్వరుడు ముక్కలైపోయాడు మరి నేను ఆ పరమేశ్వరుని దాసిని ఎందుకు ఇంకా బ్రతికి ఉన్నట్లు?'' చోళా వెక్కుతూ అన్నది

సామంతుని హృదయం స్పందించింది అతని మనసులోని తీగెలు కూడా సానుభూతితో మారుమ్రోగాయి చోళా హృదయంలోని బాధను అతడు అర్థం చేసుకున్నాడు

''చోళా అర్థమైంది నాకు మాత్రం ఏమి మిగిలింది? ఘోఘా గఢం ఘోఘాబాబా ఆయన వంశం గురుదేవులు అందరూ అందరూ '' సామంతుని కంఠంలోంచి ఏడుపే మాటలుగా వెలువడింది

సమాన బాధ ననుభవిస్తున్న వాళ్ళే ఒకరి నొకరు గ్రహించగలుగుతారు ఈలక్షణాన్ని గ్రహించి ఆ యిరువురూ ఒకరినొకరు చూస్తూ కూర్చున్నారు

ఏడుపు గొంతుతో అడిగింది చోళా- ''సామంతా నీవు కూడా వెళ్ళి పోతున్నావా?''

''ఏమిటి చేయడం? నేను ఘోఘాబాబు కాలంవాణ్ణి గురుదేవుని కాలంవాణ్ణి, ఈ నవీనయుగంలో నే నెవరో పరాయివాణ్ణి. తెలియనివాణ్ణి. అపరిచితుణ్ణి ''

''సామంతా! నేనూ నేనూ ఈ లోకపు మనిషిని కాను- ఒకసారి పూర్వజన్మలో నీకు రక్ష కట్టాను విజయతిలకాన్ని దిద్దాను దానికి బదులుగా ఒక భిక్ష అడుగుతున్నా ఇస్తావా చౌహాన్?''

''అడుగు చెల్లీ! అడుగు''

''నా పరమేశ్వరుడు ప్రభాసం తిరిగి వచ్చేంతవరకు ఇక్కడ ఉంటావు కదూ నేను జీవించి ఉంటేనే ''

సామంతునికి ఆనాటి విజయ తిలకం గుర్తుకు వచ్చింది ఆమె తీయని మాటలు జ్ఞాపకం వచ్చాయి అన్నయ్యై ఆనాటి రాత్రి కన్యాదానం చేశాడు అదీ గుర్తుకు వచ్చింది

''అయితే సరే చోళా! ఇంకేమైనా ?''

''నూరేళ్ళు వర్ధిల్లు సామంత వీరా!''

చోళా ముఖంలో సన్నని నవ్వు చిలికింది సుఖానికీ, శాంతికీ, ఆనందానికీ, మొగం వాచిన సామంతుడు కూడా నవ్వాడు ఏకాకి ప్రాణులైన ఆ ఇద్దరూ కలసి ప్రపంచ భారాన్నే సగం దించారు

## 5

నెలరోజుల తరువాత పరమ భట్టారక శ్రీ భీమదేవ మహారాజు గారి భార్య చోళాదేవి కుమారుణ్ణి కన్నది ఖంభాత, గుజరాత, అనహిలవాడల్లో ఆనంద కల్లోలాలు ఉప్పొంగాయి. మహారాజు ఆనందానికి అంతులేదు ఆయన ఖంభాతం వచ్చాడు పుత్రుణ్ణి చూచాడు. దేవదాసీ జనానికి బహుమతులు పంచిపెట్టాడు చోళా తన ప్రియదేవేరి ఆమెకు కలిగిన మొదటి కుమారుడు ఇతడు ఆయన సుఖానికీ విజయానికీ ఇది సుఖకలశస్థాపన లాంటిది.

ప్రసవవేదన ఉపశమించి, స్మృతి వచ్చినా చోళా మనస్సులో కుమారుణ్ణి చూడాలనే కోరిక కలగలేదు చూచిన తరువాత ఆ విశాల వక్షం కొదమసింగపు

నడుములాంటి నడుము పెద్ద పెద్ద కన్నులు చూచి నిలువునా వణికిపోయింది అదే వక్షం అదే నడుము అవే కన్నులు ఇంకా పెద్దవి ప్రౌఢభావాలతో ప్రభావ గరిమతో కన్పించాయి గుండెలదిరే కలలో భయంకరుడైన రాక్షసుణ్ణి చూచినట్లనిపించింది

ఆమె కన్నులు తిరిగాయి

దేవదేవునికి ఆమె సమర్పిత దాసానుదాసి ఈ బాలకుడు అధమమైన లౌకిక శృంఖలాలతో తనను బంధిస్తున్నాడు అతణ్ణి చూచినప్పుడల్లా ఆమెకు అంతులేని దుఃఖం కలిగేది

రెండు నెలల తరువాత విమల మంత్రి ఆమెను అనహిలవాడ తీసికొని వెళ్ళడానికి వచ్చాడు కాదనలేక సిద్ధమైంది పల్లకిలో కూర్చుని ఎలాగో అనహిలవాడకు బయలుదేరింది

కొన్నాళ్ళకు గుజరాత రాజధాని ప్రవేశించింది అంతఃపురంలో అడుగుపెట్టింది భీమదేవుని మొదటి భార్య ఉదయమతి, రెండవ భార్య రూపవతి వచ్చి కలుసుకున్నారు రాణీ చోళాదేవి సపర్యలకై అంతఃపురంలో హడావుడి ఆరంభమైంది

చోళా కొద్దిగా కోలుకున్నది కానీ, ఖంభాతంలో లభించిన మనశ్శాంతి ఈ విలాసాల మధ్య లభిస్తుందా? ఖంభాతంలోనైతే ఎదురుగా సముద్రం ఆవలిగట్టున పరమేశ్వరుడుంటాడు అక్కడ ఇందరు సేవకురాండ్రు లేరు- ఇంత ఆడంబరం లేదు

కోటలో అడుగు పెట్టిననాడే ఎలా తెలిసిందో ఆమెకు పైపైకి ఎన్ని గౌరవమర్యాదలు జరుగుతున్నా తనను పరాయి వ్యక్తిగా, అధమురాలిగా చూస్తున్నారని తెలిసింది

'నిజమే' చోళా పెదవి కొరుక్కున్నది 'నిజమే నేను రాకుమారిని గాను నేను దేవనర్తకిని మరి నాకిక్కడ అధికారం ఏముంది?'

అసలే దుఃఖార్తయైన ఆమె మనస్సును వేయి సమ్మెటలు కొట్టినట్లనిపించింది

భీమదేవుడు ఆనాడు ఉత్సాహంతో పనులన్నీ నెరవేర్చాడు అతని హృదయ తంత్రులు నూతనగీతాన్ని ఆలాపిస్తున్నవి అతని కన్నులముందు మనోహరమైన అనేక దృశ్యాలు కదిలిపోతున్నాయి నెమ్మదిగా ఆలోచనలతో అంతఃపురంలో ప్రవేశించాడు

చోళా తన నాట్యవస్త్రాలకు ముత్యాలు కూరుస్తూ కూర్చున్నది కారుమబ్బుల మధ్య నిర్మలమైన చంద్రకాంతితో స్ఫులంగా కొంత ఆకాశం కన్పిస్తే ఎలా ఉంటుందో అలా ఆ సాంధ్య తమస్సులో చోళా సౌందర్యం వెలుగుతున్నది

'ఏం చేస్తున్నావు చోళా?'

చోళా అలసిపోయిన తన కనురెప్పలెత్తి మహారాజును చూచింది

'ముత్యాలు కూరుస్తున్నాను '

'ముత్యాలా! దాసీలేమైనారు? మరి ఈ వస్త్రాలు !'

'ఇవి నా నృత్యవస్త్రాలు దాసీలు ముట్టుకుంటే అపవిత్రమౌతాయి '

మహారాజు నవ్వుతూ 'రోజూ రాత్రి ఇలాగే ముత్యాలు కూరుస్తున్నావుట నిజమేనా దేవీ?'

'అవును'

'ఇదేం పిచ్చి చోళా? నీవు గుజరాత్‌కు రాణివి ఈ నృత్యవస్త్రాలు నీ కెందుకు?'

చోళా ఉత్తేజంతో నిల్చున్నది ఆమె కపోలాలు ఎఱ్ఱబారి, పాలిపోయిన ముఖాన్ని దేదీప్య మొనరించాయి

'మహారాజా! మునుపు నేను దేవదాసీని, నా దేవదేవునికి ఇకముందు కూడా దేవదాసీనే' ఆమె కంఠం వణికిపోతున్నది

ఇంత చక్కని రేయిని కోపాలతో గడపడం యిష్టంలేదు భీమదేవునికి వెంటనే ఆయన లొంగిపోయినాడు 'చోళా! నాదే పొరపాటు దేవనర్తకే కదా నా సింహాసనానికి మహాశోభ చేకూర్చుంది! రా ' అంటూ ఆమెను కౌగలించుకోడానికి చేతులు చాచాడు

అలా ప్రేమతో వస్తూన్న మహారాజును ఒక లిప్తకాలం మహాక్రోధంతో చూచింది చోళా మహారాజు చేయి ఇంతలోకే ఆమెకు తగిలింది పిచ్చిదై, కాలనాగు కాటు వేయడానికి వచ్చినట్లు ఆ చేతివైపు చూచింది ఆమె శరీరం జలదరించింది వణికిపోయి కుచించుకున్నది వెనక్కు జరిగి రెండు చేతులనూ ముందుకు ఎత్తి భయంకరంగా అరిచింది

'చోళా! చోళా! ఏమిటిది! ఏమిటిది?'

'వద్దు వద్దు '

'ఏమిటి? ఎందుకు చోళా!' ఈ అసహజ ధోరణి నెరుగని భీమదేవుడు దిగులుగా అడిగాడు

చోళా ఏడుస్తూ రెండు చేతులూ జోడించి 'వద్దు మహారాజా వద్దు ఈనాడు '

'ఏమిటి? ఈనాడు ఏమైంది?'

'పరమేశ్వరుడు ' అని అనబోయి వెక్కిళ్ళు పొంగిరాగా మాటాడలేక పోయింది చోళా

'ఏమిటి? ఏమైనా వ్రతం ఉన్నదా?'

'అవును!' ఈ ఉపాయం ఆమెకు క్రొత్త ప్రాణాన్నిచ్చింది 'ఇంకా పరమేశ్వరుని ప్రతిష్ఠించలేదు '

భీమదేవుడు నవ్వాడు 'ఇపుడు తెలిసింది కానీ ఇలాంటి వ్రతమా చోళా! నన్ను గురించి ఆలోచించావా? నన్నడగనన్నా అడగలేదే' అంటూ శాంతంగా వెనక్కు జరిగాడు

'మహారాజా! పరమేశ్వరుని నీడలో మనం కలుసుకున్నాం ఆ పరమేశ్వరుడు ముక్కలైనాడు' అంటూ చోళా హృదయ విదారకంగా కన్నీరు కార్చడం మొదలుపెట్టింది

'చోళా! దిగులుపడితే ఏమి లాభం నేను కొత్తమందిరాన్ని నిర్మిస్తున్నానుగా! ప్రతిష్ఠాపన కూడా గొప్పగా జరిపిస్తా అది నీకు ఆనందదాయకమవుతుంది భారతదేశ మంతటికీ ఆహ్వానాలు పంపిస్తాను '

'ఎప్పుడవుతుంది?'

'అంతా సిద్ధమవనీ'

మునుగుతూన్న చోళాకు ఈ ఆశ ఒకటి లభించింది 'మహారాజా! నన్నక్కడికి పంపించండి నేను దగ్గరుండి నిర్మిస్తా'

'నీవా?'

'అవును నేను దేవనర్తకిని మహారాజా!' అంటూ ఉత్సాహాన్ని ప్రకటించింది చోళా

'పిచ్చిదానా, నీవు ఘుర్జర మహారాణివి నీకు నృత్యంతో పనేముంది?' నవ్వుతూ అన్నాడు భీమదేవుడు

అతడు నవ్వుతూ అన్న మాటలు ఆమెకు అందరి యెదుట చెంపపెట్టు పెట్టినట్లనిపించింది

'నన్ను ప్రభాసం పంపించండి మహారాజా!' ఆమె కన్నుల్లో నీళ్ళు క్రమ్ముకున్నాయి

'నీవు వెడితే నా గతేమవుతుంది చోళా?'

'నా వ్రతం ' అని తిరిగి సాహసించి చేతులు జోడించిందామె

భీమదేవుడు చోళా ఆకర్షణకు బద్ధుడే కానీ, ఈ నవకోమలిని కష్టపెట్టడం అతని కిష్టంలేదు ఆయన హృదయం చోళా మాటలను అంగీకరించమని ప్రేరేపిస్తున్నది మహారాజు నవ్వాడు

''వెర్రిదానా! నీ మాటను కాదంటానా? వెళ్లి నీ వ్రతం నెరవేర్చుకో, ఆనాటి రాత్రి విజయం లభించిన పిమ్మట మనం కలుసుకున్నామే అలాగే భరతఖండంలోని

రాజన్యులందరి సమక్షంలో సోమనాథ ప్రతిష్ఠాపన జరిగిన తరువాత మళ్ళీ కలుసుకుందాం'' అని ఆశాసౌధాల్లో నివసించే ప్రియునివలె, ''ఇన్ని రాత్రుల కోరిక ఒకేరాత్రి తీరాలి చోళా'' అన్నాడు

''మహారాజా!'' అని చోళా ఆయన పాదాలకు మోకరిల్లింది ''మీరు కృపా సముద్రులు నేనీ ఉపకారానికి ప్రతిఫలం ఏమివ్వగలుగుతాను? నేను దాసీని అంతే'' అన్నది

అలా పొంగివస్తున్న దుఃఖాన్ని ఆపుకున్నది చోళా

## 6

పరమ భట్టారకులు శ్రీ భీమదేవ మహారాజుగారి ప్రియపత్ని చోళాదేవి సోమనాథ మందిర నిర్మాణం చేయించడానికి ప్రభాసం వెళ్ళింది వెంట కొంత సైన్యం, కొందరు దాసీలు కూడా వెళ్లారు భీమదేవుడు తన అనుచర వర్గంతో కొంత దూరం స్వయంగా ఆమెను సాగనంపి వచ్చారు దామోదర్ మెహతా ప్రభాసం వరకూ వెంట వెళ్ళారు సోమనాధుని పరమ భక్తుడగు ఈ భావుక హృదయునికి సోమనాధుని ప్రతిష్ఠాపన త్వరగా జరగాలనే వేదన ఉన్నది యువరాజైన క్షేమరాజును కనిపెట్టి ఉండడానికి రాజవైద్యుడు కూడా వెంబడి వెళ్ళాడు

ప్రభాస నగరానికి బయలుదేరినప్పుడు చోళాకు కొద్దిగా ఉత్సాహం వచ్చింది కానీ అది క్షణికమే అక్కడికి వెళ్ళగానే మహోన్నతంగా, బ్రహ్మాండంగా తయారవుతున్న కొత్త కోట కన్పించింది కొత్తవీధులూ, బావులూ, కోనేరులూ కన్పించాయి కొద్దిగా జనసమ్మర్దం కలిగిన ముఖ్య మార్గాలు, కొత్త రూపులలో, కొత్త వైనంతో పైకిలేస్తూ సగంలో ఉన్న మందిర శిఖరాలను చూచింది రాజప్రాసాదంలా వెలుగుతున్న గగనరాశి మఠాన్ని చూచింది రాజభవనాన్ని పోలిన మహారాజుగారి ప్రాసాదాన్ని చూచింది పూర్వం దేవదాసీలు ఉన్న వీధిలో బ్రాహ్మణుల కొరకు కొత్తవీధి నిర్మిస్తున్నారు పరమేశ్వరుని మందిర శిఖరం చాలా పెద్దదిగా . కొత్త తొడుగులతో పైన ఆటాలికులు లేకుండా సగం తయారై కన్పించిందామెకు.

ఇదొక సౌందర్య విలసితమైన నవీనసృష్టి అజ్ఞాతుడైన విశ్వకర్మ ద్వారా నిర్మింపబడుతున్నది అది తన పరమేశ్వరుని నివాసం కాదు చోళా ప్రాంగణంలోకి అడుగుపెట్టింది భవనంలోకి ప్రవేశించింది దీనిని ఆమెకై భీమదేవుడు ప్రత్యేకంగా

నిర్మించాడు కానీ ప్రవేశించిన కొత్తదనం వల్ల ఆమె వివశురాలై కన్నీరు కార్చడం మొదలు పెట్టింది

భూమిని పొగమంచు ఆవరించినట్లు ఆమె మనస్సును దైన్యం ఆవరించింది ఆ దైన్యం ఆమె భావంలో, కోరికలో, ప్రతి పనిలో కనబడుతున్నది

పూర్వజన్మలో తృప్తి చెందని కోరికల కారణాన ప్రేతలోకం నుంచి దిగివచ్చి ఈలోకంలో తిరుగుతున్నట్లుగా- రాణీత్వపురీవిని సాధ్యమైనంత వదిలిపెట్టి - సగం మలచిన రాళ్ళలో - ఇటుకల్లో - సున్నపు రాశుల మధ్యలో, పనివాళ్ళ మధ్యన, శిల్పులమధ్యా తిరుగాడుతూ కొత్తగా పరాయి సొత్తుగా కన్పించే ఈ నూత్న భవనాలలో-- నశించి తన హృదయాంకితమైన, మరపుకు రాకుండా నిలచిన అపూర్వ సృష్టిని ప్రతిష్టిస్తుండేది

ఇక్కడ ఆమె బాల్యంలో పెరిగింది ఇక్కడ తప్పటడుగులు వేస్తే గంగ ఆమెను గిచ్చింది ఇక్కడ కూర్చునే ఆమె ఆలాపించింది ఇక్కడే గురుదేవులు ఆమెకు పాఠాలు చెప్పారు ఇదిగో ఇక్కడే ఆమె కుండలతో పోట్లాడింది

అటువైపు ఇప్పుడు దీప స్తంభాలు తయారవుతూన్న చోటే ఆమె భీమదేవుని వీడ్కోలు పుచ్చుకున్నది పూర్వం నాలుగు గోడల మధ్య త్రిపుర సుందరి మందిరం ఉన్నచోట ఆమెను శివరాశి తెచ్చినచోట అక్కడ విశాలమైన ఒక పెద్ద దేవీమందిరం పైకి లేస్తున్నది లోకోటలో ప్రస్తుతం గగనరాశి మఠం నిర్మింపబడుచోట వసారా ఉండేది దానిపైనే ఆమె భగవానుడైన పినాకపాణిని పొందాలనే ఆ వేగంలో అనహిలవాడ రాజు చేతుల్లోకి జారిపోయింది

అలా చూస్తూ పరమేశ్వరునికై కొత్తగా నిర్మింపబడుతున్న గర్భగృహాన్ని సమీపించగానే ఆమె కండ్లు తిరిగాయి నలువైపులా చీకట్లు అలముకున్నాయి రాళ్ళూ, ఇటుకలూ కన్పించలేదు పూర్వపు ఆ మణిమయ సభామండపం యావత్తూ సజీవంగా ప్రత్యక్షమైంది ఎదురుగా సర్వజ్ఞుడూ, గంగ, తనకై చితిని పేరుస్తూ కన్పించారు

ఇంతకంటే భయంకరమైన దృశ్యం ఆమెకు స్పృహ రాగానే కన్పించింది పూర్వం తన ప్రాణం - దేవాధిదేవుడు - మహాదేవుడు విరాజిల్లిన చోట ఒక ఖాళీ గది నిర్మింపబడుతున్నది ఆమె ప్రాణనాథుడు - సృష్ట్యాదిలో బ్రహ్మ, విష్ణువుల పోరాటాన్ని శాంతింపచేసిన స్వామి నేడు అక్కడ లేడు

ప్రళయ సమయంలో . సృష్టిఅంతా నాశనమై నిర్జనమైపోగా ఇక మిగిలిన మానవి తానొక్కతే అయినట్లుగా నలువైపులా నిరాశతో దైన్యంతో చూస్తూ దుఃఖంతో గుండె లదిమి పట్టుకుంటూ నిలుచున్నది

ఉదయాస్తమయాలు జరుగుతున్నాయి క్రమంగా రాతి కట్టడాలు - మందిరాలు పైకిలేస్తున్నాయి వీధుల్లో మూలల్లో, జనసమ్మర్దం పెరుగుతున్నది.

## 7

చోళా మాత్రం ప్రేతలోక నివాసిలా నానాటికీ కృశిస్తూ లోలోపలికి కుదించుకొని పోతున్నది ఈ చుట్టూ కన్పించే ప్రపంచంలో తనకూ, తన ప్రపంచానికీ స్థానమే లేనట్లు కన్పించేది ఆ మనుష్యులు తన తోటి వారు కారు ఈ మేడలు తనవి కావు ఇది తన ప్రభాసం కాదు- తన స్వామి నివాసం కాదు గగనరాశి- గగనసర్వజ్ఞుడు కూడా తన కోవకు చెందినవాడు కాడు ఇతడు లౌకికుడు - బలిష్టుడు - పీతాంబరాలలో వెలుగుతున్న సాధువు

ఆమె ప్రపంచం ఆమె హృదయంలోనే ఉన్నది అక్కడే పూర్వపు మందిర ఘంటికలు ధ్వనిస్తాయి అక్కడ సర్వజ్ఞ గురుదేవులు - గౌరవమూర్తులు - హారతు లిస్తూనే ఉంటారు గంగ నేటికీ అక్కడ దేవదాసీలకు నాట్యం నేర్పుతూనే ఉంటుంది నేటికీ ఆమె ఆ ప్రపంచంలో ఎగురుతూ, నర్తిస్తూ, పాడుకుంటూ ఉంటుంది చిరునవ్వుల దొంతరలతో తన ప్రాణేశ్వరుని తృప్తిపరుస్తుంటుంది ప్రణయ విహ్వలయైన అభిసారికలా బిల్వపత్రాలతో తన ప్రభువును పూజిస్తుంటుంది

ఇదే ఆమె వాస్తవ ప్రపంచం మేలుకొలుపు ప్రపంచానికి నిద్ర, ప్రపంచపు నిద్ర ఆమెకు మేలుకొలుపు అలా రాత్రింబవళ్ళు ఈ బంధనాలను గురించి ఆలోచిస్తూ, తన నాట్యవస్త్రాలను కుట్టుకుంటూ గడుపుతూండేది ఆ వస్త్రాలపై మణులనూ, నవరత్నాలనూ కూర్చడం తప్పితే ఆమె జీవితానికి హాయిని గూర్చే మరో ఆనందమే లేదు

దాసీలు ఈ పిచ్చి చర్యలను చూచి విస్తుపోవడం మానుకొన్నారు ఆమె పిచ్చిదా కాదా అన్న సంశయం ఎవరినీ విడిచిపెట్టలేదు కానీ, ఆమెను చూస్తే అందరికీ భయంగా ఉండేది

ఆమె అడుగిడిన చోట మృత్యుదేవి పారిపోయేది ఆమె వెళ్ళిపోయిన చోట ఒక క్షణం అందరి శరీరాలు గజగజలాడేవి

సాయంకాల సమయాన - పరమేశ్వరునికి హారతులిచ్చేవేళ సమీపించగానే చోళా చకితయై లేచేది అపుడే ఆమెకు ప్రపంచమంటూ వున్నదనే విషయం గుర్తుకు వచ్చేది ఉత్సాహంతో నిర్మిస్తున్న వస్త్రాలను పైకెత్తి మంచంమీద పరచి చాలాసేపు చూస్తూ గడిపేది

ఎప్పుడో ఒకప్పుడు ఈ వస్త్రాలతో తన ప్రియుని యెదుట నిల్చొని రంజించి, క్షమింపవేడుకోవాలనే కోరిక ఉదయించేది ఆమెలో

ఆమెకానాటి కార్తీక ఏకాదశినాడు తన నృత్యం ద్వారా భోలా శంకరుని వశపరచుకున్న దృశ్యం గుర్తుకు వచ్చేది

తిరిగి ఎప్పుడో ఒకనాడు గంగ సర్వజ్ఞుని సమక్షంలో పరమేశ్వరునికి తనను సమర్పించుకుంటుంది

అలా కొద్దిసేపు చూస్తూ దూరాన ఎవరైనా శంఖు నూదినా, దారిన పోయే ఎద్దుల మెడలో మువ్వలు ఘల్లుమన్నా ఉత్సాహంతో పొంగిపోయేది వెంటనే ఆమె బాలికలా, నలువైపులా చూచి, డిందుపడి ఏమీ వినిపించకపోతే చాలాసేపు ఆ దారివైపే చూస్తూ చివరికి బావురుమని ఏడ్చేది

'స్వామి రాడు  ఇక నా స్వామి రాడు' అని అసంబద్ధంగా మాట్లాడుతూ క్రిందపడి జుట్టు పీక్కుంటూ వెక్కిళ్ళతో ఏడుస్తుంది ఆమె ప్రతి రక్తనాడిలో నిరాశ ప్రవహించేది తాను భ్రష్టురాలు తాను తన స్వామిని తన నాధుని విడిచి మానవమాత్రునితో  తన నాధుని కిక తనపై కోపం వచ్చింది ఇక ఆయన రాడు ఆయన తనను ఎన్నటికీ క్షమించడు

'తన అధోగతికిక అవధిలేదు' అని ఆమెకు స్ఫురించినప్పుడల్లా ఆమె గజగజ వణికి స్పృహలేకుండా పడిపోయేది

ఇదే నిత్యమూ ఆమె జీవిత కార్యం దీనితో పాటు క్షేమరాజును దగ్గరికి తీసుకున్నప్పుడు ఆమె జీవనంలో మరీ విషం వ్యాపించేది పెరిగిన కొద్దీ అతనిలో భీమదేవుని రూపురేఖలు తీర్చిదిద్దినట్లు కన్పించేవి అతడు నానాటికీ ఐహిక బంధనమై ఆమెను కట్టివేస్తుండేవాడు

తెల్లవారడం  చీకటిపడడం  ఈ క్రమంలో చోళా నిర్జీవిలా ఒకే ఆశతో 'ఏనాటికైనా తన స్వామి రాక తప్పదు వచ్చి తనను క్షమించి తన బాహువులలో చేర్చుకోక తప్పదు' అనే ఏకైక ఆశతో జీవిస్తున్నది

రోజులు గడిచి నెలలైనాయి ఆమె ధైర్యం కరిగిపోయింది తన స్వామి రాకకు శయ్య నలంకరిస్తూ, వస్త్రాలను నిర్మిస్తూ అనేక మధుర రాత్రులు గడిపింది కానీ, స్వామి రాలేదు-- భోలానాధుడు అనుగ్రహించలేదు--- ఆ క్షణం ఇంకా రాలేదు ఆమె మనసులోని కోరిక అలాగే ఉండిపోయింది

8

అశ్వయుజం వచ్చింది ఉల్లాసపూర్ణమైన శరత్పూర్ణిమ రోజున శివ ప్రతిష్ఠాపనకు ముహూర్తం వచ్చింది

పరమ భట్టారకులు శ్రీ భీమదేవులు దేశంలోని రాజు లందరికీ పంపిన ఆహ్వానాలు అంగీకరించి అనేక రాజులు ప్రభాస ధామానికి వచ్చారు మునుపటికన్నా వీధుల్లో చైతన్యం ఎక్కువైంది. వ్యాపారులు తిరిగి దుకాణాలు తెరిచారు ప్రతియింటా వేదఘోష వినిపిస్తున్నది ప్రతి వీధిలో సమస్త భారతం నుంచీ వచ్చిన యాత్రికులు దిగారు పాశుపత మతాధినేతయైన శ్రీ గగన సర్వజ్ఞుడు మహారుద్ర పూజ ప్రారంభించాడు

ప్రభాస దుర్గం మీద భేరీలు మ్రోగాయి పతాకాలు ఎగిరాయి దేవధామం దుర్ధర్షుడైన భీమదేవుని ప్రతాపకాంతులచే పూర్వం కన్నా భవ్యరూపంతో, భగవద్భక్తిని విజయదుందుభులపై మ్రోగిస్తున్నట్లు కన్పించింది

చోళా తన భవనపు వసారాలో నిల్చొని సముద్రం వైపు చూపులు నిలిపి స్వప్నావస్థలో ఉన్నది. చుట్టూ జరుగుతూన్న ''జై సోమనాథ్'' అనే విజయ ధ్వనులు ఆమె కలకు నూతన ప్రాణాన్ని, క్రొంగొత్త చైతన్యాన్నీ ఇస్తున్నాయి

సామంతరాజులు చుట్టూ పరివేష్టించి నడుస్తుండగా శ్రీ భీమదేవ మహారాజు విజయోన్మాదంతో మత్తిల్లిన సైన్యాలను తీసుకొని వచ్చాడు ప్రభాసమంతా పిచ్చిదైంది గగన సర్వజ్ఞుడు విజేతయైన మహారాజును అభినందించాడు మహారాజు లేదనకుండా దానం చేశాడు. అయినా స్వప్న కల్లోలంలో ఏమాత్రమూ మార్పు కన్పించలేదు

ప్రభాస రాజదుర్గంలో కాలిడగానే భీమదేవుని హృదయం గర్వంతో ఉప్పొంగిపోయింది నేడతని కీర్తికి, వైభవాలకు అంతులేదు కవులు ఆయన ~ 'మ్లేచ్ఛ మర్దను'డనీ, 'అప్రతిరథ మహాజేత' అనీ కీర్తించారు ఆయన ప్రతాపంవల్ల నాడు నవ్య ప్రభాసదుర్గం అనుపమాన సౌందర్యంతో శోభిల్లుతున్నది నేడా దుర్గం సముద్రగర్భంలోంచి సముత్పన్నమైన కౌస్తుభ మణివలె, పరమ రమణీయమై వెలుగొందుతున్నది

కృతయుగంలో చంద్రుడూ, త్రేతాయుగంలో రావణుడూ, ద్వాపరంలో శ్రీకృష్ణుడూ ఈ దేవాలయాన్ని నిర్మించిన విధంగా కలియుగంలో ఈ చాళుక్యశ్రేష్టుడైన భీమదేవ మహారాజు కూడా ఈ మందిర నిర్మాణం చేయడానికి పరమ సంకల్పాన్ని గ్రహించాడు

స్వాభిమానంతో తేజరిల్లుతూ, కీర్తితో ప్రకాశిస్తూ, అమాయక మూర్తియైన మహాశూరుడూ- రసికుడూ- భీమదేవుడు అంతఃపురంలోకి ప్రవేశించాడు ఇక శివ ప్రతిష్ఠ జరుగుతుంది చోళా వ్రతం పూర్తి అవుతుంది ఆనాడు యుద్ధం జరుగుతూన్న రోజుల్లో, ఆ మధుర నిశీధిలో అనుభవించిన ఆనందం సమస్త జీవితంలో వ్యాపించనున్నది

అతడు ప్రియురాలిని సందర్శించుకోడానికి వెళ్ళాడు కానీ, మరపురాని ఆమె ముఖ కవళికల్లో పరలోక వాసినియైన రాణీ రూపాన్ని చూచి ఆశ్చర్యచకితుడైనాడు

'చోళా! నా జీవితంలో మహాభాగ్యవంతమైన ఘడియ ఇది నేడు నేను సోమనాధ ప్రతిష్ఠ చేయిస్తాను సమస్త భారతం నా కీర్తిని ఇక గానం చేస్తూంటుంది చంద్ర నిర్మితమైన ఈ మందిరం నా చేత పునర్నిర్మితమౌతున్నది' అని అంటూ ఆయన నవ్వాలని ప్రయత్నించాడు

'మహారాజా!' అపరిచిత కంఠధ్వనితో చోళా దీనంగా సంబోధించి 'నేను ఆ ముహూర్తం కొరకే ఎదురుచూస్తున్నా నా నాధుడు ఎపుడు దయ చేస్తారో! ఎప్పుడామహాత్మునికి హారతు లర్పిస్తానో! ఎప్పుడు నేనా దివ్య మూర్తియందు నృత్యం చేస్తానో!' అన్నది

'నృత్యమా!' భీమదేవుడాశ్చర్యాన్ని ప్రకటించాడు 'ఇంకాదాన్ని మరిచిపోలేదూ? నీ వింకా ఎక్కడ నృత్యం చేసేది?'

చోళా కన్నుల్లో భయరేఖలు మహా దారుణమై కన్పించాయి భీమదేవుడు ఖంభాతంలో ఆమె కన్నుల్లో చూచిన భావమే నేడు చూచి గజగజ వణికిపోయాడు

ఆయనకింకా ఎన్నో పనులున్నాయి ప్రతిష్ఠ చేసే ముహూర్తం సమీపిస్తున్నది తన మనస్సులో ఆవరించిన ఆనందం భగ్నమవడం అతనికిష్టంలేదు అతడు కిలకిలా నవ్వాడు

'అది సరే' అంటూ అతడు ఆ ఉత్సాహాన్ని అలాగే నిలిపి ఉంచాలనే ఉద్దేశ్యంతో 'నేటి రాత్రితో నీ వ్రతం ముగిసిపోతుంది కదూ! నేను వస్తాను సుమా! నీవు అన్నీ సిద్ధం చేయి ఆనాటి రాత్రి చేశావే- అలా' అని అంటూ లోలోన మధనపడుతున్నా తిరిగి నవ్వాడు

చోళా భరింపరాని వేదనను ప్రకటిస్తూ రెండు చేతులతో తన ముఖాన్ని కప్పుకున్నది

'ఈరోజు రాత్రి ఈరోజు రాత్రి నిజమే ఈ రాత్రే' అని అతి నెమ్మదిగా అన్నది భీమదేవుడు త్వరితంగా తన పనులను చూచుకోడానికి వెళ్ళిపోయాడు

## 9

మధ్యాహ్నకాలం దాటింది రాణీవాసంలో చోళా సామంతులు ఒకరి నొకరు ఎదురుగా కూర్చున్నారు ఇద్దరి చూపులూ బైటివైపే ఉన్నాయి

చోళా అతి సన్నని ధ్వనితో ఆరంభించింది ''సామంతా! నా హృదయంలో ఈరోజు ఏదో ఒక ఉత్సాహం పొంగుతున్నది నా చెవులకు ఏదో పిలుపు వినబడుతున్నది ప్రొద్దుటి నుంచే నన్ను గురుదేవులూ, గంగా పిలుస్తున్నారు నా నాధుడు నన్ను కాదనడని ఆ యిద్దరూ, అంటున్నారు నా నాధుడు నన్ను - నన్ను ఉన్నదాన్ని ఉన్నట్లుగా స్వీకరిస్తాడు ''

''నేను అమాయకురాల్ని నా నాధుడు నన్ను కాదనడు నేను ఆయన దాసిని ఆయన కాలి ధూళిని నేను ఎంత చెడిపోయినా పాతకినైనా చౌహాన్! ఎందుకో నా హృదయంలో కొత్త ఆశ పుడుతోంది నేడు నాకు శాంతి లభిస్తుంది ప్రొద్దుటినుంచీ నాకు నంది గంటలు వినిపిస్తున్నాయి ''

''నేడు వారు తప్పక వస్తారు'' చోళాకు పొంగుకొని వచ్చింది ''వచ్చి నన్ను తప్పక క్షమిస్తారు నన్ను సొంతంగా స్వీకరిస్తారు '' ఆమె కన్నుల్లోంచి ధారలుగా అశ్రువులు ప్రవహిస్తున్నాయి

''నేను ఏమంత పాపం చేశానని ఆయన నన్ను కాదంటారు చౌహాన్! ఆయన దయా సముద్రులు నే నాయనకు కింకరిని, మరి ఆయనే నాకు చేయూత ఇవ్వకపోతే ఇంకెవరిస్తారు?''

''చోళా! నాకు కూడా మా ఘోఘా దుర్గం ఈరోజు కన్పిస్తున్నది నేడు నేను కూడా కృతకృత్యుణ్ణయినాను ''

''నాకీ మాత్రం పని చేసిపెట్టు చౌహాన్ వీరా! జన్మజన్మాంతరాల వరకూ నేను నీకు ఋణపడి ఉంటాను ''

సామంతుడు కాసేపు ఏడుస్తున్న చోళా వేపే చూచాడు అతని కన్నులముందు నుంచి ఆమె దుఃఖ రూపం తొలగి క్షణంలో తన నుదుట తిలకం పెట్టిన బాల నర్తకి రూపం ప్రత్యక్షమైంది అతడు విజయాన్ని సాధించాడు దేవదేవుణ్ణి సముద్ధరించాడు కానీ, తనను నాశనం చేసుకున్నాడు

ఇప్పుడు తనను ప్రాణంతో ముడివేసి నిలిపిన ఆ బంధనం. ఆ చిన్నారి సుకుమారి రూపం- తన ముందు చేయి చాపుతున్నది మరి ఆ యాచనను కాదనడమా? తన మనస్సులో స్థిరంగా నిలచిన ఈ సౌందర్య మూర్తి చేస్తూన్న విన్నపాన్ని కాలదన్నడమా? ప్రపంచంమీదా, కీర్తిమీదా, భీమదేవుని పరువుమీదా మమకారం ఉంచుకొని ఈ దుఃఖ స్వరూపిణికి విశ్వాసఘాతం చేయడమా?

అతడు ఆ క్షణమే నిశ్చయించుకున్నాడు ఈ సమస్త ప్రపంచంలో తాను ఒక్కడే! చనిపోయిన వానిపై మమత్వంలాంటిదైన చోళా ప్రేమ ఒక్కటే తన సర్వస్వం ఇక ఒకరితో తనకు లెక్క ఏమిటి? కీర్తి అంటే ప్రేమ దేనికి? భీమదేవునితో తన కేమి సంబంధం? కీర్తి, ధనం, రాజ్యం తన కెందుకు? అతడు ఇసుక ఎడారిలో ఒక రేణువు రేణువే దైవానుగ్రహంవల్ల కైలాసమైంది పరమేశ్వరుడు మోము తిప్పుకుంటే తిరిగి ఆ రేణువే అయిపోతాడు అతని ఒంటెలు సిద్ధంగానే ఉన్నాయి సంధ్యాహారతులైన పిమ్మట అతడు కూడా అదే బాటలో అతని పూర్వులు పయనించిన బాటలో- పురోగమిస్తాడు మరి ఇక చోళా ప్రార్థనను ఎందుకు కాదనాలి?

అతడు లేచి నిల్చుని నడుము నున్న ధట్టీని బిగించాడు అతని గొంతులో జీవిత సర్వస్వంలోని ప్రేమ అంతా పొంగి వచ్చింది ''చోళా నేను నీ దాసుణ్ణి నీ ఆజ్ఞ శిరోధార్యం హారతి సమయంలో తప్పక వస్తా ''

చోళా ముఖంలో అరుణిమ అలముకున్నది

''చౌహాన్! మరి నేనూ సిద్ధంగా ఉంటా ''

## 10

సంధ్యాహారతులు ఇచ్చేవేళ సభామంటపం ధగధగలాడుతున్నది వందలకొలదీ స్తంభాలమీద వేలకువేల దీపాలు వెలుగుతున్నాయి మునుపటికన్నా విశాలంగా- భవ్యంగా నిర్మితమైన సభామండపంలోంచి పరమేశ్వరమూర్తి దర్శనం లభిస్తున్నది మునుపెంత సుందరంగా కన్పించేదో అంతే సుందరంగా చందన లేపంతో బిల్వపత్రాల మధ్య శోభిల్లుతూ కన్పిస్తోంది పై నుంచి కలశం వ్రేలాడుతున్నది మాలల్లో సువర్ణదీపికలు వెలుగుతున్నాయి

బైట సభామంటపంలో రాజులంతా గుమిగూడారు కుడిప్రక్కన భీమదేవుడు ఆసీనుడై ఉన్నాడు ప్రక్కనే ఝాలోర్ నరేశుడైన వాక్పతిరాజు ముసలి మీసాలను మిసిమి యవ్వనపు ఒడుపులో సవరిస్తున్నాడు అక్కడే అనేక యుద్ధాలలో ఆరితేరిన పోటుజోదు సపాదలక్ష ప్రభువు వీర బలదేవుడు కూర్చున్నాడు ఆబూరాజు ఘూంఘీరాజు, స్థానికాధిపతి ముకుందదేవుడు దగ్గరే కూర్చున్నారు తరువాత కచ్ఛరాజు సోరఠ నరేశుడూ, సామంత చౌహాన్ చిరునవ్వులతో కూర్చున్నారు

అమీరుని ఓడించడానికి అర్పించిన ఆహుతి ఫలాన్ని నేడు అందరు అనుభవిస్తున్నారు తిరిగి ఎలాగైతేనేం అనాద్యంతుడైన పరమేశ్వరుడు తన నివాసంలో

విరాజిల్లాడు ఈ భావం వల్ల ఇన్నాళ్ళూ పడిన పాట్లు మధుర స్మృతులై మనస్సులను గిలిగింతలు పెడుతున్నాయి

శంఖధ్వని వినిపించింది గగన సర్వజ్ఞులు పావుకోళ్ళతో, చీనాంబరాలపై వ్యాఘ్రచర్మాన్ని ధరించి, నల్లని జటాజూటాలను కొద్దిగా ఆదుర్దాగా సవరించుకుంటూ ప్రవేశించాడు ఆయనలో గురుదేవుని మాటల తీరూ, నడక రీవీ కొద్దిగా కన్పిస్తాయి

అందరి 'నమశ్శివాయ' అనే సాధునాదాలను స్వీకరిస్తూ మందిరంలోకి వెళ్ళి ఒక ఘడియ ప్రార్థించి, బిల్వ పత్రాలను సమర్పించి, గంట వాయించారు

కాశ్మీర్ మహారాజు పరమేశ్వరుని పాదసన్నిధిని సమర్పించిన రత్నఘటిత హారతిని గగనసర్వజ్ఞుడు తమ చేతులలోకి తీసుకున్నాడు

అందరూ ఒకేసారి హారతులు పాడారు

తరువాత ఆయన 'జై సోమనాథ్' అని అన్నారు సభామంటపంలో ఉన్న మహారథులందరూ అందుకున్నారు ఆకాశంలో నెమ్మదిగా వ్యాపించే గర్జాఘోషలా ఆ ధ్వని ప్రాంగణంలోంచి బైటికి వ్యాపించి నగరమంతా అలముకున్నది భేరీలు మ్రోగాయి నగరవాసులు, సైనికులు తిరిగి విజయనాదం చేశారు ప్రభాస నగరమంతా మొదటివలె సోమనాథ మయమైంది అందరూ 'జై సోమనాథ్' అనే నినాదంతో ఆకాశాన్ని దద్దరిల్ల జేశారు

తిరిగి శాంతి అలముకున్నది గగనసర్వజ్ఞుడు తన స్థానంలో కూర్చుని 'నృత్యం ఆరంభించండి' అని ఆజ్ఞాపించాడు

'నృత్యం ఆరంభించండి' అని శిష్యులు బిగ్గరగా అన్నారు కానీ 'నర్తకి సిద్ధంగా లేదు వాద్యగాండ్రూ సిద్ధంగా లేరు' అని ఎక్కణ్ణుంచో వినవచ్చింది

ఒక క్షణం- రెండు క్షణాలు- అయిదు క్షణాలు

రాజులాశ్చర్యచకితులై ఒకరి నొకరు చూచుకున్నారు గగన సర్వజ్ఞుల కనుబొమ్మల్లో ముడి సుడిగా కన్పించింది

అంతలో మువ్వలు ఘల్లుమన్నాయి మృదంగం నినదించింది

నర్తకి సభామండపంలోకి ప్రవేశిస్తోంది

ఆమె వజ్రవైఢూర్యాల రాసుల మధ్య ధగధగమంటూ దివ్యలోకాల నుంచి దిగివచ్చిన దేదీప్యమాన సుందరి యగు అప్సరసలా కన్పించింది. ఆమె నగలమీదా, వస్త్రాలమీదా పడి దీపకాంతులు సహస్ర వీచికలై అందరి కన్నులనూ జిగేలుమనిపిస్తున్నాయి

నడవడమే రానంత నెమ్మదిగా అతి నెమ్మదిగా వచ్చింది ముఖాన క్రిందిదాకా ముసుగు వేసుకున్నది

ఆమె కాళ్లలో శక్తి సంచరించింది మృదంగ తాళంలో అడుగులు పడుతున్నాయి గాయకురాలు తెర వెనుకనుంచి తపస్సును ఆరంభించింది

నర్తకి కూడా అతి నెమ్మదిగా అతి కోమలంగా కంపిత స్వరంతో పాడుతున్నది కానీ అది ఎవరికీ వినిపించడంలేదు

గీతం ముందుకు నడిచింది

మృదంగ ధ్వని సభామండపాన్ని ఆవరించింది నర్తకి అభినయంతో పూలు ఏరింది, మాల అల్లింది, బిల్వపత్రాలను తీసుకున్నది

నెమ్మదిగా ఎగురుతూ అభినయంతో శివుని పూజించింది

ముఖం చూడాలని ఆదుర్దాపడిన రాజులు ఆ ఆదుర్దాను విస్మరించారు ఇదెక్కడి నృత్యం? గాయకురాలు తెలుసుకోడానికి పాటను ఆపింది ఒక్క మృదంగం మ్రోగుతున్నది దానితోపాటు నర్తకి కాళ్ళ గజ్జెలు తాళం వేస్తున్నాయి

ప్రపంచమంతటా తెలియరాని మాయ కప్పివేసింది అది నృత్యమా కాదా అనే జిజ్ఞాసను కూడా అందరూ విస్మరించారు అందరూ రెప్ప వాల్చకుండా ఆ అద్భుత నృత్యాన్ని తిలకిస్తున్నారు

అభిసారికలాగా నృత్యం పూర్తి చేసిందా నర్తకి తరువాత శివునికి మనవి చేసుకున్నది తిరుగుతూ ప్రార్థించింది ఆమె ప్రతి అవయవంలో లాలిత్యాన్ని ప్రవహింపచేస్తున్నది

మంద్రమంద్రంగా మ్రోగుతూ నూపురాలు కారుణికమైన ఆమె గీతాన్ని పాడుతున్నాయి

శంకరుని రంజించాలని ఆమె ప్రయత్నించింది. ఆయనను నవ్వించాలని ప్రయత్నించింది క్షమించమని వేడుకున్నది నిరాశతో వెనుకకు తిరిగింది ఊగిసలాడుతూ వెనుకకు వచ్చింది

భీమదేవుడు పిచ్చివానిలా, గుడ్లప్పగించి చలనం కోల్పోయి, ఆ రూపాన్ని, ఆ నృత్యాన్ని, ఆ అభినయాన్ని చూస్తున్నాడు

గగన సర్వజ్ఞుని కన్నుల్లో భయం అలముకున్నది

శంకరుని రంజించాలని ఆ నర్తకి చివరిసారి ప్రయత్నించింది ఆక్రందనం చేస్తున్నట్లుగా నృత్యం చేసింది. ఆమె కాలి గజ్జెల్లో దుఃఖం కరిగి ప్రవహిస్తున్నది ఆ వెక్కిళ్ళు ఆమె కంఠంలోంచి వస్తున్నాయా? మృదంగంలోంచా? ఎవరు చెప్పగలరు?

ప్రేక్షకుల హృదయాలూ, శ్రోతల హృదయాలూ కరిగి దుఃఖిస్తున్నాయి

నర్తకి గర్భద్వారాన్ని సమీపించింది అదే ఆఖరు శంకరుని రంజించాలని ప్రయత్నించింది నైరాశ్యమూర్తిలా పరమేశ్వరుని చరణాల దగ్గర తల కొట్టుకున్నది

అభినయంతో, అడుగుల తాళంతో పరమేశ్వరుని ముందు తన సర్వస్వాన్నీ సమర్పించింది

నృత్యం మందగించింది నర్తకి తల వంగింది మృదంగ వాద్యాలు మందగించి ఆగిపోయాయి

తిరిగి నర్తకి ఝంఝూకారాలతో లేచి నిల్చున్నది ఆమె అడుగుల తాళం వల్ల శంకరుడు ప్రసన్నుడైనట్లు అనిపిస్తుంది

ఇక అదే చివరి వరుస అయినట్లుగా గజ్జెల ఘల్లుఘల్లుమనే మహాధ్వనితో మహా విజయోల్లాసం ప్రకటించింది

మృదంగ ధ్వని తీవ్రమైంది ధాధా కిటధా-ధాధా కిటధా-ధా ధా కిటధా-

కొయ్యబారి కూర్చున్న ప్రజలు ఉన్మాదుల్లా చూస్తున్నారు

మరొక్కసారి తీవ్రమై ప్రయత్నంతో గిర్రున తిరిగి విజయ ప్రదర్శకమైన భంగిమ చూపుతుండగా ఆమె మేలి ముసుగు జారిపోయింది

వాడినా పరమ సౌందర్యంతో విరాజిల్లే ఆ ముఖంలో దివ్యసుఖం అమరజ్యోతిలా వెలుగొందుతున్నది ఆమె కన్నుల్లో ప్రణయం విద్యుల్లతలా మెరిసిపోతున్నది

ఆ భంగిమ పూర్తికాకముందే ఒక్క గంతులో గర్భద్వారాన్ని సమీపించి తన తలను ద్వారం మీద వాల్చింది

మృదంగం ఆగింది గజ్జెల ధ్వని ఆగిపోయింది

తల జారి చైతన్యరహితమై భుజంమీదికి వ్రేలాడుతున్నది శరీరం శిథిలమై ఒక పిడికెడు మట్టి కుప్పలా అయింది

కోపంతో కత్తిని బైటికి తీస్తున్న భీమదేవుణ్ణి చేతితో ఆపి గగన సర్వజ్ఞుడు నర్తకి దగ్గరికి పరుగెత్తాడు

ఆ పరమ పుణ్య ముహూర్తాన, ధన్య ఘడియలో చోళా తన భోలానాథునికి ఆత్మసమర్పణం చేసుకున్నది

నలువైపులా వ్యాపించిన అభంగ శాంతిలో ఒకమూల ఒక సన్నని దుఃఖపు పొంగు విన్పించింది ఒక వీరుడు మెరుపులా ప్రజల మధ్యలోంచి చీకటిలోకి జారబడి అదృశ్యమైనాడు.

★ ఇతి సంపూర్ణమ్ ★